## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050005669

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

శ్రీవిశ్వేశ్వరాయనమః.

# కాశీమజిలీకథలు

మొదటి భాగము.

ఇది

గోదావరీతీరస్థితంబగు
రాజమహేంద్రవరంబున నివసించియున్న

## మధిర సుబ్బన్న దీక్షితకవిచే

రచియింపఁబడి

వారి పుత్రుఁడు మధిర కొండయ్యశాస్త్రిచే

పరిష్కరింపఁబడినది.

అష్టమ ముద్రణ 1000 ప్రతులు.

శ్రీ పోలావరపు కడ సూర్యనారాయణగారిచే

శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

రాజమండ్రి..

1938



[దీనివెల 1—8—0

## మొదటికూర్పు పీఠిక.

ఆర్యులారా! మన యాంధ్రభాషలో ననేకకథలపుస్తకములు వ్రాయఁబడియున్నవి. వానిలోఁ గొన్ని స్వదేశపుకథలు గొన్నివిదేశపుకథలుం గలిగియున్నవి. ఆంధ్రదేశమంతటను, అద్భుతముగాఁ జెప్పికొనుచుండెడి కాశీమజిలీకథలుమాత్ర మెందును వ్రాఁత మూలముగాలేవు. దానంజేసి పెక్కండ్రు పెక్కువిధములుగాఁ జెప్పుచుందురు.

చిన్నతనమునుండియు నాకీకథలు వ్రాయుటకు మిగుల నుత్సాహముఁ గలిగియున్నది. కావున నేను బలుదేశములు తిరిగి యాయాదేశములయందుఁ జెప్పికొనెడి కథాసాంప్రదాయ విశేషముల విశేషముగా సంగ్రహించి తదనుగుణ్యములైన కల్పనల బొందుపరచుచు నెల్లరకుం దెలియునట్లు తేటతెలుఁగు మాటలతో వచనరూపముగా మొదట నీమొదటిభాగము రచించి ప్రకటించితిని.

ఇందలి రసవిశేషమరయ రసికులగు విద్వాంసులే పాత్రులు. "కాశీమజిలీ" అను సమాసమసాధువైనను లోకుల వాడుకనుబట్టి యుల్లేఖించవలసివచ్చినది. మ॥ సు॥ 1900 సం॥ రం॥

## 3వ కూర్పు పీఠిక.

మొదట నీకథలు 3-4 భాగములతో ముగింపవలయునని తలంచితిని కాని చమత్కారములైకథలు పెక్కులు లభించుటచేఁ బదివాల్యూములుగా నేర్పరచితిని. ఇప్పటికి మూడువాల్యూములు అచ్చుపడినవి నాలుగవవాల్యూము అచ్చుపడుచున్నది. క్రమముగానన్నియుం బ్రకటింతును. శీఘ్రకాలములో వేలకొలఁది గ్రంథములు ఖర్చుపడుటచే కనీథలు మనోజ్ఞములుగా నున్నవనియే తలంపఁబడు చున్నవి.

శ్లో॥ ఆపరితోషాద్విదుషాం । నసాధుమన్యే ప్రయోగ విజ్ఞానం॥
బలవదపిశిక్షితానాం । స్వాత్మన్యప్రత్యయం చేతః॥

6—7—1910 మధిర సుబ్బన్నదీక్షితకవి.

4వ కూర్పు:-కవులు గ్రంథములు రచించుట లోకోపకారమునకుఁగాని కేవలము ద్రవ్యార్జనమునకుఁ గాదు. తదాదాయమువలన జీవింపఁ దలంచుట యసమంజసము. గ్రంథముద్రణాదికమునకు ద్రవ్యావశ్యకత గలుగును కావునఁ దావన్మాత్రమునకై మాప్రయత్నమై

యున్నది. పదివాల్యూములతో నీగ్రంథము ముగింతునని యిదివఱకే వ్రాసియుంటిని. ఇవి పెద్దవగుటచే వేవేగముగా ముద్రించుట సాధ్యము కాకున్నవి.

30—9—1915 మధిర సుబ్బన్నదీక్షితకవి.

5వ కూర్పు పీఠిక.

4వ కూర్పు ముద్రితములగు పుస్తకములు వెంటనే వ్యయమైనది. యుద్ధోపద్రవమువలన పంచమ ముద్రణమునకుఁ జాల యాలస్యమైనది.

ఈమొదటిభాగమునందలి కథలు లోకులవలన విని సంస్కరించి వ్రాసితిని. ఇవి కల్పితములు గ్రంథస్థములు కావని యిదివరకే తెలిపియుంటిని. కృష్ణదేవరాయులకథలలోఁ గలపాత్రముల పేరులకును జర్యలకును తచ్చరిత్రమునందలి కథాసందర్భమునకును గొంత విరియమము గలిగియున్నది. పెద్దలు చెప్పుకొనువాడుక కథలకును గ్రంథస్థవిషయములకును జాలచోట్ల పొసఁగియుండవు. అట్టివి గ్రంథములందుఁగూడఁ బరస్పరభేదములుగలిగియున్నవి. ఏదినిజమో యేదిసత్యమో నిరూపింప మొదటివారు వచ్చిచెప్పినంగాని నమ్మవీలులేదు. కథాచమత్కారమే విమర్శింపవలసిన విషయము. ఇప్పటికి నెనిమిదిభాగము లచ్చుపడినవి. 9-10 భాగము లొక్కసారియే వెలువడఁగలవు మాకుఁ జందాదాదులుగానున్నవారికి జాలపుస్తకములు తెప్పించుకొనువారికిని వారు కోరకున్నను నేను పోస్టేజీలో గొంతవహించుచున్నాను. మధిర సుబ్బన్నదీక్షితకవి.

6వ కూర్పు పీఠిక.

ఈముద్రణమం దీభాగమునఁ గొంచెముగా మార్పులు చేయఁబడినవి. ఈగ్రంథము ప్రారంభించి యించుమించుగా నిరువది నాలుగు సంవత్సరములైనది. ఇప్పటికిఁ బదిభాగములు పూర్తిచేయఁగలిగితిని. ఈగ్రంథములు ఎక్కువగా దేశములవ్యాపకంబగుటచే బహుజనహృద్యములై యున్నవని తలంపఁబడుచున్నవి. వీనిగుఱించి యిచ్చిన పండితాభిప్రాయములు చాలగలవు. వానినెల్లఁ జిన్న పుస్తకముగా ముద్రించుచుంటిని. మ॥ సు॥ 1924 సం॥ గం॥

## 7, 8 ముద్రణములకు పీఠిక.

ఈముద్రణములందు సవరణ లేమియుఁ జేయలేను. ఈ ప్రథమ భాగమిదివర కేడు పర్యాయములు అచ్చుపడి ఆంధ్రలోకమున వ్యాపించి సప్తమ ముద్రణమునకై నన్ను ప్రోత్సహించుట జూడ సుప్రసిద్ధములగు నీకథలను గురించి పెద్దగ వర్ణింప నవసరము లేదు.

ఉ. పండితులైన మెచ్చవలెఁ బామరకోటికినైన నింపుగా
నుండవలెన్ బ్రబంధము నయోక్తుల నిర్వురకున్ హితంబుగా
నుండినఁ దత్ప్రబంధ మదియొక్క సుప్రబంధమె! సాధుపాఠకా
ఖండసుఖప్రదంబగుటగా? ఫలమాఁ గవితాప్రవృత్తికిన్.

18-3-193౮ మ॥ కొం॥ శా॥

M. KRISHNAMACHARIAR, M.A., M.L., PH. D. M. R. A. S;

The collection of stories, *Kasimajili Kathalu*, composed. by Sriman Pandit Madhira Subbanna Dikshitulu, are by this time too well-known in the Telugu country to need any commendation. By their very name they inspire a sanctity of feeling and tell us how in spite of hardship of locomotion, our ancestors had piety enough to go by foot to have a glimpse of the sacred city of Kasi. Story-telling has been in India a very ancient mode of regaling congregations. It was a double merit ; it instructs the hearers in what is virtuous or heroic and it takes away for the occasion the tediousness of journey or assemblage. In these days when the world is growing sceptic in matters religious or spiritual, the stories told in the easy language of a common vernacular, will surely tend to resuscitate all that is best and memorable in India's ancient lore, Vedic and Puranic. They have the charm of the Arabian Nights Entertainments, but without a display of the latter's levity of ideas and expressions. The name and mode of the series are elastic and it is possible, if the work is continued, it will form almost an encyclopaedia of Indian mythology and literature.

Rajahmundry.
13--12--1924

M. KRISHNAMACHARIAR.

రాజమహేంద్రవరమున డిస్ట్రిక్టు మునిసిఫ్ పదవిలో నుండు బ్రహ్మశ్రీ శ్రీమాన్ యం. కృష్ణమాచార్యులవారు ఎం.ఏ. ఎల్.ఎల్, పి. హెచ్. డి. బిరుదాంకితులు క్రింది యభిప్రాయము నాంగ్లేయ భాషలో దయచేసి యొసఁగిన దానికనువాదము.

శ్రీమత్పండిత మధిర సుబ్బన్నదీక్షితులవారిచే రచింపఁబడిన "కాశీమజిలీకథ" లనుపేర నొప్పు కథాసమూహ మింతకాంధ్రదేశ మంతయుఁ జక్కఁగా నెఱింగినదే కావున నేను బ్రశంసింపవలసిన యావశ్యత లేదు. ఆగ్రంథములకిడిన కేవలనామముసహితము మనకుఁ బవిత్రమైన భావమును హృదయమున నుత్పాదింపఁ జేయుటయే కాక పూర్వకాలమున రాకపోకలకు మనకువలె సౌలభ్యములు లేకుండియుఁ గ్లేశపడియైన మనపెద్దలు కాలినడకతో పుణ్యపట్టణమైన కాశిని దర్శించిరాఁగలంత భక్తిశ్రద్ధలు వహించియుండిరను నాశ్చర్యమును గలిగించుచున్నవి. జనసమూహముల నాహ్లాదింపఁ జేయుటకుఁ గథాకథనము మనహిందూదేశములో నతిప్రాచీన విద్యయే. దానికి రెండువిధముల ప్రయోజనముగలదు. ఈకథలు ధర్మపరాక్రమముల తత్త్వప్రభావముల నుపదేశించుటయే కాక అప్పటిదీర్ఘకాల మార్గాయాసమును యాత్రికసంక్లేశమును దొలఁగించుచుండును. మతవిషయమునను ఆధ్యాత్మికవిషయమునను విశ్వాసములేక శంకాకళంకిత మగు నేఁటికాలమున స్వభాషలో సులభశైలి వ్రాయఁబడిన యీకథలు హిందూదేశమున నాదియగు వేదశాస్త్ర పురాణాది విద్యాప్రపంచమున నేదియేది శ్రేష్ఠమో శాశ్వతస్మరణీయమో దానినెల్ల దప్పక బునరుజ్జీవనముచేయుచున్నవి. ఇవి యవనయామినీ వినోదకథలలోని చమత్కృతిప్రభావము చూపుచున్నను, శబ్దరచనయందును భావములయందును అశ్లీలధర్మసాంకర్యాది దోషములులేక భాసిల్లుచున్నవి. కథలకిచ్చిన పేరును సంవిధానధోరణియు సమస్త విషయసంగ్రాహకమగుటచే యిల్లి కొనసాగుచుండినయెడల నిది తప్పక హిందూపురాణగాథాకోశమై సర్వవాఙ్మయమున కాదర్శమై యొప్పు ననుట యసాధ్యముగాదు.

13-12-24 యమ్. కృ, రాజమండ్రి.

సంస్కృతాప్రాకృతాది బహుభాషా విశేషజ్ఞులును శ్రీమాన్ యమ్. ఎ. మానవల్లి రామకృష్ణకవిగారిచ్చిన యభిప్రాయము. విద్యాగంధములేని స్త్రీబాల పామరజనసామాన్యమును నిరంతర రాజ్యభార ఖిన్నులగు ప్రభువులను వ్యవహారక్లేశ సాగరతరంగితాంతరంగులగు శ్రీమంతులను ఉపదేశ పఠనచింతనాది శ్రమములేకయే కేవలము హృదయైకవేద్యమై రసభావబంధురముగా క్షణకాల మాహ్లాద సముద్రమునఁ దేలించి ధర్మానుష్ఠానమున నెలకొల్పి యాత్మవిద్యాపారంగతులఁగాఁ జేయఁజాలినకథావినోదమేయని మహర్షులు దానిఁజతుష్షష్టివిద్యలలోఁ బరిగణించి యనుశాసించి యభివృద్ధి పఱచిరి. ఇట్టి కథావినోదము వినోదమాత్రఫలజనకముగాక ధర్మాదిసాధనోపాయమహత్త్వమంబగుట సర్వజనవేద్యమే. కేవలము రాజనీతిఁ బ్రతిభోధించు పంచతంత్రాదికథలును విప్రలంభసంభోగ శృంగారనామద్విధాభూతరసరాజ రహస్యపరమార్థ విచారమనోభిరామంబగు బృహత్కథానిబంధనంబును ధర్మలోకలవసాధిత బృహద్ధర్మసంస్థానాది ధర్మసూక్ష్మపరి బోధన చమత్కారంబగు దశకుమారకథా విస్తరంబును ఏకకథారసపరిపూర్ణంబై సాహిత్యవిద్యాధిదేవతావిలసితంబగు కాదంబరియుఁ గేవలము ధర్మప్రధానంబగు పురాణజాతమును ఏకదేశరమ్యప్రస్థానములై నగుచున్నవి. మఱియుఁగాల కౌటిల్యమున భిన్నదేశభిన్నాచారసంక్రమణంబునంజేసి చిరకాలావధిం బహుపురుషాంతరంబులం గాని తెలిసికొనరాని సదాచార ధర్మానుష్ఠాన తారతమ్యంబు నెఱుంగలేక యవిశ్వాసమూఢమగు చిత్తంబు కుక్షింభరక్రియాసాధనోపాయమగ్నంబగుచుఁ బురాణగాథావిచారక్షణావధానంబులేక తత్తరించుచుండఁదీర్ఘోపాయంబులలోసులభమైపట్టిష్ఠమైబహుధర్మప్రతిపాదకంబయి నానారసభావసమగ్రభాజనంబయి సమస్తపురాణగాదాకథాసారవిరాజితంబై కథాసంవిధానచాతురీనిరంత రోత

రోత్తరకథాస్వాదనోత్సేక సంభావికంబయివిలసిల్లు కాశీమజిలీ కథా నిబంధనము సర్వజనచిత్తాకర్షకంబనుటకును సందియములేదు. దీనిలో రసిభావపుష్టియుఁ గథాసంధానకౌశలమట్లుండఁ జతుర్విధ పురుషార్థకంబులగు మహాకవి వాఙ్మయములోని భావరత్నములు సాధారణ కథాకథనధోరణిలో వెదఁజల్లఁ బడి యుండుటచే నివి పండితులకును గావ్యకర్తలకును గూడఁ బ్రీతిభోజ్యాషణక్షమంబులని నిస్సంశయము గాఁ జెప్పవచ్చును ఇందు పారమార్థికులకుఁ దప్ప సామాన్యులకు రుచింపని శంకరాద్యాచార్యచరిత్రము లతిరసవంతముగాఁబరమార్థ బోధకంబగు కథాధోరణిగా గూర్పఁబడినవి.

విశ్రాంతచింతావినోదులకు జన్మజీవనతరణో పాయంబగు తీయని యౌషధంబువలె నుండు నీగ్రంథరాజమెంత పెద్దదియై పెరుగ నున్నను విసుగులేక యుత్తరోత్తర సంపుటప్రకటనమున కెల్లరును వేచియుందురని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇందుఁ గాదంబరీ కథాసంపుటము ప్రౌఢసాహిత్యరచనాబంధురంబై రసభావవిస్ఫృతంబై యించుక కఠినమయ్యును సాహిత్య జ్ఞాన సోపానాధిరోహణమునకై నిర్మింపఁబడిన యీకథా సంపుటములలో నిప్పటికిది యున్నతస్థాన మలంకరించుచున్నది. చతుర్థాషమ సంపుటకథా విన్యాసము లీగ్రంథకర్తకుఁ గథానిర్మాణ చతుర్ముఖత్వమును దప్పక యొసంగుచున్నది. బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్నదీక్షితులవారి గ్రంథ రచనామూలంబున గుణాఢ్యాది మహాకథక కీర్తిప్రతినిధియగు శాశ్వతఖ్యాతి సంపాదించిరని మాయభిప్రాయము. వీని యభ్యుదయ పరంపర సర్వేశ్వరుం డొనఁగూర్చుగాక యని మాప్రార్థనము.

ఇట్లు

మానవల్లి రామకృష్ణకవి.

## కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి యభిప్రాయము:

నాసహాధ్యాయి మధిర సుబ్బన్న దీక్షితకవి సర్వవిధముల ధన్యుఁడని వ్రాయుటకు మిగుల సంతసించుచున్నాను. అతఁడునాతో మునుమున్న కొన్నిగ్రంథములు గౌతమీ మహాత్మ్యము లోనగునవి వ్రాసియుండియు నిపుడు కాలానుసారముగాఁ గథలు వ్రాయుటకుఁ బ్రారంభించినాఁడు. చిన్నతనములో నుబుసుపోకకుఁజెప్పుకొను కథలను బుచ్చుకొని "కాశీమజిలీలు" అనుపేరుతోఁ జమత్కరించికథా సంవిధానముంజతనుబఱచి మొదటిభాగ మచ్చొత్తించి ప్రకటించినాఁడు. అదిప్రజల మదులనాకర్షించినది. ద్వితీయ తృతీయాది భాగములు వ్రాయుటకుఁ బ్రోత్సాహముఁగలిగించినది. ఇప్పటికిఁ దొమ్మిదిభాగములైనవి. నేనీకథలను పూర్ణముఁగఁజదువ లేదుగాని యేభాగములోనో యొకటిరెండుకథలుమాత్రము చదివితిని. అవిచదువునప్పుడు నాలోనాకే పరమాశ్చర్యము గలిగినది. నాసహాధ్యాయి విషయము నేనుజెప్పుట కొంతవఱకు దగదేమో కాని పింగళసూరనార్యుని కళాపూర్ణోదయకథకుంబోలె మనోహరత్వముం గలిగించినది. ఇట్టునాబోట్లు వ్రాయుటకుంబూని కృతకృత్యులుగాలేరనియే నా నిశ్చయాభిప్రాయము. ఒక్కొక్కపురుషునకొక్కొక్కదానిలోఁ బ్రావీణ్యము గలుగుననుటనిశ్చయము. వానికథలుపకథలతోడంగూడి యొకపెద్దగొలుసువలె మనోహరములైయుండును. ఆకథలలో ననేక నీతులు, ధర్మములు, ఆచారములు, శృంగారాదిరసములు, అధ్యాత్మావబోధకప్రదర్శనము లెన్నోయుండును. ఇవిసర్వజనాదరపాత్రములగుటయే నాచెప్పినమాటలు సత్యములనుటకుఁ దార్కాణమగుచున్నది. గద్యశైలియు సుబోధకమై పండిత పామర హృద్యంబగుచున్న యది. ఈకథలు బృహత్కథాదులవలె జగద్విఖ్యాతి గాంచుగాకయని కోరుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

16—12—24

# విషయసూచిక.

# కాశీమజిలీకథలు.

---:o:---

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్నదీక్షిత కవిగారిచే నీగ్రంథరాజము పండ్రెండుభాగములుగాఁ బండితపామరహృద్యమగు శైలితో వచనమున రచియింపఁబడి యున్నది. ఈకథలు ఆంధ్రదేశ మందంతటను వ్యాపించియుండుటనుబట్టి వీనిగుఱించి విస్తరించి వ్రాయఁ బనిలేదు.

ఇందుఁబతివ్రతలప్రభావము దుష్టస్త్రీలకుచ్ఛితచేష్టలు, సత్పురుషసాంగత్యమువలనఁ గలుగు లాభములు, దుష్టసహవాసంబునం గలుగు ననర్థములు, దేశాటనమున పండితసంపర్కమున గలుగు జ్ఞానము, రాజనీతి, వ్యవహారవివేకము, నదాన్యలక్షణము, లోభిప్రవృత్తి లోనగు విశేషములనేకములు వర్ణింపఁబడియున్నవి. మఱియుఁ గృష్ణదేవరాయ భోజరాజ శంకరగురు విక్రమార్క నారద పుండరీక ప్రహ్లాదాది మహాపురుషుల చరిత్రములు విచిత్రముగా వ్రాయఁబడి యున్నవి. ప్రతికథయందును మంచి నీతియుండక మానదు.

ఈకథలు విరక్తులకు వేదాంతవార్త్తికములు, జ్ఞానుల కుపనిషత్తులు, కర్మిష్ఠులకు స్మృతులు వైదికులకు ధర్మశాస్త్రములు యువకులకు గావ్యములునై యొప్పుననుటకు సందేహము లేదు. ఏకథయైనను ప్రారంభించిన తరువాత దుదముట్టువఱకు చదివినంగాని విడువ బుద్ధి పుట్టకపోవుటయే యీకథలయందలి చమత్కారము. పెక్కేల యిక్కథలు సర్వజనాహ్లాదకరములై యున్నవని నొక్కి వక్కాణింపుచున్నాము. ఇందులకు లోకమే ప్రమాణము.

ఇప్పటికి 12 భాగములు అచ్చుబడి సిద్ధముగానున్నవి.

అనుబంధము సహితము 13 భాగములు ఒకేసారికొను వారికి వెలలో కొంతతగ్గించి పంపబడును. పోష్టుఖర్చులు కొనువారే వహించుకొనవలెను. వలయువారు యీ క్రిందివ అడ్రస్సునకు వ్రాయవలెను.

మధిర సుబ్బన్న దీక్షితకవి [illegible] ప్రెస్
ఉల్లితోటవీధి—రాజమండ్రి.

# కాశీమజిలీకథలు.

| రు. అ. పై. | |
|---|---|
| 1—8—0 | 1 భాగము. వరప్రసాదుల కథగలది. |
| 1—8—0 | 2 భాగము. అదృష్టదీపుని కథగలది. |
| 1—12—0 | 3 భాగము. మందారవల్లి కథగలది. |
| 1—12—0 | 4 భాగము. విజయభాస్కరుని కథగలది. |
| 1—8—0 | 5 భాగము. శంకరుని కథగలది. |
| 1—12—0 | 6. భాగము భోజుని కథగలది. |
| 1—12—0 | 7 భాగము. విభీషణుని కథగలది. |
| 1—12—0 | 8 భాగము. దత్తకాదుల కథగలది. |
| 1—12—0 | 9 భాగము విక్రమార్కుని కథగలది. |
| 1—12—0 | 10 భాగము. నారదుని కథగలది. |
| 1—12—0 | 11 భాగము. ప్రహ్లాదుని కథగలది. |
| 1—12—0 | 12 భాగము. పుండరీకుని కథగలది. |
| 1—12—0 | అనుబంధము. కాదంబరీ మహాశ్వేతలకథ. |
| 0—4—0 | భద్రాచల మహాత్మ్యము పద్యకావ్యము. |
| 0—8—0 | సప్తసాగర సంగమహాత్మ్యము డిటో. |
| 0—2—0 | కన్యాశుల్కనిరసనము వచనము. |
| 0—12—0 | సావిత్రీనాటకము. |

ఒక్కొక్క పుస్తకముగాఁ దెప్పించుకొనుటకంటె 2, 3, కలిపి తెప్పించుకొనినచో పోస్టుచార్జీ తగ్గును. మేము అట్టివారికి కొంత సదుపాయము చేయుచుందుము.

వలయువారు—మధిర సుబ్బన్న దీక్షితకవి అండు సన్స.
ఉల్లితోటవీధి రాజమండ్రి అని వ్రాయవలెను.

శ్రీ ర స్తు.

# అవతారిక.

శ్లో॥ వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతఃపితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ॥

శా. శ్రీమూర్తిత్రితయంబునన్భవనస్థి। తిత్రాణనాశక్రియా
సామర్థ్యంబు గుణత్రయంబునను ని। చ్ఛామాత్రతం జూపుచున్
నామాకారగుణక్రియారహితుఁడై। నం గల్గి నట్టొప్పుచేఁ
డామోదంబున సామినేని నరసిం। హారాయునిన్ బ్రోవుతన్.

చ. సురుచిర నీలనీరద వి। శోభితమైన మెఱుంగు భంగి సుం
దరు నెదఁబొల్చి భక్తులను। దత్పరతం గరుణావిలోకనాం
కురములఁబ్రోచు పాల్కడలి। కూన సుదర్శనపాణిరాణి యా
సిరి కృప సామినేని నర। సింహునియింట వసించు నిచ్చలున్.

సీ. ఏమానినీరత్న। మేన లేని నిష్ఠమై
మెప్పించి మగని సా। మేన నిలిచె
నేకళావతి శర్వ। రీకాంతరేఖావ
తంసంబుగై సేయు। ధవునిరీతి
నేవధూమణిఁ గాంచెఁ। బావనస్థితిఁదుషా
రోర్వీధరాన్వయ। సార్వభౌముఁ
డేపాటలాధరి। మైపూతపసపున
వేదండవదనుఁ డా। విర్భవించె

గీ. నమ్మహాదేవి భక్తలో। కైక నిరత
గౌరి శర్వాణి జగదంబ। కలుషదమన
సర్వమంగళ రక్షించు। సంతతంబు
సామినేని నృసింహు వి। శ్వాసమెసఁగ.

గీ. కవులపాలింటి మరుదనో। కహము మగని
మొగము నందున నెలకొన్న। ముద్దుగుమ్మ

పద్మభవురాణి వల్లకీ । పాణి వాణి
సామినేని నృసింహుని । సాకుఁగాత.

శా. జోహారంచు భజింతునాత్మ విలస । చ్చుభ్రాంశు భూషుందుపా
రాహార్యేంద్ర సుతాతనూభవు మదే । భాస్యున్సురస్తుత్యుఁ బ్ర
త్యూహధ్వాంతసభోమణి స్గణసనా । థున్విఘ్న నాథున్మహో
త్సాహం బొప్పఁగ సామినేనికులజుం । సాకన్నృసింహాహ్వయుణ్.

ఉ. చిత్రముగైన మోములు న । శేషవిభాతిశయప్రభా లస
ద్గాత్రము జారు బాహువులు । గల్గి తలణ్ శశిరేఖ వెల్గ లో
కత్రయపూజ్య భక్తజన । కల్పక వల్లియునై తనర్చు గా
యత్రిపదంబులం దలఁతు । నాత్మఁ గృతీశు మహేశుఁ జేయఁగణ్.

ఉ. ఆదినొకండు గావెలయు । నాగమముల్విభజించి యంత న
ష్టాదశ సత్పురాణములు । స్కాందముఖంబులు జేసి లోక ర
క్షాదరణంబు తోడ వన । జాక్షుఁడన న్ప్రభగాంచినట్టి వి
ద్యాదయితు న్బరాశరమ । హాముని నాధ సుతున్భజించెదణ్.

గీ. మొక్కి వల్మీకభవుపదం । బులకు భక్తిఁ
గాళిదాసుకవిత్వవి । క్రమముఁ బొగడి
నన్నపార్యాదికవి కీర్తి । సన్నుతించి
వరుససేవింతు నాంధ్రగీ । ర్వాణకవుల.

క. నతిజేయుదు ననుఁ గొమరుని
గతిఁ జూచుచు నెనరుమీర । గా నురువిద్యా
న్వితుఁ జేసినట్టి సుగుణ క
లితమతి కివటూరి నాగ । లింగార్యునకుణ్.

వ. అని కృతిముఖోచిత వర్ణంబుగావించి మదన్వయ క్రమం బించుక వర్ణించెద.

సీ. ఆత్రేయగోత్ర విఖ్యాతమా మధిరవం
శాబ్ధి జన్మించె సుబ్బయ్యసూరి
అతనికి సుతులు సుబ్బయ్య గోవిందయ్య
యనఁగ నిద్దరుపుట్టి రమలకీర్తు

లందగ్రిజుండు బుచ్చమ్మనాఁదగు సాధ్విఁ
బరిణయంబగుచు నాపడఁతి యందు
సుబ్బయాహ్వాయపుత్త్రి సూరిజనస్తుత్యఁ
గనియె నాతఁడును వెంకమ్మయందుఁ

గీ. గాంచె బుచ్చన్ననాము బంగారయాఖ్య
సుతుల నిరువుర నందగ్రిజునకు రామ
యాహ్వాయుండ వరజునకు జగ్గయ్యయును జ
నించి రం దిలజగ్గయ్య నీతిశాలి.

మ. ఆజగ్గయ్య యొనర్చె భక్తి బహుసప్తాహంబులన్ బ్రవిపులం
బూజించె న్విమలాన్న దానముల సంపూర్ణంబుగాఁ దీర్థయా
త్రాజాతవ్రతదీక్ష వేలుపుల నారాధించె దాతృత్వ వి
భ్రాజత్తేజుడటంచు నర్థులు నుతింపంబొల్చె సత్కీర్తితోన్.

గీ. విశ్వనాథమనఁగ వెలయుమత్సుతుఁ బెంచు
కొనఁగనిచ్చినాఁడఁ గులము వెలయఁ
దాత తండ్రిలన్నదమ్ములై కూటస్థు
డరయఁ దాత తాతయగుట మాకు.

మఱియు

క. మావంశము కూటస్థుం
డై వెలసిన సుబ్బయార్యున వరజసుతుఁడా
గోవిందయ్య వివాహం
బై వెంకమయనెడు కన్యనభిమత మాన్యన్.

క. ఆనాతియందుఁగనె ల
క్ష్మీనారాయణుఁ డనంగఁ జెన్నొందు సుతున్
జ్ఞానదయామతి కలితు న
నూనకళాలలితు సజ్జనోత్తమవినుతున్.

గీ. అతఁడు వెంకమ్మయను సాధ్వియందుఁ గనియెఁ
దనయు ననుజాతకరుణా వితరణవినయు

నయకళాభూషుఁ గొండయార్యాహ్వయవిశేషు
ననవగత దోషు నన్నదానాభిలాషు.

క. ఆకొండయార్యవర్యుఁడు
జేకొనియెన్ రేకపల్లి సీతారామా
ఖ్యాకలితయజ్వసుత సీ
తాకల్పన్ సోమిదేవి ధర్మయువతిగాన్.

సీ. శ్రీకాంతు నేకాదశీవ్రతాంతరముల
నారాధనముజేసె సతులనిష్ఠ
సేవించె భూసురశ్రేష్ఠులనన్న సం
తర్పణంబులను ద్వాదశులయందు
వెలిఁగించె వేల్పుకొవెలలందు దీపమా
లిక లర్చనలను గార్తికములందుఁ
గావించె బహులోపకారముల్ ద్రవ్యప్ర
దానంబున సుధీవతంసములకు

గీ. హితుల మన్నించె బంధుసంతతులఁ బ్రోచె
రిపుల నిర్జించె గడియించె విపులధనము
వర్తకంబున గొండయాహ్వయఘనుండు
ధృతి సమార్జితమర్థసాత్కృతము జేసె.

గీ. అతఁడు సోమిదేవియందు మమ్మిరువుర
సుతులఁగాంచె నందు సుబ్బారాయుఁ
డగ్రజుండు నేను ననుజుండ సుబ్బన
దీక్షితాహ్వయుండ ధీరనుతుఁడ.

చ. శుభకరవారిజాసవసుక్షితిభృచ్ఛకోల్లస
ద్విభవ సమాసుమార్గసిత దీపితమాఘవిదియన్ జనించితిన్
త్రిభువనవంద్య వేదజననీకరుణావిలసద్విలోకన
ప్రభ నకవిత్వవైభవుఁడ భవ్యకవీంద్రవచోవిధేయుడన్.

చ. చదివితి నాగలింగగురుసన్నిధిఁ గాటవరంబునందు శ్రీ
పదకలకృష్ణమూర్తి కవివర్యునితో నల కావ్యనాటకా

ద్యుదితరసప్రబంధము లనూనగతిం గృతిలక్షణంబు గా
ముది విదితార్థయుక్తిఁ బరిపూర్ణ వివేక గురుప్రసక్తితో.

గీ. మొదట రఘువంశకావ్యంబు । జదువునపుడె
కవితజెప్పంగ వేడుక । గలిగె నంతఁ
బూని కావించి యష్టావధానములను
గృతులఁబడసితి మున్ను సత్కృతులఁ గొన్ని

గీ. ఊర్మిగోదావరీ మహా । తోత్ర్యక్తరప్ర
భాగమును భద్రగిరి రామ । భద్రచరిత
సప్తసాగర మహిమ పు । ష్కరమహాత్వ
మాదిగాఁగల పద్య కా । వ్యములఁ జేసి.

చ. పదముల గుంభనల్ వెలయఁ । బ్రౌఢిరచించిన పద్యకావ్యము
ల్గాదవరిపండితోత్తముల । కుంబలె నయ్యవి పామరాళికి
న్మొదమొనరింప వెల్లరకు । మోదముగూర్చెడు గద్యకావ్యము
ల్విదితముగా రచింపనని వేడుకఁజెందుచు వానియం దిలన్.

చ. కథలన నెల్లవారలకుఁ గౌతుకమూఁగద యందుఁ బల్మనో
రథమునఁ గాశికావసథ । రమ్యకథల్ రసయుక్తముల్ జగ
త్ప్రథితములంచు నేనవి ప్ర । బంధముఖంబునఁ గాక లోకవా
క్ప్రథమననుండుట న్వచన । పద్ధతిగా రచియింపనెంచుచున్.

మ. అరయం బిట్టకథ ల్ప్రబంధముగ జేయన్ సార్థకంబేమి శం
కరునింగాని రమేశుఁగాని పొగడంగా నొప్పునంచు న్ననున్
న్నిరసింపందగదార్యులార! ఇదియున్ నీతిస్ఫురత్కాశికా
పురయాత్రాంతరవాస జల్పిత కథాపూతంబు శ్రోతవ్యమా.

గీ. కాశికేగెద నటనుందుఁ గాపురంబ
టన్నఁ నప్పురవాస పుణ్యంబుగలుగఁ
దత్ప్రభావము మున్నుగాఁ దనరుకథల
నొప్పుటను బూతమిదియని చెప్పనేల ?

అని తలంచి యేతత్ప్రబంధరచనా యత్తచిత్తుండనై

సీ. ఏవిభుఁ డస్మదష్టావధానక్రియా
వ్యస్తాక్షరీచిత్రవైఖరులకు

సఖి మెచ్చి తోలుఁదొల్త సంతసంబున భర్త
వలయోర్మికాది భూషలనొసంగ
నల్లంతదవ్వున నరసి సన్నసదు న
వ్వొసఁగ మన్నించుఁ దానే ప్రభుండు
జనులెల్ల మెచ్చ నేసాధువు సద్వృత్తి
యమరంగ నధికార మాచరించెఁ

గీ. గృతియనం గడు కౌతుకమే పతికి నట్టి
సామినేని కులాంబోధి చంద్రుఁడైన
నారసింహున కీప్రబంధంబు కృతినొ
సంగఁ దలఁచితి మతిఁగృతజ్ఞతదలిర్ప.

ఉ. అంబుజనాభు పద్మనరు । హంబునఁ బుట్టిన వంగడంబులో
నం బరమప్రభావమున । నల్వువహించిన సామినేని వం
శాంబుధి నుద్భవించిరి గు । ణాకరు లాశ్రితజాత పారిజా
తంబులు వంశచంద్రులు వ । దాన్యమణు ల్పురుషాగ్రణుల్మహిన్.

క. గోపాలరావు తత్కుల
దీపకుఁడై యుదయమందె దీనవ్రజ ర
క్షాపరతంత్రుండగుచుఁ బ్రి
తాపకృపాశీల సంస్తుతవ్రతుఁడగుచున్.

మ. గురుతేజో మహిమంబునం దనరు నా । గోపాలరా వర్చితా
మర సీమంతవతీ కదంబయగు న । మ్మాణమ్మయందున్మనో
హరచేష్టో గుణశీల శాలి నరసిం । హాఖ్యాప్రవిఖ్యాతు శ్రీ
కరనారాయణ పాదపద్మనిరతుం । గాంచెన్సుతున్సద్వ్రతున్.

చ. ఘనమతియైన తల్లి పసి । కారున నుగ్గున రంగరించి యా
తని నునుబొజ్జలో సుగుణ । తా రజమొయ్యనఁ బోయఁబోలు నే
ర్పునమతికానిచోఁ గొరత । బూనక బాల్యమునుండియుం దిరం
బున నరసింహునందు గుణ । పుంజము లాగతి నుండ నేటికిన్.

సీ. అధికారగర్వ మిం । తైనఁ జెందఁడు కదా
బాలురతోనైనఁ । బలుకుచుండు

భవభూతియయ్యు ద । ర్పముఁను నేయఁడుకదా
యాహారశయ్యావి । హారగతుల
నొవ్వనాడఁడుగదా । నోరెత్తి పరిచార
కుల నైన నపరాధ । ములగణించి
పరిహాసమునకైనఁ । బలుకనేరఁడుగదా
పరుషతీవ్రానత్య । భాషణముల
గీ. సదయుఁ డనురాగ గుణవర్తి । శాంతమూర్తి
నిత్య సత్యవ్రతుండతి । నిర్మలాత్ముఁ
డతని కాతండె సాటి యౌ । రాయటంచుఁ
బొగడుచుందురు నరసింహు । భూమిప్రజలు.
గీ. సాత్వికంబచ్చముగఁదీసి । శాంతరసము
పదునుపడఁబోసి నెనరుతో । మెదిపిదాన
వానిమతిజేసె భారతీ । జాని, కాని
నాఁడునిల్చునె యన్ని గు । ణంబులచట.
మ. నరులెల్లందన శాంతభావమును నా । నాభంగి గీర్తింపఁగా
నురుకీర్తి ప్రభుతానురక్తిగల యు । ద్యోగంబుతో ధర్మత
త్పరుఁడై యొప్పెడువానికిం బొడమునం । తం దల్లిదండ్రుల్ ...
నరసింహాంబని పేరుపెట్టుటబుధా । నందంబుగాదే తుదిన్.
క. ఆతని యర్ధశరీరము
పాతివ్రత్యప్రభావ । పరిహాసితసతీ
వ్రాత వినిర్మలమతి వి
ఖ్యాత సుగుణ సుందరమ్మ । యనఁబొల్చుఁదగన్.
సీ. పరుల నెన్నఁడునోటఁబరుషంబుఁ లాడదు
అలుగదు దాదుల యందునైన
పెద్దలఁబొడఁగన్నఁ । దద్దయు భయభక్తి
వినయవిశ్వాసము । ల్పెనఁగొనంగ
నమ్రయై మ్రొక్కి చెం । తకుఁజేరితద్వాశే
షములెల్ల నల్లన । సంగ్రహించు

నెప్పుడు సద్గోష్ఠి । యే కల్గివర్తించు
వేదాంతవార్తల । వినఁగ దివురు.

గీ. అర్థిజనులనుఁ గడుప్రీతి । నాదరించు
బంధుసత్కారములువింత । పగిదిఁ జేయు
నొరులుగుచిడినఁజాలు దా । నొందుఁదృప్తి
తరమెపొగడ నృసింహునుం । దరమగుణము.

సీ. ధర్మక్రియాఢ్యయే తరుణీలలామంబు
కరుణాల వాలయే । కంబుకంఠి
సజ్జనమిత్రయే । సారసాయత నేత్ర
విజ్ఞానహృదయయే । విద్రుమోష్ఠి
ఘనసతీ నీతివే । దిని యేభ్రమరవేణి
సద్గుణ సదన యే । చంద్రవదన
దీనలోకావనా । ధీన యే కనకాంగి
భగవత్కథాప్త యే । పద్మగంధి

గీ. యట్టిసుందరమే కొని । యాడఁదగిన
దన్యులను జెప్పవచ్చునే । యన్నిగతుల
పతిపదాయత్త చిత్తసం । భావ్యధైర్య
మందిరమ్మల నరసింహు । సుందరమ్మ.

క. అనురూపకుల వయోగుణ
ఘనమతియై యొప్పునట్టి । కాంతామణి భ
క్తిని సతతము సేవింపఁగ
ననితరసామాన్యవిభవ । హర్షితుఁడయ్యెన్.

క. నరసింహుని కమిత శుభా
కరసంహునకుఁ గదర్య । కరిసింహునకున్
నిరసిత ఘోరాంహునకున్
నరసన్నుత సామినేని నరసింహునకున్.

# కాశీమజిలీకథలు.

## మొదటి భాగము.

### కథాప్రారంభము.

### మణిసిద్ధునికథ.

క. శ్రీకర శశిశేఖర కరు-ణాకర వారాణసీపురాకర గౌరీ
శాకరధృత మృగ గంగా-శీకరవిలసజ్జటా విశేష సువేషా!

వ॥ దేవా! యవధరింపుము. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన కాశీయాత్రా చరిత్రంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన: తొల్లి కొల్లాపురంబున యజ్ఞశర్మయను విప్రుండుగలఁడు. అతండు వేదవేదాంగంబుల సాంతముగాఁ బరిశీలించి తదుక్తధర్మంబుల ననుష్ఠింపుచు సాధుమార్గంబునఁ బెక్కు-ధనంబు సంపాదించి సంపూర్ణదక్షిణలతో విధ్యుక్తయాగంబులఁ బెక్కు-గావించి శ్రోత్రియ విద్వాంసులలో నుత్తముఁడని వాడుకవడసి కాపురము సేయుచుండఁ జిరకాలమునకు పితృహోతృని యారాధనావిశేషంబున నతనికొక పుత్రుం డుదయించెను.

యజ్ఞశర్మ మిగుల సంతసించుచు దానధర్మములచేఁ బేదలఁ దృప్తిపరచి జాతకర్మానంతర మాశిశువునకు గుణనిధి యని పేరు పెట్టెను. అగ్నిప్రసాదసంజనితుండగు నబ్బాలుండు శుక్లపక్షక్షపాకరుండువోలె ననుదిన ప్రవర్ధమానుండగుచు నధిక తేజస్సమున్నతం

బగు నాకారంబు నాకారంబునకెనయగు ప్రజ్ఞయుఁ బ్రజ్ఞానదృశంబు లగు గుణంబులుం గలిగి తనపేరు సార్థకముగావించి తలిదండ్రుల కానందము గలుగఁజేయుచుండెను.

అగ్గుణనిధి యుక్తకాలంబున నుపనీతుండై యథావిధి బ్రహ్మచర్యవ్రతం బాచరించుచు విద్యాభ్యాసంబు గావించుచుండఁ బూర్వజన్మ పరిచితంబులగు విద్యలు చంద్రునిఁ జంద్రికలువోలెఁ గ్రమంబున నతని నాశ్రయించినవి. అతని పాండిత్యము అన్యజన దుర్లభంబగు జ్ఞానప్రబోధమునకు హేతువై యొప్పుచుండెను అతఁడు సంతతము తత్త్వవేతృత్వమునుగురించి పరిశ్రమఁజేయుచుండెను. ఒక నాఁడు తండ్రి కుమారుని వివాహము జేసికొమ్మని బోధించిన వా రిరువురకు నిట్టి సంవాదము జరిగినది

యజ్ఞశర్మ—వత్సా! నీకిప్పుడు వివాహముసేయ నిశ్చయించు చుండ మీయమ్మతోఁ బెండ్లియాడనని చెప్పుచుంటివఁట. ఏమిటికి?

గుణనిధి—తండ్రీ! పెండ్లి యేమిటికాఁడవలయును?

యజ్ఞ—సుఖించుటకు. ఆనందించుటకు.

గుణ—ఏమిసుఖము? ఏమి యానందము?

యజ్ఞ—లోకమంతయు నేసుఖము నేయానందము బొందు చున్నదో నీవు నదియే!

గుణ—తండ్రీ! నేను గొన్ని శ్రుతిసాంప్రదాయముల నడి గెదఁ గోపగింపక తెల్పెదరా?

యజ్ఞ—కోపమేల? అడుగుము.

గుణ—నా కుపనయనము చేయునప్పుడు నామెడలో మూడు పోగులుగల యీయజ్ఞోపవీతము నేమిటికివైచితిరి? దీని సాంప్ర దాయ మేమి?

యజ్ఞ—దేహతత్త్వమిందుఁ దెలుపఁబడుచున్నది. తంతుత్రయము సత్త్వరజస్తమోగుణములు. వానిలోనితంతువులు సత్త్వాదిభేద

ములనియుఁ దొంబదియారుబెత్తలు తత్త్వముల సాంకేతికమనియు దానిమఁడి యజ్ఞసగ్రంథియనియు నుపనిషత్తులలో వ్రాయఁబడి యున్నది. నీవు చూడలేదా ?

గుణ—చూచితిని వివరము తెలిసినదికాదు. వివాహమందు రెండవ యజ్ఞోపవీతము వైతురదియేమి ?

యజ్ఞ—అట్టి తత్త్వములుగల మరియొక్క దేహము భారము వానిమీఁదఁ బడుచున్నదని తెలుపుటకు.

గుణ—తండ్రీ! వివాహమన శబ్దార్థమేమి ?

యజ్ఞ—ఎడతెగని బరువును మోయుట, అని.

గుణ—స్వామీ! ఈ యజ్ఞోపవీతముల నిట్లు పురుషులకు మెడలో వేయుట కేమిప్రయోజనము ?

యజ్ఞ—విద్వాంసుఁడామాటయే శంకించుకొని వానివలనఁ బంధములఁ దెలిసికొని తత్త్వమెఱింగి జ్ఞానవంతుఁడగుటకు. అందులకే యామర్మము తెలిసినవారగుట సన్న్యాసులు జన్నిదములఁదీసివైతురు. దానంజేసియే "జగమెఱింగిన పాఱునకు జందెమేల"యను సామెత వచ్చినది.

గుణ—తండ్రీ! సర్వజ్ఞుండవు నీయెఱుంగనిది లేదు. అన్నియుం దెలిసి నన్నిట్లు పెండ్లియాడుమని బోధింతువేల ?

యజ్ఞ—వత్సా! వానిసాంప్రదాయములఁ దెలిసికొనసమయ మిదికాదు. బ్రహ్మచారి గృహస్థుండై పుత్రపౌత్రాదులవలన గలిగిన యానందమనుభవించి పిమ్మటఁ దురీయాశ్రమము స్వీకరించునప్పుడు దీనిం దెలిసికొనవలయును. ఇదియే లోకాచారము.

గుణ—ఏకర్మనైనఁ బ్రారంభమునందే హేతువుందెలిసికొని చేయుట లెస్సకాదా? తన శరీరభారమును వదలించుకొనుటకు గురుతుగా వేయఁబడిన యజ్ఞోపవీతమొండు బరువైయుండ రెండవదానిం గూడ భరింపుమని చెప్పుచుంటివా ? తండ్రీ! యెఱింగియుండియు మంచిదారింజూపక కంటకభూయిష్ఠమగు తెరవుజూపెదవేల ?

యజ్ఞ—అయ్యో! పట్టీ! నీవిప్పట్టున నిట్టి మాటలం బలుక రాదు. గృహస్థాశ్రమ మన్నిటికి ముఖ్యమైనది. వినుము

ఉ. స్నానముజేసి యగ్నిపరి । చర్య నొనర్చుచు వేళలందుఁ గౌ
పీనముఁదాల్చి వేదము జ । పించుచు దండము చేతఁబూని వి
ద్యానిధిబ్రహ్మచారి జఠ । రాగ్ని జ్వలింపఁగ భిక్షగోరి యె
వ్వానిగృహంబు జేరుఁదల । పన్మతియట్టి గృహస్థుఁ డల్పుఁడే!

గీ. ఉర్వి గృహపతి చల్లఁగా । నుంటఁగాదె
సాగుచున్నది తాపస । జనతపంబు
యతుల నియమంబు వడుగుల । వ్రతము భిక్షు
కులప్రవాసంబు మహిఁద్రైర్థి । కులపరిసేవ.

గీ. కాన గృహపతి యందఱి । కన్న నధికుఁ
"డన్న మన్నమటంచు గృ । హంబుఁ" జేరు
నతిథిఁ బూజింపుమెపుడు స । త్యముగ దానఁ
గలుగు సుకృతము కోటియా । గములరాదు.

తండ్రీ! సర్వదా దుఃఖభూయిష్టమై వాగురాసమానమగు సంసారమున నేను బ్రవేశింపఁజాలను. అందుఁబ్రవేశించిన వారికి ధనార్జనాసక్తి యుండకతప్పదు ఎట్లో యొక్క కడుపు పూరించుకొన వచ్చును కాని భార్యాపుత్రాది కుటుంబము పెరిగినప్పుడు వారింబోషించుటకై గృహస్థుడెట్టికష్టముల బడవలయునో తలంచికొనిన భీతిపుట్టుచున్నది. నిత్యము భార్య జలగవలె రక్తమునుబీల్చుచుండఁ దద్భావచేష్టితములచే మోహితుండై మూర్ఖుండు తెలిసికొనఁజాలక సుఖమని యానందించుచున్నాఁడు భార్య భోగములచే వీర్యమును, ధనమును, కుటిలభాషణములచే మనమును సర్వస్వమును హరింపుచుండును. మూఢుఁడు నిద్రాసుఖవినాశనమునకై దారసంగ్రహము చేసికొనును. పెక్కేల! బ్రహ్మ పురుషులవంచించుటకే పెండ్లికల్పించె. ఇందురవ్వంత

మైన సుఖము లేదు. జనకా! జనకాదులవలె గృహస్థుండై జ్ఞానము సంపాదించుట దుర్ఘటము. మహాత్మా! కుమారుండు ప్రాజ్ఞుండని యెఱింగియు సన్మార్గముపదేశింపక నరకప్రాయంబగు సంసారకూపంబునఁ బడుమనియెదవేల? నాకుఁ బెండ్లియక్కఱలేదు. అనుగ్రహించి విడువుమని పలికిన విని యజ్ఞశర్మ శరీరమునఁ గంపము జనింపఁ దుఃఖముచేఁ గన్నులనుండి యశ్రువులు ధారగావిడుచుచుండెను.

తండ్రి పరితాపముజూచి గుణనిధి యోహో! మాయామోహాబలమిట్టిదేగదా! ప్రాజ్ఞులంగూడ వశపరచుకొనుచున్నది.

శ్లో. ఆదిత్యస్యగతాగతై రహరహ స్సంక్షీయతే చాయుషం
వ్యాపారైర్బహుకార్యభార గురుభిః కాలోన విజ్ఞాయతె
దృష్ట్వాజన్మజరావిపత్తిమరణాః త్రాసశ్చనోత్పద్యతె
పీత్వామోహామయీంప్రమాదమదిరామున్మత్తభూతంజగత్.

ఆహా! నిత్యము సూర్యుని యుదయాస్తమయములచేఁ దమయాయువు క్షీణమగుచుండ వ్యాపారపారవశ్యంబునంజేసి యాలోచము దెలిసికొనలేకున్నారు. తమకన్నులయెదుటనే యనేకులు బుట్టుచుండుటయుఁ జచ్చుచుండుటయు నాపదలనొందుచుండుటయుఁ జూచియు భయమైనఁ బొందకున్నారు. జగంబంతయు నిట్లు యుండుటచే మోహామయంబగు మద్యమును ద్రాగి లోకమునకే వెఱ్ఱియెత్తినదని తలంచుచున్నాను. ఇది మాయాబలము. దీనినతిక్రమించుట కడుంగడు కష్టము తండ్రీ! యూరడిల్లుము. నాకనుజ్ఞయిమ్మని పలికి గుణనిధి యవ్వలికిఁబోయెను.

యజ్ఞశర్మ పుత్రుని మనస్సన్యాసిత్వమునకు వగచుచు నప్పుడప్పుడు కుమారునకామాటయేచెప్పుచు హితులచేఁ జెప్పించుచు నిమ్నాభిముఖంబగు జలంబునుంబోలె వానిమనస్సు ద్రిప్పనేరక కులాభివృద్ధిఁజెందమికి విచారించుచుఁ గొండొకకాలంబున కతండు నాకం

బలంకరించెను. తత్పత్నియు సహగమనముజేసి భర్తంగలిసికొని దివ్యలోకభోగముల ననుభవించుచుండెను.

తల్లిదండ్రులు స్వర్గస్థులైనంత గుణనిధి యాచింత స్వాంతమ్మున నంటనీయక బంధములు తెగినవని సంతసించుచు నత్యంత విరాగము గలిగి తత్వజ్ఞాన విశేషములం దెలిసికొను నభిలాష గురునన్వేషించుచుండె. నంత,

గీ. భసిత రుద్రాక్షమాలికా లసితగాత్రుఁ
డురుజటాధారి వ్యాఘ్రచర్మో త్తరీయుఁ
డపరశివుఁ డనఁదనరు సన్న్యాసి యొకఁడు
వచ్చి నివసించె నూరిదేవళమునందు.

గుణనిధి దేవతాదర్శనము నిమిత్తము నాఁటిసాయంకాలమున నాకోవెలకుఁబోయి యందు రెండవశంకరునివలె నొప్పుచున్న యాసిద్ధుంగాంచి నమస్కరించి యోరగాఁగూర్చుండి తత్తపోవిశేషముల నరసి స్తోత్రపాఠములువిని సంతసించుచు నింటికిఁజనియారాత్రియెల్లఁ దన్మహాత్మ్యమును వితర్కింపుచు మరునాఁడుదయమున లేచి కాల్యకరణీయంబులం దీర్చుకొని యాసిద్ధునొద్దకేగి సాయంకాలమువరకు నందే కూర్చుండి వానివిశేషంబులఁజూచుచు రాత్రికింటికింబోయెను.

ఈరీతిఁ బదిదినములు గడచినంత నాయతీంద్రుఁడు వానిచిత్త నైర్మల్య మరసి యొకనాఁడు సుమతీ! నీవెవ్వని కుమారుఁడవు? నాకడకు నిత్యము నేమిటికి వచ్చుచుంటివి? నీయభిలాష యేమి? ఏమియు మాటాడక పోవుచుందువే! నీయుదంత మెఱింగింపుమని యడిగిన గుణనిధి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె:

స్వామీ! నేను యజ్ఞశర్మయను బ్రాహ్మణుని కుమారుండ నాపేరు గుణనిధియండ్రు. తల్లిదండ్రులు స్వర్గస్థులైరి. నాకెవ్వరును లేరు. మీవంటి సాధువులే నాకుబంధువులు, మీయట్టిమహానుభావులు పామరుల నుద్ధరించుటకే లోకయాత్ర చేయుచుందురు. నాకేకోరిక

యును లేదు. ఇహాపరములయందు రోతపుట్టినది. కైవల్యమునకు సులభమగు మార్గమేదియో తెలిసికొనన భిలాష కలుగుచున్నది. మత్పురాకృత సుకృతవిశేషంబునంజేసి నాకోరికఁ దీరువ నట్టి మహానీయులు మీరే యిటకు దయజేసితిరి. నేను కృతార్థుండనగుదునని యెంచియుచుంటి ముక్తిమార్గ ముపదేశింపుఁ డిదియే మదభీష్ట మిందులకే మీకడకు వచ్చుచుంటి. కృపాపాత్రుం జేయుఁడని పాదంబులం బడి వేడుకొనియెను.

అప్పు డాసిద్ధుండు వానిలేవనెత్తి నత్సా! నీబుద్ధిపారిశుధ్య మెఱిసితిని. పూర్వజన్మవాసనావశంబున నీకు విజ్ఞానం బయత్నో పలబ్ధంబై యున్నయది. నీవు కారణజన్ముఁడవు నీకు మాయుపదేశముతోఁ బనిలేదు. ఇదివరకే నీవు మనసుచే సన్యాసివైతివి. ఇప్పుడు కాయము నంగూడ సన్యాసము స్వీకరింపుము. నీవలనఁగొన్ని పురాతనగాథలు భూలోకమున వెలయవలసియున్నవి. కావున నొక సహాయునిం గూర్చికొని ధారుణీశైలానంబగు కాశీపురంబున కరుగుము. అందలి పరమహంసలతో నీకు సహవాసము గలిగెడిని. దానముక్తుండవయ్యెదవిదియే మేముపదేశింపునది. అని పలుకుచుఁ దనమూటనుండి కాంతులువిరజిమ్ము రత్న మొకండుదీసి యతనిచేతంబెట్టి యిట్లనియె.

సుయత్నా! నీవీరత్నమును ముందిడుకొని పూజించి కన్నులు మూసికొని ధ్యానించినంత భూతభవిష్యద్వర్తమానకాలంబులం జరిగిన కథావృత్తాంతములన్నియుఁ గరతలామలకముగా నీకుఁదెలియఁబడఁగలవు. దీనిని సాలగ్రామమువలెఁ బూజించుచుండుము, ఈమణి సిద్ధించుటచే నీవు మణిసిద్ధుండ వనఁబరగుదువు. పొమ్మింటికిఁ బొమ్మని పలికి వాని శిరంబునఁ గరంబిడి దీవించి యంపివేసి తానం దేనిం బోయెను.

అమ్మణిసిద్ధుండు గురూపదిష్టమును మంత్రోపదేశముగా స్మరించుకొనుచుఁదదుక్తప్రకారము వెంటనేగోవిందతీర్థులనుయతీంద్రు

నొద్దకుఁబోయి సన్యాసము స్వీకరించి మణిసిద్ధ యతీంద్రుఁడను పేరుతోఁ బిలువంబడుచుఁ గాశీపురంబున కరుగ నిశ్చయించి, యొక నాఁడు లౌల్యమతియను మిత్రునొద్దకుఁబోయి యిట్లనియె.

మిత్రమా! నాకుఁ జిన్నతనమునుండియుఁ గాశీపురంబున కరుగవలయునని యభిలాష గలిగియున్నది. నేఁడు గురూపదేశము గూడ నాయభీష్టమునే బలపరచినది. నేనిప్పు డయ్యాత్రకుఁ బోవుచుంటి నొంటిగాఁ దెరువునడువఁగూడదని పెద్దలు సెప్పుదురు. నీకు నాయోపిన యుపకారముగావించెద నప్పయనంబునకుఁ దోడువత్తువే యని యడిగిన వాఁడు నవ్వుచు నిట్లనియె.

అయ్యో! తమ వేదాంతమంతయు నెక్కడికిఁ బోయినది? తండ్రి యెన్నివిధములఁ బ్రతిమాలినను పెండ్లిచేసికొనక యూవగతో నాయనను సమయజేసితివికదా! ఇప్పుడు కాశికింబయనమా? దారిలో మాబోంట్లను దోడుతీసుకొనిపోయి చంపుదువుగాఁబోలు. చాలుఁ జాలు! అయ్యో! వేదాంతులకును దీర్ఘయాత్రలు కావలయునా? నేనురాఁజాలనని పరిహాసమాడినవిని యాదుష్టునితో మరుమాటాడక యాయోగి వేరొక యాప్తునికడకరిగి యభీష్టంబు తెలిపిన నతండును నాండ్రుబిడ్డలను విడనాడి యిట్టినడికాలములోఁ బ్రయాసములకోర్చి కాశికి వచ్చుటకు వీలులేదని కచ్చితముగా నుత్తరము చెప్పెను.

వెండియు నొకసఖునికడకరిగి యతనితోనిట్లనియె. ఆర్యవర్యా! ధాత్రీతలంబునఁ బ్రసిద్ధపట్టణంబు గాశియన విందువుగదా! అందు ముక్తిదాయినియగు గంగాభవానియు మోక్షలక్ష్మీఘటనాసమర్థుండగు విశ్వనాథుండును ముఖ్యదేవతలని యాబాలగోపాలవిదితమే! తత్పురంబుఁజూడ నీకు వేడుక లేదా? అప్పురవిశేషంబు లెన్నియేనిఁగలవు. వానినెల్లమార్గంబునవక్కాణింతు. జన్మముసాద్గుణ్యమయ్యెడుఁదుతో దురమ్మ. పుత్రమిత్రకళత్రాదులయెడమమత్వమోహంబువిడువుము.

వారుపరలోక సౌఖ్యమునకు శత్రువులు. మేను శాశ్వతంబుగాదు. కాశీపురంబు దర్శనమాత్రమున సంసారతాపత్రయముల యాత్రం బుడిగించునని నుడివిన దడయక మరల నాపుడమివేల్పు మణి సిద్ధున కిట్లనియె.

అయ్యా! కాశీపురంబట్టి పరిభావసంపన్నంబేకాని మార్గంబ మితక్లేశజనకంబని చెప్పుదురు. కాశికిఁబోవుటకంటెఁ గాటికిబోవుటయే సుఖమనవిందును. ఇదియునుంగాక దివ్యజ్ఞానసంపన్నులగు మీవంటి వారలకు దీర్ఘయాత్రవలన బ్రయోజనంబేమి? అజ్ఞానులకు మార్గక్లే శంబువలనజ్ఞానంబుగలుగునని తీర్థయాత్రవిధించిరి. మానసతీర్థంబాడని వారికి నాఁడు వారికెనిగూడఁ తీర్థయాత్రవలన లాభములేదందురు. పామరులకునై కల్పితంబగు యాత్రలకై తమవంటియతులతిప్రయత్న మొనరించుట నీతిగాదు. నామాటలంబాటించి యప్పని యుడుగుఁడనిన నతనితో మారువలుకక యయ్యతితిలకుండు నింకొక చెలికానింజేరి

గీ. విశ్వనాథుండు దేవతావృక్ష మమర
గంగ దుర్వారపాప ప్రభంగ యన్న
పూర్ణ గీర్వాణ సురభి యపూర్వపుణ్య
ఫలదములు తీర్థములు శుభాస్పదము కాశి.

అప్పురమునకుంబోవుచుంటిఁ దోడురమ్మని జీరుటయు నతండిట్లనియె.

స్వామీ! నామీఁదఁ గోప మూనకుఁడు. కాశీమార్గంబున రోగబాధయుఁ జోరబాధయు మెండఁట. పరలోకతుల్యమగు కాశి కరిగి యొక్కండేని యిక్కడకుఁ జేరినవాఁడు గలఁడే! యట్టి ప్రమా దాస్పదంబగు యాత్రకిట్టి ప్రాయంబుననున్న నేనెట్లుతోడువత్తునని యుత్తరంబిచ్చిన తత్తరమందినడెందముతో నతండు వెండియుఁ గొండొక కొండికం జేరి యిట్లనియె.

వత్సా! తీర్థయాత్రవలనగలుగు పుణ్యమెద్దానం గలుగదు.

అందుఁ గాశి కలుషపిశిత రాకాశి. గంగసంసారతాపభంగ. మణికర్ణిక మోక్షలక్ష్మీకుత్రిమణికర్ణిక. అన్నపూర్ణ యన్నపూర్ణ. భైరవుండఘభైరవుండు. అట్టిదానిం జూడఁబోవుదు. నేఁడు తోడు వత్తువేయని యడిగిన నతండిట్లనియె

స్వామీ! తమరు వాకుత్రిచ్చిన వాక్యంబుల కర్థంబేమియో యెరుంగను. తుదినుచ్చరించిన రాకాశి భైరవ, పదంబుల కాస్పదం బయ్యావసథంబు. దీని నేనెట్లెరుంగుదుననిన వినుండు. మత్పితా మహుం డతి వృద్ధుండు. అతండొకప్పుడు తాననుభవించిన కాశీ ప్రయాణక్లేశంబు నాతోఁజెప్పెను. అక్కథవినిన నిప్పయనం బెవ్వరునుఁ జేయయత్నింపరు. తానెవ్వరి ప్రోత్సాహముననో మత్పితా మహుం డొకప్పుడు నెలవున సుఖముగా నిలువలేక రాకాశియగు కాశి కరుగ నుత్సహించి కొంతమంది సహకారులతోఁ బయలుదేరె నఁట. బయలుదేరునప్పుడు పాథేయమునకై మోయునంత పిండియుఁ బెసరపప్పు నుప్పును గారంబునుం గలిపిన చింతపండును గొన్ని బట్ట లును గొంత సొమ్మునుమూట గట్టికొని యమ్మూటశిరంబునంబూని పూటకు రెండుయోజనంబులు వడువున నడువఁదొడంగిరి.

మాతాతగారతి నియమస్థులగుట సత్రంబుల భుజింపఁడు. కుతపకాలంబునకుఁ జేరినయూర నన్నంబు వండికొనుచుండును. అతి నియమస్థుఁడగుటచే నెక్కుడుగా నాకలియైనప్పుడు రాత్రులఁబిండి చేసికొని భుజించును.

అటు నడువనడువ నాయాస మెక్కుడైనకొలదిఁ దినమునకు యోజనత్రయమే నడువసాగిరి. మరి పదిదినములకు పూటకు యోజ నము మాత్రము నడువ నాత్రముగా నుండెనఁట. ఇట్లునడుచుచుండ నొక్కనాఁటి మజిలీ దవ్వగానుంట విని జాముతాత్రియుండగనే లేచి తోడివారలతోఁగూడ నడవిమార్గంబునంబడి నడచుచుండెను.

అన్నిశాంతంబున ననంతవేగ వాతోద్ధూతంబులై జీమూతసంఘాతంబులొక్క పెట్టున పుడమియిట్టట్టుగదల గర్జిల్లుచు నాకసంబంతయు నావరించి తళుక్కురను మెఱుపులు చూపులకు వెరపుగరుపఁ దెఱువెఱుంగని యిరులుగ్రమ్మఁ బెనుజడి గుమ్మరింప నొడలుతడిసి గడగడవడంక నగ్గాలివాననిలువ నెందుఁదావుగానక యత్యంత దుఃఖాక్రాంత స్వాంతుఁడై మత్పితామహుండు మేసిపై నాసబూనక చిత్తంబు త్తలపడ నెత్తిపై నెత్తుకొన్న తడిసినమూటను మాటిమాటికి భుజమున మార్చుకొనుచు నతిక్లేశముతో నడచుచుండెను. అట్టితరి నెట్టిసుమతి కైన విసుగు రాకమానునా ?

తడిగుడ్డలఁ బిండుకొని గాలివానయొక్కింత యడఁగినదని సంతసించుచు నడువయత్నించుచుండ నొకదండనుండి ప్రచండకోప మేపార దండధరకింకరులఁ దిరస్కరించు తస్కరు లెదురై బెదరు గదుర నార్చుచు దండంబుల మోది యచ్చోటసారుల దోచికొని కట్టుగుడ్డలతోఁ బ్రాణంబుల మిగిలిచి సాగనంపిరి.

నడుమనప్పు డతిభారమైన మూటలు లేకపోవుటచే నాఁటి పయన మెంతేనిఁ దేలికయైనది. తెల్లవారిన వెనుక మాతాతగారును సహవాసులును జేతఁగాసైనను లేకపోవుటచే మేనులు గాసిజెందుటచేఁ గాళ్లపైఁ గొంతవిసుగుఁ దోప నడుచుచు మిక్కిలి దవ్వగు నాఁటియవసథంబు పయనంబున కంతరంబున నంతరాయము వాటిల్లుటచే మునిమాపునకుఁ జేరుట కడుప్రయాసమైనది.

అట్లు సాయంకాలమునకు శరీరంబులు జేరనైచి వంటజేసి కొనుటకుఁ జెంతసామాగ్రి లేమింజేసి చింతించుచుఁ దమబడిన బన్నముల నప్పౌరుల కెఱింగించి పాత్రాదికముల సంగ్రహించి యర్ధరాత్రంబున కెట్లో భుజించిరి.

వారిలోఁ గొందరికి నతిసారరోగమంకురించుటచే నమ్మరు

నాఁడు పయనముసాగించుటకు వీలుపడినదికాదు. అప్పటఁగలనత్రం బున రోగావిష్టుల నిలువనీయరు. వారి యామయ మెఱింగి కావలి వారలు వారి నందు వెడలఁగొట్టిరి.

అప్పుడారోగులఁ దీసికొనిపోయి తోడివారూరిబయల నున్న మశీదుపైఁ బరుండఁబెట్టిరి. తురకలత్తెరగరసి యతిరయంబున నరు దెంచి పరుసంబులాడుచు రోగుల నడివీథికినీడ్చి తోడివారలఁ జావ మోదిరి. తమ్మలమిళితవసనంబులఁ దటాకంబున నుదుకుటచే వారిలో గొందరధికారి నికటంబునకుఁ దీసికొనిపోఁబడి శిక్షితులైరి. అక్కటా! అయ్యిక్కట్టు రోగులకన్న తోడివారికే యెక్కుడుబాధకలుగఁ జేసి నది. పదిదినములయ్యూర వసించిరి. వారు పడినయిడుములకు మేర లేదుగదా ? రోగులకుఁ గొంచెముఁ జవసత్వములు గలిగినతోడనె క్రమ్మరఁ గాశికిఁ బయనముసాగింతమని కోరిన సహవాసులకు మత్పి తామహుం డిట్లనియె.

నీ ! కాశి రాకాశియని యెఱిఁగియే బుద్ధిమాలి పయనమైతిమి. యీసిగ్గుచాలదా ? జ్ఞానముగలవారి కింటికడ మోక్షమురాదా ? జ్ఞానములేనివారలు నీటికాకులవలె మునింగినను ప్రయోజనమేమి ? ఇంటికి బోవుదమురండు. ఈపాటిశిక్ష చాలును. అపరాధులవలెఁ జెర సాలఁబడితిమి. యవనులచే దెబ్బలందింటిమి. బ్రాహ్మణులమయ్యుఁ గడజాతివారిచే నీడ్వంపఁబడితిమి. అయ్యో ! ఆవెతలు తలంచికొనిన గుండె పగిలిపోవుచున్నది. దేవతార్చన జేసికొనుచు నింటికివచ్చిన యభ్యాగతుల నర్చించుచు సత్కాలక్షేపము జేయుగృహస్తునికిఁ దీర్థ యాత్రతోఁ బ్రయోజనమేమి ? బ్రతికియుండినఁ బెక్కుమార్గములఁ బుణ్యము సంపాదించుకొనవచ్చును. మరలి యింటికింబోవుదము రండని బోధింపనఁ గొందఱు సమ్మతించిరి. మఱికొందఱతనిమాట బాటింపక వారిని విడిచి యవిముక్తక్షేత్రంబున కఱిగిరి.

మత్పితామహప్రభృతు లారుమాసములకిల్లు సేరి మతిమూఁడు నెలలకుఁ బూర్వజవసత్వములు గలిగి తిరుగఁజొచ్చిరి. కాశికిం బోయిన పదుగురిలో నెనమండ్రు దారిలోనే కడతేరిరి. ఇరువురప్పురవరంబు జేరిరఁట. కొంతకాలమందుండి వారింటికివచ్చుచుండ మార్గమధ్యంబున కాలధర్మంబునొందినట్లు చిరకాలమునకుఁ దెలిసినదని యీకథ యొకప్పుడు మాతాతగారు నాకుఁజెప్పిరి. కాశికిఁబోయినవాఁడు తిరుగ నింటికిరాఁడని యాబాలగోపాలవిదితమే. మీకింత జెప్పవలయునా? నామనవి మన్నించి మీరును నప్పయనపు వేడుక మరలించుకొనుఁడు. మిత్రుండనగుట నింత జెప్పుచుంటిని. ప్రణవాక్షరజపము జేసికొనుచు స్వదేశంబున వసింపుఁడు. అని యెంతయో యుపన్యాసముగాఁ జెప్పెను.

మణిసిద్ధుండద్దిరా! బుద్ధిమంతుడవౌదు వెంతగాధ జెప్పితివి. చాలుఁ జాలునని పలుకుచు వానినివిడిచి వేఱొకసఖునిం జేరి యాత్మీయాభిలాష నెఱింగించుటయు నతండును గాశీప్రయాణం బతి ప్రయాసజనకంబని నుడివి యనంగీకారము సూచించెను.

ఇట్లడిగినవారెల్లఁ గాశీపురంబును నిందించుచుఁ బోవలదని తన్ను మందలింపుచుండ మిక్కిలి పరితపించుచు జాత్యంతరులఁ బెక్కండ్రనడిగియు విగతమనోరథుండై యొక్కనాఁడిట్లు తలంచె.

అయ్యో! దైవమా! నేనేమిపాపమాచరించితిని. కాశీనివాస యోగము నాకు లేదుగాఁబోలు? విశ్వనాథసందర్శనంబును, గంగానదీస్నానంబును, నన్నపూర్ణ చేతిభిక్షయుఁ, బూర్వపుణ్యఫలంబున గాక యూరక లభింపవండ్రు. ఈశ్వరానుగ్రహం బెట్లున్నదో కదా యని యనేకప్రకారంబులఁ జింతించుచు గనఁబడినవారి నెల్లఁ గాశికి వత్తురేయని యడుగుచు వెఱ్ఱివానివలెఁ దిరుగఁ జొచ్చెను. ఇట్లనేక పురంబులు కాశీయాత్రా సహాయునికయి యయ్యతీశ్వరుండు గ్రుమ్మరుచుఁ గాశీపురాయత్తచిత్తుండయి విశ్వనాథుని ధ్యానించుచు నన్న

పూర్ణం గొనియాడుచు గంగాభవానిం బొగడుచు నొక్కనాఁడతం డొక గ్రామాంతరమునఁ జిట్టడివి దారినడుచుచుండ ముందటి—

సీ. వాసనల్ వెదజల్లు వనసుమావళి శిఖా
శ్రవణభూషలుగాఁగ సంతరించి
పెనుగోచి బిగియఁగట్టిన తోలుమొలత్రాట
వరుసఁ గత్తియుఁ గొడవలియుఁజొనిపి
పసిమేత తమి నాల్గు దెసలకొయ్యనఁబారు
పసులఁ గ్రమ్మరఁ బ్రోగుపరచికొనుచు
పొగరెక్కినట్టియాఁ బోఁతునెక్కి విచిత్ర
గతులఁ దోలుచుఁ దురఁగమునుబోలె

గీ. పొదలఁ దూరినపసులు దాపునకురాగ
మోవిదగిలించి పిల్లన గ్రోవిపాడి
కొనుచు మూపునఁ బెనుదండమును ధరించి
పసులఁ గాచెడు నొక గోప బాలుఁగనియె.

కనుంగొని వానితోనిట్టి సంవాదము గావించెను.

మణిసిద్ధు—ఓరీ! యెవ్వఁడవురానీవు. ఇటురారా (అని పెద్ద కేకపెట్టెను.)

గొల్లవాఁడు—(దాపునకువచ్చి) వోరీవోరీయని పిలిచెదవు నీ నొకేమైన కొవ్విననదా? మాల మాదిగ ననుకుంటివా? నాకు పేరు లేదా? మాపెద్దకాపున్నైతము పేరుపెట్టి పిలుచునుగదా? ఆమాత్ర ము బుద్ధినీకులేదా?

మ—ఓరీయన్న మాత్రముననే నీకు కోపమురావలెనురా?

గొ—అదిగో! రా అంటేగాని నీనోటితీట తీరదుగాఁబోలు.

మ—పోనీ నీయిష్టమువచ్చినట్లు పిలుతునుగాని నీపేరేమి అబ్బాయీ! యేమికులమువాఁడవో చెప్పుము.

గొ—ఆలాగున మొదటనే మనవిజేసుకుంటే బాగుండునే? ఔరా! గొల్లోళ్లు లోకువా బాబూ! నాపుట్టువుర్వోత్తము సెప్పుతా గాని నీపేరు వూరు కులము ముందుగా సెప్పుమరి.

మ—నాపేరు మణిసిద్ధుఁడు నేను బ్రాహ్మణుఁడను. మా కాపురము కొల్లాపురము.

గొ—నీవు భేమ్మడవైతే బోడిగుండేమి, మాభేమ్మడులాగున లేవేమి?

మ—విూబ్రాహ్మణుఁడు యేలాగున్నాఁడు చెప్పుము.

గొ—మాభేమ్మని గురువులోడికి యీతరుప్పలాగుజుట్టు. పొలిమేర రాతిమీాదవేసిన కొంగరెట్టలాటిబొట్టు. మెడమీాఁద చేప మీాసాలవంటి ధారాలువేసుకొని వ్రొంకరబూరాలతో యేటికొక మాటువచ్చి యెవరినో యొకరిని తెగకాల్చి మరీవెడతాఁడు. వాఁడి లాగున నీవు లేవేమి?

మ—ఓహో! వారా! వారు వైష్ణవులు. మేమువైదికులము.

గొ—అయిదుకులకు బుజముమీాద దారాలు వుండవా?

మ—అవి దారములుకావు యజ్ఞోపవీతములు. వారిలో నేను సన్యాసినిగనుక ఉండవు.

గొ—సన్యాసి అంటే తప్పుమాట కాదండి?

మ—తప్పని నీవెట్లెఱుంగుదువు?

గొ—నేనేదైనాతప్పుచేసినప్పుడుమా పెదకాపు నన్నుసన్నాసి వెధవసన్నాసివెధవ అని తిట్టేవాఁడుఅందుకోసరము తప్పనుకున్నాను.

మ—తప్పుకాదు. సన్యాసియనగా భార్యాపుత్రాదులు లేక యొంటరిగా తిరుగుచు నన్నిసంగములు విడిచినవాఁడని యర్థము.

గొ—అయ్యా! సన్నాసిగారు! అన్ని సంగములూ అంటు న్నారు. స్త్రీసంగం లేదండీ?

మ—మేము పెండ్లియే యాడలేదు.

గొ—అయితే భోగంవాళ్ళని యుంచుకున్నారా యేమిటి ?

మ—వాళ్ళను మేము చూడనేచూడము. కామమును జయించినారమురా !

గొ—అదిగో "సీ" "రా" మాత్రము విడువవు.

మ—పొరబాటున వచ్చినది పోనిమ్ము. ఈమాటలతోనే సరి పోయినది నీపేరు కులము చెప్పితివికావుగదా.

గొ—నేనుగొల్లోరిచిన్నవాణ్ణినాపేరు కోటప్పమాదీవూరేను.

మ—ఈయూరనఁగా నేయూరో పేరుచెప్పుము ?

గొ—ఇది శ్రీరంగపురము.

మ—నీకుఁ దలిదండ్రు లున్నారా ?

గొ—లేరు, చిన్నప్పుడే చచ్చినారఁట.

మ— మరి యెవరిదగ్గిరనున్నావు ?

గొ—ఈవూరి పెద్దకాపుగారిదగ్గర నున్నాను.

మ—ఏమిచ్చుచున్నాఁడు ?

గొ—అన్నంబట్ట యిచ్చుచున్నాఁడు వారిపశువులను కాచెదను. ఇదంతా వారిపొలమే. వారిది గొప్పకమతము. వాళ్ళింటికి వెళ్ళండి స్వయంపాకం యిస్తారు.

మ—నాకు స్వయంపాకము అక్కరలేదు గాని నీకు వివాహమైనదా?

గొ—యివాహం అంటే యేమిటి ?

మ—పెళ్ళి.

గొ—(నవ్వి) యింకా కాలేదు.

మ— కోటప్పా! నిన్నొక యుపకారముకోరెదనుచేయుదువా?

గొ—నేనుచేసే యుపకారమేమిటండో ?

మ—నేను కాశికిఁ బోవుచున్నాను ఒంటరిగాఁ బోఁగూడదు తోడువచ్చిన నన్నువస్త్రములిచ్చి యేమడిగితే అదియిచ్చి చిత్రమైన కథలుకూడా చెప్పెదను.

గో—నీవు కాశీవి యెవరిపశువులు ?

మ—పశువులుకాయడముకాదు కాశీయన నొకపట్టణము.

గో—కాశీఅంటె యెక్కడనున్నది ?

మ—అది మహాస్మశానము గంగయొద్దనున్నది.

గో—బాబో! నన్ను గంగయొద్దనున్న స్మశానములోనికి రమ్మంటివా ?

మ—దానిపేరేకాని స్మశానముకాదు పెద్దపట్టణము.

గో—అక్కడకు వెళ్ళడమెందుకు ?

మ—అది మహాపుణ్యభూమి ! అక్కడకు బోయి గంగలో స్నానమాచరించి విశ్వనాథుని దర్శించి యొకరాత్రి వసించినను మరుసటిజన్మమునకు మహారాజై పుట్టుదురు.

గో—ఎవ్వరు వెళ్ళినానా ?

మ—మనుష్యులు పక్షులు పురుగులు మృగములు మొదలైనవి కూడ గంగలోమునిగినంత ముక్తినొందును.

గో—అక్కడనుంచేనా కాశీకావిడి తీసుకొనివచ్చి ముష్టెత్తుకొనేవాళ్ళు డబ్బిస్తె కాశీపట్టణముఁజూపించెదరు ?

మ—ఔను వారలు యాత్రచేసినవారే.

గో—అలాగైతే దానిపుట్టుపూర్వోత్తరమంతా చెప్పుము విన్నపిమ్మట నాకు బాగున్నదనితోచిన వచ్చెదనని చెప్పుతాను లేకపోతే రానని చెప్పుతాను.

మ—(ఆమాటను వినినంత సంతోషించి వానిదరికిఁజేరి యక్కడ నున్న మఱ్ఱిచెట్టుపీడంగూర్చుండఁబెట్టి) దాని పూర్వోత్త

రమును సంక్షేపముగాఁ జెప్పెదనుగాని నీవిదివరకేమైనా కథలు విని యున్నావా ?

గో— ఏమిటో పాండవకథంటె పందికథంటే మరి కామమ్మ కథంటే యీలాటివేకాని మరివినలేదు.

మ— నేను చెప్పినది నీవుజ్ఞాపకము వుంచుకోగలవా ?

గో— నాకుకథలంటే మహాయిష్టము తెలిసేలాగున చెప్పితే జ్ఞాపకముంచుకోగలనుగాని గొడవగాను పెద్దమాటలుగాను చెప్పకుము.

మ— ఆలాగు నేఁయుని యతని శిరము మీఁదఁ దనహస్తమిడి వానికి గ్రహణశక్తి పూర్ణముగాఁ గలిగించి యక్కథనిట్లని చెప్పం దొడంగెను.

---

## కాశీమహిమదెలుపుకథ.

గోపా! వినుము. తొల్లి త్రిలోకసంచారియగు నారదుండు తీర్థయాత్రకు వెడలి యనేక పుణ్యస్థలంబుల కఱిగియఱిగి యందలి తరంగిణుల నవగాహంబు సేయుచు నొక్కనాఁడు వింధ్యాచలోపాంత కాంతారంబుదరియంజొచ్చె. అదియు నుద్యానవనంబువోలెఁ గమ నీయభూరుహాలతావృతంబై యొప్పుటం జేసి యమ్మునిస్వాంతంబునకు విశ్రాంతింగలుగఁ జేసినది.

పదంపడి యమ్మునియు నర్మదానదిం గృతావగాహుండై మధురఫల రసాస్వాదనమత్తశుకపికస్వానగానంబులకుఁ దానంబు లగు మరందబిందుపానాలోలరోలంబనాదంబులు చెవులకింపు జనింప జేయ నడచు నజ్జడదారి రాకయెరింగి వింధ్యాచలేంద్రుండు జంగమ రూపంబున నెదురేగి యర్ఘ్యపాద్యాది విధుల నమ్మహానుభావు

నర్చించి విశ్రమించియున్న కొండొడవడి కిట్లనియె. స్వామీ మునీంద్రా! నాకొక్క సందియంబు గలదు వక్కాణింపుఁడు. లోకంబున లెక్కకురాని మెట్టలెన్ని యేనింగలవు వానింబాటింప నేటికి? మేటియని పేర్కొనువానిలో హాటకాచలంబును నేనుంగదా మేటులమైయుంటిమి. పక్షపాతంబు మాని మాయిద్దరకుంగల తారతమ్యంబు వక్కాణింప మీరలు సమర్థులని యడిగిన నజ్జడదారి యొక్కింత సేపూరకుండి శిరఃకంపంబుతో నుస్సురని యిట్లనియె.

గిరీంద్రా! పాపము నీవు లోకంబుపాటి మాటల నాడుచుంటివి. మొన్న నేనమ్మేరుధారుణీధరంబు కడకరిగితి. అదియు నీవెట్టట్టు లవంధ్య గర్వంబునంబల్కుచు నిన్నుచిన్నమెట్టలతోటి పాటిగా బేర్కొని తనకెందును సాటియగునగంబు లేదని మువ్మారొత్తిపలికినది. మీయిద్దర తారతమ్యంబుఁను నోరులకు నరయ శక్యమే! నీకు మేలయ్యెడుంగాక పోయివచ్చెదనని యక్కలహాభోజనుండింటదేనింజనియె.

పిమ్మట వింధ్యమ్మమ్మునితిలకుని పలుకులఁదలంచి కలకజెందిన డెందంబుతో నౌరా! మేరుగిరికింత పొగరేల? దానిమదం బుడిగింతునని యాక్షణంబ యవక్రవిక్రమంబునఁ ద్రివిక్రముండువోలె బ్రహ్మాండకరండంబునిండ దన మేనుబెంచి నిక్కిచూచుటయు సూర్యాదిగ్రహగమనంబులకంతరాయంబైన కతంబునం గొన్ని లోకంబు లంధకారంబును గొన్ని దేశంబు లెండయుఁ గొన్ని విష్టపంబు లివకయుఁ గొన్ని దేశంబులు హిమంబును బీడింపఁ దొడంగినది. అయ్యకాండప్రళయోత్పాతం బెఱింగి యింద్రాదిబృందారకసందోహము శతానందునిదరిజేరిగి యవ్వెరపు తెఱం గెఱింగించిన నవ్విరించియు నయ్యుపద్రవంబు లోపాముద్రామనోహరుని వలనంగాని చక్కఁబడదు. అమ్మహానుభావుం డిప్పుడు కాశీపురంబునం గాపు

రంబు సేయుచున్నవాఁడతనిం బ్రార్థింపఁబోండని యానతిచ్చిన గీర్వాణులు వాణీధవు రానతి కాశీపురంబున కరిగిరి.

గోపాలా! యింతవట్టు కథస్పష్టంబుగాఁ దెలిసినదయా! యనిన వాఁడయ్యా! మీదయచే నంతయుం దెలియుచున్నదిగాని యిందొ క్కసందియంబుదయించె వినుండు. వింధ్యంబన మనము చూచు మెట్టలకన్న నున్నతము గలిగియుండవచ్చునుగాని మనుష్యునివలె మాట్లాడుటయు నెదుగుటయు నెట్లుగలిగియున్నదో నాకు విడిపోవ కున్నది దాని నిక్కంబు తెరం గెఱింగింపుఁడనిన నతండు వాని శంకకు సంతసంబంకురింప వెండియు నిట్లనియె.

భూతలంబున మహానుభావ సంపన్నంబులగు కొన్ని గిరు లకును మనుష్యులవలె జంగమరూపంబులు గలిగియున్నవి. అవియు భార్యాపుత్రాదులఁ గూడి కాపురంబు సేయుచున్నటుల గ్రంథంబుల వ్రాయబడియున్నది.

హిమాచల పుత్రియగు పార్వతీమహాదేవిని శివుండు పెండ్లి యాడినకథను నీవు వినలేదుగాబోలు. వింధ్యాద్రియు నట్టిగిరికోటి లోని దగుట నట్లాచరించె. తర్వాతి వృత్తాంత మాలకింపుము. ఇంద్రా దులట్లు కాశీపురంబున కరిగి యప్పుర మహానుభావత్వ మగ్గించి యాహా! వింధ్యాద్రి మూలంబునఁగదా మన కీతన్నగరాలోకన కౌతుకంబు సంప్రాప్తించె ధన్యులమైతిమని తలంచి గంగానదిం దీర్థంబులాడివిశ్వ ధు నభిషేకముఖార్చనా విశేషంబుల నారాధించి యన్నపూర్ణను భజించి ఢుండిభైరవాదుల పాదంబుల కెరగి మరి యుంగల శివలింగమూర్తుల నర్చించి యందందు నగస్త్యుని జాడం గనిపెట్టుచు నెట్టకే నొకరీతి నాతపస్వియున్న యిక్కమెఱింగి యొక్క గుహాముఖంబుగా నయ్యాశ్రమంబు సేరిరి.

అక్కుంభసంభవుండును జంభారి ప్రముఖ బహిర్ముఖుల

రాక యెఱింగి పొంగిన డెందంబుతో వారి కర్ఘ్యపాద్యాద్యర్చనా విధులం దీర్చి దర్భాసనంబుల నాసీనులం జేసి పదంపడి స్వాగత పూర్వకముగా నాగమ కారణం బడుగుటయు నా దేవతలు బృహస్పతి ముఖంబుగా లోకంబులకు వింధ్యాద్రి మూలంబునం గలిగిన యుపద్రవప్రకారం బెఱింగించి యాబాధ వాపుమని యత్తపోధన సత్తముని బ్రార్థించిన నంగీకరించి యతండును వారి నిజనివాసంబులకనిపె. సురలరిగిన వెనుక నమ్మునివరుండు కాశీనివాస సౌఖ్యంబునకుం గలిగిన యంతరాయమును దలంచి కలఁగిన మతితో లోపాముద్ర నీక్షించి యిట్లనియె.

కాంతామణీ! నిరంతర మిప్పురంబున ననంతసుఖంబనుభవించుచు నేకాంతముగా వసించియున్న నన్నెట్లెఱింగిరో? నిలింపులు తత్సుఖంబున కంతరాయంబు గలుగజేసిరిగదా? నాగొప్పతనంబే నాకింతముప్పు దెచ్చినది. కటకటా! నాకు సురతటినీజలావగాహన యోగంబు లేదు గాబోలు పర్వతసంఘంబులనెల్ల గడగడవడకించు బల్లిదుఁడొక గిరికి వెరచి నేఁడు నామఱుఁగు చొరవలెనా! ఇదియు మదీయకర్మఫలంబె గదా! అప్పుడప్పని కద్దియేని ప్రతిరోధము సెప్పక దెప్పన నొప్పుకొంటి. నీవైనను సెప్పవైతివిగదా? యతివా! యని యనేక ప్రకారంబులఁ జింతించుచుఁ బ్రయాణోన్ముఖుండై యప్పురంబు మువ్మారువలఁగొని కొంతవడి నడిచి యప్పురాభిముఖుండై యిట్లనియె హా! తల్లీ గంగాభవానీ! నీచల్లదనంబు విడిచి పరమ నిర్భాగ్యుండనై యన్యదేశం బరుగుచుంటి. కరుణించి యనుజ్ఞ యిమ్ము. అన్నపూర్ణ! నీచేతి భిక్షాశనంబు విడిచి వేరొకయెడకఱుగు జనునియెడ గృప విడువకుము. హా! విశ్వనాథ! నిన్ను విడిచిపోవఁ గాళ్ళాడకున్నవి. బిందుమాధవా! నాయందు దక్కటికము నుంచుము. పోయివచ్చెదను. ఓఢుంఠీ! తుండాదండసీత్కారమారుతమ్ముల

నెన్నడు తాపమార్చుకొందునో? భైరవా! భక్తచకోరకైరవాప్తుండ వగు నీపాందువాసి యేగుటకన్న వ్యసనమున్నదే? మణికర్ణికా! నీపరిభావం బెఱింగియుఁ బెరచోటి కరుగు దురితాత్ముండు గలఁడే! అని పెద్దయెలుంగునఁ దద్దయుంబ్రొద్దు గాశిఁదలంచి కన్నీరుగార గోలుగోలుమని యేడ్చుచుం బలికి యందు వెడలి కతిపయ ప్రయాణంబుల వింధ్యాద్రికడకేగెను. అని చెప్పిన గోపాలుండయ్యా! ఆయూరు బాయుట కాయనయంతయడల నేటికి! కార్యంబైన వెనుక మరలనరుగరాదే! యనిన నయ్యతియు వినుము. నీప్రశ్నంబున కుత్తరంబు ముందరి కథయే చెప్పఁగలదు.

అట్లు లోపాముద్రా సహాయుండై యగస్త్యుండు తన చెంతకరుదెంచుటయు వింధ్యుండు గర్వంబువిడిచి గురుభక్తితో మిన్నంటి యున్న తనశిఖరంబులుపుడమియంట మునియడుగులంబడియె. అప్పుడుమార్గావరోధంబు వాసిన భాస్కరాదిగ్రహంబులు యథామార్గంబులసంచరించుటచే లోకోపద్రవంబడంగె. పిమ్మట నమ్ముని పతియు నతనిశిరంబున గరంబిడి వత్సా! మేము దక్షిణయాత్ర కరుగుచున్నవారము. వచ్చువరదాక నీవీతీరుననుండుము. అట్లుండకున్న మదీయపరిభావంబెఱుంగఁ జేసెదనని యతనినొడంబరచి దక్షిణాభిముఖుండై యగస్త్యుండు చనియె. అదియేసుమీ! మరల నుత్తరంబున కగస్త్యుండు రాకునికి గారణంబు. వినుమట్లయ్యగస్త్యుండు వింధ్యాద్రి నేలంబడ నేసి క్రమంబున భద్రాచల పట్టసాచల పుష్పాచల ధవళాచలాదిపుణ్యక్షేత్రంబులు సేవించుకొనుచు శ్రీశైలంబున కరిగెను.

ఆశ్రీశైల శిఖర మీక్షించినంత మేనుంబులకింపఁ దదీయ మహిమ దిలకించి యగస్త్యుండు లోపాముద్రతోనిట్లనియె.

పూబోఁడి! చూడుమిది శ్రీశైల మిందు మల్లికార్జున

దేవుండేకాంతముగా భ్రమరాంబా సహాయుండై విహరించుచున్న వాఁడు. ఇన్నగాంతరమునుండి కృష్ణవేణి పాతాళగంగయను పేరఁ బ్రవహించుచున్న యది ముప్పది యోజనంబుల వైశాల్యంబును నాలుగుద్వారంబులును, సంజీవినీ ప్రభృతి దివ్యౌషధులును, సంచార వృక్షంబులును, కదళీచందన బిల్వాద్యనేక వనంబులును వరాహ నాగసింహాది బిలంబులును, రత్నాకరంబులగు నిధులును, ముక్తి ప్రదంబులగు పెక్కు తీర్థంబులును, ననేకకోటి మహాలింగంబులును, గలిగియున్నవి.

ఇందుండు పాషాణంబులెల్ల శివలింగంబులనియుఁ జెంచులు మహర్షులనియుం జెప్పుదురు పెక్కేల నిన్నీలకంధరు నాలయంపు శిఖరము జూచినంత మోక్షంబు జేకూరునని తదీయప్రభావంబు పలుదెరంగుల నభివర్ణించుచుండ నాలకించి లోపాముద్ర మానస ముద్రిగ నాడి మనోహరు వదనంబులపై చూడ్కి నిలిపి యెద్దియో యడుగంబోయి యూరకున్న నాసన్న యెఱింగి యమ్మునివరుం డంగనామణీ! నీవేల మాటాడఁబోయి యూరకుంటి వెద్దియేని సందియంబున్న నడుగుమని సాదరంబుగా బలికిన నామెయు నతి వినయముతో ప్రాణవల్లభునకు నమస్కరించి యిట్లనియె. నాథా! శిఖరదర్శన మాత్రమున ముక్తిప్రదంబయి యీక్షేత్రంబింత ప్రాంతంబుననుండ జచ్చినంగాని మోక్షం బీఁజాలని కాశికతిగి గాశిజెంద నేటికి? మీరును కాశీవియోగసంతాపము పాతాళగంగా ప్రవాహశీకరంబుల నార్చుకొనుచు సుఖంబున నిందుండ రాదే? యని యడిగిన పడంతి సంప్రశ్నమున కగస్త్యుఁడు మెచ్చుకొని యామె సందియంబువాయ నిట్లని చెప్పందొడంగె. అంగనామణీ! శ్రీశైలాది పుణ్యక్షేత్రంబులు కాశివలె బునరావృత్తి ముక్తిసౌఖ్యం బొనగూర్పజాల వీయర్థంబు తేటబడ నొకయితిహాసంబు సెప్పెదను నాకర్ణింపుము.

## శివశర్మయను బ్రాహ్మణుని కథ.

మధుర యనుపట్టణంబున శివశర్మయను బ్రాహ్మణుఁడు గలండు. అతండు సమస్త విద్యలయందుఁ బ్రవీణుండై పండితరాజను బిరుదువహించి పెక్కురొక్కంబు సంపాదించి గృహస్థధర్మముల యోగ్యవర్తనములచే నాచరించుచుఁ బుత్రులఁ బెక్కండ్రంగని తత్సంతోషంబు గొన్నిదినము లనుభవించినవెనుక నొక్కనాఁ డంతరంగమున యౌవనంబుపోకను ముదిమిరాకను దలంచి యిట్లు చింతించెను. కటకటా! నాదగు పూర్వప్రాయమంతయు నైహిక సుఖంబులకై వృథావ్యయ పుచ్చితి నాముష్మికంబింతయైనను సంపా దించుకొననైతి సిరు లశాశ్వతములు. మేనుచంచలము, బంధులు మాయాసంబంధులని యెఱింగియు అనాదియగు నవిద్యచే నవి యన్నియు దిరములై యుండునట్లుగానే వ్యాపారములు జరిపింపఁ బడుచున్నవి. నేనును అట్టిజ్ఞానంబు గలుఁగజేయు గ్రంథములు పెక్కు జదివియు ననుభవంబు లేమింజేసి యింతవట్టును వట్టిబూట కపుదానికై దొరలుచుంటిని. నేఁటికిద్దియో పూర్వపుణ్యఫలంబునఁ దెలిసికొంటి. ఇప్పుడు తీర్థయాత్రారూపంబునఁ బుణ్యం బుపార్జిం చెదనని నిశ్చయించి యప్పుడ కొడుకులకు సొత్తంతయుంబంచి యిచ్చి యొక్క శుభముహూర్తంబున నిల్లు వెడలి కతిపయప్రయాణంబుల గాశీపురంబున కఱిగెను.

కాశీమహిమ నంతయు నంతకుమున్న చదివినవాఁడగుట నొరుల సహాయము లేకయే యందలి తీర్థవిశేషంబుల నరయుచుఁ దీర్థోపవాసపూర్వకముగా గంగానదిం గృతావగాహుండై యంగం బుప్పొంగ విశ్వనాథుని దర్శించి యానంద బాష్పములతోడ నద్దేవుని కభిషేకంబుగావించి సంపూర్ణ మనోరథంబుతో నన్నపూర్ణనారా ధిం చివటుకభైరవాదుల యాత్రావిధిం భజించి మఱియు గాశీ

ఖండంబున జెప్పంబడిన శివమూర్తులను తీర్థవిశేషంబులను వెదకి వెదకి వానినామంబులనచ్చటివారి కెఱుంగదెల్పుచు నధిక నియమంబు మీఱ నారుమాసంబు లాపురంబున నుండి యమ్మహాదేవు నర్చించెను. పిమ్మట దక్కుంగల తీర్థముఖ్యంబుల సేవింపందలంచి యందు వెడలి ప్రయాగకరిగె అదియు నెంతో ధన్యాత్ముండైనను రెండు మూఁడు వాసరంబులకన్న నెక్కువ నుండనీయదు. కావున మూఁడు దినంబులందలి తీర్థదేవతల యథావిధి నారాధించి మరియును, గయము, గాంచీపురంబు, నుజ్జయినియు, మధురయు, ద్వారవతియు, నయోధ్యయు మొదలగు క్షేత్రంబుల కఱిగి యందలి హరిహరుల సమబుద్ధి నారాధించి మాయాపురంబున కఱిగెను.

అదియు హరిద్వారం బనియు, ముక్తిద్వారంబనియుఁ జెప్పఁబడుచుండు. అట్లఱిగి శివశర్మ నిర్మలబుద్ధిఁ దీర్థోపవాసంబుచేసి యథోక్తరీతి నాతీర్థదేవతల దృప్తిపరచి యందుఁగల చంద్రశేఖరుని పంచాక్షరీ మంత్రపారాయణపరుండై మూఁడువాసరంబులర్చించెను.

అట్లుండ నంతనొకనాఁడు హరిద్వారప్రాంత గంగా తీరంబున మాధ్యాహ్నమం దన్నము వచించి పాత్రిలో వడ్డించుకొనఁదలచు నంతలో నితాంతమరణావేదన యావిర్భవించి జీవితమాపతముల కెడయయ్యెను.

అట్లు శివశర్మ గంగాతీరంబున జీర్ణదేహంబువిడిచినంతలోఁదన కన్నులారంగనిన సంగతులన్నియు బహువినోదములుగాను నద్భుతములుగా నుండుటంజేసి యదితనకు భూలోక నివాసంబున కంతరాయంబైన మరణంబుగా నెఱుంగక తానొక చక్కనిదేశంబున కేగుచున్నట్లు తలంచెను.

ముందు నద్భుతంబగు తేజఃపటల మొండు తనచెంతకు వచ్చుచున్నట్లు కాన్పించె. అదియు గొంతనిదానించి చూచినకొలఁది నవ

రత్నఖచితమైన బంగారపు తళుకుగానేర్పడియె. అదియు నవికాపిం చిన కొలఁది నొకవిమానంబుగాఁదోఁచె. అట్టి విమానరత్నంబు దనచెంత నిలిచినంగని యదియొక భాగ్యవంతుని యానసాధనమను కొని దాని నధిరోహించువేడుక మనంబున నంకురించుచునంతలో నందుండి యిరువురు పరిచారకులు దిగివచ్చిరి.

వారింజూచి యతండు వీరెవ్వనికై వచ్చిరో యెవ్వనివారలో కదాయని వెరగందుచుండ నక్కింకరులును దివ్యభూషాంబరములంగై కొని తిన్నగా నతనిదగ్గరకువచ్చి శివశర్మా! వీనిధరింపుమనుటయు నాతండడివరకు దనజీవితకాలములో నంతవిలువగల నగలను బట్ట లను జూచి యెఱుంగమి మరియు నద్భుతమందియోహో యిప్పుణ్యా త్ములెవ్వరోకదా నన్నుమిగుల గౌరవపరచుచున్నవారు. వీరి కుల గోత్రంబులఁ దెలియుటెట్లనయని వారి నుపలక్షించి యిట్లనియె.

అయ్యలారా! మీరెవ్వరు? దీనినెవ్వరికై గొనితెచ్చితిరి? మీవృత్తాంతమెట్టిదో యెఱింగింపుఁడనిన వారును జిఱునగవు మొగమునకు నగయెమెఱయ నోశివశర్మా! మేము విష్ణుకింకరులము. నీచేసిన సుకృతమునకై వీని నీనిమిత్తమే తీసికొనివచ్చితిమి. ఇవ్విమా నరత్నమధిష్టింపుము. విష్ణులోకంబున కేగుదమనుటయు నతం డొక్కింతపరిశీలించి తాను జదివిన గ్రంధంబుల నవలోకనంబుజేసి కొని యోహో ఇదినాకు మరణావస్థయని తెలిసికొంటి. తీర్థసేవం గావించిన పుణ్యంబేకదా నన్నింత గౌరవపరచుచున్నది. పురా ణంబుల జదివినరీతిని మరణాంతమునఁ బుణ్యాత్ములఁబుణ్యలోకంబు నకుంగొనిపోవువిమానమా? యిది. మేలుమేలు! నాపుణ్యమిట్టిదే యని సంతసించి వారిచ్చిన భూషాంబరములఁదాల్చి యక్కింకరు లిరుగెలంకుల వింజామరలు వీవ నవ్విమానరత్నం బధిష్టించి యూర్ధ్వ లోకాభిముఖుండై చనియెను. అట్లు కొంతదూరం బఱిగి నంత

మహిషవాహనారూఢుండై దివ్యపురుషుండొకఁడే తెంచి యతనికి నమస్కరించి చనుటయు శివశర్మ విష్ణుకింకరుల నీదివ్యపురుషుం డెవ్వఁడని యడిగిన వారితఁడే కాడా భూతసంఘాతంబుల సమయించు యముండనియు నిది యమలోకపు పొలిమేరయనియుఁ జెప్పిరి. దాని కతండు వెరంగంది యయ్యా! పురాణంబుల యమునిరూపము భయంకరముగా వర్ణింపఁబడియున్న దే? ఇంత సౌమ్యుఁడుగా నుండు టకుఁ గతంబేమి యతిన వారిట్లనిరి.

పుణ్యాత్మా! పాపాత్ముల కట్టిరూపున గాన్పించునుగాని మీ వంటి పుణ్యాత్ములకు మాత్రి మిట్టిరూపముతో వచ్చి చూపట్టు వాఁడని యెఱింగించుచుండ నవ్విమానరత్నము యమలోక మతిక్రమించి మఱియుం బెక్కుభువనంబుల దాటి బ్రహ్మలోకంబునకుం జనినది. ఆలోకంబాలోకోత్సేకంబగుట శివశర్మ కాలోకింప నఘాతకౌతూ హలం బొదవించె. అంత నక్కింకరు లతని బ్రహ్మసభకుం గొని పోయి తదీయవృత్తాంతం బెఱింగించిన నవ్విరించియు నింతయేనా యని పెదవి విరచె పిమ్మట నావిమానంబును విష్ణులోకంబునకుం గదలుటయు శివశర్మ చతురాననుండు తన్నుఁగుఱించి యీసడించిన సంగతి విష్ణుకింకరులనడిగిన వారిట్లనిరి.

అయ్యా! నీవత్యంత పుణ్యాత్ముండవని మేము నిన్ను విను తించిన నవ్విరించియుఁ గాశిలో మేనువిడువని కొరంతనుగురించి యీసడించె. వారణాసిం గాత్రింబువాయుని నను లెట్టిపుణ్యాత్ము లైనను పునరావృత్తిరహితముగుముక్తిం బడయనేరరని యెఱిం గించుచుండ నవ్విమానంబు విష్ణులోకంబునకుం గొనిపోయె. పిమ్మట శివశర్మ విష్ణులోకంబునఁ బెద్దకాలంబు సుఖించి మరల ధరణీపతియై జనియించి కొంతకాలంబు రాజ్యమేలి కాశిలో నివసించి యందు మేనువాసి పునరావృత్తిరహితముగు శివలోకసాయుజ్యమందె.

వాల్గంటే వింటివిగదా! ఇతర క్షేత్రంబులకుం గాశికింగల వాసియని తెలిసికొని యగస్త్యుఁడు లోపాముద్రతో శ్రీశైలాది పుణ్య క్షేత్రంబుల సేవించుకొని నేఁటికిఁ గూడ దక్షిణదిశను గాపురంబుండెను.

గోపా! కాశీమహిమంబు వింటివా? పంచక్రోశవైశాల్యంబు గల యాక్షేత్రం బుత్తరవాహినియగు గంగాతీరమందున్నది. అందు విశ్వనాథుండు ముఖ్యదేవత, బిందుమాధవస్వామి క్షేత్రపాలకుండు, భైరవుఁడు పురరక్షకుండు, అన్నపూర్ణ, విశాలాక్షియను పేరులం బరగియున్న దేవతయే ముఖ్యశక్తి. ఢుండి మొదలగువారావరణ దేవతలు, మణికర్ణిక తీర్థముఖ్యము, మరియు ననేకకోటిలింగంబు లును ననేకకోటిమహాశక్తులుం గలిగియున్నయవి. అప్పురమహిమంబు సంక్షేపంబునం జెప్పితి. షణ్ముఖుండైన నిక్కంబు వక్కాణింప నోపండదిముక్తిస్థానంబు. పెక్కేల సేవించినంగాని తద్విశేషంబు లెరుంగఁబడవు. ప్రొద్దు చాల యెక్కినది. తత్సహాయమునకై యేమియుత్తరమిత్తువో చెప్పుమనిన నాగొల్లచిన్నవాఁడా కథను విన్నంత గోపభావంబువిడిచి మిక్కిలి గ్రహణశక్తి గలిగి కాశీ ప్రయాణోత్సాహంబుదీపింప నయ్యతిచంద్రునకు వందనంబాచరించి యిట్లనియె. అయ్యవారూ! తమరునాకిప్పుడు చెప్పిన కథావిశేష ములు కాశీప్రయాణమున కుత్సాహంబు గలిగించుచున్నవి కాని యొండు వినుండు. మొదటినుండియు నాకుఁగథలయందు తాత్ప ర్యము ఎక్కువగానున్నది. నేను మీతో వచ్చునపుడు నడుమఁ ద్రోవ నెద్దియేని నొకవింత గనంబడిన దానిగురించి నాచేయు ప్రశ్నంబునకుఁ గథామూలముగా నుత్తరంబిచ్చుటకు నొడంబడుదు రేని యిప్పుడు మీమాటంబూని వచ్చువాఁడ నట్లియ్యని యాక్షణంబ యింటికి మడిగిబోవు వాఁడ నిదియ మదీయవాంఛితంబు. దీనిం జెల్లింప నొడంబడుఁడని వేడుకొనుటయు నయ్యతిపతిమిగుల సంత

సించి గోపా ! నీకోరిక యిదియేకద. అట్టిప్రశ్నములకు నూటికి విచి
త్రములగు కథలమూలముగా నుత్తరము జెప్పఁవాఁడ సంశయింప
కుము. లేలెమ్ము. పురమ్మునకరిగి నీయజమానుని కెఱింగించిరమ్ము.
పొమ్మనపుడు వాఁడందులకు వందనపూర్వకముగా నియ్యకొనియాక్ష
ణంబ పురంబున కఱిగి యక్కాఁపునకుం జెప్పి యొప్పించుకొని కావల
సిన సామగ్రి కొంతగైకొని కావడిగాఁగట్టి యక్కావడి మూపునం
బూని తోడరా నొకశుభముహూర్తంబున నామణిసిద్ధ యతీంద్రుఁడు
కాశీయాత్రకుఁ బ్రయాణము సాగించెను.

అయ్యతిచంద్రుఁడు నియమముగాఁ గాశీయాత్రఁ జేయఁ
దలఁచుకొనుటం జేసి దారి నడుచునపుడు మౌనమువహించి ప్రణ
వాక్షరజపము జేసికొనుచు నడుమ గొల్లవాఁడెద్దియేని నడుగుచుండఁ
జేయి వీచి మాట్లాడఁగూడదని సూచించుచుఁ గాశీనగర దర్శన
వ్యగ్రచిత్తుఁడై మనంబునంగల తొందరనడకయందుఁ గాన్పింప
మొదటిమజిలి చేరెను.

అట్లుచేరి యొకసత్రంబున బసజేసి మౌనంబువిడిచి గొల్ల
వానింజీరి నేనిందు పాకంబుసేసెద సామగ్రియంతయు నుండెంగాని
ఆకులును కట్టెలును గొరంతగానున్నవి. ఇది యరణ్యప్రాంతము.
ఈయూరిబైటనే యవి లభ్యమగును. సరగ నఱిగి సంగ్రహించి
రమ్మని చెప్పవాఁడరణ్యవాసి యగుట వెరువక యొక్కరుఁడ చని
కొన్నికట్టెలం గొట్టి యాకులంగోసి మోపుగట్టి యెత్తుకొనునంతలోఁ
బైకిఁదలయెత్తి చూడఁగా భూమికి నేత్రగోచరమైనయంతదూర
ములో నొక కీలురథమరుగుచుండుటఁజూచి వెరఁగంది యోహో !
యిదియేమివింత ! ఈబండి భూమినంటకయే యరుగుచున్నయది.
దీనిచందమెట్టిదో మనయయ్యవారినడిగి తెలిసికొనియెదం గాకయని
వేగిరముగా నామోపు శిరమునఁ బూని యింటికరిగి యామోపుదింప

కయే అయ్యగారూ ! అయ్యగారూ ! అని యరచెను. ఆస్వాముల వారు మడిగట్టుకొని యితరజాతులతో మాట్లాడరు. వాఁడెంత బిగ్గరగా నరచినను ప్రతివచన మియ్యకపోవుటచే వానికి మిగుల కోపము వచ్చినది. మోపుదింపి యీకేకకు మాట్లాడకున్న నిప్పుడే యింటికిఁ బోవుచున్న వాఁడనని మరలఁ బెద్దయెలుంగున బిలిచిన నాతపస్వి యదరిపడి వాకిటకువచ్చి హస్తసంజ్ఞతో నిప్పుడుమాట్లాడను భోజనమైన వెనుక మాట్లాడెదనని సూచించుచు వాఁడు తెచ్చినకట్టె లును ఆకులునుందీసికొని వేగముగా వంటఁజేసి భుజించిన వెనుక నీవలకు వచ్చి గోపాలుని నన్నమునకుఁ బిలిచెను. వాఁడు నేనొక విచిత్రమైన విషయము జూచితిని. దానిపూర్వోత్తర మెట్టిదో చెప్పినంగాని భుజింప ననిన నాయతియు వత్సా ! భుజింపుము. పిమ్మట స్థిరముగాఁ గూర్చుండి నీయడిగినదానికింగల కారణంబులు చెప్పెదనని యెట్టకేలకు వానినొడంబరచి యన్నముబెట్టి భుజించిన వెనుక యొకరమ్యమైన ప్రదేశమున వసించి వానిం బిలిచి గోపా ! నీవు చూచినవిశేష మెద్దియో చెప్పుమనుటయు వాఁడిట్లనియె.

అయ్యా ! నే నాకులకై పొలమున కరిగినప్పు డొకబండి యూకాశమార్గమునఁ బోవుచున్నది. అందుఁ గొందఱు పురుషులు స్త్రీలతో వినోదముగా మాట్లాడుచున్నట్లుగూడ వినిపించినది. ఇది కడుచిత్రము దానివృత్తాంత మెట్టిదో యెరిగింపుఁడనిన నయ్యతియు దనకు సన్న్యాసియిచ్చిన మాణిక్యమును ముందిడికొని పూజించినంత నమ్మణిప్రభావంబున నావృత్తాంతమంతయుఁ గరతలామలకముగాఁ బొడకట్టుటయు నద్భుతపడి యతఁడు వానితో నిట్లనియె.

గోపా! నీవు శౌనకమహర్షి వలెె బహుకథాశ్రవణకుతూహ లుండవు కావున నీకాపేరు తగియున్నది. నిన్నిప్పటినుండి శౌనకుం డని పిలుచుచుందు. నీవు చూచినది యొక కీలురథము. దానివృత్తాం

తమెంతయు విచిత్రమైనది. కథారూపముగాఁ జెప్పినంగాని తెలియదు. సావధానముగా నాలకింపుమనుటయు వాఁడుచాల వేడుకపడి అయ్యా! మీరకథ నాకుఁ జెప్పునప్పుడు గూఢార్థములుగల గీర్వాణపదములఁగూర్చినచో గ్రహించుట కష్టముగానుండును. తేటమాటలతో నెఱింగింపుఁడని వేడుకొనిన మెచ్చుచు నయ్యతిపతి వానికిట్లని చెప్ప దొడంగెను.

---

## మొదటి మజిలీ.

# శూరసేనమహారాజు కథ.

కాశ్మీరదేశంబున మధుర యనుపట్టణంబున శూరసేనుండను రాజుగలం డతండు ధార్మికుండును నీతిమంతుడును వినయశీలుండును బుద్ధికుశలుండు నగుటచేఁ దన రాజ్యమందలి జనులనెల్ల బిడ్డలవలెఁ జూచుకొనుచు వారివారికిఁ దగినరీతిఁ గొలఁదికప్పంబులం గట్టుచు బీదలైనవారి కుటుంబమునకుఁ దగినవృత్తులేర్పరచుచు దేవబ్రాహ్మణ భక్తిగలిగి నిర్జలప్రదేశంబుల వాపీకూపతటాకాదులఁ ద్రవ్వించుచు రామరాజ్యంబువోలెఁ బాలించుచుండెను. అతనియెడఁ బ్రజలు నధిక తాత్పర్యముతో మెలంగుచుండిరి. మఱియు నతనికి వినయనిధి యను మంత్రిగలం డతండును గంటికి ఱెప్పరీతి రాజునకు ముప్పురాకుండఁ గాపాడుచు నీతిశాస్త్రపారంగతుండై సంధివిగ్రహయానద్వైదీభావ సమాశ్రయములయందును సామదానభేదదండముల యందును మిత్రామిత్రులయందును యథాయుక్తముగా మెలంగుచు అరులవలన రాజ్యంబున కేకొఱంతయు లేకుండునట్లు ఇంద్రునిచెంత బృహస్పతియుంబోలె సకలరాజ్యభారవాహుఁడై యుండెను.

ఆరాజేంద్రుని పురోహితుఁడు కళానిధియనువాఁ డఖిలశాస్త్రములఁబరిపూర్ణముగాఁ జదివినవాఁడగుట నతని సహాయమువలన గతాగత కాలముల మంచిచెడ్డలఁ దెలిసికొనుచుఁ గాలస్వైపరీత్యాది దోషంబులకుఁ దగినశాంతులఁగావించుచు నాతఁ డతని మంత్రింబు నైతమాలోచన సభలో ముఖ్యమైనదానిఁగా నెన్నుచుండెను.

మఱియుం బాణిజ్యవాణిజ్యపూజ్యమతియగు నొకవర్తకుం డును సకల యంత్రరచనా నిపుణధిషణుండగు నొక కళాదుండును నాప్తులై యుండ నాభూనాథుం డామంత్రిపురోహిత వర్తకకళాదులు నలువుర నెల్లప్పుడు నెడబాయక వారి యాలోచనానుసారముగా రాజ్యంబేలుచుండెను. వారేగురు రాజ్యదేహంబునకుఁ బ్రాణంబులై యేకొరంతయు లేక నడుపుచుండిరి. అట్లుండునంత నద్ధరాకాంతుఁ డొక వసంతకాలమున సాయంసమయమున నంతఃపుర సౌధోపరి భాగంబున నిష్కుట విటపికుసుమ వాసనలు నాసాపుట పర్వంబు గావింప నలుదెసలఁ గట్టిన వట్టివేళ్ళచాపలఁజల్లించు జలసీకరంబుల నెగరజిమ్మి కమ్మని మలయమారుతమ్ములు మేనికిహాయిగా సోక నేకాంతపుకొలువుదీర్చి యక్కొలువుకూటంబునకు నల్వురమంత్రుల రావించి యంతకుమున్ను తనకుఁగలిగిన విచారంబువారుకొనురీతిఁ బ్రసంగింపుచుండ నవ్విధంబెఱింగి వినయనిధి వినయంబున నిట్లనియె.

దేవా! దేవరవారి ముఖవిలాసంబరయ నేఁడెద్దియో విచార గ్రస్తమానసులై యున్నట్లుతోచుచున్నది. తద్దయుంబ్రొద్దుచింతింప నట్టి కారణము లెద్దియునుగానరాదు. ఎద్దియేనిం గలిగెనేని సమదుఃఖ సుఖులమైన మాకుఁజెప్పవలదె? చెప్పితిరేని ప్రాణంబులచేనగుకార్యం బైనను సమర్థింపఁగల మవ్విధంబరయ మానసంబు లాత్రపడుచున్న వని యడిగిన నతనిమాటలాలకించి యొక్కింత సేపూరకుండి యుస్సు రని దీర్ఘనిశ్వాసపూర్వకంబుగా నారాజు వారికిట్లనియె.

మిత్రులారా! నాకు గొరంతయేమియును లేదు. నేఁడు మన యాస్థానమునకు వచ్చిన వార్తాపత్రికం జూడ నామనంబున నొక్క విచార మంకురించినది. మన రాజ్యంబునఁ గోటీశ్వరుండొకఁ డకాల మృత్యువుచేఁ గబళింపఁబడెనఁట! అతని కేవిధమైన సంతానమును సమీపజ్ఞాతులును లేకపోవుటయేగాక మరణశాసన మేమియును వ్రాయకుండుటం జేసి వాని యాస్తి యంతయు మనయధీనమైనదని తద్గ్రామాధికారులు పంపిన పత్రిక యిందాక మీరు చూచినదేకదా!

సంతానంబు గొరంతయైన వానిగతి యెట్టిదో కంటిరే! మనకు సైతమిట్టి చందంబగునేమో యను చింత యావిర్భవించినది. మనకు పూర్వప్రాయంబు కడచినది. దేహంబుతోడ నేఁగదా మృత్యువావిర్భ వించుచున్నది. బ్రతుకు నిక్క మెవ్వరెఱుంగుదురు. మనలో నొక్కనికి నొక్క పుత్రుఁడును లేకపోయెనే! మనయనంతరం బింత రాజ్యం బెవ్వని యధీనమగునోయని చింతించుచుంటి. ఇంతియకాని వేఱొండుకాదు దీనికి మీయుత్తరం బేమని యడిగిన బుద్ధిమంతుడగు నమ్మంత్రి యా రాజుతో వినయపూర్వకముగా నిట్లనియె.

దేవా! దీనికిఁ జింతింపకుఁడు. పుత్రోత్పత్తివిషయమై యనేక సాధనంబులు గలిగియున్నవి. తొల్లి దశరథాది ధరణీపతులు పెక్కండ్రు వృద్ధులయ్యు పుత్రకామేష్టి మొదలైన సత్క్రియలవలన సంతానంబు వడయలేదా? అట్టి విధిం దెలుప మన పురోహితుండు సమర్థుండని యతని మొగముపైఁ జూడ్కి నిలిపిన నాబ్రాహ్మణుఁడు లేచి యల్లన నమ్మహారాజుతో నిట్లనియె.

రాజా! సంతానము జనించుటకై పెక్కు విధులు గ్రంథంబులఁ జెప్పఁబడియున్నవి హోమంబులు దానంబులు తీర్థసేవలు లోనగు సత్క్రియలవలనఁ బుత్రులు జనింతురు. వానిలో సులభమగు మార్గంబు చింతించి సంతానంబుగలుగుటకు పూఁటకాఁపయ్యెదను.

బ్రాహ్మణ ప్రసాదంబునగాదే! తొల్లి వృద్ధుండైన నరసింహదేవ మహారాజుగారు కృష్ణదేవరాయలం గనిరనిన నద్దారాకాంతుండా వృత్తాంత మెఱింగింపుఁడనుటయు బ్రాహ్మణుండిట్లని చెప్పందొడంగె.

## కృష్ణదేవరాయల జననకథ.



ప్రసిద్ధుండైన నరసింహదేవ మహారాజుగా రాంధ్రదేశంబున నధికధర్మిష్ఠుండై పాలించుచుం గవీంద్రులవలన ననేకకృతులువడసి దిగంతవిశ్రాంత యశోమహితుండై యొప్పుచుండెను. ఇట్లుండియు సంతానంబు గొఱంతయైనం జింతించుచున్న యావృద్ధభూపతి మతికి ధృతిగఱపి యతని యమాత్యుం డారాజ్యంబున నూరక యనేకాగ్రహారంబుల ననుభవించుచు సంవత్సరంబున కొకసారియైన దర్శనం బియ్యని సిద్ధాంతులం బెక్కండ్రి పట్టాలతోడ రప్పించి సాదర పూర్వకముగా నిట్లనియె

దైవజ్ఞులారా ! మీదైవజ్ఞత్వంబు సార్థకమునొంద నేఁడుమీవలన మనరాజుగారి కొకప్రయోజనంబు దీర్పవలసి వచ్చినది. దైవజ్ఞులన దైవమును గుర్తెఱింగిన వారుగదా. గతాగతకాలముల జరుగు విషయములు మీకుం గరతలామలకములై యుండును. మీగ్రంథములకుం గోచరములు కానిసంగతులుండవు. కావునంబురాతన గ్రంథములం బరిశీలించి రాజుగారి జాతకఫలమున కనుగుణ్యముగాం గాలరీతిం గనిపెట్టి సంతానంబు గలుగుమార్గంబొండు వక్కాణింపుఁడు. చెప్పలేమంటిరేని తక్షణమే మీమీయగ్రహారములకుంగల పట్టాలతోఁ గూడ నాస్థలనువిడిచి యన్యదేశముల కరుగవలసివచ్చును. మీగ్రంథంబుల నట్టి సాంప్రదాయకమైన యర్థముదొరకక మానదిదియ ముమ్మాటికి నాజ్ఞయని బుద్ధిమంతుండైన యామంత్రి చెప్పిన మాట

లాలకించి యాసిద్ధాంతులు చింతాకులస్వాంతులై కొండొకవడికి నుదుట్టు గదుర నప్పని కారుమాసములు మితి గోరిరి. మంత్రియు నట్టి మితినిచ్చి వారి నిజనివాసంబుల కనిపెను. పిమ్మట నాజ్యోతిష్కు-లిండ్ల కఱిగినవెనుక నందరు నేకముఖముగా నిద్రాహారంబులుమాని తమరదివర కెన్నఁడును విప్పిచూడని పురాతనపు జ్యోతిషగ్రంథంబులన్నియు నొక్క యక్షరం బేనియు విడవకుండఁ బరిశీలింప దొడంగిరి.

ఇట్లారుమాసములు రాత్రింబగళ్ళు తదేకదృష్టిగాఁ బరిశీలించుచుండ నొక్కనాఁడొక్క గ్రంథంబున రాజుగారి పూర్వపుణ్యాముననో సిద్ధాంతుల యదృష్టంబుననో సంతానజననసూచకమైన విషయమందుఁ జూడనయ్యె. తత్సంవత్సర మాఘబహుళ చతుర్దశీ భానువారమునాఁటిరాత్రి తులాలగ్నమున రెండుఘడియలు భుక్తమైన తరువాత నాగ్రామమున కుత్తరదిశను క్రోశద్వయ పరిమాణముగల దూరములో నల్పపరిమాణమెత్తుగల యంతరిక్షమున నక్షత్రమొండు పడుననిసిద్ధాంతమూలముగాఁ దెలినది. దాని బుద్ధిమంతులైన సిద్ధాంతులు పుత్రోత్పత్తికిఁ గారణమగునట్లు మార్చిరి. చిరకాలము స్వర్గంబున బుణ్యసుఖం బనుభవించిన జనులు పుణ్యంబు క్షీణమైనవెనుక మర్త్యలోకంబున నక్షత్రరూపముగాఁ బడి పుడమి నధికులై జనింతురను శాస్త్రప్రసిద్ధిం బట్టి యానక్షత్ర మొక కలశోదకంబునం బట్టి యజ్జలంబులం గ్రోలిరేని పుత్రోత్పత్తియగునని నిశ్చయించిరి.

గణితాగతమైన యావిషయము బలుమారు శోధించి చూచి స్థిరపరచిన వెనుక వారత్యంత సంతోషంబుతో రాజునగరి కరిగి మంత్రికావృత్తాంత మెఱింగించిన నయ్యమాత్యశేఖరుఁడును వారి బుద్ధికుశలతకు మెచ్చుకొని తత్ప్రధానముగఁ దప్పక సంతానము గలుగునని నిశ్చయించి యంతయెత్తున నొక మంచెగట్టించి దాని నెక్కుటకు వీలగురీతిని సోపానంబు లేర్పరచి సిద్ధాంతులు చెప్పిన

మహాశివరాత్రి నాఁటిరేయి యందట నక్కడకటిగి యొక వృద్ధ బ్రాహ్మణు నుపవాసంబుతో దాని నెక్కించి పవిత్రోదకంబులచే నిండింపఁబడిన బంగారుకలశ మొకటి యతనిచేతి కిచ్చి రాజును మంత్రియు సామంతులు పౌరులు మఱియు ననేక గ్రామములనుండి యవ్వింతజూడవచ్చిన ప్రజలును నా రాత్రి నక్షత్రపతన దర్శన లాలసులై కనురెప్పవేయక చూచుచుండిరి.

ఇట్లుండ నంత సిద్ధాంతులు చెప్పిన మితియొక్కింతేనియు నతిక్రమింపకయే యమ్ముహూర్తంబునఁ దళక్కురను కాంతితో దృష్టులకు మిఱుమిట్లు గొలుపుచు నక్షత్ర మొకఁడు చంద్రోదయమైన తెరంగున దెసలనెల్ల తేజఃపుంజంబుల వెదజిమ్ముచు విప్రహస్తకలశోదకంబునం బ్రజ్వలించుటయు, నవ్వింతకత్యద్భుతస్వాంతులై లోకులెల్ల హల్లకల్లోలముగా రొదజేయుచు గొందఱు సిద్ధాంతులను మరిగొందరు తద్గ్రంథంబును నభినుతించిరి. ఆనరనాథుండు మంత్రియనుమతి నాక్షితిసురుల కనేకాగ్రహారము లిచ్చుటయే గాక వారితమఁనూశ్రిత పండితమండలములో ముఖ్యులుగా నెన్నుకొనుచుండెను.

పిమ్మట నక్కలశోదకంబు శుభముహూర్తంబున మంత్రిబోధచే నారాజుగ్రోలి తనకుఁగల యిద్దరిభార్యలలో చిన్నభార్యయందు ప్రీతి పెద్దగావున నాఁటిరాత్రి నాపడతిం బడకకు రమ్మని యాజ్ఞాపించెను. అత్తరుణియుఁ బ్రసూతివలన యౌవనంబునకులోపంబగునని రతిక్రీడాసుఖము బరిపూర్ణముగా ననుభవింపని దగుటచే నా రాత్రి దాను బో[illegible] కత్యంతాప్తురాలగు దాదినొకదానిఁ దన నగలచే నలంకరిం[illegible] శయ్యాగృహంబున కనిపినది. స్త్రీలకుఁ గామమును మించిన యభిలాష లేదు.

అదియు రాజుభార్యవలె నభినయించుచు మంచముకడనిలువంబడుటయు నారాజేంద్రుండు తజ్జలంబులఁ గ్రోలినది మొదలు మేన

యుంగక కైపెక్కి మదోన్మత్తుండై యున్న కతంబున దానిం దనభార్య గా యనుకొని రతిక్రీడలం దేర్చెను. పిమ్మట గొండొకవడికి నొడలు దెలిసికొని నిదానించి చూచి నీచకాంతగా నెఱింగి కోపంబును శోకంబును సంభ్రమంబును మనంబున నొక్కసారి యంకురింప దానివలనఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగి కరవాలంబున దాని శిరంబు దెగవ్రేయబోయి యంతలో విమర్శించి యప్పుడ మంత్రిం దీసికొని రమ్మని నాప్తునొకని నంపెను. "బుద్ధిఃకర్మాను సారిణీ" యను వాక్యంబు దప్పదుగదా ?

వినుమారీతి దాసీకేశంబు లొకచేతను గత్తినొకచేతను బట్టి కొని యట్లే నిలువంబడియుండ బుద్ధిమంతుండగు నమ్మంత్రియు నట్టి వార్తవిని యెట్టియుపద్రవమైన పనిజరిగెనోయని వెరపుజెందుచు వతి రయంబు నర్ధరాత్రంబున నొంటిగా రాజు నగరికరిగి యం దేకాంత గృహంబు సొచ్చి రాజును దాదియు నున్నరీతికి భీతి జెందిన డెందం బుతో నిట్లనియె.

ఓహోదేవా! యూడుగు ముడుగుము. ఇంతసాహసం బాచ రింపఁ బూనితివేమి ? ఈనాతి నీయతివగాదా ? యేమితప్పు నేసినది యెఱింగింపుమని యతని కరముననున్న కరవాలము లాగికొనుటయు నారాజు మంత్రి కావృత్తాంత మామూలచూడంబుగా వక్కాణించి దీనింజంపెద నీయభిప్రాయ మేమని యడిగిన నాప్రధాని యిట్లనియె.

అయ్యా! దీనిం జంపిన లాభ మేమి? ఈనేరంబిది యాచరిం చినదికాదు. తన యేలికసాని చెప్పినట్లు నడుచుకొనుట దాదుల కుచిత ధర్మముగదా ! రాణియు బాల్యచాపల్యంబున నట్లు నడిపించినది గానిండు.గతమునకు వగవంబనిలేదు.మనమధికప్రయత్నమునఁబడసిన ప్రయోజనంబూరక చెడఁగొట్టుకొనుట లెస్సగాదు. దైవసంకల్ప మీరీతినుండ దాని మార్చ నెవ్వరితరంబు. పుత్రులలో నౌరసుఁడును

క్షేత్రజ్ఞుడును ముఖ్యులు. దీనికి జనించినవాఁడు నీకౌరసుండనంబరగు వాఁడందరకన్న నుత్తముఁడని శాస్త్రములు ఘోషించుచున్నవి. దీనికితప్పక మంచిసమాధానం డుదయించును. ఈరహస్యం బెవ్వరికి నెఱింగింపరాదు. దీనిం గళత్రముగా సంగీకరించి యంతఃపురంబున నుండ నియమింపుఁడని మంత్రి యనేక నీతివాక్యంబులు సెప్పి యెట్టకేలకు నాపట్టపురాజు నొడంబరచెను. పిమ్మట నారాజును దానింభార్యగా గ్రహించి యంతఃపురంబున గోప్యంబుగా నుండ నియమించెను.

మంత్రియు నట్లతని సమాధానపరచి మఱల నింటికరుగు నప్పటికిఁ దెల్లవాఱుచుండెను. వీధుల నక్కడక్కడ గుంపులుగా నిలిచి జనులు మంత్రింజూచి యెద్దియో గుజగుజలాడికొనిరి మంత్రియు వ్యాకులచిత్తుఁడై యున్న కతంబునఁ బరిశీలింపకయే యింటికరిగెను.

అట్లింటి కేగినంత నమ్మంత్రిభార్యయు నెదురువచ్చి ప్రాణేశా! నగరివిశేషములేమి? ఇంత యర్థరాత్రంబున రాజేల మీకు వర్తమానము సేసె నెఱింగింపుఁడనిన నతం డది యొక రాజకార్యపు తొందరయని మఱపించి చెప్పుటయు దాని కామెనవ్వి నాథా! మీరు నాకుఁ జెప్పక దాచినను గొంచెము దెలిసినది లెండి యని పరిహాస మాడుటయు నతండు తొందరపడి నీవువిన్నవిషయమెయ్యది వివరింపు మనుటయు నాకాంత యిట్లనియె.

మనరాజుగారు నక్షత్రయుక్తమగు కలశోదకంబు గ్రోలిమదోన్మత్తులై యున్న కతంబున పడకకు నియమింపఁబడిన రెండవభార్య ప్రసూతివలన యౌవనమునకు భంగము కలుగునని తనదాది నలంకరించి పంపెననియు నతం డెఱుంగక రమించిన పిమ్మట నిజంబు దెలిసి దానిఁ జంపబోయి యంతలో మీయనుమతిబడసి చేయుటకు మీకు వర్తమానము పంపెననియు మీరుదానిం జంపవలదు దానికి జనించిన పుత్రుఁడే రాజ్యంబున కర్హుండగునని రాజును సమాధానపరచి

దాని నంతఃపురంబున కనిపిరనియు వీధుల జనులనుకొనగా విని వచ్చి మనదాది నాకుచెప్పినది. ఇదియే నేను వినిన వార్త నిజమో యసత్యమో మీమనంబునకే తెలియఁగలదు. అనుటయు నాప్రెగ్గడ తెల్లబోయి యారా? లోకంబీపాటిది గాఁబోలు. నాకన్న ముందరనే యీవార్త యూరంబడినది. ఇంకేటి రహస్యంబు చాలుచాలునని పశ్చాత్తాప చిత్తుండయ్యె నా రహస్యము రాజున కెఱింగింపఁడయ్యెను. ఇట్లుండ నంత నన్నెలంతయునంతర్వత్నియై పదియవమాసంబున మన్మథునిం బోలు చక్కనిముద్దులబాలుం గనినది. భూపా! యతండే యష్టదిగ్గజములను బిరుదులు నడసిన మహాకవులచే ననేక కృతులందిన కృష్ణదేవరాయ భూపాలుండు. అని యెఱింగించిన నంత సింహ నాతేనితో మఱియు నాబ్రాహ్మణుండును దేవా! తమకు నట్లే బ్రాహ్మణ ప్రసాదంబున బుత్రుం డుదయించునని చెప్పెను.

పిమ్మట నర్యసర్యుండును (మరాబును) బ్రాహ్మణుఁడు చెప్పిన చొప్పున పుత్రోత్పత్తికి హేతువులు వ్రతదాన హోమతర్పణాదులే యగునని తత్ప్రయత్నమాచరించుటకు మిగుల నతనితొందర పెట్టెను.

ఇట్లు వారుముగ్గురు తమకుఁదోచిన విషయంబులు సెప్పి యూరకున్నంత కళాదుఁడు లేచి అయ్యా! రాజేంద్రా! పుత్రోత్పత్తికి మీరుచెప్పిన వన్నియుఁ దైవికములు. కలిగినం గలుగవచ్చును. మానినను మానవచ్చును. దీనికి నేనొందుపాయము మానుషంబైన దానిని వక్కాణింతు వినుఁడు వైద్యగ్రంథంబుల నెన్నియేని బరిశీలించినాఁడ వానిలో శారీరశాస్త్రమను గ్రంథంబున దీనివివరము వ్రాయఁబడియున్నది. అది చూచినచో సంతానము దైవికమని యెంతమాత్రము నమ్మఁజాలను. అపుత్రత దంపతులరోగమువలన గలుగుచున్నది. దానినోషధి సేవచే మాన్పవచ్చును. అట్టిగ్రంథంబు పరిశీలించి తచ్చికిత్సం జేసినచోఁ దప్పక సంతానము గలుగునని పలికిన నతనిమాటలును లౌకికమునకనుకూలముగానున్న వని పాటించిరి.

అట్లు వారైదుగురు నుప్పరిగెయందు వెన్నెలలో బల్లచుట్టుపీఠములువైచుకొని వలయాకారముగాఁ గూర్చుండి సంతాన విషయమైన మాటలాడుకొనుచుండ గోపా ! వారిపూర్వపుణ్య మెట్టిదో అంతరిక్షమునుండి యొక మామిడిపండాబల్లమీఁదఁ బడినది. విభ్రాంతులై వారట్టెలేచి యాకసంబుదెస జూచిరి. అందు ననతి దూరమున నొక గరుడపక్షి వలయముగాఁ దిరుగుచున్నట్లు కాన్పించినది. అప్పుడు చర్మమునందప్పక్షి ముక్కుఁ గొనగీటులు నాటియుండుటఁ దిలకించి వారాపక్షియాపండెక్కడనుండియో తీసికొని పోవుచుండ ముక్కుజారి పడినదని నిశ్చయించిరి.

అప్పుడు బుద్ధిమంతుఁడగు మంత్రి లేచి పురోహితునితో నీఫల వృత్తాంత మెట్టిదో ప్రశ్నరూపముగా వక్కాణింపు మనుటయు నా సిద్ధాంతి యప్పటిలగ్నమునుబట్టి చూడ నది సంతానజనన హేతుభూతమగు ఫలమని తెలియఁబడినది. దానికి వారాశ్చర్యపడి దైవానుకూలమునకు మెచ్చుకొనుచు నప్ఫలం బప్పుడ విడదీసి రాజు టెంకను, మంత్రి చర్మమును, బ్రాహ్మణుఁడు వర్తకుఁడు కంసాలియు రసఖండమిళితములైన ముక్కలను దీసికొనిపోయి భార్యలకిచ్చి యారాత్రి కళత్రములతో రతిక్రీడావిశేషముల నానందించిరి.

పిమ్మట నుదయమున వారి హృదయములకు గొమరు లుదయించు శుభసూచకములు పెక్కులుదోఁచిన సంతసించుచుండ వారిభార్యలును గర్భచిహ్నంబులం దాలిచి పదియవమాసంబున నొక శుభలగ్నంబున నైదుగురు పుత్రులం గాంచిరని వచియించిన మణిసిద్ధునితో గోపాలుం డిట్లనియె. అయ్యా ! ఆమామిడిపండు దిననంతనే వారిభార్యలు గర్భవతులై పుత్రులఁగాంచుటచే దానియందెద్దియో విశేషముండకపోదు. దానివృత్తాంతమరయ నామనమత్యాతుర పడుచున్నయది. వివరింపుఁడని వేడుకొనుటయు నంతసించుచు వానికాయతి శ్రేష్ఠుం డిట్లని చెప్పఁదొడంగె.

# మామిడిపండుకథ.

—**—

కర్ణాటదేశంబున శుద్ధమతియను బ్రాహ్మణుఁడు గలఁ డతనికి బాల్యంబుననే తల్లిదండ్రులు పరలోకగతులగుటచే దేశంబున రక్షించువారు లేమింజేసి స్వదేశమువిడిచి కాశీనగరంబున కరిగెను.

అట్లు కాశినిజేరి తనకువిద్యయం దభిలాష లేకున్నను విద్యార్థులకుమాత్రమందు భోజనసదుపాయ మెక్కుడుగాఁ జేయఁబడుచున్నది గావున మొదట నతఁడు భుక్తికొరకు విద్యార్థికోటిలోఁ జేరెను. వాని పూర్వపుణ్యమెట్టిదో క్రమంబుననతనికందరకన్నవిద్యయుసులభముగా రాఁదొడఁగినది. సాధారణముగా విద్యార్థులు పెండ్లియైన తోడనే కాశికిఁ బోవుటయు భార్యయెదుగువరకు నేదోయొకశాస్త్రమందు పాండిత్యము కుదుర్చుకొని దాననేసంతుష్టివడసియింటికివచ్చుచుందురు. శుద్ధమతి కింటియొద్ద నట్టియాప్తులుగాని భార్యగాని లేకపోవుటచే స్వదేశమున కరుగుట కవసరములేమింజేసి నలువదియేండ్లు వచ్చువరకుఁ జదివెను. కావున నతఁ డనేకవిద్యలయందుఁ బ్రవీణుఁడయ్యెను. అతనికి మొదటనుండి ఛాందసము మెండుగానున్నదిం విద్యాగ్రహణమందు మాత్రమట్టిది గాన్పించకున్నది. నలువదియేండ్లు కాశిలో విద్యాభ్యాసము సేసినవాఁ డరుదు గావునఁ గాశిలో నట్టిపండితునికి విద్యార్థియను నామమేకాని యుపాధ్యాయు నామమువచ్చుట లేదు. శుద్ధమతికిమాత్ర మచ్చటఁగూడనట్టిప్రఖ్యాతివచ్చినది. కాశిలోనున్న పండితులలో ముఖ్యుఁడని పేరువచ్చినవెనుక నతనికి స్వదేశగమనమునం దభిలాష జనించినది. స్వర్గమందున్నను జన్మభూమిసౌఖ్యము రాదుగదా! అట్టి యుత్సాహము గలిగినతోడనే యాపండితుఁడుగొందఱు విద్యార్థుల వెంటబెట్టుకొని స్వదేశమునకరిగి యందు దానుజనించిన గ్రామమునకు వెళ్ళెను. అందుఁ దన్ను గుర్తెఁగిన వాఁడు లేక

న్నను తనఖ్యాతిని వినుచున్నవారు పేరుజెప్పినతోడనే మిక్కిలిగౌరవముజేసి యొకయింటం బ్రవేశపెట్టి కొన్నాళ్ళదనుక భోజనభాజనములకుం దగిన సదుపాయము చేయుచుండిరి. మఱియుం గాశినుండి గొప్ప పండితుండు వచ్చెనను వార్తవిని యనేకగ్రామములనుండి పెక్కండ్రు విద్యార్థులు ఆయనకడకువచ్చి శాస్త్రములం జదువందొడంగిరి. ఆతనికి ఛాందసము చాలంగలిగియున్నను బోధనశక్తియు శాంతతయుంగూడ నధికముగా నుండుటంబట్టి యక్కడకువచ్చిన విద్యార్థి మఱియొకచోటికరుగుటకు సమ్మతింపఁడు. అతనికిఁ గలిగియున్న ఛాందసమంతయు లౌకికవిషయమే కాని విద్యావిషయములోఁ గాన్పింపదు.

ఇట్లు శుద్ధమతి యధికవిఖ్యాతి నొప్పుచున్నవార్తవిని సమీపగ్రామవాసియగు శ్రోత్రియబ్రాహ్మణుం డొకండాయనతో బంధుత్వముఁ గలిసినఁ జాలుననుకొని పెద్దవాఁడని యెంచక పదియేఁడులు ప్రాయముగల చక్కనితనకూఁతు నాయనకిచ్చి వివాహము గావించెను. వివాహమైన నాలుగేండ్లకు తరుణి కాపురమునకు వచ్చినది. అత్తవారింట విద్యార్థులేగాని యాఁడుతోడులేమింజేసి యాయింతి కొన్నాళ్ళదనుక లజ్జావతిగనుండి పిదపఁ బ్రౌఢగా సంచరింపం దొడంగినది. మిక్కిలి గుణవంతురాలగు నాచిన్నది విద్యార్థులనెల్ల పుత్రులుగా భావించుకొనుచు వారితోఁ గడుఁచనువుగా మాట్లాడుచుండును. అట్టి స్థితినిజూచి యావృద్ధబ్రాహ్మణుఁ డామెవిషయమై యనుమానముజెంది యొకనాఁడిట్లని తలంచె. ఓహో! స్త్రీలుదుష్టమతులని యెఱింగియుండియు దీనిని విద్యార్థులతో నింతచనువుగా మాట్లాడనిచ్చిన నాకంటె మూఢుఁడుగలఁడే. "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" యను శాస్త్రబోధ నెన్నటికేనియు మఱువఁబోలునే ఎంతదృఢమైన స్త్రీలమనస్సులును పురుషులు సమీపించినతోడనే చలింపక మానవు. అట్టి స్త్రీలచరిత్రల పెక్కుజ్ఞాపకము

దెచ్చికొని విద్యార్థులకును భార్యకును సంబంధము గలిగియున్నదని ధ్రువపరచి యామె నవ్వినను మాట్లాడినను చూచినను విద్యార్థుల నిమిత్తమేయనియు నదియు నొకవిధమైన సాంకేతిక మేయనియుఁ దలంచుచు విద్యార్థులకుఁ బాఠము జెప్పుటమాని సర్వకాల సర్వావస్థలయందు నామెను విడువక తిరుగుచుండును.

వీధుల నెవ్వరేని మాట్లాడుకొనినను నవ్వుకొనినను నేకాంతముఁ జెప్పుకొన్నను తనభార్య జారత్వవిషయమేయనియుఁ దనకు మిగుల నపకీర్తి వచ్చినదనియు భావించి యధిక చింతాకులస్వాంతుఁడై యొకనాఁడయ్యో దైవమా! నే ననేక విద్యలంజదివి మిగుల ఖ్యాతి జెంది కాశినుండక యిచ్చటికేలవచ్చితిని? వచ్చియు విచ్చలవిడి సంచరింపక గుదిబండందగులు చుకొన్నట్లుఁ బెండ్లియాడితిని. పెండ్లియాడి నను నిట్టిదుర్మార్గురాలు దొరకవలెనా కటకటా! నాఖ్యాతియంతయు నొక కాంతమూలముగా నశించుచున్నది. నేనేమిచేయుదును. స్త్రీమూలముగా నెంతవానికి నపఖ్యాతి రాకమానదు. బృహస్పతియంతవానికిఁ గళంకము దెచ్చిపెట్టిన స్త్రీజాతిని నమ్మినఁ జెడకుందురా? ఛీ! ఛీ! ఇట్టి యపకీర్తి మోచికొనియుండుటకంటె మరణమే మేలుగదా. అయ్యో! యెన్నినాళ్ళో శ్రమపడి చదివిన చదువంతయు గంగపాలుగాఁగ నూరక చావవలసి వచ్చెనేయని పలుదెరంగుల విచారించి భార్యజారిణియైనతరిఁ జేయఁదగిన కృత్యములు వ్రాసియున్ననీతిశాస్త్రమొకండువిప్పిచూచిననందిట్లువ్రాయఁబడియున్నది.

"శ్లో. కులటా యది జాయచేన్మౌనమేవ వ్రజేత్సుధీః
దేశాంతరంవా గంతవ్యం మరణం చాపి రోచతే
ఏతత్త్రిభిః ప్రకారైస్తు నాపఖ్యాతిభయం భవేత్॥"

అనఁగా దనభార్య జారిణియైనవో నెరిఁగియు నెరుఁగనట్లూరకుండుటయే మొదటిపక్షమనియు, నట్లూరకుండ లేనివాఁడు దేశాం

తర మరుగవలయు నది రెండవపక్షమనియు, దానికి సమ్మతింపని వానికి మరణమే మేలనియు నీమూఁడు ప్రకారములచేతను అపఖ్యాతి భయము పొందనేరఁడనియు నర్థము. అట్టిశ్లోకము పలుమారు శోధించి యాద్యంతములకు సమ్మతింపక దేశాంతర మరుగుటయే నీతి యనియు "దేశాంతరంవా గంతవ్యం"అనుచోట భార్యతోడనా యొంటరిగానా యనువిషయముఁ గొంత చర్చించి భార్యతో నఱిగినచో నచ్చటనైత మీఁదుర్మార్గురాండ్రమూలముగా నపఖ్యాతి వ్యాపింపగలదు. కావున నొంటరిగానేయని నిశ్చయించి యొక్కనాఁడర్ధరాత్రంబున నొరు లెఱుంగకుండ దర్భాసనమును గొన్నిపుస్తకములు దేవతార్చన సంచియు మూటగట్టుకొని గుట్టుగా నిల్లువెడలి యడవిమార్గంబున, బడి పోవుచుండెను.

మఱియు గురుని మత మదివరకే తెలిసికొనిన విద్యార్థులు నలువురుమాత్రమాతనతోఁ బ్రయాణమై పోవలయుననియెంచి మూటలుఁ గట్టికొని కాచియుండిరి. నిద్రావశంవదులగుటచే నెఱుఁగక తామునుగూడ నరుగ లేక పోయిరి యామావధిలో మెలఁకువ వచ్చుటచే నాయన జాడఁబట్టి యిల్లువెడలి యాయనపోయిన మార్గముననే పోవ నడవసాగిరి విద్యార్థులును నించుమించుగా ఛాందసంబున గురునితో సమానులే. శిష్యులు మిగుల బలముగలవారగుట వడివడి నడిచి తెల్లవారునంతలో గురువుగారిం గలసికొనిరి. ఆయన తనవెంట వచ్చు విద్యార్థులం గాంచి వారు తన్నింటికిఁ బిలిచికొనిపోవుటకునై వచ్చుచున్నారని యెంచి వారికగబడనట్లు మిగుల వేగముగా నడువ సాగెను కాని యంతలో వారు గలిసికొనుటచే నతనిప్రయత్నము కొనసాగినదికాదు పిమ్మట శిష్యులనుజూచి యతఁడు మీరేల నా వెంట వచ్చుచుండిరని యడిగిన వారు అయ్యా! మాకింకను విద్య పూర్తికాలేదు తమవంటి యుపాధ్యాయులు దొరకుట దుర్లభము.

విద్యాగ్రహణలాలసులమై తమవెంట వచ్చుచుంటి మిదియు మా యభిలాషయని చెప్పిన నతండు ఔనౌను! మీరు నాతో వచ్చెడు కారణము నేనెఱుంగుదు. నాభార్య జారిణియని ప్రకటించి నాయపఖ్యాతి వెల్లడిఁ జేయఁబూనితిరిగాబోలు? మీరు నాతో రావలదు. మీయిష్టమువచ్చినచోటున కరుగుఁడు. నేనిక్కడనుండి కదలనని నేలం జదికిలఁబడియెను. వారామాటకాశ్చర్యపడి చెవులుమూసికొని శివ శివా! మేమాసంగతియే యెఱుఁగమే? మాకు విద్యాసక్తియేగాని వేరుగోడవలేదు. మీరేమిటికి దేశాంతర మరుగుచుంటిరో మాకుఁ దెలియదు. మాకామె తల్లిగాదా? యామెవిషయమై మే మేమనఁ గలము. మీపాదములాన మేము చదువుటకుఁదప్ప మఱియొకపనికి మీతో వచ్చుట లేదు. మమ్ముఁగొనిపొండని యాతనిపాదములంబడి లేవకుండుటయు దాని కతఁ డెన్నివిధములనో ప్రతికూలవాక్యములను జెప్పెనుగాని వారిప్రార్థనలచే సమ్మతింపక తీరినదికాదు. గురువుగారు అనుమతించినపిమ్మట శిష్యులు వారిదర్భాసనమును దేవతార్చనసంచియుఁ దోవతులమూటయుఁ దారుగైకొని యాయనవెనుక నడువసాగిరి. అట్లాఛాందసు లేగురునడిచినడిచి జాముప్రొద్దెక్కుతరి కొకపట్టణముఁ జేరిరి ఆపురిలో నొకబ్రాహ్మణవీథిం బోవుచు గమనాయాసమువాయ విశ్రమింపఁదలంచి యిరుగెలంకుల నరుగులున్నను వానిమీఁద వసింపక వీధిలోనె మూటలుదింపి కూర్చుండి మార్గాయాసము వాయ దోవతిచెరఁగుల విసరికొనుచుండిరి.

అట్టిసమయమున నాప్రాంతమందలి యొక గృహస్థునిభార్య మంచినీరు దెచ్చుటకై బావికరుగుచు మార్గమునఁ గూర్చుండియున్న యాఛాందసులంగాంచి అయ్యా! మీరెవ్వరని యడిగినది. ఆమాట విని వారు అమ్మా! మేము పరదేశుల మనిరి. ఆమెయు మీరు పరదేశులు కారని నుడివి కలశముగొని బావికరిగినది. ఆమె మఱల

వచ్చునప్పటికి వారొండొరు లాలోచించుకొని అమ్మా! మేము పర
దేశులము కానిచో మార్గస్థులమైనఁగామా యనిరి. అప్పుడు ఆమె
మీరు మార్గస్థులును గారని నుడివి యింటికేగినది. అమె క్రమ్మర
వచ్చులోపల వీరాలోచించుకొని తల్లీ! మేము మార్గస్థులమును
గానిచో బాటసారులమని చెప్పుచున్నారమనిరి. అప్పుడును కారని
చెప్పి యాచిన్నది బావికరిగినది. వారపు డోహో యిదిచిత్రము.
ఈగ్రామంబున నాఁడువాండ్రకుసైతము పాండిత్యము కలదుగాఁబో
లు. మన మన్నపదములు కర్థము వేరుకలదా యేమి? అనేకశాస్త్ర
ములు చదివితిమిగాని మనమెవ్వరమో తెలియకున్నదే! ఈసారి
యేమనిచెప్పుదము. ఎట్టిపేరు నుడివినను నీకాంత సమ్మతింపదే యని
యాందోళితమానసులై చింతించుచుండ నయ్యండజయానయుఁ దన
కలశమెత్తుకొని యాదండ నిలువంబడిన వారేమియుం బలుకనేరక
అమ్మా! మేము శుద్ధవెఱ్ఱిమూఢులమనిరి. ఆమాట కామె లోన
నవ్వుకొని వెఱ్ఱిమూఢులును గారని పలికి యింటికరిగెను. పిమ్మట
వారత్యంతవిషాదదోదూయమానమానసులై యోహో మనమన్య
దేశ మరుగుచుంటిమి. ఇక్కడుండు పండితులతో సంభాషింపవలసి
వచ్చును. మనమెవ్వరమో తెలిసికొని యేగుట మంచిది. అని నిశ్చ
యించి యామె మరల వచ్చునేమోయని యట్టె కూర్చుండిరి. ఆమె
యు నీళ్ళుతెచ్చుట చాలించి చేద దీసికొనివచ్చుటకు మరల వీధికి
రాగానే యీబ్రాహ్మణులు తటాలునలేచి యామెకు వందనము
చేయఁబోయిన యామెచే వారింపంబడి అమ్మా! నీవు మహావిద్వాంసు
రాలవుగాఁ దోఁచుచున్నావు. మేమనేక శాస్త్రములు చదివితిమిగాని
మేమెవ్వరమో మాకుఁ దెలిసినదికాదు.

నాలుగువిధముల పేరులు సెప్పినను కాదంటివి. మాయందను
గ్రహముంచి మే మెవ్వరమో? యేమనవలయునో? యెఱింగించిన

విని సంతసించి యరుగుచున్నవారమని మిగులఁ బ్రీతిమాలుకొను టయు నవ్వనిత తనలో మఱియు మిగుల నవ్వుకొని అయ్యా! ఇప్పుడు చాల ప్రొద్దెక్కినది మాయింటికివచ్చి వంటఁజేసికొని భుజింపుఁడు. భోజనమైన పిమ్మట సంతయుం జెప్పెదననుటయు నామెమాటకు వారు మిగుల నాకలిగొనియున్నవారు గావున సంతసించి యామెతో గూడ వారియింటి కరిగిరి. ఆసతీమణియు వారికొకగది చూపి యందు వంటసామగ్రినంతయు నమర్చి పెరటియందున్న నూతియొద్ద స్నానముజేసి వేగిరముగా వంటఁజేసికొని భోజనము సేయుఁడు. నామగఁడు మిగుల ననుమానముగలవాఁడును ధూర్తుఁడునగుటచే నాయన వచ్చినచో మిమ్మును నన్నునుగూడ దండించును ఆయన నిత్యమును రెండుయామములదనుక రాజుగారియొద్ద పురాణముచెప్పి పండ్రెండుగంటలు కొట్టినతోడనే యింటికి వచ్చుచుండును. ఇపుడు పదిగంటల ప్రొద్దెక్కినది. త్వరగా వంటజేసికొనుఁడని తొందరపెట్టుటయు వారు నామెచెప్పినచొప్పున నూతియొద్ద స్నానముచేసి యాగదిలో వంటఁజేసికొనుచు స్తోత్రపాఠములఁ బఠించుచు భగవద్గీతలఁ బారాయణము చేయుచు నతివేగముగా ముగింపవలయునని తలంచిరి కాని దేవతార్చన చేయుచుండగనే పండ్రెండుగంటలు కొట్టిరి. అంతలో యజమానుడు వచ్చి తనవాడుకప్రకారము నాలుగుగదులు వెదకిచూడఁగా నొకగదిలో నీబ్రాహ్మణు లుండుటఁజూచి తల కంపించుచు వేగముగా నాయింటికిఁ దాళమువైచి భార్యయున్నయింటికిని బీగముబిగించి వాకిళ్ళన్నియు మూసి వీధితలుపునకు లక్కశీలుతో ముద్రవైచి యతిజవంబున రాజనగరికిఁ బోయెను.

గోపా! వినుము. ఆబ్రాహ్మణునికి భార్యవిషయమై మిగుల ననుమానముగలిగి యొకప్పుడు రాజుగారితో అయ్యా! తమరు పెక్కునేరములకు శిక్షలు విధించుచుంటిరి గాని జారత్వదోషమునకుఁగూడఁ

నేలవిథింపరని యడిగిన నతం డట్టిద్రోహ మెక్కడనున్నదో వక్కా
ణించిన దండింతుననియె. దాని కాబ్రాహ్మణుడు సిగ్గువిడిచి యెక్క
డనో యని చెప్పనేల నీదుర్మార్గపుకృత్యము మాయింటనే జరుగు
చున్నది. నేను తమయొద్దకుఁ బురాణము సెప్పుటకు వచ్చినపిమ్మట
నిత్యమును నాభార్య విటులతో నింటికడ స్వేచ్ఛగా సంచరించు
చున్నదని చెప్పెను. అవ్విషయము రాజు పెక్కండ్రనడిగి యామె
మహాపతివ్రతగాఁ దెలిసికొని పురోహితునితో నార్యా! మీరు
అసత్యమాడితిరి, మీభార్య కడునిల్లాలఁట మీరెట్లంటి రేమని యడి
గిన నతం డయ్యా! తమ రడిగినవారలు దానివిటులే. ఈసంగతి
తమకు బాగుగాఁ దెలిసినచో నమ్మకపోదురే! యనుటయు నానృ
పతి యటులేని మీభార్యవిటులతోఁ గూడియున్నప్పుడు వచ్చి నాకుఁ
జెప్పుడు. నేనువచ్చి యట్టికృత్యము జరిగించుచున్నదని తోఁచినచో
వారినెల్లఁ దప్పక దండింతునని ప్రతిజ్ఞ జేసియుండెను. కావున నట్టి
విటులు నేఁటికిఁ జిక్కరనియు వారినందఱ రాజుగారికిఁ జూపించు
తలంపుతో నాపౌరాణికుండు మహావేగముగాఁ జెమ్మటలుగ్రమ్మఁ
బరుగెత్తుకొని పోయెను.

ఆజనపతియుఁ బరిషేచనము చేయఁబోయి యంతలోఁ బౌరా
ణికుండు వచ్చెనను వార్త విని వాకిటకువచ్చి యతని యాయాసముఁ
జూచి యచ్చెరువందుచు నార్యవర్యా! భుజింపక యే యింతలోవచ్చితి
రేల? తొందరపని యేమిగలదని యడిగిన నతండు నిట్టూర్పులు నిగు
డించుచు నిట్లనియె.

దేవా! దేవరవారు వెనుక ప్రతిజ్ఞచేసినసంగతి జ్ఞాపకముచేసి
కొనవలసిన యవసరము వచ్చినది. నేనింటికి వెళ్ళునప్పటికి నాభార్య
యేగురువిటులతో నింటికడ స్వేచ్ఛగా విహరించుచున్నది. కన్ను
లారఁ జూచితిని. వెంటనే వచ్చినచో దేవరవారికే విశదము కాఁ

గలదు. ఇంతకుమున్ను నామాటలు దబ్బరగా ద్రోసివేసితిరి. తాళము వేసి వచ్చితిని. ఆలస్యమైనచో దానికి సహాకారులు పెక్కండ్రు గలరు. వారికిఁ దెలిసెనేని ముద్రలు విడఁగొట్టి యింటనున్నవారి సాగనంపఁగలరు. కావున వేగముగవచ్చి చూడవలయునని మిగుల దీనత్వమునఁ బ్రార్థించుటయు నానరపతికిఁ బురోహితునియందు మిగుల ననుగ్రహముగలదు కావున నావిషయము పరీక్షించుటకు భోజనము చేయకయే కొంతమంది పెద్దమనుష్యుల వెంటఁబెట్టుకొని యుక్కతవకాలంబున వారింటి కరిగెను. అంతట పురోహితుఁడు బీగముల విడఁదీసెను. అందఱు లోపలకుఁ బోయిరి భూపతి యావిటులెక్కడనున్నారని యడిగిన నతం డిది యిటునందు. ఈమూల గదిలో నున్నవారని యాగదియొద్దకుఁ దీసికొనిపోయి బీగమును గొళ్ళెముదీసి తలుపులు తెరచినంత నాగదిలో నేవురు శ్రోత్రియులు శంకరావతారములవలెఁ దెల్లనివిభూతియు రుద్రాక్షలు నొసల మెరయ దేవతార్చనలు సేయుచు దలుపు మూసినది మొదలు దగులుపడి దైవమును ధ్యానించుచున్నవారిం గాంచిరి. అప్పుడాయొడయుండు మనంబున నద్భుతపడి పురోహితునితో నార్యా! విటులు వీరేకాదా యని పరిహాసముగా నడిగిన నతండు దేవా! వీరే నేనింట లేనప్పుడు నాయింటిలోఁ బ్రవేశించి పెద్దమనుష్యులవలె నటించు జారపురుషులనుటయు రాజు వారినందఱ దరికిఁజీరి, అయ్యా? తమరెవ్వరు? ఎక్కడికరుగుచున్నవాఁ రీయింటికేల వచ్చితిరి. నిజముఁజెప్పుడు ? చెప్పకున్న దండింతునని యడిగిన నాబ్రాహ్మణులు గడగడ వడఁకఁ దొడఁగిరి. శుద్ధమతి యెట్టకేలకుఁ గొంచెము ధైర్యముదెచ్చికొని రాజుగారితో నయ్యా! మీ రెవ్వరని యడిగినందులకు నుత్తరము జెప్పలేము. మేమెవ్వరమో తెలిసికొనుటకై కాదా మేమీయింటి కరుగుదెంచితిమి మావృత్తాంతము వినుఁడు యథార్థముగా వక్కాణింతుము.

నాకుఁ జిన్నతనమందే తల్లిదండ్రులు గతించుటచేఁ గాశికరిగి నలువదియేండ్లు పెక్కువిద్యలం జదివితిని. అందుపాధ్యాయ పదము వచ్చినతోడనే యట నిలువలేక దేశమునకు వచ్చితిని. వచ్చినతోడనే నాకొక బ్రాహ్మణుఁడు గన్యనిచ్చెదనని చెప్పిన పూర్వకర్మదోషము వలన సమ్మతించి యక్కన్యం బెండ్లియాడితి. పెండ్లియైన నాలుగై దేండ్లకే యది కాపురమునకు వచ్చినది. కాని నాకెంతమాత్రము సౌఖ్యము లేకపోయినది. దేవరవారితో నసత్యముఁ జెప్పరాదుగదా! మిగులయౌవనముగల విద్యార్థులు నాయొద్దఁజదువుచుండిరి. అది తరుచువారితో మాటాడుటయు నవ్వుటయుఁ బరిహాసముచేయుటయుఁ జూచుటయు మొదలగు శృంగారచేష్టలు నామనంబునకుఁ బరితాపము గలుఁగ జేసినవి. లోకులు నన్నుఁజూచి నవ్వసాగిరి. మొదట నాకెంత ఖ్యాతివచ్చినదో భార్యమూలముగా నంత యపఖ్యాతివచ్చినది. అప్పుడు సహింపలేక రయిక నీతిశాస్త్రమునందుఁ జెప్పినచొప్పున నెవ్వరికిఁ దెలియకుండ నిల్లు వెడలి దేశాంతర మరుగుటకై నడుచుచుంటిని. ఇంతలో నీనలువురు నన్నుఁగలసికొని నేనెన్నివిధముల వలదని చెప్పినను వినక నాతోఁ గూడవచ్చిరి. మే మేగురము నీదినమున జాము ప్రొద్దెక్కినవేళ కీయూరుజేరి యీవీథిలో విశ్రమించియుంటి మింతలో నీయింటివాల్గంటి నీటికరుగుచు మీరెవ్వరని యడిగిన మేము పరదేశులమంటిమి. గారనియె. మఱల మార్గస్థులమనినను కారనియుత్తరం బిచ్చిన బాటసారులమని చెప్పితిమి. దాని కామె తలఁద్రిప్పిన నేమియుం దోఁచక వెట్టిమూఢులమంటిమి. అప్పుడుగూడ కారని యామె యింటికరిగినది. ఆమాటలకు మిగులఁ జింతించి యనేక గ్రంథములఁ జదివితిమి గాని మేమెట్టివారమని చెప్పవలెనో మాకుఁ దెలిసినదికాదు. మాసంగతి నీవే చెప్పవలయునని యామెను మిగుల బ్రతిమాలితిమి. ఆమెయు భోజనమైనవెనుకఁ జెప్పెదనని మమ్ము

నిక్కడకుఁ దీసికొనివచ్చి మాతో మీరు త్వరగా వంటజేసికొని భోజనముఁజేసి పొండు. నామగఁడు వచ్చెనేని మిమ్మును నన్ను గూడ దండించునని యామె మొదటనే చెప్పినదిగాని మాఛాందసమువలన వేగిరము తేలినదికాదు. ఇంతలో నాయనయే కాఁబోలు వచ్చి తలుపుమూసి వెళ్ళినవాఁడిదియె మదీయవృత్తాంత మిందింతయైన నసత్యమున్న యెడల దేవరవారు మమ్ము శిక్షింపుఁడని వేడుకొనియెను.

ఓహో! పురోహితునికిఁ బట్టిన పిచ్చి యీతనికిం బట్టినదే! ఇట్టి ఛాందసుల నందఱ నొక్కచోటికిఁ దెచ్చిన దైవమును మెచ్చుకొనవలెను. మేలుమేలు; వీరిభార్యలయందు లేశమైన దోసమున్నట్లు కాన్పింపదు "వృద్ధస్య తరుణీ విషం" అనురీతిని వీరికిఁదోచిన యనుమానమేకాని యొండుగాదు. వీరిబుద్ధుల జక్కఁబరచెదనని తలంచి పురోహితుని మొగముఁజూచెను. అప్పుడు పురోహితుం డిట్లనియె. పువరా! నాభార్యయొక్క గుణము తెలిసినదా? ఎన్నఁడును తానెఱుఁగనివారు వీథిలోఁ గూర్చుండియుండఁగా వారితోఁ బరిహాసపు మాటలాడి యింటికేమిటికిఁ దోడ్కొనిరావలయును. ఇంతకన్నఁ దప్పేమున్నది? తప్పక దీనిం దండింపుఁడని పలికిన నవ్విప్రునాక్షేపించుచు ఛాందసుఁడా! నీభార్య యెక్కడనున్నదో చెప్పుమని యడుగుటయుఁ బురోహితుం డామె యున్న యింటియొద్దకుఁ దీసికొనిపోయి తాళముతీసి యిందులో నున్నదని చెప్పెను.

అప్పుడా తేఁ డొక్కరుఁడ లోనికరిగి యధిక చింతాకులస్వాంతమైయున్న యక్కాంత పాదంబులకెరగి యమ్మా! నేను నీకుఁ బుత్రుండ నన్ను వేరుగా భావింపకుము. నీసుగుణంబు లిదివరకే విని యుంటిని. ఇప్పుడు బాగుగా వెల్లడియైనది. నీపెనిమిటి దుర్బుద్ధిపిమ్మట విమర్శింతు. ఇప్పుడు నీవలన నొక్కవిషయముఁ దెలిసికొనఁగోరియే

యిచ్చటికి వచ్చితిని. కరుణించి వచింపుము. ఈబ్రాహ్మణులు పర దేశులమనియు, మార్గస్థుల మనియు, బాటసారుల మనియు, వెఱ్ఱి మూఢులమనియుం జెప్పినను సమ్మతింపక యెద్దియో యొక నామము గలవారిగా భావించినట్లును తమ్మెవ్వరో తెలిసికొను తాత్పర్యము తోనే వారిచ్చటికి వచ్చినట్లును వారే చెప్పియున్నారు. ఆసంవాదము విన నాకును నుత్సాహమధికముగా నున్నది. ఈమాట దెలిసికొను టకే నేను మీయొద్దకు వచ్చితిని. వారెవ్వరో వచింపుమని మిగుల వేడుకొనఁగా నామె కొంతసేపేమియుం బలుకలేదు. పలుమారు తన్నావిషయము చెప్పుమని వినయముతో ప్రార్థించుటచే మాటా డక తీరినదికాదు. ఆయిల్లాలు తల నించుక వాల్చి దేవరా! నేను దుష్టురాలనుగాకున్నను దుష్టురాలనైనట్లు నలుగురిలో వాదు వచ్చిన ప్పుడు దానికిఁ దగిన దండనయెద్దియో యట్టిది విధించుట మీకు న్యాయమైయున్నది.

మఱియు నేనా బ్రాహ్మణులను భోజనమునకు వత్తురను తాత్ప ర్యముతో నప్పటికిని [illegible] వేగగాను తమకు వచ్చినపని యెద్దియో చూచుకొనుచు [illegible] యుచున ముగాదని పలికిన నక్కలికి [illegible] లికపడి యప్పుడమి యొడయడమ్మా! నాకట్టి తాత్పర్య మేమియు లేదు [illegible]. [illegible] దింతచేసి దోసములేకన్ని [illegible] నేను వచ్చితిని క్షమింపుము నీవు [illegible] మా [illegible] యట్టివిట [illegible] టి యున్నాని చెప్పి [illegible] చ్చెను [illegible] యుటకే [illegible] యొముగా దీని [illegible] సైరించి [illegible] రివ రమాన మె [illegible] మిగులఁ గుతూహలముగా నున్నదని బ్రతిమాలిన నెట్టకేల [illegible] యిట్లనియె.

రాజా! వినుము. నేను నిటికై బావికిఁబోవుచుండఁ [illegible] బ్రా హ్మణు లిరుఁగెలంకుల నరుగులుండగ విడిచి వీథిలో నెండలో దర్భా

సనముల దింపి కూర్చునియుండిరి. అట్టివారింజూచి వీరు చదువుకున్న వారేకాని ఛాందసులనియు గూడ స్ఫురించుటచే నట్టిదాని గ్రహించుటకై సుమీ మీరెవ్వరని యడిగిన వారుచెప్పిన పేరులన్నియు గాదంటి. పరదేశులనఁగా భాషాభేదముఁ గలవారికిఁ జెల్లునుగాని యేకభాషగా నున్నవారికిఁ జెల్లదు. మార్గస్థులమనగా మనకన్న ముందు మార్గమందుండుటంబట్టి యన్నోదకములకుఁ జెల్లును. బాటసారులనఁగా సంతతము నడుచువారు సూర్యచంద్రులకుఁ జెల్లును. ఇంక వెఱ్ఱిమూఢులను పదముఁ చదువుకొని పెద్దవిద్వాంసులను బిరుదులు బూనినవారికిఁ జెల్లవు గాని యని సగముచెప్పి యూరకున్న యన్నాతితో రాజు భయపడకుము. వారెవ్వరో యెఱింగింపుమని పలికిన నక్కలికి యిట్లనియె.

అయ్యా! వెరపేల వినుఁడు. అందు మొదటివాఁడు నాపెనిమిటియు, రెండవవారు మీరునుఁ గావచ్చును. మధ్యాహ్నకాలమందైదుగురు విటులతోఁ గ్రీడించుచున్నదని వివేకములేక చెప్పిన నాపెనిమిటియు, నాయన చెప్పినతోడనే జారత్వమునకైదుగు రేలవత్తురను సందియములేక నిజమనినమ్మి పదుగురు పెద్దమనుష్యుల వెంటబెట్టుకొని వచ్చిన మీరును గాక యీబ్రాహ్మణులుగారని నిర్భయముగఁ బలికినది. అన్నాతి నీతివాక్యంబుల కెంతయు సంతసించి యాభూకాంతుండు తనపురోహితుని పెద్దమనుష్యుల యెదుట మిగుల నిందించి కటకటా! యింత యుత్తమురాలగు నీభార్యను నిష్కారణముగ బాధించుచున్న నిన్ను దండించినను దోషములేదు. ఆమెంజూచి నిన్ను మన్నించితి నింకొకసారి యిట్టిసంసార ద్రోహపుమాట పలికితివేని క్షమింపక తగిన దండన విధింతునని భయంకరముగాఁ బలికిన నతండేమియుం బలుకక యూరకుండె. పిమ్మట నాశుద్ధమతింజూచి యుతనిభార్య సుగుణములు తచ్ఛిష్యులవలన నెఱింగినవాఁడు గావున

నిట్లనియె. ఓహో! యెంత యోగ్యుఁడవు! త్రిలోకపూజ్యురాలగు భార్యనువిడిచి వెఱ్ఱియనుమానముఁ బూని పరదేశ మరుగుచుంటివి. నీవంటి నిర్భాగ్యుండుండునే? నీచదువేల? ఇరవులకేగదా వృద్ధులకు గన్య నియ్యఁగూడదని చెప్పుదురు. వెఱ్ఱిఛాందసుఁడా! యిప్పటికైన బుద్ధిరాలేదా? చెప్పుము, లేకున్న నిన్నును దండింతునని పలికిన నతని కావిషయము చూచినదిమొదలు తనభార్య విషయమై తనకుఁగలిగిన యనుమానము కూడ నిట్టిదేయనియు నామె నిర్దోషురాలేయనియు నిశ్చయించియున్నకతంబునఁబశ్చాత్తాపముఁజెందుచున్నృపతి కిట్లనియె.

దేవా! నాకు బుద్ధివచ్చినది. నేనిదివరకు పడిన యనుమాన మింతయుఁగల్లయని యిచ్చట జరిగినముచ్చటవలనఁ దెలియవచ్చినది. నేను భార్యతో నిష్టముగాఁ గాపురముసేయుదునని యొడంబడియెను. పదపడి యప్పుడమియొడయఁడు శుద్ధమతి మిగులఁబండితుడనియుఁ దన యాస్థానములో నుండఁదగినవాఁడనియును దలంచి తనయభీష్ట మెఱింగించి యతండు సమ్మతిపడిన మీఁదట నతనిభార్యను సబహు మానముగా రప్పించి యొకయిల్లుకట్టించి యిచ్చి తగిన గౌరవముగా వారిం బోషింపుచుండెను. శుద్ధమతియుఁ బురోహితుండును నది మొదలు తమ భార్యలయందు మిగుల ననురాగముగలిగి యేయను మానములేక వర్తింపుచుండిరి. అయ్యిరువురు ఛాందసులతో నారాజు వినోదముగాఁ గాలక్షేపముఁ జేయుచుండెను.

ఇట్లుండునంత నొక్కనాఁడు తనకు సంతానము లేదని సంతా పించు భార్య నోదార్చుచు శుద్ధమతి యతివా! దీనికై నీవు చింతింప కుము. చక్రవర్తివంటి నందనుంబడయు నుపాయ మెఱుంగుదు. శ్రీశైలమునందలి వింతలందెల్లఁగల్ల మొందునాదండనున్నది. తదు క్తప్రకారము తపం బాచరించి యట్టిపట్టిం గాంచెదనని చెప్పి భార్య యనుమతి వడసి యిల్లువెడలి క్రమంబున శ్రీశైలంబున కరిగెను.

అందుఁ బాతాళగంగాతీరంబున నరసింహబిలంబున వసించి కందమూలాశనుండై కల్పోక్తప్రకారంబు పాశుపతవ్రత మాచరించుచు నారుమాసములు కాళీధవు నారాధించుటయు నవ్వేల్పు స్వప్నాంతరంబున వానికి బొడసూపి: పాటుఁడా! నీవు నగము భక్తితో నన్నారాధించితివి. అయినను గల్పోక్తనియమము జరిపితివి కావున నీకోరిక తీరుపక తప్పదు. నీవు రేపుస్నానముచేసి వచ్చుచుండ దారిలోఁ జూతఫలంబొండు గాన్పించెడిని. దానిం గైకొని నియమముగా నెందును నేలం బెట్టకుండ నింటికిం దీసికొనిపోయి నీభార్యకిమ్ము. ఉత్తమసంతానము గలుఁగఁగలదు. అంతరంబున నేయంతరాయము గలిగినను నాఫలము నీకుదక్కదుసుమీ. అని చెప్పి యాదేవత యంతర్ధానము నొందెను.

పిమ్మట శుద్ధమతి తద్దయుఁ జెలఁగి పరిశుద్ధచిత్తముతో నాఫలంబు గైకొని క్రింద నిడకుండ నియమముగా నింటికివచ్చుచుండ నొకనాఁడు జాముప్రొద్దువేళ తెలగరాయని చెఱువులో నడుచుచు ఫలమొక చెట్టుకొమ్మలసందున నిరికించి ప్రాంతమందలి బావిలో స్నానము చేయుచుండెను. ఇంతలో నావృక్షముమీఁదనున్న గరుడపక్షి యీఫల మీక్షించి తత్క్షణంబ ముక్కుతోను గాళ్ళగోళ్ళతోను జిక్కంబట్టి యట్టె యెగిరిపోయినది. ఆబ్రాహ్మణుఁడది చూచి మిగుల వగపుతో నతిజవంబునఁ బరుగిడివచ్చెనుగాని యది దూరముగా నెగిరిపోవుటచేత నేమియుం బ్రయోజనము లేకపోయినది. దానన త్యంత చింతాకులస్వాంతుండై యతండు నిశాంతము జేరి తనపాట్లన్నియు నాప్తులతోఁ జెప్పుకొని తనదురదృష్టమును గురించి జీవితాంతము వరకు చింతింపుచుండెను. భవితవ్యమట్లుండ వానికాఫల మెట్లు దక్కెను.

ఆపక్షి యట్లు గైకొని యెగిరిపోవుచుండ దైవయోగమున ముక్కుజారి కాశ్మీరదేశపురాజు గూర్చుసియున్న బల్లమీఁదఁబడి

నది. ఆఫలమాహాత్మ్యమువనేకదా యాయేవురకుఁ బుత్రులుజనిం చిరి. తర్వాతివృత్తాంతము వినుము. ఇందాక నిలిపిన కథావృత్తాంతము జ్ఞాపకమున్నదియా. రాజుగారికిని మంత్రికిని పురోహితునికిని కోమటికిని కలాదునకును బుత్రులు గలిగినప్పటి యానంద మెవ్వఁడును గలిగినదికాదు.

# వరప్రసాదులకథ.

అట్టి సంతోషముతో వారు పుత్రోత్సవము పంచిపెట్టియుఁ బేదలకుఁ బెక్కుదానములు సేసియు మిత్రులకు బంధువులకు మెందు విందులు గావించియు మహోత్సవముల నెన్నియేని నాచరించిరి. పిమ్మట నాపుత్రులకు జాతకర్మాదివిధుల యథావిధినాచరించి రాచపట్టికి వసంతుఁడనియుఁ మంత్రిసూనునకు రాముఁడనియు, బ్రాహ్మణపుత్రునకుఁ బ్రవరుఁడనియు, వైశ్యనందనునికి సాంబుఁడనియు, కళాదకుమారునికి దండుఁడనియు, నామాద్యక్షరంబు లేకముగాఁ జదివిచూడ వరప్రసాదులని వచ్చునట్లు పేరులుపెట్టిరి. వరప్రసాదు లేవురు రూపంబునను దేజంబునను గుణంబుల నొక్కపోలిక గలిగి మన్మథునిం దిరస్కరించు చక్కఁదనముతో నభివృద్ధిఁజెందుచుండఁ దల్లిదండ్రులకు మిగుల ననురాగ మభివృద్ధి యగుచుండెను.

పిమ్మట నైదేండ్లు వచ్చినతోడనే యబ్బాలుర నొక యుపాధ్యాయునికడఁ జదువవేసిరి. ఆగురువునకు వచ్చినచదువంతయు వారికారుమాసములు చదువుటకుఁ జాలినదికాదు. తరువాత నొకసాహిత్యధురీణుని గురువుగా నేర్పరచిరి. ఆతనికడ వత్సరములో నాటకాలంకారములయం దసమానపాండిత్యముఁ గుదురుచుకొనిరి. పిమ్మట

నొక వైయ్యాకరుణుని నాచార్యులగాఁజేసిన నతనికడ మూఁడేం
డ్లభ్యసించి పిదప నతనికిసైతము తప్పుల దిద్దఁదొడఁగిరి. అట్లు
వ్యాకరణపాండిత్యము కుదిరినతోడనే తార్కికునికడ నొప్పగించిన
నారుమాసములకే యతని శిష్యునిగాఁ జేసికొనిరి. పిదప నొకసిద్ధాం
తిని మూఁడుమాసములును, వైణికుని రెండుమాసములును, వైద్యుని
నాల్గుమాసములు, వేదాంతిని మాసము, వైదికుని వత్సరము,
తాంత్రికుని మాసము, మాంత్రికుని మాసము, గురువుగ నేర్పరచు
కొని యవ్విద్యలన్నియు సాంగముగా గ్రహించిరి. తక్కినవిద్య
లన్నియుఁ బుస్తకములే గురువుగానుండ సంగ్రహించిరి. మఱియు
శస్త్రవిద్యయు ధనుర్విద్యయు నశ్వవిద్యయు మొదలగు రాజార్హము
లగు విద్యలుగూడ శీఘ్రకాలములోనే సంగ్రహించిరి. ఇట్లుకొలఁది
ప్రాయమందే యిరువది నాలుగువిద్యలయం దసమానపాండిత్యము
గల యవ్వరప్రసాదుల సుగుణములు నిత్యమును బొగడనివారు లేరు.
వారివిద్యలు, గుణములు, శీలములు, రూపములు, ప్రజ్ఞలు, తల్లి
దండ్రులకేగాక శతృవులకుసైతము స్తోత్రపాత్రములై యున్నవి వర
ప్రసాదులు ఆహారవిహార శయ్యాసన రహస్యవ్యాపారములయం
దును విడువక యేకప్రాణముగా వర్తింపుచుండిరి. వారియెడ రాజు
మొదలగు వారికిఁ బుత్రప్రేమ సమానముగానే యున్నయది.

వారు నిత్యము ప్రాతఃకాలమునందును సాయంకాలమునం
దును మంచిగుఱ్ఱముల నెక్కి పెక్కుదూరము విహరించివచ్చుచుందురు.
అశ్వారోహణమందు వారికి మిక్కిలి పాటవముగలదని జగత్ప్రసిద్ధ
మైనది. వారికి బదియారేఁడుల ప్రాయము వచ్చినంత వారికిఁబెండ్లిండ్లు
జేయుఁ దలంపుతల్లిదండ్రుల హృదయంబులనంకురించినది. అక్కుమారు
లైదుగురు నొక వసంతకాలమునఁ దురగారూఢులై యుద్యాన
వనమునకుఁబోయి యందు విహరించుచు నిట్లు సంభాషించుకొనిరి.

రాముఁడు—మిత్రులారా! మనమనేకవిద్యలం జదివితిమి. ప్రాయమునకు మించిన పాండిత్యము సంపాదించితిమి. దేశాటనం బునం గాని మన విద్యాపాటవంబునకుఁ దేటరాదని నాయభిప్రాయ ము. అక్కార్యంబున కిదియ సమయము. ఇందులకు మీరేమందురు?

వసంతుఁడు—నీకు మంచియూహ తోఁచినది. మనకిప్పుడు వివాహములు చేయవలయునని మనతండ్రులు ప్రయత్నించుచున్నా రు. మెడకు లంకెలు దగిలికొనిన తరువాతఁ గదల శక్యమా? దేశ ములన్నియుంజూచి రావలయుననినాకు మొదటనుండియు నుత్సుకమే.

ప్రవరుఁడు—మీయభిప్రాయములు మేము కాదనువారమా? కూపస్థకూర్మమువలె స్వదేశముననే యెల్లకాలముకాలక్షేపముచేయు వారు పండితులైనను మూఢులని నీతిజ్ఞులు చెప్పుదురు. తప్పకయిప్పుడే బయలుదేఱవలసిన సమయము.

సాంబుఁడు—అన్నన్నా! మీయావనమద మెన్నివికారములఁ బుట్టించుచున్నది. దేశాటనము మాటలతో నున్నదనుకొంటిరా! వేళకు నాహారము దొరకదు. పండుకొనుటకుఁ దగిన సెజ్జలుండవు సత్రభోజనము మఠనిద్రయుఁ గావింపవలయును. మిక్కిలి సుకుమా రుఁడగు నీరాజనందనుం డాయిడుమలఁ బడఁగలఁడా? పరదేశులం జూచి ప్రజలు కడుఁజుల్కనగా మాటలాడుదురు. నిద్రాహారములు తిన్నగలేక రోగములు రాకమానవు. ఈవెఱ్ఱియాలోచనలుమాని యింటికడ సుఖముగా నుండనీయుఁడు. యౌవరాజ్యపట్టాభిషిక్తుండై యితండు మహేంద్రవైభవ మనుభవించుచుండ మన మనుచరులమై చూచి యానందింతము. స్వదేశములో స్వగ్రామములోఁ స్వగృహ ములోఁ బూజ్యతలేని దరిద్రునికిఁ బరదేశమేగుట గొప్పయని చెప్పఁ బడియున్నది. ప్రాయికముగా విద్వాంసులు దరిద్రులగుట వారికి దేశా టనము కీర్తికరముకావచ్చును. అదియునుంగాక మన తలిదండ్రులు

మనలంజూడక యొకదివసము గడుపనేరరు. అట్టివారు మనపోకకు సమ్మతింతురా ? చెప్పకపోయితిమేని దుఃఖసముద్రమున మునింగిపోవుదురు. అన్నిగతులకి త్తఱి దేశాటనము సమంజసముగా లేదని నాయభిప్రాయము.

దండుఁడు— మనసాంబుఁడు కులజమైన పిరికితనము విడువక దేశాటనమునకు జడియుచున్నాఁడు. ఆతండునుడివిన కష్టములన్నియుఁ బరదేశములో ధనహీనులకుఁ గలుగుచుండును. వలసినంతధనము దీసికొనిపోయిన మనకుఁ బరదేశము స్వదేశమువలెనే యుండును. రాజపుత్రులు యౌవరాజ్యపట్టభద్రులై దిగ్విజయయాత్ర చేసివత్తురు. అట్టియాత్రవలనఁ గొన్నికొన్ని విశేషములు దెలియఁబడవు. మనమెట్టివారమో తెలియనీయక సామాన్యులవలె నరిగినచో నెన్నెని విశేషములు తెలియఁబడక మానవు. ఆహా! భూమండలపటమంతయు నొక్కసారి విమర్శించి చూకుఁడు. ఎన్ని దేశములు, ఎన్ని పట్టణములు, ఎంతలేసి విద్వాంసులు, ఎంతలేసిభాగ్యవంతులు. ఎంతలేసిసౌందర్యవంతులుందురోకదా? ఒక్కొక్క దేశమునంగల స్త్రీలచాతుర్యంబులు వర్ణింపనలవియా? మహారణ్యంబులు మహానగంబులు దిరిగిన దివ్యౌషధీవిశేషంబు లెన్ని సంపాదింపవచ్చును. తల్లిదండ్రులు మనగమనమునకు సమ్మతింపరు. వారెఱుంగకుండఁగనే పోవలయును, సంవత్సరములోనంతయుం దిఱిగి రావచ్చును. విద్యాభ్యాసమునకై తల్లిదండ్రుల విడిచి విదేశమునఁ బెక్కుసంవత్సరములు వసించిన వారెందరో యున్నారు. మనము పోయితిమేని వారికది సరిపడియుండును: వేగమేవత్తుమని వ్రాసిపెట్టి యేగుదము. మృత్యువువలన భయము లేకుండ మనయాయువులు గుప్తముగా దాచు పాటవము నాకుఁ గలదుగదా! అట్లుచేసిన మనము యమపురి కఱిగినను భయములేదు. అన్నివిధములచే నొకసారి దేశములు తిరిగివచ్చుటయే శ్రేయమని నాయుద్దేశము.

సాంబుఁడు— నేను బిరికితనమునఁ జెప్పినమాటగాదు. మీ యందఱికన్న ముందడుగు వేయఁగలను. అనంతములైన దేశములు గుఱ్ఱమెక్కి తిరుగుచుండ నొకయబ్దకాలము సరిపోవునా? మనసంకల్ప ప్రకారము జరుగదు. కానిండు. మీనలువుర యభిమతములకు నేను వ్యతిరేకము చెప్పువాఁడనా? తప్పక భూమియంతయుం జూచి రావలసినదే.

వసంతుఁడు—మిత్రమా! సాంబ! నీవు చెప్పినదంతయు సమంజసమైనదే. కావలసినంతధనము దీసికొనిపోవుదము. మీరు నలువురు నావెంటనుండ నాకేకొదువయు రానేరదు. సుఖముగానే తిరిగివత్తము.

రాముఁడు— వానికిమాత్రమిష్టము లేదాయేమి. మంచిపిల్లను బెండ్లి చేయుటకు వానితండ్రి నిశ్చయించెనఁట. అందులకడ్డు చెప్పుచున్నాఁడు.

ప్రవరుఁడు—అమాత్రపు కన్య లాదేశములో దొరకకపోరు స్వయముగా మనము చూచి పెండ్లి జేసికొనుట లెస్స

దండుఁడు—పదుఁడు పదుఁడు మీయభిలాషలన్నియుఁ దీరఁగలవు. దేవతాస్త్రీలనే పెండ్లియాడివత్తము.

వసంతుఁడు—అందఱును సమ్మతించిరిగదా. పోవుటకుఁ గాల నిరూపణము చేయుఁడు.

ప్రవరుఁడు—ఏప్పుడో యననేల రేపురాత్రిఁ బండ్రెండుగంటలు గొట్టినతోడనే గుఱ్ఱములెక్కి యూరిబయలనున్న చూతవనములోనికి రావలయు నింతయేని జాగుసేయరాదు. అందఱము గలిసికొనినతరువాతఁ బశ్చిమమార్గంబునఁ బోవుదము.

దండుఁడు—మిక్కిలి వెలగల రత్నములును బంగారమును దగిన యాహారపదార్థములు మూటగట్టుకొని యందఱు రావలయు నిదియే ప్రమాణవచనము.

అందఱు—ముమ్మాటికిని బ్రమాణవచనము. ఇప్పుడనుకొనిన సమయమున కాతోటలోనికి రావలయును.

అని యాలోచించికొని యందఱు గుఱ్ఱములెక్కి సత్వరముగా నిండ్లకుంజనిరి. ఆరాత్రియు మఱునాఁడు పగలును బ్రయాణసన్నాహమేకాని యొండు కార్యమేమియు వారెఱుఁగరు. వారట్టి యుత్సాహముతో నుండిరని యెక్కరును గ్రహింపరైరి. ప్రవరునితల్లి మాత్రము వత్సా! నేఁడిదియేమి? మిత్రులయొద్ద కఱుగక యింటియొద్దనే యుంటివేమి? పుస్తకములన్నియు సవరించుచుంటి వేమిటికి? యెక్కడికైనఁ బ్రయాణము చేయవలసి యున్నదా యేమి? అని యడిగినది. అతండామె కేదియో సమాధానముజెప్పి మరపించెను.

నాఁటిరేయి నియమించుకొనిన సమయమైనతోడనే యందఱును గుఱ్ఱములెక్కి యెవ్వరికిం దెలియకుండ సాంకేతితమైన యారామమున కరుదెంచిరి.

అందఱును జేరినవైనము పేరుపేరునం దెలిసికొని కలసికొని మాట్లాడికొని మంగళశ్లోకములం జదువుచుఁ బశ్చిమ దిగభిముఖులై మనుష్యసంచారములేని యొకమహారణ్యమునంబడి నడువసాగిరి. వారి వారువములు ఱెక్కలుగలవియుంబోలె గంచెలందాటుచు గుట్టల నతిక్రమించుచుఁ బొదల దూరుచు నత్యంతపాటవంబున నేగఁ దొడంగినవి.

మఱియు వసంతుండు ఖడ్గపాణియై యడ్డమైన తరులతాగుల్మాదుల ఖండించుచు ముందుఁ దనఘోటకమును విన్నాణముగా నడిపించుచుండ రాముఁడును దానియడుగుల నడుగులిడునట్లు తన తత్తడిని సమవేగంబునఁ బోనిచ్చుచు వసంతుఁడు నఱుకగా మిగిలిన కంటకలతావితానంబుల భంజింపుచుండును. అతనిపజ్జ ప్రవరుండును వాని వెనుక సాంబుఁడును వానిపిరుందన దండుండు నట్లే తురగంబులఁ దోలుచుండిరి.

అయ్యరణ్యంబు ముందుఁజూడ దుర్గమంబుగను వారి వెనుకఁ జూడ రాజమార్గంబు గలదిగను గనంబడుచుండుటంజేసి

యక్కాంతార మక్కుమారశేఖరులకు దారి యిచ్చుచున్నదో యనునట్లు చూడనయ్యెను. అందఱకన్నను వెనుకవచ్చుచున్న దండుఁడు వైద్యశాస్త్రప్రవీణుండును మహాయంత్రనిర్మాణదక్షుం డునగుట నయ్యడవి నందందుఁ గాన్పించుచున్న మూలికావిశేషములను యంత్రోపకరణ దారుఖండంబులను సంగ్రహించుచుండెను.

తమ్ముఁగానక మరునాఁడు తమవారేమి చేయుదురో యని తత్కృత్యంబుల గుఱించి సంభాషించుకొనుచు వారట్లు మహావేగంబునఁ బోవుచుండఁ గొంతసేపటికి వారి నాశ్వాసించుటకుంబోలె నంబుజినీకాంతుం డనూరు పురస్సరముగాఁ బూర్వగిరి శిఖర మధిష్ఠించి యరుణకర ప్రసారముల వారిపై వ్యాపింపంజేసెను.

అప్పుడొక తటాకనికటంబునఁ దమహయంబులనిలిపి యవ్వీరులందుఁ బ్రాతఃకాలకృత్యంబుల నిర్వర్తించుకొని తత్కాలోచితాహారంబున నాకలి యడంచుకొనిరి. వసంతుం డిట్లనియె. మిత్రులారా! మన మీరాత్రి ననేకయోజనముల దూరము వచ్చితిమి. ఇమ్మహారణ్యమున కంతము గానఁబడకున్నది. మనవీటికిఁ బడమర దెస జలధిదనుక జనసంచారశూన్యమగు మహారణ్యమున్నదని మనము భూగోళశాస్త్రమునఁ జదివియుంటిమి. మనవారు మనలం బట్టుకొని తీసికొనిపోవుదురని తలంచికదా ? యీదెస కరుదెంచితిమి. ఇంక నందులకు వెరవవలసిన పనిలేదు. ఇటనుండి దక్షిణముగా నేఁగిన గొన్నినగరములు గనంబడును. అవియు నిక్కడికిఁ బెక్కుదూరములో నుండవచ్చును. మన గుఱ్ఱములు జాల బడలినవి. కొంత విశ్రమించి యరుగుదముగాక. మఱియొకరేయి నిట్లు శ్రమపడితిమేని జనపదంబులం జేరుదుము. ఈపాటి యలసట సైరింపఁ గోరుచున్నవాఁడనని యోదార్చిన వారెల్లరు సంతసించుచు నతని దయకు స్తుతిజేయఁ దొడంగిరి.

వారి వాహంబులు వారివాహంబులువ్రాలె సంసక్తాంబరం బులు సముపగత జీవనంబులునై గంభీర హేషాఘోషంబుల గమ నోత్సాహంబు శూచింప నక్కుమారులు వెండియు నధిష్ఠించి దక్షి ణాభి ముఖులై పోయిపోయి రాత్రిపడినంత నొకచోట విశ్రమించి మరునాఁడు వేకువజామున గ్రమ్మరం గదలిపోదలంచినముదముతో నటవీవిశేషంబులం జూచుచు మట్టమధ్యాహ్నము దనుక నేకరీతిఁ బయనంబు గావించిరి.

అల్లంతదూరములోఁ గాంచన శిఖర భాసుర మైన గోపుర మొండుగాంచి సాంబుఁడు అదిగో పురము పురము అని అని కేకలు వైచెను. రాముఁడు అవును పట్టణమే కావచ్చును. ఇచ్చట భూములు సస్యసంపూర్ణములై యొప్పుచున్నవి. అడవి పలచపడినది. జనమిందుఁ దిఱుగుచున్నట్లు చిహ్నములు గనంబడుచున్నవి. అని పలుకుటయుఁ బ్రివరుండిట్లనియె.

పట్టణ ప్రాంతభూమి జనాకీర్ణమై యుండవలయు నిందొక్క రుండును గనంబడఁడు. కారణమేమియో యనుటయు వసంతుండు గుఱ్ఱముల నాపుఁడని నియమించి నలుమూలలు పరికించి యిదిగో మనము నగరమునకు దాపుగా వచ్చితిమి. ఇందక్కడక్కడ గృహ ములు గనంబడుచున్నవి. మనుష్యుండొక్కఁడును గనఁబడఁడు. ఇది తర్కింపఁదగినదేయని పలికెను.

అప్పుడు ప్రివరుఁడు సౌధప్రాకార విశేషంబులం జూడ నీవీడు రాజధానివలెఁ బొడకట్టుచున్నది. ఇట్టినగరము వెలుపల జనసంచార శూన్యంబగుట నాలోచించి మఱియుం బోవలయుననిన నవ్వుచు దండుండిట్లనియె.

మిత్రులారా ! అది యేదియైన మనకేమిభయము ? మనయా యువులు గుప్తముగా దాచినమాట మరచితిరా ? మట్టమధ్యాహ్న

మున నర్ధరాత్రమునఁబోలె నిశ్శబ్దంబై యున్న యన్నగరములోఁ బ్రవేశించి యదార్థమరయుదము గాక వదుఁడుపదుఁడు అనియుదుటు గరపుటయు సంతసించుచు వసంతుండు తత్తడిని మడమలతో నడచిన నది చిత్తానుగుణ్యముగాఁ బరుగిడఁ దొడంగినది. దాని ననుసరించి తక్కినవారును వారువంబుల నడిపించిరి. ఇంతలోఁ బట్టణము సమీపించినది.

వారు మిక్కిలి సాహసముతో జనశూన్యమైన యానగరిలో నొకవీధిని గుఱ్ఱముల నడిపించుచుండిరి. గృహకవాటములన్నియు మూయఁబడియున్నవి. అంగళ్ళన్నియుఁ గట్టివేయఁబడినవి. అక్కడక్కడ వేదికలపై జనులు నిద్రించుచుండిరి. అవ్వింత జూచి వెరగుపడుచు వసంతుఁడు సఖులారా యీవీడు రేఁదిమ్మరీడులది కాదు గద. లేక దీని నెవ్వరైన నిట్లుండ శపించిరా? యిట్టి పట్టపవలున నిశీథంబునం బోలె జనులు నిద్రించుట శంకాస్పదమైయున్నది. వేగమ దీనిదాటి పోవుటయే శ్రేయమని పలికిన దండుండిట్లనియె.

రాజపుత్రా! అందందు నిద్రించు వారింజూచితివా? వారు మనవలెనేయుండిరి, రాక్షసనగరము భూతములపురము నైనచో నిట్టి మనుష్యులేల యుండెదరు. దీని కేద్దియో కారణముండక పోదు. దాటిపోవనేల? దీనిని విమర్శించి మఱియుం బోవలయు నిట్టి వింతలను జూచుటకేకదా? మనమిల్లు వెడలితిమని యతండు పలుకుచుండఁగనే యొకమూల ఢం ఢం అను డిండిమధ్వని వినంబడినది.

ఆచప్పుడు విని వరప్రసాదులు ఓహో! యెద్దియో చాటింపు కాఁబోలు. ఆకర్ణింతుముగాక యని యాధ్వనిజాడ ఘోటకముల నడిపింపందొడంగిరి. ఖడ్గహస్తులై యిరువురు రక్షకభటులొక డిండిమహస్తునితోఁగూడ వీధుల సంచరించుచుఁ బౌరులారా! భద్రముగా నిద్రింపుఁడు. భద్రముగా నిద్రింపుడు. మీసొత్తుల మేము గాపాడు

చుంటిమని కేకలు వైచుచుండిరి. వరప్రిసాదులు వారిదాపునకుఁ బోవుటయు వారికిని వీరికిని నిట్టి సంవాదము జరిగినది.

రాజభటులు—మీారెవ్వరు ?

వరప్రిసాదులు—మేము కాశ్మీర దేశస్థులము.

రాజ—ఇట్టి యర్థరాత్రింబున నిర్భయముగా సంచరించు చుంటిరేల ?

వర—ఓహో ! యిది యర్థరాత్రియా ! పట్టపగలుగాదా ! మీామాట లింత విపరీతములుగా నుండుటకుఁ గారణమేమియో తెలియకున్నది

రాజ—ఇది పట్టపగలన్న వారిని శిక్షించుట మాారాజుగారి శాసనము మీారెఱుంగరు కాఁబోలు. మొదటితప్పు మన్నించితిమి. మీారింకొక్కసారి యట్లు వనాట్లాడినచో శిక్షాపాత్రులగుదురుసుమీా?

వర—ఇది యేమియన్యాయము. నిజముబల్కినను దండించు రాజులుగలరా ? పోనిండు. మేము భుజింపవలయునట్టి సదుపాయ మెక్కడ జరుగును. ఎందైన సత్రమున్నదియా ?

రాజ—(అత్యాగ్రహముతో) మేము పురరక్షకులముగాని పరదేశులకు భోజనసదుపాయము జేయువారమును సత్రముల నెఱింగించువారమును గాము. రాత్రుల వీధుల నితరులు సంచరించుటకు రాజుగారియాజ్ఞలేదు. ఎక్కడనైనను సత్వరముగాఁ బండుకొనుఁడు. లేనిచో శిక్షింతుము.

వర—ఊరక యాగ్రహపడియెద రేమి ? పరదేశస్థులకు బస జూపినంత మాత్రముననే యధికారమునకు లోపమువచ్చునా !

రాజ—లోపమువచ్చును. అది మావనికాదు. వేగిరము పండుకొనుఁడు.

నిలుఁడు. నిలుఁడని గుఱ్ఱంబుల కడ్డునిల్చుటయు వారు గొ్రిత్త వారగుట నేమియుం బలుకనేరక గుఱ్ఱంబులడిగ్గి వారిశాసనమునకు

లోనైన ప్రాంతముననున్న యొక యరుగుమీదఁ బరుండిరి. ఊరక కన్నులుమూసికొనిరిగాని నిద్రపట్టినదికాదు. ఇంతలో సాయంకాల మగుటయు ననఁగా నాగ్రామస్థులకు నది యుదయమే గనుక ప్రాతః కాలమున లేచునట్లు సాయంకాలమున లేచి జనులెల్లరు క్రమంబున వారివారి వ్యాపారములయందు బ్రవర్తింపఁ దొడంగిరి. వరప్రసాదులు పరుండియున్న యింటియజమానుఁడు తలుపు తెరచి వారిం జూచి గొప్పకుటుంబములోని వారింగాఁదలంచి మిక్కిలి గౌరవముగా అయ్యలారా మీరెవ్వరు ? ఈగ్రామమెందులకై వచ్చితిరి ? మీ వృత్తాంత మెఱింగింపుఁడని యడిగిన ప్రవరుం డిట్లనియె.

అయ్యా! మేము కాశ్మీరదేశస్థులము. గొప్పవంశము వారము విదేశములయందుఁగల వింతలఁజూచుటకై దేశాటనము జేయుచుం టిమి. ఈపురము నేఁటిమధ్యాహ్నము జేరితిమి. అట్టివేళ నిద్రించు చున్న జనులఁజూడ మాకు మిగుల వింతయైనది. కారణమడుగ నిది మధ్యాహ్నమనువారిని దండింతుమని రాజభటులు మమ్మునరికట్టిరి. మిగుల నాకలితో వారియాజ్ఞకు బద్ధులమై మీయరుగుమీఁదఁబండు కొంటిమి. ఇంతలో సాయంకాలమగుటయుఁ దెల్లవారినట్లు జనులు వారవారి పనులందు బ్రవర్తింపఁదొడంగిరి. ఇందలి వారలు నిశా చరులగుటకుఁ గారణము తెలియకున్నది. ఈవిశేషమెట్టిదో యెఱిం గింప వేడుచున్నారము. అని సానునయముగా నడిగినఁ బుణ్యామతి యైన యాగృహపతి వారిని లోనికిఁ గొనిపోయి యుచితప్రదేశ మునఁ గూర్చుండబెట్టిత్రృటిలో రుచిగలపదార్థములతో వంటఁజేయించి భోజనముబెట్టి పిమ్మట రహస్యస్థలంబునకుఁ దీసికొనిపోయి సాదర ముగా నానగరవృత్తాంత మిట్లు చెప్పందొడంగెను.

---

# కానీసునికథ.

ఆర్యులారా! ఇదిలాటదేశము. ఈదేశాధికారిపేరు కానీసుఁడు. వీనికి దుష్టబుద్ధి సుబుద్ధియను నిద్దరు మంత్రులుగలరు. వారియాలోచ నానుసారము నతండీరాజ్యంబేలుచుఁ బదివత్సరముల క్రిందట నొక నాఁడొకసభజేసి యందు పౌరహిత పురోహిత సామంత ప్రముఖులు పెక్కండ్రు వినుచుండ నాయొడయఁడు మంత్రులతో నిట్లనియె.

అమాత్యులారా! నాచిత్తమున నిప్పుడొక క్రొత్తసంకల్ప మంకురించినది, దాని మీరిరువురు విచారించి గుణదోషంబులవకా- శింపుఁడు భూమి పుట్టినది మొదలు పాలించిన రాజుల చర్యలుజూడ నేకరీతిగానే యున్నవి. "గతానుగతికోలోకః" అనునట్లు ముందువాఁ డెట్టి చెడుత్రోవ నడచినను నది పెద్దలునడచిన మార్గమనియు దాని నతిక్రమింపరాదనియుఁ వెనుకవారు నట్లె నడుచుచుందురు. "శతాం ధాఃకూపంప్రవిశంతి" అనునట్లు వారును వీరును గూడగుడ్డివారలే. మొదటివారు తర్వాతవారికి పెద్దలగుదురుగదా! కావున నారాజ్య మందొక క్రొత్తపద్ధతిఁ జేయందలంచికొంటి. ఇదిమొదలు నీరాజ్య ము వారందరునట్లే నడచుచుందురు. దానిమూలమున నాకు మిగుల ఖ్యాతిరాఁగలదు వినుండు. రాత్రియనియు, బగలనియు, నిద్రావిహా రములం బట్టి మనవారు దినమునకు రెండునామములు పెట్టిరిగదా, అందు నిద్రించునది రాత్రియనియు విహరించునది పగలనియుఁ జెప్పుదురు. దానికిఁ బదులుగా నిప్పుడు రాత్రి పగలు, పగలు రాత్రి నిజేయువాఁడనై యుంటిని. నడతలం బట్టగదా వానికట్టినామములు వచ్చినవి? కావున రాత్రిపనులు పగటియందును పగటిపనులు రాత్రి యందును ప్రజలు చేయఁదొడంగిరేని యట్టినామములు వానికే రూఢమగుచున్నవి. ఇదియే మదీయసంకల్పము. దీనికి మీయభి

ప్రియమేమని యడిగిన దుర్బుద్ధియను మంత్రి యిదిమిగుల యుక్తముగా నున్నదని రాజుగారిని స్తుతించెను. సుబుద్ధియు దానికొడంబడక రాజుతో నిట్లనియె దేవా ! వినుండు.

శ్లో. "సులభాః పురుషాలోకే సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః"

అనునట్లు ఇష్టముగా మాట్లాడువారు పెక్కండ్రుగలరు. అప్రియముగాహితమైన దానింజెప్పువారును వినువారునులేరు. నేఁజెప్పఁబోవునది తమకుఁ బ్రతికూలముగానే యుండును. ఐనను హితమైన మార్గము చెప్పకమానను. వినుం డిప్పుడు దేవరవారికిఁ దోచినయాలోచన లోకమునకు విరుద్ధమైనదియేగాక లోకులకు మిగుల పీడాకరమైయున్నది. నిద్రాహారంబులంబట్టి రాత్రింబగళ్ళకు నామములు పెట్టలేదు. అందుఁగల చీఁకటియు వెల్తురునుంబట్టి యట్టిపేరులువచ్చినవి. తేజస్తమంబులంగూడ మార్పనోపుదురేని యట్టినామంబులు వానికిఁ బెట్టనగు దానినూలముగా స్వర్గమునకుఁ బ్రతిస్వర్గము సృష్టించిన విశ్వామిత్రునకుంబోలె తమకును గొప్పఖ్యాతిరాఁగలదు. కాని వ్యాపారముల మార్చినంత మాత్రముననే యట్టిఖ్యాతి రానేరదు. రాత్రిసంచారము క్రూరమృగములకు రాక్షసులకుగాక మనుష్యులకెట్లుపొసంగును. వెలుతురులేక యేపనిచేయుటకు వీలులేదుగదా ? అట్టి చీకఁటిలో పగటిపనులెట్లు చేయుదురో విచారింపవలదా ? అట్టి నియమము భగవంతునిచేఁ జేయఁబడినది. దాని మనుష్యులు మార్పఁగలరా ?

మనుష్యకృత్యముల మార్చినను మార్పవచ్చునుగాని దైవకృత్యములమార్ప నెవరితరంబు? మఱియొకరాజు పాదములతో నడుచుట లెస్సకాదని చేతులలో నడువమనును. ఇంకొకఁడు కన్నులతో విని చెవులతోఁ జూడమనును. ఇట్లు విపరీతకృత్యములు వ్రజలెట్లు

చేయఁగలరు? చేయశక్యముకాని పనులవిషయము శాసనముల నియమింపరాదు. దైవికముల మార్చుట శక్యముకాదు. అప్పని యపఖ్యాతికి మూలమగును. ప్రజావిరోధము సంభవించునని నిర్భయముగా నాసుబుద్ధి యుపన్యసించినంత నాభూపతి యత్యంతకోపముతోఁ దనయాజ్ఞకు నాటంకము చెప్పినందుల కప్పుడే యామంత్రి నుద్యోగమునుండి తప్పించి మర్యాదఁ బొగడుచు నమ్మరునాఁటి నుండియుఁ గొత్తశాసనము వడువున జనులు నడుచుకొనునట్లు దేశమంతయుఁ బ్రకటింపఁజేసెను. రాజశాసన మతిక్రమించిన వారిని గఠినముగా శిక్షింతుమని చాటింపించిరి. అట్లు చేయుటకు రాజభటులఁ బెక్కండ్రనియమించిరి.

అట్టియుగ్రశిక్షకు వెఱచి యందలిప్రజలు దీపంబులకుఁ జమురు దెచ్చుకొనలేకను చీఁకటి నడువలేకను నిద్దురకాఁగలేకను బెక్కుతెఱంగుల నిడుమలఁ బడుచుండినను విషనాభిలో పురుగులవలె జన్మభూమి విడువలేక నయిదాఱువత్సరము లధిక క్లేశము లనుభవించిరి. తుదకదియును నలవాటైనది. ఇంత మొండిజను లెందైనఁగలరా?

మా రాజుచరిత్ర పుట్టిది. మీరు పరదేశస్థు లెరుఁగమినైన నిఁకనిది రాత్రియనఁబోకుఁడీ! అట్టి మాటలచేఁ బెక్కండ్రు శిక్షితులైరి. శీఘ్రముగా నీగ్రామము దాఁటిపోవుఁడని యయ్యజమానుఁడయ్యూరి వర్తమానమంతయు నెఱింగించిన వరప్రసాదులు నందలి ప్రజల యిడుమలకుఁ జాలిపడి యోహో! యిట్టి నీతిమాలిన నృపాలుఁడుండునే యని యతని నాక్షేపించి యతని దుష్కృత్యము నెద్దియో యొకయుపాయమున మాన్పింపఁదలంచి యందుఁ గొన్ని దినంబులుండినంగాని యట్టి పనిచేయుటకుఁ బొసంగదని యొక గొప్ప భవనమద్దెకుదీసికొని యందు నివసించి యచ్చటి వారివలెనే కొన్ని దినములు రాత్రింబగళ్ళ చర్యలు నడుపుచుండిరి.

# దేవతావస్త్రములకథ.

బుద్ధిశాలులగు వరప్రసాదు లొక్కయుపాయమున నానృప తిని వంచింపఁదలంచి యొకనాఁడు పెందలకడ భోజనములుజేసి గౌరవమైన వేషములు వేసికొని రాజుగారి హాజారముకడ నిలువంబడి యొక చీటిలోఁ గొన్నివిషయములువ్రాసి ద్వారపాలురచేతికిచ్చి రాజున కంపుటయు నాచీటిచూచుకొనిన తక్షణము రాజుగారు వారిఁ దోడితెచ్చుట కొకయుద్యోగస్థుని పంపిన నతఁడత్యంతగౌర వముగా వారిదోడ్తెచ్చి రాజుగారి సింహాసన ప్రాంతమందు విడిచెను.

రాజును వారికెదురేగి గౌరవముగా మన్నించి యుచితపీఠ కలఁ గూర్చుండఁబెట్టి స్వాగతపూర్వకముగా నిట్లనియె, పురుషవర్యు లారా! మీర లెద్దేశమువా రెచ్చటనుండి యెచ్చటి కరుగుచు నిచ్చటి కెప్పుడువచ్చితిరి ? కులగోత్రనామంబు లెట్టివో యెఱింగింపుఁడు. మఱియు మీరు చీటిలో వ్రాసిన వింతపనులేమిచేయగలరనియత్యం తాతురముగా నడుగుటయు, వాక్పాటవముగల మంత్రిసూనుండు లేచి సభాసదులకు మ్రొక్కి రాజుదిక్కు మొగంబై యిట్లనియె.

రాజేంద్రా! మాది కాశ్మీరదేశము. పట్టుసాలి కులమువారము విచిత్రములగు బట్టలు నేయఁగలము. అట్టిపనితో మిగుల గౌరవ ముగా మాదేశపు రాజుగారియొద్ద నుండువార మతని కిప్పు డొక యాపద సంభవించుటచే నటనుండక మమ్ము రక్షించువా రెవ్వరని యరయుచుండ యపూర్వచర్యాభిలాషులును నూతనమార్గ నిర్మాణ దక్షులునగు మీకీర్తి దిగంతవిశ్రాంతమై మాకర్ణ గోచరమగుటయు వింతకార్యముల నొనరించుటయందు వేడుకగల మీరుగాక మా యపూర్వవిద్య పరీక్షసేయు దక్షు లన్యులు లేరని నిశ్చయించి యుష్మద్దర్శనార్థులమై యీదేశమరుగుదెంచితిమి.

మాపుణ్యవశమున మిమ్ముఁ బొడఁగంటిమి. సెలవైన యెడ మానేతచమత్కృతి వక్కాణింతుమనుటయు నట్టిమాటలకు నా రాజు మిగుల నానందించి మంత్రిదిక్కు మొగంబై దుర్బుద్ధీ! మన నూతనచర్యాస్థాపనవలన నెట్టిఖ్యాతిగలిగినదో వింటివా ? మనకుఁ గడుదూరముగానున్న కాశ్మీరదేశములో సైతము మనపేరు వాడుక పడియున్నదఁట. మేలుమేలని సంతసించు రాజుతో మంత్రియిట్లనియె.

దేవా! కాశ్మీరదేశ మొకటనేల? భూమండలమంతయు మన పేరుప్రతిష్ఠలు వ్యాపకమైయున్నవి. ఆయాదేశములనుండి వచ్చుచున్న వార్తాపత్రికలవలన నవ్విధమెల్లఁ దెల్లమగుచున్నది. తమకుఁ గల బుద్ధికుశలత మఱియొకరాజునకుఁగలదా? ఎప్పుడును గొత్తమార్గములే విమర్శింపుచుందురుగదా? దీనిమూలమునఁ దమకు శిబి, కర్ణ, బలి ప్రముఖులకు దాతృత్వమున వచ్చినదానికన్న నధికమగు యశంబు రాఁగలదని పెక్కుస్తోత్రపాఠములు పఠించిన మంత్రి మాటలను రాజు విని పరమానందభరితుండయ్యెను. వరప్రసాదులు నవ్వుకొనుచు నామాటల ననువదించిరి. అప్పుడు రాజు వారితోఁ గోవిదులారా! మీవిద్యాపాటవంబెట్టిదో యెఱింగింపుఁడు. అపూర్వమని తోఁచినచో మిమ్ముఁ దప్పక భరింతునని పలుకుటయు మంత్రిపుత్రుండగు రాముండిట్లనియె.

అయ్యా! మేమాఱుమాసముల కొక్కదోవతులచాపు చీరయుఁ దలరుమాలును నేయుదుము. ఆపుట్టములకు నేఁబదివేల మాడలు వ్యయమగును. అందు ముందుగా సగము సొమ్మీయవలయును. బట్టలనేత ముగిసినతోడనే మే మెవ్వరికినేయుదుమో యాయజమానుఁడు భార్యతోఁ దనకుఁగల వైభవమున నొకసాయంకాలమం దూరేగి మాబసలోనికివచ్చి మాకియ్యవలసిన సొమ్ముతో నొసఁగినంత బహుమతిం గూడ నియ్యఁదగినది. పిమ్మట నాపుట్టముల మేమే

వారికిఁ గట్టుదుము. ఆపుట్టంబులం గట్టికొని యూరంతయునూరేఁగి యారాత్రి భార్యాభర్తలు కాముకేళిం దేలినచోఁ దత్ప్రభావంబున వారి కధిక తేజస్సమన్వితుండగు నందనుం డుదయించును. మఱియు నొక్కవిశేషమాకర్ణింపుఁడు. మేము నేయుబట్టలుగాని నూలుగాని జారత్వదోషమువలన జనించినవారికి మాత్రము గాన్పింపవు. అవి దేవతావస్త్రములు ఇట్టిచాపుల నేఁటికొకసారి నేసి మారాజుగారివలన మిగుల గౌరవమందుచుందుము. దైవప్రతికూలమున నతండు చిక్కులంబడియుండుటంబట్టి యింతదూరము రావలసివచ్చినది. ఆపుట్టంబులఁ గట్టినప్పుడుగాని యయ్యానందము సెప్పినందీరదు. ఇంతుల కొడంబడుసు రేని నిందుం డెదము లేని చో సెలవీయుఁడు. వేఱొక యాస్థానమున కరిగెదమనుటయు నపుత్రకుండగు నూతనమార్గస్థాపకుండు నగుటచే దానఁ దనకు గొప్పఖ్యాతి రాఁగలదనియు నట్టి ప్రభావము లేకున్న నొకచాపునకు చీరకు నంత వెలయేల యనుగు దురనియు మనంబునఁ జింతించి వారట్టి ప్రభావసంపన్ను లగుదురని నిశ్చయించి వారితో నిట్లనియె.

ఓతంతువాయకులారా! మీకావిషయమై వితర్కమేమిటికి! మాసంస్థానమునకు వచ్చినవిద్వాంసు లూరకచనుటగలదా! రాత్రింబవళ్ళుమార్చి మిగుల విఖ్యాతిఁజెందుచున్న నాకుఁ గ్రొత్తపనులకునై యెంతసొమ్మైనను లక్ష్యమా? మీయిష్టమువచ్చినంతసొమ్ము వ్యయపెట్టి యట్టి యద్భుతపువస్త్రంబుల నేసియిండని యానతిచ్చి వారు కోరినంత ద్రవ్యంబిచ్చి సబహుమానముగా సెలవున కనిపెను.

వింతబట్టలనేయఁగల పట్టుసాలీలు వచ్చినారని గ్రామమంతయు వదంతియగుటచే నట్టివసనంబులు చూచుటకు పౌరులకుఁ గూడ మిగుల నాతురముగానున్నది. వరప్రసాదులును నేతసాధనములగు వేమానదండములు రాట్నములు మగ్గములు కండెగుల్లలు

లోనగునవి మాత్రము సంగ్రహించిరి. వాకిట తమ యాజ్ఞలేక యన్యులు రానీయకుండునటుల కావలివానిం బెట్టి లోపల నిష్టమైన వినోదములతోఁ బ్రొద్దు పుచ్చుచుండిరి.

ఇట్లుండునంత రెండు మాసములయిన పిమ్మట కాసీననృపాలుఁడొక్కనాఁడా పుట్టముల పని యెంతయైనదో యని తెలిసికొన వేడుకపడుచు నవ్విశేషములఁ జూచిరండని గ్రామాధికారుల వారి యొద్ద కనిపెను. అట్టిపుట్టంబులం జూడ వారికిని మిగుల వేడుకగా నుండుటచే సత్వరముగా వరప్రసాదుల నెలవునకఱిగి కావలివానిచేఁ దమరాక వారికెఱింగించిరి.

వరప్రసాదులును ముహూర్తమాత్రము నిలిపి తీసికొనిరమ్మని కావలివానికాజ్ఞ యిచ్చి యింతలో రాట్టములు దోడుబద్దలు సద్దుకొని వట్టిరాట్టముల నూలొడుకువారివలెఁ ద్రిప్పుచు నూలుచుట్టు వారివలెనే తోడుబద్దలకుఁ జుట్టుచుండిరి. అంతలో గ్రామాధికారులు లోనికివచ్చిరి. అప్పుడు రాముఁడెదురుపోయి సముచితసత్కారముల వారిం గౌరవించి తగుపీఠములఁ గూర్చుండంబెట్టి కొండొక వడికి నావట్టిచుట్టు బద్దలు వారికి జూపించుచు నిట్లనియె.

అయ్యా! నూలెంతసన్నమో చూచితిరా? మృదువు పరీక్షింపుఁడు. ఎంతసాపుగానున్నదో చిత్తగించితిరా! చేతంబట్టిచూడుఁడని దాపుగా నాకండెలంగొనిపోయి చూపించుచు రెండుమాసములకు నూలు తయారగుటయే దుర్ఘటమగుచున్నది. ఇట్టి నూలిదివఱకు మీరెన్నఁడైనఁ జూచితిరేమో నిజముచెప్పుఁడని యడిగెను. ఆగ్రామాధికారులు వెఱఁగుపడి తమకేమియుఁ గాన్పింపకున్నతఱిఁ తమ తల్లిం దూరుచుఁ దద్దోషంబుననే యువ్వింతనూలదృశ్యమైనదని నిశ్చయించి దానిమహాత్మ్యమగ్గించుచుఁ గాన్పింపలేదంటిమేని తమమాతృదోషము వెల్లడియగునని తలంచి యదినిజముగాఁ దమకుఁగనిపించుచు

న్నట్లభినయించుచు దానిమార్దవము సాపు సన్నమును విన్నాణమును రామునికన్నఁ బెద్దగాఁ గొనియాడ దొడఁగిరి.

గ్రామాధికారు లిరువురిలోఁ గరణమునకుఁ గాన్పించెనని కాపును కాపునకుఁ గాన్పించెనని కరణమునుదలఁచి యాగుట్టు తెలియనీయక మాట్లాడుచుండిరి. ఇట్లు కొంతసేపు నూలును గుఱించియు నూలోడుకు వారిగుఱించియు స్తోత్రపాఠములు పఠించి యా గ్రామాధికారు లరుగునప్పుడు రాముఁడు వారికి నిట్లనియె.

పురుషశ్రేష్ఠులారా! మీరు రాజుగారితో రెండుమూఁడు దినములలో నూలుతీయుట పూర్తియగునని చెప్పఁడు. దానిమార్దవాది గుణంబులు మీరుచూచినవేకదా? అదియుఁగూడఁ దేటపరుపుఁడని మిగుల గౌరవముగా వారిని సాగనంపి వరప్రసాదులు వారి మూఢత్వమునకై యొండొరులు నవ్వుకొనుచు నారాట్టంబులు చుట్టుబద్దలు నొకమూల పారవైచి యథాప్రకారము సంగీతాది వినోదములతోఁ గాలక్షేపముఁ జేయుచుండిరి.

అచ్చట నగరిలో గ్రామాధికారు లరిగినది మొదలు వారి రాకకెదురు చూచుచు వారుగనంబడినంత నుత్సుకతతో మీరు పుట్టములఁ జూచితిరా? ఎట్లున్నవి? ఎన్నినాళ్ళకుఁ బూర్తియగుననిరి? తంతువుల తీరెట్టిది? ఎఱింగింపుడనుటయు వారు రాజునకు నమస్కరించి యిట్లనిరి. ఏలికా! తమయాజ్ఞానుసార మరిగితిమి. మేమరుగునప్పటికిఁ గొందఱు రాట్టంబుల నూలుతీయుచుండిరి. మఱికొందఱు చుట్టుబద్దలకుఁ జుట్టుచుండిరి.

అయ్యారే! ఆనూలువంటి నూలు భూలోకములో నింతకు మున్ను చూచినవారము కాము. దానిమార్దవముఁ జూడ మనుష్యకృతమని యెవ్వరును నమ్మరు. సన్నమును బరీక్షింతుమన్నఁ గాన్పించియుఁ గాన్పింపకుండు. సాపుచూడఁ బోతపోసినట్లున్నది.

అట్టి తంతువులతో నిర్మితమైన పుట్టంబు లెట్లుండునో గదా? అపూర్వ చర్యాభిలాషులగు దేవరవారికిట్టి వింతపుట్టంబు నేయు నేత గాండ్రింగూర్చినవాఁడు భగవంతుండని మేము నమ్ముచుంటి మని మఱియు మఱియు నానూలునుగుఱించి స్తోత్రములు చేయుచు రాజు వలన ననుజ్ఞవడసి వారు నిజవాసంబుల కరిగిరి.

అప్పుడు పెక్కురు వారింజుట్టికొని యాపుట్టముల వృత్తాంత మడుగఁజొచ్చిరి. వారు వారియపూర్వ పటనిర్మాణమునుగుఱించి స్తుతిపూర్వకముగానే వక్కాణించుచుండిరి.

కానీనుఁ డాగ్రామాధికారులవలన విచిత్రవస్త్ర గుణము వినినది మొదలు మఱియు నాతురతఁజెంది యాఉమానము లెప్పుడు వచ్చును. ఎప్పుడా వలువలఁ జాలుతునని మిగుల వేడుకపడుచు మఱి రెండునెలలరిగినపిదప దండనాథునింజీరి సేనానీ! వింతపుట్టములు నేయువారుండు తావు నీవెఱుంగుదువుగదా? అచ్చటికరిగి యావస నంబులనేత యెంతయైనదో తెలిసికొనిరమ్ము. గ్రామాధికారులు చూచి యద్భుతముగా నున్నవని చెప్పిరి. పరీక్షింపుము అని యంపు టయు మహాప్రసాదమని యాదండనాథుఁడు వానింజూడఁ దనకును వేడుక కలుగుటచే నంతోషముతో నప్పుడ యప్పట్టుసాలీలున్న నెలవునకరిగి కావలివానిచేఁ దమరాక వారికెఱింగించెను. వరప్రసా దులు పరిచారకునితో సేనాధిపతిందీసికొని రమ్మని జెప్పి పట్టి మగ్గంబులసాచి నూలు సవరించువారివలెనే నద్దుచు దండముల ధట్టించుచు యవాగూరసమునఁ దడుపుచుఁ బెక్కుతెరంగుల నభిన యింపందొడంగిరి.

ఇంతలో దండనాథుఁడు లోనికిరాగా మంత్రినందనుండెదు రేగి తోడ్తెచ్చి యుచితపీఠికం గూర్చుండంబెట్టి స్వాగతపూర్వకముగా నాగమన కారణముల దెలిసికొని ముందతని చేయింబట్టికొని యా

మగ్గముల దగ్గరకుఁ దీసికొనిపోయి అయ్యా! మగ్గమదిగో చూడుఁడు. రెండుమూడు దినములలో బద్దలం దగిలిచి నేతప్రారంభము చేయుదుము.

ఈవింతనూలు చూచితిరా ? యిదికట్టుచాపునకును యిది తలరుమాలునకును యిదిచీరకునుగా నేర్పరచితిమి. నిదానించి పరీక్షించుఁడు. మార్దవాది గుణంబులు గ్రామాధికారులు చూచినప్పటి కన్న సొంపుగానున్నవి. అప్పుడు సిద్ధమగుచుండుటంబట్టి యిట్టియంద ము తేలలేదు. చేతంబట్టిచూడుఁ డెంతమృదువో యని వట్టి మగ్గమువీఁద జేయినంటించిన నాసేనాని తనకేమియుఁ గాన్పించమి మనంబున దిగులుపడి అయ్యో ! నాతల్లి గ్రామాధికారుల జనని వంటి గుణసంపత్తికలది కాకపోయెనే ? కటకటా ! యట్టికులటకు జనించిన నాపరువేపాటియది. సాటివారిలో మేటియనుకుంటిగాని దీనిమూలముగాఁ దేటయైనది.

ఈగుట్టుబయలు పెట్టినచో చుట్టములుసైతము మొట్ట మొదట చూచినంత గౌరవముగాఁ జూడరు. ఊరక యట్టి యప కీర్తి వెల్లడిచేసికొననేల? చాలునని తలంచి యామగ్గములోఁ గూర్చిన నూలు ముట్టినట్లభినయించుచు నోహో ! యీనూలుమార్దవము మిగుల విన్నాణముగానున్నది! గ్రామాధికారులు దీనిగుణమంతయుఁ జెప్పలేకపోయిరి. ఈనూలు మనుజులు చేతితోఁ జేసినదే ? ఔరా ! యంత్రముననైన నింత వింతగాఁదీయుట దుర్ఘటము. ఇట్టి నూలున నేసిన పుట్టంబులఁ గట్ట మారాజుగా రెంతపుణ్యముఁజేసిరో ? యిట్టి విద్యాపాటవ మభ్యసించిన మీకు భగవంతుఁడు చిరాయువొసంగెడుగాత మని యావలువల శ్లాఘించుచుఁ బ్రియానోన్ముఖుండై యున్న సేనానితో రాముఁడిట్లనియె.

అయ్యా ? మీ యేలికతోఁ జేలంబులనేత మెల్లుండి ప్రారంభింతుమని చెప్పుఁడు. తక్కినగుణంబులు మీరు చూచినవేగదా.

మీకుఁ దోఁచినట్లు వక్కాణింపుఁడని యతని వీథిద్వారముదనుక బొగనంపి క్రమ్మర లోనికరిగి యామర్గంబు లోకమూలఁ బొఱవైచి యథాప్రకారము వినోదములతోఁ బ్రొద్దుపుచ్చుచుండిరి.

లోన రవులుచున్న మాతృదోషవిచారపరితాపము మొగము నందోపనీయక దండనాథుఁడు సంతసించువానివలెనే రాజునగరి కరిగి తనరాక కెదురుచూచు నృపతికి మ్రొక్కి యావసనంబులగురించి గ్రామాధికారులకన్న నధికముగా స్తుతిజేయుచుఁజెప్పి తదనుమతి నింటికరిగి యాచింత స్వాంతమునఁ దగిలి చివుకుచుండెను.

ఆభూపతి సేనాపతిమాటలు వినినదిమొదలు రెట్టించిన వేడుకతో నెట్లో యొకనెలగడిపి యొకనాఁడు మంత్రింజీరి దుష్బుద్ధీ! యీపాటికి మనపుట్టముల నేత పూర్తియగునుఁ నేతరీతి యెటులున్నదో నీవే వెళ్ళి స్వయముగా చూచివచ్చి నాతోఁ జెప్పుము. ఇతరులు చెప్పినచో నాకు నమ్మకముండదు. పూర్తిగానేత కాకున్నను వస్త్రముల సిగ్గు తేలును. వేగఁబోయిరమ్మని చెప్పుటయు రాజునాజ్ఞ శిరంబునంబూని మంత్రియు 'నుచితపరివారములతో వరప్రసాదు లున్న గృహములకడ కరిగెను. ద్వారపాలకునిచే నతనిరాకవిని యాకుమారులు నేయు సామగ్రి దూలమునకు వ్రేలాడఁగట్టి గోతిలోఁగూర్చుండి యిటునటు వట్టికండెల విసరుచు వేమాదండంబున ధట్టించుచు బట్టలు నేయువారివలె నభినయించుచుండిరి.

ఇంతలోఁ బ్రధాని లోపలకువచ్చినంత రాముఁడెదుర్కొని వినయమభినయించి గద్దియం గూరుచుండఁబెట్టి యాగమనకారణం బడిగి తెలిసికొని నేతగాం(డున్న తావునకుఁ దీసికొనిపోయి యార్యా! సగము నేతయైనది. చూడుఁడు! ఇంక నొక్కమాసములోఁ బూర్తి యగును. దండనాథుఁడు నూలుచూచినవాఁడుకాని నేతచూడలేదు. తమరు నేత చిత్తగింపుఁడు. తంతువుల మార్దవాదిగుణంబు లిదివరకే

వినియుందురుగదా ? దానియథార్థము తమరుగూడఁ బరీక్షింపుఁడు. అంచుమేల్కట్టు విమర్శింపుఁడు. అని చుట్టినదండ మూరకవిప్పినట్టు విప్పి చూపించుటయు దానఁగాని ముగ్గమున గాని తన కేమియు గాన్పింపకున్న తెరంగునకు నంతరంగమున వ్యాకులపడి వానిమాట లేమియుఁ బాటింపక అతండిట్లు చింతించెను. అక్కటా ! గ్రామాధి కారులకు సేనానాయకునకుఁ గాన్పించిన నూలు నా కేమిటికిఁ గాన్పిం చదు. నాతల్లి జారిణియై సతీతిలకమని వాడుక చెందినది యెటో తెలియదు. ఆఁడువాండ్ర సుగుణములన్నియు నిట్టే కపటభూయిష్ట ములై యుండును. స్త్రీలలో పతివ్రతలు లేరని రూఢిగాఁ జెప్పఁ గలను. పైకి మహాగుణమణులుగాఁ గాన్పించుచుఁ జాటున ననేక దుష్కృత్యములు చేయుచుందురు. శ్లో॥ "స్త్రీణాంచచిత్తం పురుష స్యభాగం దేవోనజానాతి కుతోమనుష్యః" అనునట్లు స్త్రీలచిత్తము భగవంతుఁడే యెఱుఁగఁడఁట. మనుష్యున కెట్లు గోచరమగును. మంత్రినని పెద్దపేరు పెట్టుకొని గౌరవముగా సంచరించు నాగుట్టు బయలైనచో నన్నెవ్వరు మన్నింతురు ? రాజుసైతము నాపుట్టుక గురించి పరిహాసము సేయకమానునా ? ఈరహస్యము గోప్యము గానేయుంచి కాన్పించినట్లభినయించినచో నేకొరంతయుఁ గలుగ కుండునని నిశ్చయించి చింతవిడిచి యల్లన రామునితో నిట్లనియె.

కువిందాగ్రేసరా! నేననేకవస్త్రంబులు చూచితినిగాని యింత వింతయైన నూలును మృదువైన పుట్టములును నెచ్చటను జూచియుం డలేదు. గ్రామాధికారులు సేనానాయకుఁడు నుడివినదానికన్న సొగసుగా నున్నవి. మారాజేఁడు చాలవేడుక పడుచున్నాఁడు. వేగఁ బూర్తిచేయుఁడు. మీకు బహుమతి నిప్పింతునని పలికి యతఁడు వెడలుతరి రాముండార్యా ! అన్నిటికిని తమదేసుఁడి బాధ్యత. మా కేమి పారితోషిక మిప్పింతురో ! కటాక్షముంచుఁడని మిగుల

వేడుకొనువానివలె నభినయించుచు మంత్రిని సాగనంపి యతని యవివేకమునకు నవ్వుకొనుచు నట్టిపనులుమాని తమకుత్సాహమైన వ్యాపారములతోఁ గాలక్షేపముచేయఁ దొడంగిరి.

పిమ్మట మంత్రియు రాజసముఖమున కరిగి రేనికిమ్రొక్కి దేవతావస్త్రంబుల మహిమనంతయు గ్రామాధికారులును దండనాధుఁడును జేసినవర్ణనకన్న నూరుమడుంగు లధికముగావర్ణించెను. అప్పుడుకానీనుఁ డావస్త్రంబులుధరించు భాగ్యమెప్పుడబ్బునని గడియలు లెక్కపెట్టుచు నిమిషము యుగమువలె నానెల వెళ్ళించెను.

ఇంతలో వారుచెప్పిన యారునూసములు బూర్తియైనవి. ఒకనాఁడు రాముఁడు ఉచితవేషముతో రాజసభకుఁబోయి సన్మానము లంది రాజునకు మ్రొక్కినట్లు సభాసదులకు నమస్కరించుచు నిట్లనియె.

దేవా ! దేవతావస్త్రములు సిద్ధమైనవి. వానిగుణంబు లిదివరకే మీరు వినియుందురుగదా. మరియు వానిధరించు పద్ధతి మొనటనే మేము వక్కాణించితిమి. నేఁడు మంగళదివసము. ఊరేగి వచ్చి పుట్టంబులు దాల్చుఁడని చెప్పెను.

అప్పుడా రేఁడు అపరమితసంతోషము జెందుచు కువిందా ! మీరిట్టివిద్యాపాటవ మెచ్చట నేర్చుకొంటిరి ? ప్రధానప్రముఖులు మీరు నేయుచున్న వస్త్రంబులు కడువిస్మయము గొలుపుచున్నవని స్తుతిజేసిరి. అందులకే వీనిదేవతావస్త్రములని చెప్పుటకుఁ గారణమైనది. మీదేశపురేఁడు వీనిని ధరించునాఁడు ఏమిచేయువాఁడో యెఱింగింపుఁడు. మేమునట్లువచ్చి యవ్వాలువల ధరింతుమని యున్మత్తుండు ప్రేలె నడిగిన మాటయే యడుగుచుఁ జెప్పినమాటయే చెప్పుచు హృదయంబునఁగల సంతోషము వెల్లడింపుచుండెను.

అప్పుడు రాముఁడు దేవా ! దేవతావస్త్రములనేత మేము బహువర్షంబులు తపముజేసి నేర్చుకొంటిమి. దివ్యప్రభావ సంపన్న

ములగు నీవస్త్రంబులు ధరించునాఁడు మా రేఁడు దివ్యోత్సవములతో భద్రగజముపై భార్యతో నెక్కి యూరేఁగివచ్చి బ్రాహ్మణులకు షోడశమహాదానములు గావింపుచు మాబసకువచ్చి మావలన నాపుట్టములందు కొని మాకుగానుకలిచ్చి యాపుట్టంబులఁదాల్చి వెండియు వేదండమెక్కి యూరేగి యింటికరుగుదురు. ఇవి దేవతా వస్త్రంబులు గావున స్త్రీలకు నాఁడు పురుషదర్శనము దూష్యము గాదు. మాయేలికకన్న దేవరవారు నూతనమార్గనిర్ణేతలు గావున నీవిభవమధికముగాఁ గావింపఁదగునని చెప్పి యతండాయెకిమీని యనుమతివడసి యింటికింబోయెను.

ఆ నరనాథుండును రాముని మాటలకునుబ్బియప్పుడ గ్రామ మంతయు నలంకరింపుమని చాటంబంచి పట్టణప్రజలెల్లరు నూరేగు నప్పుడు తనతో నుండునట్లు నియమించి మంత్రిసామంతహిత పురో హితాదివర్గము సేవింప శుభముహూర్తమున భద్రగజముపై నెక్కి తూర్యనాదములు భూనభోంతరాళమునిండ మెండువైభవముతో నూరేగి యాకపటకువిందులున్న మందిరద్వారము జేరెను.

అప్పుడు వరప్రసాదులువచ్చి ప్రధానవర్గముతో రాజదంప తుల లోపలకుఁ దీసికొనిపోయి యుచితాసనములఁ గూర్చుండఁజేసి పెక్కుస్తోత్రములు గావింపుచు నెదురు నిలువంబడిరి. అప్పుడా యొడయఁడు తాను తెచ్చిన మణిభూషాంబరములతో వారికీయవలసిన విత్తమంతయు బంగారుపళ్ళెరముతో వారికందిచ్చి యత్యుత్సాహ ముతో దేవతావస్త్రము లెందున్నవని యడిగెను.

అప్పుడు రాముఁడు సంజ్ఞజేసినంత వసంతుఁ డొకపళ్ళెరము ప్రవరుఁడొకపళ్ళెరము దండుఁడొకపళ్ళెరముదెచ్చి రాజుముందిడి యివిగో దేవతావస్త్రములు చూడుఁడని పలికిరి.

ఆపశ్చైరములఁ దన కేమియుఁ గనంబడమి డెందం బాందోళన మంద నేమియుందోఁచక మేనంజమ్మటలుగ్రమ్మ దుఃఖావేశముతో నిట్లు తలంచెను.

అయ్యో! యిట్టి వింతపుట్టంబులఁ జూచుభాగ్యము నాకుఁ బట్టినది కాదు. మొదటనే నేనిట్టికొలటీయుఁడని తెలిసినచో నిట్టిపనికిఁ బూనికొనక పోవుదునుగదా? మోసపోయితిని; పదుగురిలో నవమానితుఁడఁగాకుందునా? ఛీ! ఛీ! నాయట్టిమండలాధిపతిం గనినయాఁడుది స్వైరిణియయ్యెనా? ఏడంతఃపురములలో దాచిపెట్టినను రాజస్త్రీలు చెడుకార్యము లాచరింతురని వాడుకయున్నది. ఆమాటయేల తప్పెడిని. అన్నన్నా! గ్రామాధికారులు దండనాథుఁడు ప్రధానియు నీ చిత్రపటంబులఁ గన్నులారఁ జూచితిమని చెప్పిరి. వారితల్లులకుఁగల నియమము నాతల్లికిలేకపోయినది. అక్కటా! యిప్పుడక్కపటాత్మురాలు బ్రతికియుండినఁ బొట్టచీల్చి చంపకపోవుదునా? యిప్పుడీయదృశ్యవస్త్రంబులఁ గట్టుకొట్టోకోయని చింతాకుల స్వాంతుఁడైయున్న యన్నరనాథునకుఁ రాముం డిట్లనియె.

దేవా! యేమియుంబలుక కూరకుంటి రేల? పుట్టంబులుగాన్పింపలేదా? లేక సొంపుగానున్నవికావా? గుణదోషనిరూపణము చేయుఁడు. తమరు ధరించువలువ లివియే ఎంతమృదువుగా నున్నవియో ముట్టిచూడుఁడు. అనుటయు రాజు తొందరపడి కాన్పింపలేదనఁబోయి యంతలో సవరించికొని యిట్టులన్నచోఁ దనగుట్టు బయలగుటయేగాక ఫలమేమియు లేదని నిశ్చయించి నేనూరక యున్నందులకుఁ గారణము మఱేమియు లేదు బట్టలు గనంబడుచున్నవి. వీనిం జూచినతోడనే నాకొక్కవిచారము గలిగినది. వినుండు. ఇట్టివింతవస్త్రంబులు దాల్చి మాతల్లికి మ్రొక్కు భాగ్యము లేకపోయెఁగదా యని యామె గుఱించి చింతించుచుంటినని యుత్తరము చెప్పిన రాముఁ డిట్లనియె.

దేవా ! దేవరయిట్టి యుత్సాహసమయంబున నమ్మగారి గురించి చింతింపం బనిలేదు. ఆమె కడునిల్లాలని తమ కీదేవతావస్త్రములు గనంబడుచుండుటంజేసి తెల్లమగుచున్నది. వస్త్రములవిషయమేమైన సంకోచమున్నచో వక్కాణింపుండు. మేము చెప్పినంత యొప్పుగా నున్నవియో లేదో పరిశీలింపుండని వట్టిపళ్ళెరములోఁ జేయిబెట్టి యిటునటుఁదిరుగవేయుచు మీఁదునకెత్తి చూపించుటయు నాపుడమిరేఁడు వచ్చియు రాని స్వరముతో నోహో నాయదృష్టమేమి? యిట్టి యపురూపపు పుట్టంబులఁ గట్టుభాగ్యముఁగలిగినది. అమాత్యశేఖరా! యీచిత్రపుటంబులయందు చెంతవింతగా నున్నవియో చూచితివా ? ఇట్ట మృదువు భూలోకములో లేదుసుమీ ! నడుమనడుమ జరీపూవులు మెరయుచున్నవి. అయ్యారే! దుర్బుద్ధీ ? ఇవి నీకెట్లు కనబడుచున్నవో చెప్పుము. నీవు మొదటఁ జూచినప్పుడు వీనికీ సుందరసాంద్రత్వములేదని దలంచెదను. ఇప్పటికినప్పటికి భేదమేమైననున్నదియా? యని సందియంబుదీర వెండియునడిగిన నామంత్రియు వచ్చియురాని స్వరముతో నిట్లనియె.

దేవా! దేనికైనను మెఱుఁగుబెట్టినప్పుడుగల తళుకు రచించునప్పుడు గలుగునా! నేను మొదటఁ జూచినప్పటికన్న నిప్పుడీవస్త్రంబులు మిక్కిలి మనోహరములుగా నున్నయవి. ఈసాంద్రత్వము, ఈధావళ్యము అప్పుడింతవిన్నాణముగా లేదు. దేవరయనినట్లీయంచు మిక్కిలిచక్కగా నున్నయది. కాబట్టియే వీనికి దేవతావస్త్రములని పేరు వచ్చినది. వీని నమానుషములనుట కేమియు సందేహములేదు. అపూర్వక్రియాకరణదక్షులైయున్న దేవరకివి తగియున్నవని యతండు మిక్కిలి స్తోత్రములు గావించెను. తరువాత నానృపతి సభ్యులఁ జూచి యివియెట్లున్నవని యడిగినవారును దమకందేమియుఁ గనంబడకున్నను నదిమాతృదోషముగాఁ దలంచి కనంబడినట్లే యభినయించుచు వానినెక్కుడుగా వినుతించిరి.

పిమ్మట రాజు భార్యతో, బోటీ! నీవు వీనింజూచితివా? యెట్లు కనంబడుచున్నవో చెప్పుము. వీండ్రు మొదట మనతోఁ జెప్పినంత సొగసుగానున్నవియా యనియడిగిన నచ్చేడియ పరిశీలించు నట్లభినయించుచు నాత్మగతంబున, అయ్యో! నాతల్లి యెంత దుష్టురాలో కదా! వీండ్రందఱికిఁ గనంబడిన వస్త్రములు నాకేమిటికిఁ గనంబడవు? ఆమె కట్టి చెడువాడుక యున్నట్లెప్పుడు వినియుండ లేదే! అయినను నాఁడు వాండ్రుకూఁతురులుగదా! అన్నన్నా! యింద రిలో నేనొక్కరితనే జారిణీపుత్రికనైతిని. అందఱు కనంబడుచున్న వనియే చెప్పుచున్నారు. ఇప్పుడు నేనుమాత్రము నిజముచెప్పి నాతల్లిందిట్టింపనేల? కనంబడుచున్నవనియే బొంకెదను. అని తలంచుచు నారాజపత్ని ధాత్రీశా! రాత్రింబగలుగా మార్చిన మీపరిభావమే తాదృశంబే! యిట్టిపుట్టంబులంగట్టమీకుకాక యొరు లకు శక్యమా? వీనిని దేవతావస్త్రములని చెప్పవచ్చునని పలికి యూరకున్నది.

ఇట్లుకొంతసేపు వాండ్రందఱు వస్త్రపరిభావంబు నగ్గించిన పిమ్మట రాముఁడు మొదట నియమించినప్రకారము వానిగైకొని కుచ్చిళ్ళుపెట్టు నట్లభినయించుచు రాజుగారిని నిలువఁబెట్టి కట్టుకొని యున్న వసనము విడదీసి యామాయావస్త్రము కట్టువానివలె చుట్టఁ బెట్టుటయు దిగంబరుఁడై యుండ నెల్లరుచూచుచుండియు మాతృదోష మునంజేసి తనకొకనికే యట్లగుపడుచున్నదని ప్రతిమనుజుఁడు నను కొనెనుగాని యూరహస్య మొక్కనితోనైననుఁ జెప్పినవాఁడు లేడు.

భూపతియుఁ దనదిగంబరత్వము నాత్మదోషమునంబట్టి తన కొక్కనికే కాన్పించుచున్నదనుకొనెనుగాని యెల్లరకు వెల్లడియగు చున్నదని తెలిసికొనినచో మిగుల సిగ్గుపడవలసివచ్చును. అట్లు తలంచియుఁ గొంతలజ్జ మనంబునఁ బెనగొనుటయుఁ బూర్ణముగాఁ

దలమెత్తలేక యిటు నటు చూడఁదొడఁగెను. పిమ్మట నంతకుమున్న నిరూపించియున్న యొకకాంతను రాజుభార్యకుఁజీరఁగట్ట నియమించు టయు నాబోఁటియు రాజవధూటిం జాటునకుఁ గొనిపోయి మాయా పాటవంబు దేటపడ మున్నుధరించియున్న కోకవిడలాగి వరప్రసా దులఁ జేసినదానిం గట్టుదానివలె నాలుగైదు సాగులు పైకినిఁ గ్రింది కిని ద్రిప్పి దిగంబరగానే సభకు దోడ్కొని వచ్చినం జూచినవారెల్ల మనుగల్గిన యనుమానముతోనే విరక్తులై యుండిరి.

నృపతియుఁ దనభార్యదిగంబరత్వము తనకొక్కనికే తేట యగుచున్నదని సమాధానపడి యూరకుండెను.

ఆమెయు నట్టేయెంచి తలవంచి పలువిధముల జింతించుచుం డెను. పిమ్మట నూరేగింపునకై యాదంపతు లలంకరించిన పట్టపు దంతినెక్కి చుట్టును సకలపరివారములు సేవింపఁ దూర్యనాదంబులు రోధోంతరాళంబునిండ మెండువై భవంబున నూరేగుచుండఁ బౌర కాంతలావింతఁజూచుటకై యత్యాతురముతో సౌధోపరిభాగంబుల గవాక్షంబుల దలుపు దెరచిచూచుటయు దిగంబరులై యున్న యాదంపతుల తెరంగున కంతరంగంబుల వేతెరంగులఁ బరితపించి సిగ్గున గవాటంబులు మూసుకొనిరి.

ఇట్లు విధిలేక యారాజు గొంతసేపూరేగి యంతటితో చాలించి యెల్లవారిని వారివారి నివాసంబులకనిపి భార్యతో నంతఃపురంబున కరిగి కేళీతల్పంబునఁ గూర్చుండి మెల్లన నిట్లనియె.

కాంతామణీ! నేనింతదనుక గుట్టుబట్టితినిగాని యికనావనోప వినుము నాకన్నులకు నీవు గట్టుకొనిన చీరగాని నేధరించిన వలువగాని గాన్పింపలేదు. నాయపకీర్తి వెల్లడియగునని యట్లంటిగాని యదియథా ర్థముగాదు. నీవును చీరసొగసుగానున్నదని పొగడితివిగదా! నీకు యథార్థముగా నది గనిపించినదా? మనయిరువురనడుమ మరుగులేదు గదా యని యడుగుటయు నప్పడతియుగుట్టువిడచి మగనితోనిట్లనియె.

నాథా! మీరును, మంత్రియు మఱియుఁ జేనున్నవారును నేసిన వసనంబులంజూచి మిగుల స్తుతిచేయఁదొడంగిరి. నాకాపస్త్రైరమం దేమియు గాన్పించకున్నను మీకుగోచరమైన తెరంగుతిలకించి నా మాతయందుఁబాతకం బారోపించి యాగుట్టువెల్లడిజేయక యట్లంటి గాని మీరును నేనును దిగంబరులమై యున్నట్లేనాకుఁ గాన్పించినది. ఇదియ యథార్థము. అని యామె పలికినతోడ నేయాతేనికిలజ్జాక్రోధ మ్ములు మనంబుననొక్కసారి యావిర్భవింప నప్పుడే వేరొక వలువం ధరించి యమాత్యుని రప్పించి యతనితో నిట్లనియె.

మంత్రీ! యాపట్టుసాలీలు పన్నినపంతంబు జూడఁగడుఁగ పటముగాఁదోఁచుచున్నయది. నీవు రెండు తేపలావలువలఁ బరీక్షించి తివిగదా? నిజముగా నీకవిగాన్పించినవేమోచెప్పుము! భయపడ కుము. మాకేమియు నందుగాన్పింపలేదని తమస్థితిని జెప్పినతోడనే మంత్రియు నయ్యా! తమరిట్లడిగినపుడు నిక్కముదాచ రాదు. గ్రామాధి కారులు సేనాపతియుఁ దమకుగాన్పించెనని చెప్పినవిషయముల మనంబునఁదిలకించి యందేమియు నాకుఁగాన్పించకున్నను దత్ప్ర భావంబున నట్లయ్యెనని మాతృదోషము స్థిరపరచి మొదట నట్లంటిని తరువాత దేవరవారే కనఁబడినవనిబొగడిన నేనునుబొగడితి. నాకంటి కేమియుఁ గానబడలేదిదియ యథార్థము. పరువులోపమగునని బొం కిన తప్పుసైరింపుడని వేడికొనియెను. అప్పుడారాజు తలఁ గంపించుచు నప్పుడు సేనాపతిని గ్రామాధికారులను మరియుం దనతోఁబట్టుసాలీల లోగిలిలోనికివచ్చిన పెద్దమనుష్యులనుఁ బెక్కండ్రఁబిలిపించి యా బట్టలవిషయమై మంత్రినడిగినట్లు వారినడుగుటయు వారును నట్లె యుత్తరముజెప్పిరి. అప్పుడప్పతి ముప్పిరిగొను కోపంబున నాకపటవు పట్టుసాలీలఁ బట్టితెండని యమదూతలంబోని కింకరులం బనిచి తానును భార్యయు వస్త్రహీనులై యారేగిన తెరంగంతరంగంబునఁ దిలకించియగ్గలమగుసిగ్గునఁదలవాల్చిపెక్కుగతులఁజింతించుచుండెను.

రాజభటు లతిజవంబున నా కపట కువిందులున్న మందిరంబున కరిగి యందుసందడి యేమియు లేమింజేసి సందియమందుచు లోనికిఁ బోయి చూడ నెవ్వరునుగాన్పించ లేదు. మఱియు నాశూన్యగృహము నలుమూలలు వెదుకఁగా నొకచో నొకపత్రిక దొరకినది. దానిం గైకొని వాండ్రు వెండియు నన్నరపతియొద్దకుంజని యతనితో నిట్లనిరి.

దేవా! సంతతము నపూర్వవస్త్రదర్శనోత్సుకులగు పౌరుల కోలాహలముచే నాక్రాంతమై యుండు నాభవనమిప్పుడు శూన్యమై యున్నది. అందెవ్వరును లేరు. వారిసామానుసైత మేమియుఁ గాన్పింప లేదు. ఆమాయావు లెచ్చటికో పారిపోయిరని తలంతుము. వెతక వెదక నొక మూల నీపత్రిక గనంబడినది. ఇది వాండ్రు వ్రాసినట్లే యున్నది. చూడుండని పలుకుటయు విస్మయమందుచు మంత్రి దానిం గైకొని యెల్లరు విన నిట్లు చదివెను.

"మహారాజశ్రీ యపూర్వదుర్మార్గ చర్యాభిలాషులైన
కానీన మహారాజుగారికి

కపటపు పట్టుసాలీలు వ్రాసిన యాజ్ఞ యేమనగా—

నీవు లోకవిరుద్ధమగు మార్పులఁజేసి ప్రజలఁ బెక్కు తెరంగుల బాధించుచుంటివిగాన నిన్ను వంచించియది మాన్పించుటకై యింద్రు నిచేఁ బంపఁబడినదూతలమైన మేము నీకిట్టి యవమానముగలుగఁజేసి యదృశ్యులమైతిమి. ఇటమీఁదనైన బుద్ధిగలిగి యట్టివిపరీతపుశాసనము మార్పు చేసికొని సుబుద్ధికిమరల మంత్రిత్వమిచ్చి న్యాయంబుగ రాజ్యమేలుము. లేకున్న మాయాజ్ఞ తిరస్కరించినట్లు భావించి నిన్నుఁ బెక్కు చిక్కులంబెట్టి రాజ్యభ్రష్టునిం జేయుదు మిదియ మమ్మాటికిని యాజ్ఞ."

దేవదూతల చేవ్రాలు.

అనిచదివిన రాజు మిగుల భయపడి యోహో! మనమార్పు ఇంద్రునికి సైతము విరోధముగా నున్నది కాఁబోలు! త్రిలోకాధి

పతియగు సురపతితో ద్వేషము బూని యెవ్వఁడు రాజ్యము చేయ గలఁడు? ఇఁకఁజాలు నతనియాజ్ఞ శిరంబునం బూనఁదగినదే. కనుక యిప్పుడ రాత్రిరాత్రిగాఁ బగలు పగలుగానెంచి వ్యాపారములు జేయఁబ్రజల కాజ్ఞాపత్రికలు వ్రాయుఁడని మంత్రికాజ్ఞాపించి యప్పుడ సుబుద్ధిని బిలువనంపి యతని యిష్టానుసారముగా మును పోలె రాజ్యం బేలుచు సుఖంబుండెను.

అనియెఱిఁగించి మణిసిద్ధుఁడు గోపాలా! యిప్పుడు చల్లబడినది. నడువవలసిన సమయ మయినది. కనుక కావడి యెత్తుము. తదనంతర కథావృత్తాంతము పెద్దదిగ నున్నది. ఇప్పుడు తేలదు రాత్రి మజిలీలోఁ బూర్తిగాఁ జెప్పెద ననుటయు నక్కథా శేషము విను టకు మిగులఁ దొందరగలవాఁడై వాఁడు లేచి కావడి యెత్తుకొని నడువసాగెను. యతీంద్రుండును మౌనంబవలంబించి ప్రణవాక్షర జపముఁజేసికొనుచు విశ్వేశ్వరాయత్తచిత్తుండై నడువఁ దొడంగెను. అట్లు వారతిజవంబున నడుచుచు సాయంకాలపు మజలీచేరిరి. అం దొకసత్రంబున బసజేసి భోజనాది సాయంకాల కృత్యములు నిర్వర్తించిన పిమ్మట నమ్మణిసిద్ధుఁడొక పరిశుద్ధ ప్రదేశంబునం గూర్చుండి శ్రద్ధాళుండై యున్న శిష్యునకుఁ దరువాయి కథ చెప్పందొడంగెను.

# రెండవమజిలీకథ.



వినుమట్లు మాయావస్త్రములు ధరించి రాజుగారూరేగింపున కఱిగిన వెనుక వరప్రసాదులట్టి చీఁటినివ్రాసి గోడకంటించి తమ సామగ్రి గుఱ్ఱంబులపై సద్దుకొని యయ్యుత్తమాశ్వములెక్కి యొరు లెరుఁగకుండ నుత్తరమార్గంబునంబడి మునుపోలె నతిజవంబునం

బోయిరి. అమ్మార్గంబునఁ గడునడవి బలసియుండుటచే నరుగ సంకట మైయున్నను వెరువక వారు వారువముల నేకరీతి నడిపించుచు నడ్డముగ వచ్చిన క్రూరసత్వంబులఁ బరిమార్చుచు ఫలాహారములచే నాకలి యడంచుకొని మూఁడుదినము లేకరీతి నడిచిరి కాని తెరపి కాన్పించి నది కాదు.

మూఁడవనాఁడు మధ్యాహ్నంబున వారు పిపాసావివశులై యరుగుచుండ దైవవశంబున నొకచో మధుర సలిలవిలసితమగు సరోవరము తీరంబున శాఖాంతకర్షిత దిగంతమగు వటవృక్ష మొండు నేత్రపర్వముగావించినది.

దానింజూచి మిగులసంతసించుచు నాపురుషశ్రేష్ఠులందొకచో గుఱ్ఱములదిగి మార్గాయాసంబు వాయ నత్తటాకంబున జలకేళిం దేలి యందు వంటజేసికొని భుజించిన వెనుక శీతలసాంద్రచ్ఛాయాభి రామంబగు తత్ప్రదేశంబునఁ దత్సరోవర కమలముకుళ సౌరభ చోర కంబులగు మలయానిలకిశోరంబులు మార్గశ్రమంబపనయింపహాయిగ నిద్రించి కొండొక వడికి మేల్కాని యల్లన నాపాదపోచ్ఛ్రాయంబుదిల కించుచు నాలుగుదిశలను వ్యాపించియున్న శాఖలు నాల్గింటికి నవసా నము గాన్పింపమి మిగుల వెరఁగందుచు ఆహా! యీవటవృక్షమెంత వింతగా నున్నదో చూచితిరా? ఇందు మన మెన్నఁడునుజూడని విచి త్రపుపక్షులెన్నియో కులాయంబుల నిర్మించుకొని హాయిగా విహరిం చుచున్నవి. మఱియు నుక్కుకంబముల వంటి యూడలచే భరింప బడి నలుదిక్కుల కొనసాగరయుతలంపునబోలె వ్యాపించియున్న యున్నగశాఖలంబడి శృంగాటకంబునఁబలె నిరాటంకంబుగా శకటం బులు సైతము బోవచ్చునుగదా! అని పెక్కుతెరఁగుల నా మాత్రిసు సోయగము వర్ణించుచుండ రాముఁడొక యుత్సాహంబు మనంబునం దీపింపవారితో నిట్లనియె.

తమ్ములారా! ఈకొమ్మల పొడవెంతయున్నదో చూతమే! యనుటయు వారు వల్లెయని పిమ్మట వెండియు నతండట్లయిన నెల్లర మొక్కొక్కశాఖం బరీక్షించినచోం బెక్కుదినములు పట్టును.

సాంబుఁడు తక్కఁ దక్కిన నలువురము నాలుగుకొమ్మల వెంబడిపోయి యాదెసనున్న విశేషంబులం దెలిసికొనివత్తము. అప్పయనంబున కాలుమానములు గను వేర్పరచుకొని యెదము ఏపాటి వింతలు గాన్పించినను నమ్మితి దాటింపక మరల తరువు మొదలు చేరవలయు. అందరును జేరుదనుకఁ దక్కినవారీప్రదేశముననుండఁ దగినది. ఇదియ మున్మాటికిని ప్రమాణమని యొకరిచేతిలోనొకరు చేయివైచుకొని తురంగములను వస్తువులనుం గాచుటకై సాంబుని నాతరుమూలంబున నుండ నియమించి తూర్పుదెసకు వసంతుఁడును దక్షిణమునకు రాముఁడును బశ్చిమమునకుం బ్రవరుఁడును నుత్తర దిశకు దండుఁడును నాకొమ్మలెక్కిపోయిరి.

---

# వసంతునికథ.

అందు రాజకుమారుండు తూర్పుదెస కఱిగిన కొమ్మమీఁద భూమి మీఁదవలె రెండహోరాత్రంబులు నడిచెను. పిమ్మట నిలువంబడి నడుచుటకు వీలులేక చేతులంగూడ మోపుచు నాలుగుదినములు నడిచెను. పిమ్మట రెండునాళ్లు లంతకన్న సన్నమగుట మఱియు బ్రాకినడువవలసివచ్చినది. ఇట్లు ఎనిమిది దివసములు నడచునంత నాకొమ్మయవసానము గాన్పించినది. ఆచివర నిలువంబడి చూచిన నొకవింత గనంబడెను. మొదటం బ్రళయకాల వాతూలసమాలోల కాల జీమూతమాలికవలె నలుదెసలం గ్రమ్ము ధూమమ్మును అంతలో నాధూమస్తోమం బదృశ్యమై తదంతరమునుండి ప్రచండమధ్యందిన

మార్తాండ కిరణప్రకాండ సముద్దీపిత వీతిహోత్ర ప్రజ్వలజ్జ్వాలా మాలికల పోలికను నాలుకలఁదెరచికొని దెసలావరించు పెనుతేజం బును అదియుఁ జూడఁజూడ నగోచరంబై విద్యుత్ప్రభావిభాసురా భ్రంలిహాగ్రంబులగు కార్తస్వరమయ సౌధచయంబులునుఁ గాన్పించినవి.

అప్పుడు వెరఁగుపడి యతండోహో! ఇదియొక పట్టణముఁవలె నున్నది. మొదట గనిపించిన వికారములన్నియు నేతన్నగర ప్రభావ టలంబులే! మేలు మేలు! నాకింకను మొదలు చేరుటకు జాల గడువుగలదు కావున నింతలో నీపురవిశేషంబు లరసివచ్చెదఁగాక యని నిశ్చయించి యల్లనసాశాఖాగ్రంబునుండి పుడమికిదిగి ధైర్య సాహసంబులే తనకు దోడులై యుండ నాపట్టణమున కరిగెను.

అందొక మానవుఁడుగాని జంతువుగాని పక్షిగాని కనంబడ లేదు సాహసముతోఁ బురము ప్రవేశించి యాసౌధంబుల తలుపు లన్నియు ముద్రానిగళఘటితములై యుండుటంజూచి యెన్నఁడును జనసంచారము లేనట్లు తోచినతోడనే యతండు ఔరా! ఇది మునుపుచూచిన కానీనుని నగరముకన్న చిత్రముగా నున్నదే. అతనికన్న బుద్ధిమంతుఁ డీపురమేలుచున్నవాఁడు గాఁబోలు నిదియుం జూచెదంగాక యని యప్పురవీధులంబడి నడువసాగెను. అందలి గృహములన్నియు నేకరీతిగా నుండుటం బట్టి తిరిగినవీధినే తిరుగుచుఁ జూచినగృహమే చూచుచు ననేకవిధంబులఁ బరిభ్రమించి పెక్కు తడవా వీటి మేటి వీధులన్నియుఁ దిరిగెను. వచ్చిన వీధియుం బోయిన వీధియుఁ దెలిసినదికాదు.

అట్లు తిరుగుచుండఁ గొండొకవడికి క్రొత్తవీధి యొకటి కనం బడినది. దీనివెంబడిబోయి యెవ్వరునుఁ గనఁబడకపోయినచో మగిడి చనియెదంగాకయని నిశ్చయించి యావీధింబడిపోవుటయు నందుగూడ

మనుష్యులెవ్వరును గనఁబడలేదు. అంతకుమున్నుచూడని గొప్ప కోట యొకటి గాన్పించినది.

దానింజూచినతోడనే యతని కెడద నొకవిధమగు వేడుక బొడముటయు నిందుఁదప్పక జనులుందురని తలంచి యక్కోటగుమ్మ మరయు తలంపునముమ్మారు దానిచుట్టు దిరిగెను.ఎందును ద్వారము గాన్పించినదికాదు.

దానికతం డొక్కింత చింతించి యిట్టి కోటలోపలకు మార్గముండక పోవునా? యెద్దియేని గుప్తముగా నుండవచ్చు నమ్మఱుఁగు తెరవరసెదంగాకయని మఱియు మఱియును కోటచుట్టును దిరుగుచు నేలనెరియలంబరిశీలించుచుండ నొకదండ నొకగొణ్ణెము గనంబడుటయు దానింబట్టుకొని పైకిలాగినతోడనే యొకగుమ్మము తెరవఁబడినది. అది గుహలాగుననున్నను నదియే కోటలోనికి మార్గముగా వచ్చునని నిశ్చయించి ధైర్యంబున నందుఁజొచ్చెను. చీఁకటిచే కొంతదనుక నతనికేమియుఁ గాన్పించినదికాదు. నడుపనడుమ మఱల వెల్తురు గానంబడ దొడంగిన సంతసించి యతండు చివర కామార్గముననే కోటలోఁ బ్రవేశించెను.

అయోమయం బగు నక్కవాటం బతండు గోటలోఁ బ్రవేశించిన వెంటనే యెప్పటియట్ల మూసికొనిపోయినది. కోటలోఁ బ్రవేశించిన యతనికి మొదట నెవ్వరును గాన్పించలేదు. ఒక యుద్యానవనము గానంబడినది.

అదియు మధురఫలరసాస్వాదన రతమదశుకపిక ప్రముఖ శకుంతసంతాన స్వానగాన లసమానంబులగు పాదపకాయమానంబుల నల్లిబిల్లిగ నల్లుకొనువల్లరీ సల్లలిత లతా వితానంబులకుఁ జోద్రులగు వేదులఁ జలయంత్రవర్ధిత ద్రుమ కమనీయదళకిసలయ ప్రసూన రసపానలోల రోలంబకదంబ ఝుంకార ముఖరితంబై

యుంటఁదిలకించి జనసంచారంబులేక యిట్టిమనోహరోద్యానవనం బుండనేరదని నిశ్చయించి యందువిసరు శీతలమందమారుతముల మార్గాయాసమువాయ నల్లన నత్తోటందాటి మఱియుం గొన్ని వాకిళ్ళుగడిచి విచిత్రవస్తు నిస్తులాలంకృతంబులగు ననేక భవనంబు లఁగాంచియు మునుపొంటెనందెవ్వరింగానక విభ్రాంతస్వాంతుండై అయ్యో! ఇట్టి దేవతాభవనంబుల జనులు లేకుండుట కేద్దియో కార ణంబని మఱియు మఱియుం దిరుగుటయు దేవసభం దిరస్కరించు సభయొకటి నేత్రపర్వముగావించిన నచ్చటికరిగి దానియలంకార మున కచ్చెరువందుచు నలుదిక్కులం బరికింప నొక దెస సోపానం బులు గానంబడినవి.

అమ్మెట్లెక్కి పోయిన మునుజూచినసభకన్న వింతయైన రవిర హితమగు మందిర మొండు గానంబడియెను. దానిందిలకించి మూల నున్న యున్నతసోపానంబులంబడి యరుగుటయు నంతకన్న వింత యగు విశ్రాంత మొండు చూడంబడినది. ఈరీతి నాలుమేడలంగాంచి యందద్భుతమైన యలంకారములుగాక మరియెవ్వరిం గానక ధైర్యం బున వెడియుం జూచెదంగాక యని యందున్న నారోహణశ్రేణి మీఁదుగా నెక్కుటయు వేరొక్క చక్కని యంతఃపురము జూడనయ్యె. అదియు నపవరకు జూచిన నికాయములకన్న రమణీయమగు నలం కారమున శోభిల్లుచుండుటం జూచి యిందుఁదప్పక జనులుందురని నిశ్చయించి లోని కరుగుటయు నాభవనాంతరంబున హంసతూలికా తల్పమున నిద్రించుచు ననన్యసామాన్యలావణ్య మాన్యయగు కన్య యొకరిత యతనికి నేత్రపర్వము గావించినది.

అక్కాంచనగాత్రిం గాంచి మేనుపులకింప నట్టె నిలుచుండి యతం డాహా! యివ్వరారోహను గేహాలంకారమునకై చిత్రకారుండు బంగారునంగా వించి యిట్లుంచెఁగాఁబోలు. నిజముగా నిట్టికాంతలు

లోకాంతరములయందైనంగలిగి యుందురా! కలిగియున్నచో నట్టి యన్ను మిన్నలఁ గాంచువానిదిగదా భాగ్యమని మఱియుందిలకించి యప్పంకేరుహాననపై నిజాలోకన జాలంబులు నెరయఁజిమ్మి యాహా! యిప్పుడ నాకట్టి భాగ్యము సమకూరినట్లు తోచుచున్నదే! ఇది చిత్రింపువాల్గంటియనుకుంటిఁగాని కానియట్లు నిట్టూర్పులం గదలు తదీయపయోధరంబులే నయనబంధువులయి చెప్పుచున్నవి. కాదు కాదు. అదియుం జిత్రకారకుని రచనా చమత్కృతియే కావచ్చు. భ్రమసితిని లేనిచో నిట్టి విజన నికేతమున నేకతమున నేకతమయిట్టి మనోహరగాత్రినివసించెడిని? అని యాసందియము వాయ డాయం బోయి యప్పూఁబోఁడిమేనిపైఁ గేలిడి యక్కుసుమగాత్రి గాత్ర స్పర్శసుఖంబభినయించుచు నౌరా? యేమి నాభాగ్యము ఇప్పొన్ని కొమ్మ బంగారుబొమ్మ యనుకొంటిని కాదు. నిజమైన వాల్గంటియే మేలుమేలు. నాకుఁగన్నులు గలిగి నందులకు నేఁటికిఁగదా సాఫల్య మైనది.

ఇక్కన్నియ పన్నగ పన్నగవేణియో, యచ్చరమచ్చకంటియో విద్యాధరవిద్రుమాధరియో, గంధర్వపర్వేందువదనయో, కిన్నరకిన్నరకంఠియో, శక్రచక్రవాకస్తనియో, సాధ్యహరిమధ్యయో, సిద్ధపల్లవపాణియో, రంభారంభోరువో, యక్షగజగామినియో, భాస్వరకార్తస్వరగాత్రియో, రతియువతియో కావలయుఁ గానిచో మానిసిప్రోయాండ్రకీ సోయగము గలదే.

అని పెక్కగతులనాచక్కెరబొమ్మమేని సొంపు నాపాద మస్తకము వర్ణించుచు నట్టియయ్యొలనాగచెక్కిలి గ్రక్కున దద్దయుంబ్రీతి ముద్దు పెట్టుకొని యనాఘ్రాత కుసుమమగు నక్కిసలయపాణి మేనిపొత్తునాకత్తె నేనిఁజిత్తభవుంబరిచరుంగా జేసికొననే యని మదనవేదనా దోదూయమానమానసుండై యప్పల్లవపాణి

నల్లన లేపఁబోయియు నిద్రాభంగంబు సేయనోపక తడబడుచుండ నింతలో నత్తలోదరియదరిపడి లేచినది.

అట్లు లేచి యెదుర మదనసుకుమారుండగు నారాజకుమారుం గాంచి యాయించుఁబోఁడి మేనుబులకింప విభ్రాంతస్వాంతయై యొక్కింత సేపేమియుం బలుక నేరక, ఏమీ ? యిది నాకు స్వప్నమా? కాదు. జాగ్రదవస్థగానేయున్నది ఈగృహంబున నున్న వస్తుజాలంబు లన్నియుఁ బ్రత్యక్షముగాఁ జూచుచుంటినే? ఇదిగో నాకన్నులు తెరవబడియే యున్నవి. ఈయేకాంతప్రదేశమునకు వసంతుంబోలిన యీపురుషరత్నం బెట్లువచ్చెనో! మదీయభాగ్యదేవత యిట్లుపుత్తెంచె నేమో యరసెదంగాక యని మెట్టకేలకుఁబికస్వరంబున నతనితో నిట్లనియె.

ఓ మదవతీ మదనా ! నీవదనంబు జూడ మిగుల సుకుమార వంతుఁడవుగాఁ గాన్పించుచుంటివి. నీవిక్క్రాంతారంబున నేకాంత ముగా నున్న యీరాక్షస శుద్ధాంతమున కెట్లువచ్చితివి ? నివాస దేశంబెద్ది ? భవదీయ నామాలంకృతంబులైన వర్ణంబుల వివరించి కర్ణానందం బాపాదింపుము. మద్దత్తంబగు నాతిథ్యంబంగీకరించి నన్నుఁగృతార్థురాలింగావింపుమని వినయంబునఁ బ్రార్థించినం దదీయమృదుమధుర మనోహార పికస్వర వికస్వర వచన రచనకుఁ బరవశుండై యారాజనందనుం డొక్కింత తడవునకొడలెఱింగి యయ్యంగనామణికిఁ దనవృత్తాంతబంతయు నెఱింగించి మఱియు నిట్లనియె.

యువతీ ! భవదీయకులశీలనామంబులెఱింగినపిమ్మటగాని యేత దాతిథ్యం బంగీకరింపరాదు. ఇయ్యడవినడుమ నీయంతిపురంబునకు వన్నెయిడుచు నొంటిగా నీవుంటకుఁ గతంబేమి ? నిన్నుఁగన్న తల్లిదండ్రులెవ్వరు ? నిన్ను భార్యగాఁబడసిన ధన్యుని యభిదానమెద్ది?

ఇది రాక్షసశుద్ధాంతమంటివి. ఆరాక్షసుండెవ్వఁడు ? ఇవ్విజననగర మెవ్వరిది ? నీవు వనదేవతవని తోఁచుచున్నది. యథార్థము వక్కాణింపుమని యడిగిన సంతసించి యప్పఁడతి యిట్లనియె.

ఓమహారాజకుమారా ! మదీయవృత్తాంతం బాకర్ణింపుము. నాపేరు కళావతి. ఇవ్విజననగర మొకబ్రహ్మరాక్షసిచేఁబాలింపఁబడుచున్నది. ఆరాకాసియనేక దేశంబులనుండి దోఁచికొనివచ్చిన సొమ్మంతయు నీనిశాంతములనునిచి బీగములువైచుచుండును. మరియువారంబునకొకసారి వచ్చి యిచ్చట మేడనొకటి గట్టి తెచ్చిన విత్తం బందుంచి ముద్రిలువైచి యేగుచుండును. ఈసౌధంబులన్నియు నట్లు కట్టినవే. అదియొకనాఁడు దేశాటనంబునకై వెడలి నాజన్మభూమి యైనయవంతి దేశంబునంబడి మహా మారియుంబోలె యందలి ప్రజలఁగసిమెసంగి తదీయ దేశపాలకులగు మదీయ జననీ జనకుల కృపలేక నాకలోకంబున కనిచి రెండేండ్ల ప్రాయంబు గలిగి బంగరు తొట్లె నిట్టట్టు కొట్టుకొనుచున్న నన్ను మాతృమాత్రము నొందింపక తద్దయుంబ్రీతి ముద్దిడుకొని యత్తొట్టెతోడ నన్నిక్కడకుఁదీసికొనివచ్చి కన్నకూఁతురుంబలె పెనుచుచుండఁ దల్లిదండ్రులమరచి నేనింతదాననైతిని. దానినేతల్లియని నమ్మియుంటిని. మాయమ్మయు వారంబున కొకసారి వచ్చి రాత్రిల నాకుఁబెక్కువిద్యలం గరపుచు వివిదేశంబులం జరుగు వింతలగువృత్తాంతముల నెఱింగించుచు నిట్టియరణ్యంబున నున్నను లోక పరిపాటి యంతయు నాకుఁ జూచిన దానికన్న నెక్కుడుగాఁ దెలియజేసినది.

దానంజేసియేసుమీ! నేనింతకుమున్ను పురుషుల నెఱుఁగకున్నను మిమ్ముగన్నతోడనే మర్యాదగల పురుష రత్నమని యూహించితి. ఈరక్కసి లోకంబున నెక్క డేవింతయగు వస్తువున్నను నాకుఁ దెచ్చియిచ్చుచుండును. మాకోటలోనున్న విచిత్రవస్తువులు

నాకలోకంబులో సైతము లేవని చెప్పఁగలను. మాయమ్మయు నిన్న నే దేశాటనమునకై యరిగినది. మరియు నేడుదినములదనుక రాదిది య మదీయవృత్తాంతము నేఁడు మద్భాగ్యవశంబున మిమ్ములఁ బొడగంటినని పల్కుచు విభ్రమవిలోకనంబు లతని వదనపద్మంబునం బరగించిన నించు విల్కాఁడు ఘాముల్కులఁ జురుకు చురుకున నెడద నాటనేయుటయు నాపురుషసింహుఁడు మోహామాపనేరక యమ్మగువనుఁ బిగియారఁ గౌఁగలించుకొని చెక్కిలిముద్దిడుకొనిన నవ్వనితయుఁ దత్తదనుగుణ్య వృత్తుల మెలంగుచుఁ జిత్తంబిచ్చినది.

పిమ్మట నక్కనకాంగి యప్పురుషపుంగవు నభ్యంగనమార్చి తనసూదవిద్యాపాటవంబు తేటపడ నతివిచిత్రములైనపిండివంటలతో రుచిసంపన్నంబైనయన్నంబుఁబెట్టినది. భోజనంబైనపిదప నయ్యిరువురునొకవిహారమందిరంబునం గూర్చుండి కప్పురపు వీడియము వైచుకొనుచుఁ గొంతదనుక నిష్టగోష్ఠిం బ్రొద్దుపుచ్చిరి. మఱియు నత్తరుణియు విపంచి ధరియించి పాణికంకణ ఝణత్కారంబు లెసంగ సప్తస్వరంబులను రాగంబు బెరుగఁ బెక్కురాగంబులను జంత్రిస్వరములతో గంఠనాదంబుమేలగించి రాల్గరగునట్టుగాంధర్వంబు వెలయించిన నగ్గానంబున మానసంబు నీరుగాఁగ నన్నరనాథసూనుఁ డోహోయని యచ్చెరువందుచు నాపల్లవపాణిని మఱియు మరియుఁ గౌఁగలించుకొనిముద్దుపెట్టుకొనుచుఁ బెక్కుతెరంగులనన్నాతి మానసము గఱుగఁజేసెను. ఇట్లయ్యిరువురకు మదనుండు సమానుండై యున్నకతంబునవారు బెద్దయుంబ్రొద్దు నొడలెఱుంగని కామావృత్తులందగిలి విచిత్రబంధంబుల రతికేళిం దేలిరి.

చ. పొడమిన నాఁటనుండియునుఁ ♦ బూరుషు పోలికయే యెఱుంగక
యడవి వసించి లోకవిష ♦ యంబుల నేమియుఁ జూడనట్టి య
ప్పఁడతి వసంతుని న్సకల ♦ బంధములన్సుమకేళిఁ దన్పె నే
ర్పడ సహజంబుగాదె రతి ♦ పాటవ మారయ నాఁడువారికిన్.

మఱియు ననేకవిచిత్రములైన సౌధములను, నవరత్న శోభావిభ్రాజమానంబగు సభాభవనంబులను బహువిధ ఫలతరుమండ మండితములయిన యుద్యానవనములను, జలయంత్రవర్ధిత కుసుమకి సలయదళవిలసితములయి తావుల వెదఁజల్లు పూవుందోటలను విహ రింపుచు స్వర్గసౌఖ్యంబుల మాటుపరచు కోటలో నమ్మోటి బోఁటితో సంగజ విద్యాపాటవంబు దేటపడ నేఁడుదివసంబు లొక్కగడియగా గడిపిన నయ్యుతివయు నతని చతురతకు మెచ్చుకొనుచు నారక్కసి వచ్చు సమయం బాసన్నంబగుటయు నతనితో నిట్లనియె.

నాథా! నేఁడు దిననాథుం డపరగిరి శిఖరంబు నధిరోహిం చిన తోడనే వేడుకతో నిక్కడ కద్దానవి యేతెంచెడిని? నీయునికి వినినచో నొడల నసువులు సడలఁజేయక మానదు.

దానఁ బెక్కగతులఁ గొనలు సాగుమనయుత్సాహం బంత యు నుత్పన్నంబయ్యెడుంగదా. కావున నారక్కసి యిక్కడనుండి యరుగుదనుక నిన్నొక గృహగోధికంజేసి భిత్తిన త్తించెదను. అప్పాట వంబు అన్నిశాటినివలనం దెలిసికొనినదే యంతదనుక సైరింపుమని పలికి యక్కలికి యట్లుకావించినది. ఇంతలో బ్రహ్మాండకరండంబు పగులనార్చుచు నారాకాసి యాకాశమార్గంబున నేతెంచిన నమ్మద వతి యెదురేగి పదములంబడిన నదియు నప్పఁడతి జడుపుడిపి లేవ నెత్తి ముద్దిడుకొని పెక్కగతుల గారవించెను. మఱియు భోజనంబైన వెనుక తన కవ్వసిత చరణంబు లొత్తుచుండ పెనుపాన్పునఁ బండు కొని తాను జూచివచ్చిన వింతలన్నియు నక్కన్నె కెఱింగింపుచు నలుదెసలం బరికించి యల్లన నిట్లనియె.

బోఁటీ! నేఁడు మనలోగిటిలో మానిసివాసన వైచుచున్న దేమి? లాతివార లెవ్వరేని రాలేదుగదా! వచ్చిన వాకుత్రువ్వ మాంసాహారుల కొత్రువ్వడిగింతు ననుటయుఁ గపటంబున నక్కోటి లాలక యిట్లనియె.

అమ్మా! యీనట్టడవిలోని కెట్లు మానవులు వత్తురను కొంటివి. వచ్చినను గుట్టుతెలిసి కోటలోనికి రాఁగలరా? నేను మాత్రము మానిసినిగానా? నాకంపు నీకు బెట్టగింపుగాదా? నన్ను బరిమార్చినం బరిమార్చు మింతకన్న వింతవారు లేరనుటయు నామాటల సయిరింపక పశ్చాత్తాపచిత్తయై కూఁతు నోదార్చి రాత్రిశేషం బెద్దియో గొడవతో గడిపి తెల్లవారినతోడనే యాపువ్వుఁబోడిం దీవించి యారక్కసి యెక్కడికేనిం బోయినది.

పిమ్మట నాకొమ్మయు సంతసముతో జలకమాడి సింగారించుకొని మరల వసంతునిఁ బురుషుంగాఁ జేసి పన్నీట జలకమార్చి మధుర పదార్థంబుల నాఁకలిదీర్చిన నప్పురుషుండు రాత్రియుం బగలను వివక్షలేక నేకరీతి శంబరారాతి కేళుల నానాతిని సంతోషపరచెను. వారికవ్వార మొకనిమిషమైనంగాలేదు. ఆహా! కామ ప్రభావంబు యుగాంతరంబులు గడచినను నట్లేయుండునుగదా! విను మట్లయ్యిరువు రాకాసి వచ్చుదినంబు దక్క తక్కిన దివసంబుల నెల్ల నసమశరక్రీడల నీడులేని వేడుకతోఁ గడుపుచుండిరి. ఒక్కనాఁ డవ్వేడుక కాఁడాచేడియతో నిట్లనియె.

అంగనామణీ! మనమీతెఱంగున మఱుంగువడి యియ్యడవి నడుమ పాముపడగ నీడనున్న భేకంబులవలె నీరేదిమ్మరి రాయిడి కడలుచు నెంతకాల ముండవలయును? ఎప్పుడో యిది యాకఁలి గొని యున్నప్పుడు తెప్పున నన్నుఁగూడ భక్షింపక మానదు. క్రూరుల నమ్మవచ్చునా? మన మిన్నిశావారిణి బారిందప్పించుకొని జనపదంబుల కఱిగి స్వేచ్ఛావిహారంబుల సుఖింపరాదే యనుటయుం గటకటంబడి యక్కుటిలాలక మగనితో నిట్లనియె.

అయ్యో! మీరయ్యసురాంగన పరాక్రమం బెఱుఁగవచో నిట్లనక పోదురుగదా! వినుఁడది మన మెందేగినను దెలిసికొని యొక

యడుగునవచ్చి యిరువురఁ గబళములుగాఁ జేసికొనకమానదు. వారంబున కొక్క-రేయిగదా వనకు హాయితప్పియున్నది. ఊరక యిట్టిసుఖంబేల నేలపాలు గావింపవలయును ? ఇంతకన్న జనపదం బులనేమి వింతలున్నవి ? కావున నిట్టి యాలోచన మాని తద్దయుం బ్రీతినెల్ల ప్రొద్దుల నాతోనిందుఁ గ్రీడింపుఁడని పలికిన ముద్దరాలిం బెద్దతడవుబిగియఁగౌఁగిలించుకొని యద్దూరదర్శి తదిష్టానుసారముగా మెలఁగుచు మఱికొన్నిదినము లరిగినవెనుక నొకనాఁడా చేడియతో నిట్లనియె.

కాంతా ! నేఁడొక యేకాంతంబుగలదది యిట్టిట్టని శంక సేయక నాచెప్పినట్టు చేయుదునని నాచేతఁ జేయిడుదువేని నీకు వాకృచ్చెద ననిన నవ్వనితయు నవ్వుచు నాథా ! యట్లకావింతుఁ జెప్పుఁడని యత్యాతురముతో బ్రతిమాలిన నతండును తానాలో చించిన రీతియంతయు నాతలోదరికి బోధించి యీరేయి నట్టడుగు మని ప్రేరేపించిన నయ్యించుఁబోఁడియు దానికారణ మెఱుఁగనేరక యడుగవలదని మున్ను చెప్పియున్నవాఁడు గావున మరుమాట పలు కక వల్లెయని మునుపూలె వల్లభుని బల్లింగావించి గోడనత్రించి యానత్రంచరివచ్చుదెస బరికించుచుండ నింతలో దానియార్పులు చెవింబడుటయు నెదురేగి యుపచారపూర్వకముగాఁ దోడ్తెచ్చి భోజ నంబు గావించిన వెనుక దానిచరణంబు లొత్తుచుఁ దలవంచుకొని యెద్దియో తలంచుకొని పయ్యెట దడుపఁ గన్నీరుగార్చుచుఁ జింతింప దొడంగినఁ జూచి యోర్వజాలక యాపూర్వ దేవాంగన యిట్లనియె.

వాల్గంటీ ! నేనింటలేనప్పుడు నిన్నొంటిగా నుంటజూచి బంటు తనంబున నెవ్వరేని యవమానంబు గావించిరేమో చెప్పుము. ఇప్పుడయప్పాపాత్ముల యొడ లడవిమృగములపాలు గావించెద. లేక నీకెద్దియేనిం గావలసియున్న వస్తువెఱిగింపు మది త్రిలోకంబుల నెందున్నను దృటిలో నీముందు దెచ్చిపెట్టెద. వేరెద్దియేని కారణ మున్నచో నుడువు మూరక నాడెందం బాందోళనమునొంద నిట్లు

కుండెద వేమిటికి ? ఎప్పుడును నామానసం బలరఁ బెక్కులు పలుకు చుండు నీవు నేఁడిట్లు కన్నీరు విడుచుచుండుటకు నాచిత్తము తత్తర పడుచున్నది. వేగ నెఱింగింపుమని యారక్కసి పెక్కు తెరంగుల బ్రతిమాలిన నెట్టకేల కయ్యేలనాగ యిట్లనియె.

అమ్మా ! నేజింతించుటకు నీవడిగిన దానిలో నొకటియుఁ గారణముగాదు. వినుము నీవు పెక్కుదేశంబు లరిగి ఘోరకృత్యములఁ గావింపుచుండ, మాంత్రికులుగాని, తాంత్రికులుగాని, పరాక్రమ వంతులుగాని నీకెద్దియేని కీడు గావించినచో నేనేమి సేయుదును ? నాదేహ మీయడవిమృగములకు బలియియ్య వలసివచ్చునుగదా. నీవరిగినది మొదలు వచ్చుదనుక నాదేసం బరికించుచు నొంటిగా నెన్ని నాళ్ళీయడవిలో వసింపుదును ? నీవు రానినాఁడు నాప్రాణం బులు నిలుచునా ! నన్నుఁగాపాడు వారెవ్వరు ? ఇదివరకుఁ జేసిన హింసయు సంపాదించిన విత్తంబును చాలదా ? ఊరకేల గుహ్మరి యెద వెల్లదినముల నాకడనుండిన నుండుము. కానిచో నన్నుఁగూడ భక్షించియేగు మిదియమదీయచింతా ప్రకారమని పలికినవిని నవ్వి యవ్వికటముఖి యవ్వనజముఖితో నిట్లనియె.

ఓహో ! "నెలఁతా ! యిదియా నీచింత" చాలు చాలు ఈపాటి కూరకుండుము. నన్నుఁ జంపువాఁడీ మూఁడు లోకంబులను లేఁడు. నేనెక్కడి కరిగినను నాయాయుర్దాయము గోప్యముగా నిక్కడనే యున్నది. ఆమర్మ మెఱింగిన వాఁడుగాని నన్నుఁ జంపలేఁడు. దానిం దెలిసికొన బ్రహ్మవశముగాదు. నేను బ్రతికియుండఁగా నీకొక యాపద రాసిత్తునే ? దీనికయి చింతించకుము. నిశాటుల కిల్లకాల మొకచోట నుండుట కులపరిపాటి గాదని పలికినవిని మరల నబ్బోఁటి యిట్లనియె.

అమ్మా ! నీయాయుర్దాయము గోప్యముగా నున్నదని యన్నంతమాత్రమున నే నాకు సమ్మోదంబుగాలేదు. అమ్మరుంగు

తెరంగెఱింగిన పిమ్మట సరిపడెనని తోఁచినచోఁ మురిపెమందెనని తనకు మగఁడు బోధించినరీతిగాఁ బలికిన నారక్కసి యక్కపటం బెఱుంగక చెక్కిలి ముద్దిడుకొని కన్నీరు దుడుచుచు నప్పుడుచుతో నిట్లనియె.

తన్వీ ! అట్లైన, విను మివ్విజననగరమున కుత్తరంబున నవ రత్నసోపాన మండితంబున, కనత్కనక వనజ కుముదకైరవకల్హార కమనీయ పరిమళమిళితామృతోపమానజల కలితంబునై యొప్పు తటాకంబుగలదు. అక్కమలాకరంబున స్నానంబుజేసి దాని ముమ్మారు వలగొని పడమరదెసఁజూడ నపూర్వమైన కదళీవనం బొండుగాన్పించును. అందొక్కొక్క బోదికి నూరేసి కప్పురపు టన టులు మనోహర ఫలదళ విలసితములయి పెక్కు దినుసులుగాఁ బొడ నూపును. దానినడుమ వింతలగు నాకులును ఫలములఁ గిక్కిరిసి యున్న గెలలును గలిగిన బోదియొకటి కొమరు మిగిలియున్నది.అబ్బో దినున్న యనటులన్నియుఁ జెలఁగినచోఁ నడుమనొక యినుపకవా టంబుజూపట్టు. దానిబీగము నీవు పరుండు పర్యంక పేటికయందున్నది. దాన నత్తలుపు దెరచినచోఁ బ్రశస్తభిత్తికా ఘటిత నవరత్న ప్రభా నిరస్త తమస్సమూహంబగు పాతాళ గేహంబొకటి పటికంబురాల సోపానములతోఁ గాననగు. అందు సుందర మణిస్థంభ సంభావితం బగు మంటపంబున వ్రేలంగట్టియున్న పసిడిపంజరములోఁ బంచవర్ణ ముల చిలుక యొకటి గలదు. నాయాయుర్దాయము దానిలో నున్నది. దానికేమైనఁ బ్రమాదము సంభవించినచోఁ నాకుఁబ్రాణ హానియగుంగాని వేరొండు మార్గంబున మృత్యువు రానేరదు. ఈ రహస్యంబు చతురాస్యుండైన నెఱుంగఁడు, నాకుఁ బ్రియకవు గాన నెఱింగించితిని.

ఇప్పుడైన నాకు వేరొండుచోట మరణంబులేదని నమ్మకము కలిగినదా యని తనజీవిత రహస్యవృత్తాంతమంతయు నెఱింగించిన,

సంతసించి యూయించుబోఁడి యిట్లనియె. అమ్మా ! నేటికి నామనం బునమ్మోదంబందినది. మున్ను గలిగిన యదటుడిగె. నీవింక జముని కడ కరిగినను భయములేదని యానందమందుచున్న కూఁతు బెక్కు తెరంగుల గారవించె. నింతలో దెల్లవారుటయు నానిశాటినికోట దాటి యెక్కడకేనిం బోయినది.

అంత నన్నెలంతయు సంతసముతోఁ దనకాంతుని గోధిత్వంబు వాయబోధించి యభ్యంగనా భ్యవహారాలంకారాది వ్యాపారముల దీర్చిన వెనుక నొక కనకమణిగణప్రభావిభాసితంబగు సభాంతరమునఁ గూర్చుండియున్న యవసరంబున నయ్యంబుజాక్షి తనకారక్కసి చెప్పిన వృత్తాంతమంతయు నింతయేనిఁ గొరంతపుచ్చక పూస గ్రుచ్చినరీతి వాకుృచ్చిన నచ్చెరువందుచు మందహాసంబున వదనం బలంకరింప వసంతుం డంతరంగంబునఁ బెక్కుతెరంగుల నాలోచిం చుచుఁ దనకపటంబా బోటికిఁ దేటపడనీక మఱునాఁడుదయంబున లేచి భార్యకెద్దియో మిష జెప్పి మాటుకవాటంబుదారి నక్కోటదాటి యుత్తరంబుగా నరిగిన గనక పద్మమనోహారంబగు సరోవరంబు గాన్పించినది.

అందుఁగ్రుంకి ముమ్మారు వలగొనిన పిదప గనంబడిన కదళీ వనంబుజొచ్చి యెట్టకేలకు వెదకి యప్పొను బొదింగనుంగొని కటారి ధారనేకవారంబున దాని నిర్మూలంబుగావించి యయ్యనుప కవాట మును జూచెను. దానిబీగము దెచ్చుట మరచివచ్చెను గాన నత్యంత చింతాక్రాంతస్వాంతుడై యోహో ! యిప్పుడేమి మోసము రాఁబోవునోగదా ! తాళము మరచివచ్చితిని. మరలనింటి కరిగినచో నాలస్యమగును. అరక్కసికీపాటి కొంతపొడకట్టక మానదు. అది వచ్చినచో నన్నుఁ బరిమార్చును.

ఏమిసేయుదునని పెక్కుతెరంగులఁ జింతించుచు నలవాటు చొప్పున దనచొక్కాయిజేబులోఁ జేయిడినఁ దాళముచెవి యొకటి

చేతికిఁ దగిలినది. అది పైకితీసిచూచి యోహో! ఇది నాజేబులోని కట్టువచ్చినది. దీనికిసరిపడునేమో చూతమని యదియందుఁదగిలించిన యమరుటయు సంతసించి యటునిటు త్రిప్పిన బీగమువచ్చినది, దాని కచ్చెరువందుచు దైవమే తనకీసహాయమును జేసెనని పెక్కువందన ములు గావించుచు నమ్మార్గంబునఁ బాతాళగృహంబు సొచ్చెను.

గోపాలా! వినుమత్తాళముచెవి యారక్కసి తనకావృత్తాంత మెఱింగించి యరిగినపిదపఁ గళావతి పరీక్షార్థమై దాని నప్పేటికలో నుండి పైకిదీసి చూచి మరల దానినందుంచ నశ్రద్ధగలిగి మంచము మీదనున్న మగని చొక్కాజేబులోవైచి నాయంగీ నతఁడుదయ మువ వచ్చునప్పుడు దొడిగికొనెను. గానఁదాన నది తీయఁగలిగె లేనిచో నిష్కారణ మతండే మడియునలసివచ్చును.

వసంతుడఁట్లు పాతాళగృహము ప్రవేశించి మణికాంతులచేఁ బట్టపగలువలె నొప్పుచున్న యచ్చోట నలుదిక్కుల వెదకి మంట పములో వ్రేలంగట్టియున్న పంజరము జేరంజని తలుపుదెరచి చిలు కంబట్టునంతలోఁ దెలిసికొని యప్పలలాశిని దిశలదుర్వనార్చుచు నొక్కపరుగున వచ్చెను. గాని మొదట నతఁడు చిలుక కాళులు రెండును విరచెను. గాననది చెఱువుగట్టున కాళ్ళువిరిగి పడియెను.

పదంపడి దానిరెక్కలు గంతమును నులిమి పారవైచిన నదియు నయ్యవయవములు విరుగనార్చుచు గిలగిల దన్నుకొనుచుఁ బ్రాణంబులంబాసెను. ఆహా! పెద్దకాలమునుండి గాలుండువూలె జీవజాలంబుల సమయించుచు నస్తోకగర్వోద్రేకమ్మున గుర్మ్మరు నారేదిర్మ్మరి కతనిచేతిలో చావు విధియించెఁగాబోలు. అట్టి దుష్టు రాలింగొట్టిన యతని సుకృతము సురలుసైతము గొనియాడిరి. అట్లా ఘోరదానవిందునిమి యతండ త్తటాకంబున నొడలు గడుగుకొని యుత్తరంగాయంగన కరింగింప నతిత్వరితగతిఁ జనుదెంచెను.

అంతకుమున్న యన్నెలంతయు మానవాంతకురాలియార్పులు విని యోహో! ఇదియేమి నాతల్లి యకాలమునవచ్చుచున్నది. విపరీతంబెద్దియేని బుట్టనుగదా! నామనోహరుఁడొంటిగా నటవి కరిగెనే యతనియునికి వినివచ్చెనా? యేమి మోసము గావించునోగదా యనుచు మరికొంతతరి కయ్యెడలు వినరామికి నెడదదడఁబడ దాను మున్ను దీసిన తాళపుచెవిని వెదకి కాన కయ్యో! నానెయ్యంపు జనని బ్రతుకేమయ్యెనోకదా! అకటా! నన్నుఁ బుత్రికయని నమ్మి నాకుఁ దనమనువు మరుగుతెరం గెఱింగించెనే! నేనును నామగని కపటంబెరుంగక స్త్రీచాపల్యంబున దాచలేమి నాగుట్టు చెప్పితిని. దానికేమి మోసము గావించెనోగదా యని కన్నీరుమున్నీరుగాఁగా బెక్కుగతుల జింతింపుచుండెను.

ఇంతలో నావసంతుండయ్యింతి యంతికమునకుఁ వచ్చిన నంతసముతో నెదురేగి, పదముల కెరగి యుచితోప చారంబులు దీర్చిన వెనుక సామీ! యేమియింత యాలస్యము చేసితిరి? అకాలమున మాతల్లి ముఖఘోషము వినఁబడియు, నణఁగినది. దానిని మీరు చూడలేదుగదాయని యడిగిన నవ్వుచు నతండు ప్రేయసీ! ఇపుడు నీజనని తటాకతీరమునఁ బెద్దనిద్దురఁ జెందియున్నది. చూచి వత్తువు గాని రమ్మనిన నవ్వనిత యదేమి యట్లనుచుంటిరి. నిజము చెప్పుడు నాగుండెలు కొట్టుకొనుచున్నవని యత్యాతురముతో నడగిన జరిగిన కథయంతయు నెఱింగించి మిగుల పలవించు నయ్యెంచుఁబోఁడి నోదార్చువాఁడై యతం డిట్లనియె.

మోహనాంగీ! అట్టిరాకాసి తల్లికై తల్లడించు నీవంటి వెంగలి యెందైనంగలదా? ప్రజలతోఁ దల్లిదండ్రులఁ బరిమార్చి తన్నల్ల కాలము బందీగృహంబునం బడవైచిన రక్కసియెడ మక్కువగల నీబుద్ధిలోలతఁ బెక్కుగతుల నెన్నదగి యున్నదే. చాలుచాలు

నీపాటికి నూరకుండుము కాటుక మోముతమ్మిం గ్రమ్మంగన్నీరు వెడజిమ్ముచుం నేంటికి పరితపించెదవు? తాటకివలెం దటాకాంచల మునం బడియున్న దానియాకారము జూచినంత నాకును భీతిప్రదమి నది. నీవెట్లు దాని మాతగా నెంచి భయపడక సంచరించితివో యెఱుంగ. దీనిమరణంబు మనకుంగాక త్రిలోకంబులకును సుఖకర మని నమ్ముము. అనుదిన మనేక జంతువులం గృతాంతు నంతి కమ్మన కనుచు దనుజకాంత నంతంబుంజేసిన నాకుం బుణ్యమేకాని విశ్వాసఘాతుక పాతకంబు రానేరదు.

దైవకృపచే మనచిక్కులు వాసినవి. ఆనంద మందుమని యూరడించిన మగనివచనంబుల శోకంబపనయించుకొని యక్కాంత యొక్కసారి దానికళేబరము జూపింపుమనివేడిన నంగీకరించి యితం డయ్యంగనను జయ్యన నయ్యెడకుం గొనిపోయి తటాకాంచలమున ఘోరముగాం బడియున్నదాని మేనుజూపించినం బెంచిన మోహం బునం గొంతదనుక చింతించి దానిందహింప మనోహరునడిగికొనిన నతండపిదంబునం దదంగకంబులు ఖండించి ప్రాంత శుష్కతరు శాఖలంజితిం జేర్చి యందగ్నింజొనిపి బూతిగావించెను.

పిమ్మట నాదంపతులు శుచిస్నానమునకై ప్రాంతముననున్న సముద్రమునకరిగి యందఘమర్షణసూక్తములతో శుచిస్నానముచేసిరి. అప్పుడప్పారావార తరంగములు పెంపుగబొంగుచున్న కతంబున నారాయిడి నచ్చేడియ కుడిచేతనున్న నవరత్నస్థాపితమగు కంకణ మొండు చీలవదలి సముద్రోదకంబులం బడియెను.

దానన త్యంత వ్యథనొంది యందెంతేని ప్రయత్నముతో వెదకుచున్న యాకన్నియతో నావన్నెకాండు అబలా! జలంబుల మిగుల శ్రద్ధాపూర్వకముగా నెమకుచుంటివిం వెలగలవస్తువెద్దియేనిం బడెనే యని యడిగిన నప్పడంతి మగనికిట్లనియె.

నాథా! మునోక్కసారి యద్దానవి దేవలోకంబున కరిగి యందాకాశగంగలో నగలును బుట్టంబులును గట్టునఁబెట్టి రంభాది దేవకాంతలు జలకేళిం దేలుచుండ న్వాదండనుండి రంభదియో యూర్వశిదియో మేనకదియో కాని యనర్ఘ రత్నరుచులు వెలుగు చున్న కంకణములజత యొకటి దొంగిలించి తెచ్చి నాకిచ్చినది. అదియు నాచేతులకుఁ గొల్చునట్లు సరిపడి యపూర్వతేజం బొనగూర్చినది నాకున్న వస్తువులన్నిటికన్న దానియం దెక్కువ మక్కువ గల్గుటచే నొకప్పుడైనను విడువక దాల్చియుందును.

నేఁడు మున్నీటి తరగలరాయిడి నందొక్కకడియము జలంబులంబడి మునిఁగిపోయినది. దానికై వెదకుచుంటిని. ఇది యగాధ ప్రాంతమగుట దొరకకున్నను నాసపదలినది. దానితోడి కడియమిదిగో యెంతచక్కగా నున్నదో చూడుఁడు. అని తనచేతనున్న రెండవ కడియము విడదీసిచూపించినఁ జూచి వెరఁగుపడి యతండోహో! ఇది దేవతాభూషణముగాన నిట్లున్నది. మానవుల యలంకారముల కింత వింత సొబగుండదు. దేవతల నగలన్నియు నీరీతినే యుండును గాఁబోలు. అహాహా! వారి భోగభాగ్యములు! దానికై నీవిఁక యూరక శ్రమపడకుము. నేర్పరియగు కంసాలి నాకు మిత్రుఁ డొకఁడు గలఁడు. వానిచే నిది పోలికయిచ్చి రెండవది చేయించెద నని తత్కాలోచితవాక్యములచే నామెకు దానియందుఁగల కోరిక యుడిగించి యత్తరుణిమణి కేలుఁబట్టి మరల కోటలోనికిం దీసికొని పోయెను.

అంతలోఁ దనమిత్రుల వృత్తాంతము జ్ఞాపకమువచ్చుటయు నటకరుగు సంకల్ప మంకురించినదికాని యక్కోటలోని భగవంతుల వింత సొబగెంతయు నతని స్వాంతమున కడ్డుపడి సాగనిచ్చినదిగాదు. దాన నమ్మానవనాథసూనుం డమ్మానవతీ శిరోమణితో నందు గొన్ని దినంబులు స్వేచ్ఛావిహారంబులఁ గ్రీడింపుచుండెను.

గోపా! అట్లు సముద్రింబునంబడిన యప్పంకజాక్షి కంకణం
బొకమత్స్యంబు జాతిస్వభావంబున మ్రింగి క్రుమ్మరుచుండ దాని
నొకజాలరి జాలంబునంబట్టి పైకితీసి యందపూర్వ తేజంబున వెలుంగు
పెనుమీనుంగాంచి దానిమేని యందంబునకు వెరగందుచు దాను
దినినచో నొకటి రెండు పూటల యాహారమున కెక్కుడు చాల
దనియు నొకరేనికిఁ గానుకగానిచ్చిన నచ్చెరువంది యెద్దియేని బహు
మాన మిచ్చుననియు నిశ్చయించి కోయక యబ్బోయ ప్రాంతమున
నున్న వంగదేశాధీశుడగు కందర్పకేతుం డనురాజునొద్ద కరిగి
తనకడనున్న యవ్వింతచేప నర్పించెను.

ఆచేపంజూచి యతండును మిగుల నాశ్చర్యపడుచు నప్పల్లె
వానికిఁ దగిన పారితోషికంబిచ్చియంపి యప్పుడది బానిసకత్తెచేఁ
దగ్గరయుండి కోయించి యందువెలుంగు నపూర్వమణివలయము
జూచి చేతంబూని యిటునటు త్రిప్పుచు నాహా! యింతవింతయగు
కంకణము ధరించు నించుఁబోడి యెంతవన్నెలాడియోగదా! యే
దేశంబలంకరించెడినో? దానిభార్యగాఁబడసిన మగవాఁడు పూర్వ
జన్మమున నెంత తపముగావించెనో యని పెక్కుగతుల దానిమూల
ముగాఁ దద్వస్తుధారిణియగు నారీమణిం బొగడి విరాళింపూని యట్టి
కంకణము ధరియించిన కోకస్తని యీలోకములోనిదేగదా. దాని
దీసికొనివచ్చి నాకిచ్చిన వారికి నాయర్ధరాజ్యం బిచ్చెదనని యప్పుడ
ప్రచురపత్రికల వ్రాయించి దేశదేశంబుల వ్యాపింపఁజేసెను వానిం
జూచినవారెల్ల రాజ్యకాంక్షం గొంతజింతించిరి గాని యన్వయదేశ
గోత్రనామంబులు వివరింపమిం జేసి యట్టియాసల మరలించుకొనిరి.

ఒక్కనాఁ డయ్యూరనున్న వృద్ధభూసురకాంత యావృత్తాం
తము విని సంతసముతో నాభూకాంతుని యంతికమున కరిగి యతని
వలన జాలరివాఁడు వలవైచిన ప్రదేశపుగురుతును కంకణము పోలి
కయు దెలిసికొని యతనితో నిటనియె.

దేవా! నేను దేవరవారు గోరిన నారీమణిం దీసికొనివచ్చెదను; దీనికై చింతింపకుఁడు. అక్కాంత మీపక్క నున్నదిగా భావింపుఁడు. సకలసాధన సమన్వితంబును విచిత్రవస్తు భూయిష్ఠంబునునగు నొక యోడ నాకిప్పింపు డిప్పుడ యరిగెదనని యడిగిన నతండు సంతసించి యది కోరిన వన్నియు నిచ్చి యంపెను. పిమ్మట నాబటుగు వడఁతియు నాయోడకు నేలికయై యెక్కి మంచివేళ లంగరులు తీయించి చాపలెత్తించి పల్లెవానికిఁ జెప్పదొరకిన దిక్కుననుసరించి యోడ నడిపింపసాగెను.

ఓడ నడుచునప్పుడు సముద్రతీరధారుణి యంతయుఁ బరీక్షించుచు నావృద్ధ పదియేనుదినములు పయనము సాగించెను. పదియారవదినమున సూర్యోదయము కాగనే యొద్దున గొప్పపొగయు, దానిలోనుండి మంటయు, నవియన్నియు నడంగినవెనుక నున్నతములైన మేడలుం గాన్పించినవి.

వానింజూచి యమ్ముసలిది మిగుల సంతసించి యోడసరదారులతో నోడలంగరు వేయుఁడనియు మరల దానువచ్చుదనుకఁ గనిపెట్టుకొని యక్కడనే యుండవలయుననియు నాజ్ఞాపించి చింపిరి గుడ్డలఁ గట్టుకొని చిన్నదోనె యొకటి యెక్కి చిరుకోలం దోసికొని యప్పట్టణపు రేవు చేరినది.

మొదట నందెవ్వరింగానక చింతాకులమానసయై గట్టుపై కెక్కి నలుదెసలం బరికించుచుండ నొకదండనుండి యిరువురువచ్చుట గానంబడియె. వారు దాని పుణ్యవశమున నాఁటియుదయమున విహారార్థము వెడలిన వసంతుడును కళావతియే. అట్టివారిం జూచినతోడనే వేడుకతో నాపోడ మరల సముద్రతీరమునఁ గూర్చుండి తల విరియఁబోసికొని గోలుగోలున నేడ్వసాగెను.

ఇంతలో నాదంపతులు సమీపించి జనరహితమగు నాప్రదేశ మున మానిసి గానంబడిన, సజాతీయవస్తుదర్శన సంతోషంబు మనం బున వెల్లివిరియ నల్లన దానితో నిట్లనిరి.

అమ్మా ! నీవ్వెరవు ? ఇందేలవచ్చితివి ? నీయభిధానమెద్ది ? ఇట్లుకుందఁ గారణమేమి ? నిన్నెవ్వరిట్లు భంగపరచిరి ? నీవెతల తెరంగెరించిన మాచేయూపినంత యుపకారము సేయుదుము. నిక్కము వక్కాణింపుమని సాంత్వనపూర్వకముగానడిగిన,నామిష్టు రాలొక్కింత తలయెత్తివారల చక్కఁదనమునకు మిక్కిలి వెరగుపడి మరియు నానెలతం దిలకించి, ఔరా ! యీమోహనాంగి నిర్జరాంగనగాని మానవకాంతగాదు. మానిసులకిట్టి యందముగలుగునా వంగదేశా ధీశుని మరులుకొలిపిన మదవతియు నిదియే. అతని యొద్దనున్న కంకణమునకు జోడైనది దీని దాపలకేల నున్నది. ఔనౌ, నతండిట్టి రమణీమణికై విరహమొందుట యుచితమే. నాభాగ్యవశంబున నేఁటికెన్నుకొన్న యన్నువ కన్నులంబడినది. దీనినెట్లోమాయచేసి కొనిపోయెద. అర్థరాజ్యంబు నాకుఁదక్కినదని సంతసించుచు నమ్మురిపెము మొగమునఁ దోపనీయక వారిపాదంబులంబడి యిట్లనియె.

అయ్యో! నాకుయ్యేమని వక్కాణింతు. అయ్యయు నమ్మయు వలె మీరాదరంబున నడుగ నుడువకునికి సాధు పరిపాటిగాదు. నాకు లేక లేక యొకకొడుకు గలిగెను. వాఁడు పుట్టినవేళ యెట్టిదో కాని జాతకర్మాదిక్రియలు నిర్వర్తింపకమున్న తండ్రి నాకలోకం బలంకరించెను. ఆఁడుదాననైనను నేను ధైర్యము గలదాననుగాన భయపడక యెద్దడికోర్చి పిల్లవాని నత్యంతమోహంబునం బెనిచి పెద్దవానిఁజేసి తద్దయుశ్రమపడి పెక్కురొక్కంబు వ్యయపుచ్చి యొకపడుచుం గట్టిపెట్టితిని. ఆదుర్మార్గుడది కాపురమునకు వచ్చినది

మొదలు నాయందుగలభయభక్తులు నానాటికి నీటఁగలుపుచుండెను వానిభార్యయు ననార్యకుల సంజాతయగుట నాపై మిగుల నీసుగలిగి మగనికి ననుదినము రోసమెక్కించుచుండును. కొడుకు చెడుగైనఁ గోడలు మంచిదగునా ?

ఇట్లుండ నొక్కనాఁడాకోడలురాకాసి యేమిబోధించెనో యానిర్భాగ్యుఁడూరక నాపైఁబడి చానమోది తలబట్టి యీడ్చి చావుమని సముద్రంబునం బడద్రొబ్బిన మునింగితినిగాని పాపపు పరమేష్ఠి నా కాయువెక్కడఁబెట్టెనో చావక యలలం దారువువ్రాలె దేలి యీ రేవునకుఁ గొట్టుకొనివచ్చి గట్టెక్కితి. "పాపీచిరాయు" వనుమాట తప్పునా ? మరియు నన్నింకనెన్ని చిక్కులఁ బెట్టదలఁచియో దైవము సముద్రంబునం బడినను చావనీయక తేలవైచె. కటకటా ! నావంటి పాపాత్మురాలీ మూఁడులోకంబుల లేదుసుఁడీ యని యేడ్చుచున్న యన్నాతిం జూచి జాలిపడి వసంతుండిట్లనియె.

అవ్వా ! మేమిప్పటి కేలికలమై యుందుము. నీవు మాయిరువురనడుమనుఁ దల్లిగా మెలంగుము. ఎల్లపనులును నీమీఁదుగా నడిపించుకొనియెదము నీకేకొరంతయు రానీయము. చింతవిడువుము. వేయేల మేము నీయాజ్ఞకులోనై మెలంగువారము. లేలెమ్ము రమ్మని బ్రతిమాలు నాభూపాలసూనుని యనునయవాక్యంబులఁ దేరినదాని వలె నభినయించుచు నతని గుణగౌరవము పెక్కుగతులఁ గొనియాడి యల్లనలేచిన నతండు తన యుత్తరీయము దానికిఁగట్టనిచ్చెను. అప్పుట్టంబు గట్టుకొనిన యాదుష్టురాలిని వెంటబెట్టుకొని యాఁడుతోడు దొరకెనను సంతసముతో నారాజకుమారుం డంగనతో ముచ్చటించుచుఁ గోటలోనికరిగెను.

పిమ్మట నావృద్ధయు వారిద్దరినడుమ మిగుల నమ్మకమైన వర్తనముల మెలంగుచు నాహారమిచ్చునప్పుడును అలంకరించుచున్నప్పు

దును నభ్యంగనాది సంస్కారములు జరుపునప్పుడును వారి చిత్త వృత్తుల కనుగుణ్యముగురీతి నెరపుచుఁ దుదకు వారిఁ దాఁజెప్పినట్లు నడచుకొను వారిగాఁ జేసికొనియెను.

అతండును దనభార్యకుఁ దోడుగలదుగావున వేటకై యడవి కరిగి రెండుమూఁడు దినములవరకు యథేచ్ఛముగాఁ గుమ్మరివచ్చు చుండును. ఇట్లు కొన్నిదినము లరిగినవెనుక నొకనాఁడతఁడడవి కరిగిన యప్పుడప్పుడఁతి మెత్తఁదనము గనిపెట్టి యల్లన యావృద్ధ యిట్లనియె.

వాల్గంటీ! యొంటిగా మనమికోటలో నుంటిమి. కోటదాటి నచో బెడిదంపుటడవియుఁ గ్రూరమృగము లేకాని మానిసి యెవ్వం డును గానంబడఁడు. నీమగఁడు మిగుల బలశాలియగుట నిట్టిచోట మనకేకొరంతయు లేకున్నది. నోట ననినం దప్పగాని మానవ శరీర ములు శాశ్వతములు గావుగదా. ఆతఁడు ముందో మనము ముందో యెవ్వరుచూచినారు. మనకన్న నతనికి ముందర మోసము సంభ వించినచో మనబ్రతు కేమికావలయు? నేనిట్లంటినని మరియొక లాగున భావింపకుమీ! ఎన్నఁడో రాఁబోవు ననర్థమునకిప్పుడే ప్రతీకారము జింతింపవలయునని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. నాజీవితము మీయధీనము జేసితి. నాకు మీకన్న యాప్తులు లేరుగదా! మీరు క్షేమముగా నుండుట కంటె నాకుఁ గావలసిన దేమున్నది? ఎల్లకాల మిట్లుంచ భగవంతుని బ్రార్థించుచుంటిని. కాని మనయిష్టానుసార ముగాఁ గాలము నడువదు. "కాలోయం దురతిక్రమః" యను వాక్యమునుంబట్టి నేనిట్లు చింతించుచుంటిని.

కావున మగుహా నీమగని యాయుర్విషయమై కాలమితి యెరుగునేమో యడుగుము. మనవారికి జాతకముల వలనగాని సాముద్రికమువలనగాని యాయుర్మితి దెలిసియుండును. అప్పుర్తము

మనకుఁ దెలిసినచో నిర్భయమైన యానంద మందుదముగాక — నే నడుగమని నట్లడగకుమీ ! యతని మానసమున కేమితోఁచునో అట్లడిగిన నాయానసుమీయని పెక్కునీతులు దెలిసినదానివలె బోధించుటయు నాలించి యాయింతిముఖ యందుగొన్ని వాక్యం బులు తనకుఁగర్ణకఠోరములుగా నున్నను సైరించి యిదియేమో తనక్షేమము గోరియే యట్లనుచున్నదను నమ్మకముచే మరుమాట పలుకక యట్లడిగెద ననుమాట శిరఃకంపమున సూచించిన నంతటితో నాప్రస్తావము కట్టిపెట్టి వేరొక్కగోష్ఠిచేఁ బ్రొద్దుపుచ్చికొనిరి.

ఇంతలో దినాంతమగుటయు వసంతుఁ డింటికరుదెంచిన సంత సించి వారెన్నేని నుపచారంబులం దీర్చిరి. అతండు నిష్టాహార సంతు ష్టుండై యీప్సితకామంబులఁ దీర్చుకొనియె. ఇట్లు నాలుగైదు వాసరము లరిగినను కళావతి కాప్రస్తావము తెచ్చుటకు వీలుదొరకి నదిగాదు. ఒకనాఁడతఁ డుదయమున వేటకై తొందరగా నటవి కరుగుచుండ నాదండకరిగి యతని కైదండబట్టికొని యయ్యండ జయాన యిట్లనియె.

నాథా ! మీరు సారెసారెకు ఘోరమృగయాసక్తి నడవి కరుగుచుంటిరి. ఒంటిగా మేమిచ్చోట నుండఁజాలము. మీకందే మైనఁ బ్రమాదము సంభవించినచో మాకేది దిక్కు. ఈసారి మమ్ముఁ గూడఁ దోడ్కొని పోయినంబోండు లేకున్న మీయాయుఃప్రమాణ నిశ్చయం బెరుంగుదురేని వక్కాణింపుఁడని కేల్వదలక నిర్బంధించిన సంతసించి యాచంచలాక్షిని గౌఁగిటఁ జేర్చుకొని యతండారహస్యం బదివరకెవ్వరికిఁ జెప్పనని నిశ్చయించుకొనియుఁ బ్రియాణపు తొంద రచే మరచి యత్తెరవతో నిట్లనియె.

బోఁటీ ! నాకు భయమేమిటికి ? వినుము మదీయమిత్రుఁ డగు నొకకళాదునిచే నాయాయువీక త్తివఱలో నుంచబడినది. ఇది

నీయొద్దనునిచికొనుము. దీనికిఁ బ్రమాదము వచ్చిననాఁడుగాని నాకుఁ బ్రాణభయము రానేరదు. దీనింగాపాడుకొనుమని నిదానించక యది యమ్మదవతి చేతికిచ్చి తాను వేటకై యటవికరిగెను. ఎట్టినేర్పరియై నను విధి గతికి బద్ధుడై ప్రమాదముఁనొందక మానఁడు.

ఆతండొకింత నిదానించినచో నాకపటమునుఁ దెలిసికొనఁ దగిన వాఁడే "బుద్ధిఃకర్మానుసారిణీ" యను వచనంబునుంబట్టి యతని కట్టియూహ పుట్టినదికాదు.

పిమ్మట నవ్వరవర్ణిని యన్వర వృత్తాంతమంతయు నమ్మనలి దానికెఱింగించిన సంతసించుచు నప్పడతి కిట్లనియె. అమ్మా ! మనము వజ్రయరలు ప్రాణపదముగాఁ గాపాడుకొనవలయునుజుమీ ఎక్కడ దాచెదవొకాని మనబ్రదుకంతయు దీనితోనున్నది యనిన నదియు నమ్మా ! యెక్కడదాచినను భయమేమి మనముగాక యన్యు లెవ్వారేనిం గలరా ? నిత్యమునుఁ జూచుచుండవచ్చు నీమంచము తలకడనునిచెదననిన నౌను భయమేమి యట్లె యుంచుమని చెప్పినది.

అక్కపటం బెఱింగక యక్కలికి యక్కడనే దాచెను. మఱి వసంతుఁడును రెండు మూఁడు దినములలో నిల్లుజేరి యభీష్ట కామంబుల సంతుష్టి నొందుచుండెను.

ఇట్లుండి యొక్కనాఁడు రేయి నాదంపతులు పెద్దయుం బ్రొద్దుఁ గంతుకేళులం దేలియలసిసొలసిగాఢనిద్రాపరవశులై యున్న వేళఁ జూచి యానీచురాలు మెల్లన నవ్వజ్రసంగ్రహించి యొకరాయిమీద దాని యర లరుగదీయఁ దొడంగిన నారాజకుమారునికి మరణావేదన యావిర్భవించి నిట్టూర్పులతో నిట్టట్లు గొట్టుకొన దొడఁగిన నారా యడి కచ్చేడియ మేల్కని పతిని లేపియు లేవకున్నఁ దొందరపడుచుఁ దలయంపినున్న వజ్రను వెదకి గానక తటాలున ముసలిదియుండు గదిలోని కేగుటయు నది వేగిరించి వజ్రయర లరగదీయుచుండ నీక్షించి

యేమే నిర్భాగ్యపుముండా ! యిట్టిద్రోహకృత్యమున కొడిగట్టితివి ? ఆయన నీకేమి యపకారము గావించెనే. కటకటా ! నిన్ను జనని యని నమ్మినందులకు మంచి యుపకారము గావించుచుంటివి. అయ్యో! నేనేమిచేయుదు నెవ్వరు దిక్కని పెద్దయెలుంగున నేడ్చుచు నవ్వాలయాడఁ బెరికికొనిన నక్కలికితో నది యిట్లనియె.

పట్టీ ! యూరక నన్నేల దిట్టెదవు ? నీమగఁడు చెప్పినగుట్టు వట్టిదో నిజమోయని పరీక్షార్థమైయిటు గావించితినిగాని ద్రోహబుద్ధిగాదు. ఇంతమాత్రమున నతనికి నిజముగా నాయాసముసంభవించినదే చూతము రమ్మని యాగదిలోనికరిగి యతనిం జూపి వెఱయరలు నిశ్శేషముగా నరుగదీయలేదు గాన నించుకప్రాణము గలిగి యున్న వాఁడు గాని యూరహస్యమది గ్రహింపలేక చచ్చెనని మిగుల నానందమందుచుఁ బైకిఁ గళావతికన్న నెక్కుడు చింతించుచు నామెతో నిట్లనియె.

అబలా ! ప్రమాదవశంబునం జేసితిని. కానిమ్ము నేనొక సిద్ధౌషధమువలన వీనిం బ్రతికించెద నీవు చింతింపకుము. చింతించి నచో బ్రతుక నేరఁడు. దానికి ముందు నీవు సముద్రోదకంబులఁ దలయంటుకొనవలయు ఆలస్యముచేయక యందుఁబోదమురమ్ము. అతని వియోగము నీకన్ననాకు వ్యాకులముగానున్నది. అని పలికినఁ బాపమక్కలికియదియు నిజమని నమ్మి చింతించుటమాని యమ్మాయలాడితో సముద్రతీరమున కరిగినది.

అప్పుడది పట్టీ ! వట్టినేలం గూర్చుండి తల యంటుకొనరాదు అల్లదిగో ప్రాంతమున నెద్దియో చిన్నదోని గాన్పించు చున్నది. దానిమీద గూర్చుందువు గాని రమ్మని యచ్చటికిం దోడ్కొనిపోయి యానావ కొనబల్లమీఁదఁ గూర్చుండబెట్టి యొడలు నలుగిడి కన్నులు మూసికొమ్మని తలమీఁద పులుసుపోసి యొకచేతరుద్దుచు రెండవ

చేత జిరుకోలతో నద్దోని త్రోసికొని యొకనిమిషములోఁ బెద్ద యోడయొద్ద కరిగినది.

అప్పుడు తల రుద్దుటమాని కన్నులం గడిగినం జూచి యాచకో రాక్షి నలుదెసలంబరికించి యెుదును భూమింగానక పెద్దయోడ గాంచి యాముసలిదాని కపటం బెఱింగి యిట్లనియె. ఓసీ పాపాత్మురాలా! నామగఁడచ్చట గతచేతనుఁడై పడియుండ నన్నిక్కడి కేల తోడ్కొని వచ్చితివి. నీయభిలాష యెద్దియో చెప్పమూరక యేల శ్రమపెట్టెదవు. నన్నుఁగూడ జంపినం జంపుము. నీకపటమెఱుంగక బంగారమువంటి కాపురము నీటఁగలుపుకొంటినే!

అయ్యో! యెంతకపటము బన్నితివి. కటకటా మన్మథునిఁ బోలు నామగని నిరపరాధిం జంప నీకు జేతులెట్లాడెనో. ఛీ! కఠినచిత్తురాలా నీమొగము జూచినం బాతకమువచ్చునే. ఇదిగో నీవు జంపకున్నను ప్రాణేశ్వరుంబాసి నిముషమైనను దాళజాల. ఈసముద్రోదకంబులంబడి లోకాంతరమున నతనిం గలిసికొనియెద నని లేవఁబోవుటయు నట్టిపట్టుకొని లేవనీయక యదియోడవాండ్రం జీరి దీనిలోనికి గొంపొండు డని యాజ్ఞాపించిన వారు బలాత్కారముగా నా నారీమణినోడలోనికిఁ దీసికొనిపోయి రమ్యమైన యొక గదిలోఁబెట్టి తలుపుబిగించిరి.

పిమ్మట నాముసలిదియు నోడయెక్కి సరదారులకుఁ బడవ నడుపుఁడని యాజ్ఞాపించి తానుగూడ నాయువతియున్న గదిలోని కరిగిమగనిందలఁచి నొగిలిన చిత్తముతో నుత్తలపడుచున్న యప్పడుచుతో నిట్లనియె.

కాంతా! నీకాంతుఁడు లోకాంతరమున కరిగెను. చింతించిన మరల వచ్చునా? విను మతనికన్న భాగ్యంబునను రూపంబునను యౌవనంబునను నధికుఁడైన వాని నీకుఁబతింగావింతు. పదిదినములు

సైరింపుమని యెన్నియో ప్రియోక్తులు చెప్పినదిగాని యవియన్నియు
చెడచెవులంబెట్టి పట్టరాని యలుకదానిఁ బెక్కు గతులఁ దిట్టుచు
దైవంబును దూరుచుఁ దనకుఁదాన నిందించుకొనుచుఁ బెక్కుగతుల
వగచుచుండెను.

ఆనావయు మంచిగాలి వీచుటచే నాలుగుదినములకే వంగదేశపు
రేవుచేరినది. తోడనే ముసలిది ఫిరంగియొకటి వేయించిన నాధ్వని
వలన నేకార్యసూచనము తెలిసికొని యాభూపాలుండుచితపరివారముతో
నాయోడఁజేరి ముసలివానివలన నన్నెలంత వృత్తాంతమంతయు విని
సంతసించి యాచెల్వంజూచి యూర్ధ్వలి యొక్కింత వడికిఁ దెలిసి
మోహమాపలేక యప్పుడ యప్పుడంతయుఁ గూడఁ దలంచెను.
అమ్ముసలిది యొప్పుకొనక కొన్ని దినములు మచ్చిక జేసినంగాని
యిచ్ఛగింపదని యడ్డుపెట్టిన నతండు సమ్మతించి యొకయాందోళిక
మున నబ్బాలికామణిం గూర్చుండబెట్టి తలుపులు బిగించి యపూర్వ
మగు నొక యంతఃపురముఁ జేర్చెను.

అందుఁదగిన పరిచారికలఁ బెక్కండ్ర నునిచి యవ్వనిత
మనసువచ్చిన యుపచారములఁ జేయించుచు నొక్క నాఁడంగజ
తాప తప్తుండయి యతండచ్చేడియ గవయంబోయిన నామెయు
నప్పటికి దనకేమియుం దోచమిం జేసి యెద్దియో వ్రతమిషచే
సంవత్సరము మితిఁ గోరినది.

ఆ భూపతియు బలపద్రితి కభిమతములేక యట్టి మితి నిచ్చి
దిన మొక్క యుగముగా గడుపుచుండెను. అని యొతిఁగించి యంత
లోఁ బ్రయాణ సమయ మగుటయుఁ గథజెప్పటచాలించి యయ్యతి
గోపా! పైకథ మందటిమజిలీలో జెప్పెద. నేఁడు నడువవేళ యైనది.
లెమ్మనవుడు వాఁడు తర్వాయికథవిన వేగిరపడుచుఁ గావడియెత్తు
కొని యాసన్యాసితో నడుచుచుండెను. అయ్యతియు మానం

బవలంబించి పఞ్చాక్షర జపంబు గావించుచు నడుచుచుండ వాఁడు వినినకథయంతయు జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుచు నడుమనొకసారి యయ్యో! యావసంతుఁడు మరల బతుకునా యనియు వేరొకసారి యారాజకుమార్తె మరల జేరునా యనియు నతఁడు మరల మిత్రులతోఁ గలిసికొనునా యనియు వారందరు నింటి కరుగుదురా యనియుఁ బల్కరించుచుండ హస్తసంజ్ఞచే వారించుచు నయ్యతి క్రమంబున మధ్యాహ్నపు మజిలీచేరెను.

అయ్యతి మునువ్రాలె నట ననుష్ఠాన మంతయు దీరిన వెనుక వంట జేసికొని భుజించి యలసటదీరిన కొండొకవడికి నొక చల్లని ప్రదేశమునఁ గూర్చుండి భోజనమైనది మొదలు కథ చెప్పుమని వేపుచున్న యాగొల్లవాని కిట్లని చెప్పఁదొడంగెను.

---

మూఁడవ మజిలీ.

# రా ము ని క ధ.



గోపా! వినుమట్లు దక్షిణపు దెసకు మట్టికొమ్మమీదుఁగా నరిగిన మంత్రిసూనుఁడైన రాముఁడు నాల్గుదినములు సులభముగా నడిచి మఱిరెండునాళులు ప్రయాసముగా వంగి నడుచునంత నంతము గాన్పించినది. కాని యదియొక పర్వత ప్రాంతభూమిగా నున్నందున నందలి విశేషములరయఁ దలఁచి యాశాఖదిగి నడువ నొక గొప్ప పర్వతము గానఁబడినది. దాని యౌన్నత్య మరసెదంగాక యని యతండది యెక్కనారంభించెను. సాయంకాలమైనను శిఖరము గాన్పించినదికాదు. ఆరేయి నట ఫలాహారమున నాకలి యడంచుకొని మరలఁ దెల్లవారినతోడనే యెక్కనారంభించెను. సాయంకాల

మయినను దుద యగుపడలేదు. మును వ్రాలె నట వసించెను. మరునాఁటి రాత్రికిని శిఖరము మిగిలియేయున్నది. ఈరీతి నారుదినములు నడచినను శృంగము గనంబడ నందులకు వెరగందుచు నతండౌరా! యిదిచూడ నెంతయో లేనట్లుండు యెక్కినకొలఁది మిగిలియే యుండెను. ఈకొండయౌన్నత్యము మిగుల వింతగా నున్నది. దీని రేపుమాత్రము పరీక్షించి కొనగనంబకనిచో మగిడెదంగాక యని నిశ్చయించి యారేయి గడిపి మరునాఁడు చీఁకటి పడుదనుక నెక్కి చివర జూడలేక విసిగి మగుడఁ దలంచు నంతలో నందొకగుహ గాన్పించినది. దానింజూచి ప్రవేశింపం దలంచి రాత్రివేళ యగుట కొంచెము భయముజెంది యారాత్రి యాగుహాముఖంబున నివసించి మరునాఁడుదయంబున దానింబడి ధైర్యసాహసంబులే తనకుఁ దోడురా నరిగెను.

సాధారణమైన వెలుఁగుగల యాగుహాలోఁబడి పోవంబోవఁ గ్రమంబున నది యల్పమగుచుండుట నిలిచి నడచుటకు వీలు లేక గొంచెము వంగియే నడువఁదొడంగెను. మఱియుం బోయినకొలఁది గుహ చిన్నదియు జీఁకటి యెక్కుడగుచుండ నడువశక్యముగాక మగిడి పోవుదమని యాలోచించి వెనుకకుఁదిరిగి దారియే కాన్పించినది కాదు అప్పుడతనికి వచ్చినదారియుఁ బోవలసిన దారియుం దెలియక దట్టమగు చీఁకటిలోఁ జేతులఁ దుడిమికొనుచుఁ గొంత దనుకఁ బ్రాకియే యరిగెను. పైననెట్లును శరీరము పట్టునంత యవకాశము లేనందున నప్పుడతనికి ధైర్యమాగినదికాదు. మరణభీతి జనించి యకటా! దైవము నన్నిచ్చటికిఁ జావఁదోడ్కొని వచ్చెనే? నా సాహసమే నన్నింత జేసెనుగదా! మట్టికొమ్మతుద గానంబడిన తోడనే మగుడకయీపర్వత మేటికెక్కితిని? ఎక్కియుఁ బయట నరుగక గుహఁజొరనేల? సొచ్చియు చీఁకటి బలియుచుండ మగుడక

యింత దవ్వురా నేల ? ఇదియంతయు దైవికమేగదాయని యూహించి ధైర్యముతో నిట్లు తలంచెను.

మ. ఎట నెవ్వానికి నెన్ని రేల్సుఖముగా ♦ నీ దుఃఖముల్గాని వి
స్ఫుటపూర్వా చరితాత్మకర్మవశతన్ ♦ భోక్తవ్యమై యుండునో
ఘటనాచాతురిఁ దాఁ ద్రిప్పుఁగట్టుచు బలా ♦ త్కారంబుగా వాని న
చ్చోటికిం దోడ్కొనివచ్చి దానిగుడిపిం ♦ చున్ దైవమన్నాళ్ళగిన్.

అని బాల్యంబున నాచార్యుండు సెప్పినపద్యము జ్ఞప్తికి తెచ్చుకొని నాకు మరణమయ్యెడుఁగాని మరియేమియుఁ గాఁగలదు. అది యెల్లరకు జన్మము తోడనే వచ్చుంగదా ? దానికై చింతయేటికి ? అనుచు భగవదాయత్త చిత్తుండై మఱి రెండు బారలు ప్రాకిన తోడనే కొంచెము వెల్తురు గనుపించినది. దానియాధారమున మఱి రెండు గజములు నడిచిన నందొక కెలనఁ గవాట మొకటి చేతులకుఁ దగిలినది. అది పట్టిలాగిన మణిప్రభలచే బట్టపగలుగానున్న యొకగదియందు దపంబొనరించుచున్న మహర్షిం గాంచి హర్షంబున మేనుపులకింప మరణభీతి విడిచి యమ్మహానుభావు పాదంబుల ముంగల సాష్టాంగ మెరగి యట్టె లేవకున్న యొక్కింతవడి కయ్యోగీంద్రుఁడు గన్నులం దెరచి పాదంబులం బడియున్నవానిఁ గృపగదుర లేవనెత్తి యోరీ ! నీవెవ్వండవు విధ్విపిన గుహాంతరాళమున కెట్టు ప్రాణములతో వచ్చితివి ? చెప్పుమని యడిగిన నతఁడు నమస్కరించి తన కథ యంతయుఁ జెప్పి రక్షింపుమని వేడుకొనియెను.

అయ్యోగియు నతని సాహసమునకు మెచ్చుకొనుచు యీనో! పండ్రెండేండ్లకు నొకసారి బాహ్య ప్రచారము గలిగిన నాకీదినముననే యట్టిమితి యగుటచేఁ గనులఁ దెరచి నీతో మాటాడఁగలిగితిని. లేనిచో నీవు వృధాగాఁ జావవలసివచ్చును. ఈగుహాయందు వచ్చుటకేగాని మరలఁబోవుటకు దారి గనఁబడదు నీమనోధైర్యము

గొనియాడఁ దగియున్నది. నీకేమి కావలయునో కోరుమనుట యు నతం డంధకారబంధురంబగు గుహాంతరాళమున నుండి తెరపిగల ప్రదేశము జేరుటకంటె వేరొండు వరమని తోచమింజేసి తన్ను బాహ్య ప్రదేశంబున జేర్పుమని వేడిన నమ్మునియు వానిఁ గన్నుల మూసికొమ్మని యెద్దియో జపించినంత రాముండు తత్క్షణం బక్కొండ యవ్వలి భాగంబు సేరెను.

అట్టివిశేషము గన్నులు దెరచి చూచి మునిప్రభావమునకు వెరగందుచుఁ దన్ను మరల జనించిన వానిగా భావించి యావట వృక్షముజాడ నేమూలను గానక హాహా మోసము వచ్చె నే, నా మది భ్రమసినది. అమ్ముని వరమిచ్చినప్పుడ యామఱ్ఱి మొదలు జేర్పుమనక మఱియొక లాగున గోరితినే యిపుడది యేదెస నున్నదో తెలియదు. ఎట్లు మొదలు చేరుదునని పశ్చాత్తప్త చిత్తుండై నడువ సాగెను.

అట్లుసాయంకాలము దనుక నడిచినను గ్రామమేదియుఁ గానంబడలేదు. విశాలమగు నొకచూతవృక్షము గనంబడినది అదియు నివాస యోగ్యముగానుండ నారాత్రి దానిమూలమునఁ బరుండి తన పయనపు విశేషమును గుఱించి చింతించుచుండ నిద్దుర పట్టక రెండుయామములదాక మేలుకొని యుండెను. అట్టి యెడ నాచెట్టుమీఁద గూటిలోనికి రెండు గరుడపక్షులు చేరి యిష్టములైన మాటలం జెప్పకొనఁ దొడంగెను. అందాఁడుపక్షి మగపక్షి కిట్లనియె.

నాథా! మీరు అనేకభూములు తిరిగి వచ్చితిరిగదా. ఎందేని వింతలు చూచితిరేని నుడువుఁ డని యడిగిన దానికా పతంగపుంగవం బిట్లనియె.

కాంతా! నేఁడెందును నేవింతయుఁ జూడలేదు. వచ్చుచుండ నిచ్చటికి రెండుయోజనముల దూరములో నొకపట్టణముగలదు.

ఆపట్టణపురాజునకు లేకలేక యొక కూఁతురు గలిగినది. దాని చక్కఁదన మీమూఁడు లోకములంగల యంగనలకు లేదు. పాప మాపూఁబోఁడికిఁ గొలఁది కాలమైన దెద్దియో రోగమునఁ గన్నులు గాన్పించుట లేదఁట. అట్టిసొగసుగల మగువకుఁ గన్నులు పోఁగొట్టిన నలువం దిట్టుచుఁ దల్లిదండ్రులేగాక పౌరులు గూడ పూర్తిగా భుజించుట మానివేసిరి.

ఆరాజు లక్షలకొలఁది రొక్కము కరుచుపెట్టి పెక్కుచికిత్సలు చేయించెనుగాని దానికన్నులు చక్కఁబడినవి కావు.

మ. ద్విజవంశోద్భవుఁడైన భూపుఁడయిన ♦ విద్వద్వర్యుఁడైనన్ జఘ
న్యజుఁడైన న్ఘనుఁడైన నీచకులుఁడై ♦ నన్మత్తనూజాత నే
త్రజరుగ్దోషము వాయ నెవ్వఁడు చికి ♦ త్సంజేయునో వానికిం
ద్రిజగంబుల్గన నిత్తు నత్తరుణి ధా ♦ త్రీరాజ్యయుక్తంబుగాన్.

అని చాటింపించు చున్నాఁడు.

నేఁడాపట్టణము మీఁదుఁగా వచ్చుచున్న నాకీవింత మాత్రము కనంబడినది. ఇంతకన్న నెద్దియుఁ జూడలేదనియె. ఆమాట వినిన తోడనే యప్పతంగాంగన జాలిపడి అయ్యయ్యో! పాపమంత సంపదయు సౌందర్యమును గలిగిన చెలువ గుడ్డిదిగా నున్నదని వినిన నాకునుంగూడ విచారమగుచున్నది. అట్టియంధత్వంబు వాయఁజేయ వైద్యుండొక్కండునప్పుడమి లేఁడాయని యడిగిన మరల విహగపతి యిట్లనియె.

బోఁటీ! మన గూటియందున్న యీపసికాష్ట మరగఁదీసి యాగంధ మాపద్మగంధి కన్నులం బట్టించిన జక్కంబడునుగాని వేరొక్కయోషధి నేవైద్యుండును బాగుసేయలేడని చెప్పి యాపక్షిపతి యాసతితో రాత్రిశేషము గడిపి యుదయమున నెందేనిఁ జనియెను.

పక్షిభాషను గుర్తెఱింగిన రాముఁడు చెట్టుక్రిందఁ బరుండి యాపలుకులన్నియు వినియున్నకతంబున నుదయకాలమున నాచెట్టెక్కి యక్కులాయమందున్న వసికాష్టము సంగ్రహించి యత్యంత సంతోషముతో దిగి సాయంకాలమునకే యాపట్టణముఁ జేరెను.

అందొక బ్రాహ్మణ గృహమందు భుజించి వీధివేదికమీఁదఁ బండుకొనియుండఁ బౌరులా నారీమణి చక్కఁదనముం గుఱించియే చింతింపసాగిరి అట్టిమాటల నాలింపుచు నతం డారాత్రి యొక యుగముగా గడిపి తెల్లవారినయంత నెంతేని సంతసముతో నారాజ నిశాంత ప్రాంతమునకరిగి "రాజనందన కన్ను లేను జక్కబరతునని" వక్కాణించినంత బదుగురు చుట్టుకొని యతని రాజునగరికిఁ దీసికొని పోయిరి.

ఆధాత్రీపతి యావార్తవిని యశ్రద్ధజేసి చాలుచాలు! నిట్టి వైద్యులనేకులయిరి ఏటికి నీశ్రమయని మొదట నీసడించెను పదంపడి యతనిమాటల పాటవమునుబట్టి యెట్టకేలకొడంబడి యక్కన్యం జూపించుటకై తగిన పరిచారికల నియమించెను.

వారితోఁగూడ గన్యాంతఃపురమున కరిగి రాముండందర దూరముగాఁబొమ్మని తానొక్కరుండ యయ్యండజయానదండకరిగి తదీయతారుణ్య రామణీయమున కచ్చెరువందుచు నల్లన నయ్యౌషధీ కాష్టం బరుగఁదీసి యాగంధంబు గన్నులకుఁ బట్టించిన వెంటనే యవి యపూర్వతేజంబునం బ్రకాశిల్లుటయుఁ జూచి యాచకోరాక్షి సంభ్రమాశ్చర్యసంతోషకలిత మానసయై యెదుర నాశ్వినేయ స్వరూపంబున నిలిచియున్న యామంత్రి నందనుం దిలకించి మేను పులకింప నమస్కరించుచు "నీవ నాభర్తవు. నాపుణ్యంబు ఫలించె" నని యనురాగ సూచకములగుచూపు లతనిపైఁ బరగించుటయు నతండును గ్రుచ్చియెత్తి గారవించుచుఁ దనసంతోషము వెల్లడించెను.

అట్లాండ్రోరుల మనంబులు గలిసికొనిన పిమ్మట నావృత్తాంత మంతయు నాధరాకాంతుండు విని యత్యంతప్రహర్షంబున నతని కులశీలనామంబులం దెలిసికొని మఱియుం జెలంగుచు దైవమును వేదరంగులం గొనియాడి శుభముహూర్తంబున నతని కారాజ్య ముతోఁ గూఁతునిచ్చి వివాహ మాచరించెను.

అట్లు రాజ్యముతో మిగులరూపవతియగు నామగువను స్వీకరించి యతండయ్యంగనతోఁ గొన్ని దినంబు లీడు లేని వేడుక లనుభవించుచు నొక్క నాఁడాప్తులవృత్తాంత మంతఃకరణగోచరమగుటయు నేకాంతముగాఁ గాంతతో నిట్లనియెను.

ప్రియసీ! మేమేగురము మిత్రుల మొక్కసారి యిల్లువెడలి దేశాటనముఁ జేయుచు నొక వటవృక్షమూలగా విడిపోతిమి. వారి జాడయేమైనదో తెలియదు. మేమనుకున్న మితియుఁ గడచినది. కావున నట్టిమిత్రుల వెదకివచ్చెద సెలవిమ్మని యడిగిననమ్మగువయు విడువలేక యెన్నియో ప్రతికూల వాక్యముల జెప్పి యెట్టకేల కతని యనునయవచనంబులచే నొప్పుకొనినది. అట్లు భార్యతోఁ జెప్పి యొరు లెఱుంగకుండ నతండొక నాఁడర్ధరాత్రంబున మిక్కిలి జవముగల తురగమెక్కి యొక్కరుఁడయ్యూరు వెడలి యడవిమార్గంబునంబడిపోయెను. సౌహార్ద్రచిత్తులు భోగములం గణింతురా? అట్లైన తెగని యడవిలో మఱునాఁడు రెండుయామముల ప్రొద్దెక్కినదాక నేకరీతి ప్రయాణము చేయుటచే మిక్కిలి నలసటఁ జెంది గుఱ్ఱము నడువఁజాలక యొకచెట్టు కడ నిలుచుటయు నతండదియెఱింగి దానిందిగి ప్రాంతమందున్న జలాకరంబున వారువముతోఁ గూడ నీరుద్రావి ఫలాహారమున నాఁకలిఁదీర్చుకొని మిగుల నెండగానుండుటచేఁ దరినున్న తరువునీడ గుఱ్ఱమును గట్టివైచి యొక్కింతవడి విశ్రమించెను.

అయ్యవసరంబున దిక్కుడ్యంబులు బీటలు వారజేయు నొక్క యద్భుతధ్వని వినంబడెను నిరాయుధుండగు నతండాభయంకర స్వరమునకు వెరచి మిక్కిలి పొడవగు నయ్యగమాగ్రంబున కెగ బ్రాకునంతలో ననంతవేగమ్మున వాలమ్ము విదల్చుచు సింహంబొ కం డార్పులడర నయ్యెడ కరుదెంచి చెట్టుమొదలంగట్టియున్న మేలి గుఱ్ఱమును బిట్టు కొట్టుకొనుచుండ మెడబట్టి యీడ్చుకొని పోయినది.

పిమ్మట నాపురుషసింహము, సింహము దవ్వుగా నరిగెనని యెఱింగిన వెనుక యల్లన నత్తరువుదిగి యుల్లము తల్లడిల్ల మెల్లన నడువఁజొచ్చెను. ఇంతలో నతనిస్వాంతమున నున్నదురంత చింతా ధ్వాంతమునకు దోడుగా శేషడహగిరి శిఖర పరిసరమున కటుగఁదెసల జీకటులుగాటుక బూసినరీతి నావరింపం దొడగెను. భయంకర మృగాక్రాంతమగు నక్కాంతారంబునఁ జీకటిఁని ద్రోవగానక నడుచు నప్పుడతండాయుధమాత్రసహాయంబైన లేమింజేసి జీవితేచ్ఛవదలి దైవమునే ధ్యానింపుచు నరుగ నరుగ మఱియు నంబరతలమ్మున మేఘమ్ములుగ్రమ్మి యుఱుముల నాకసంబరులఁ దళుక్కురని మెఱయు మెఱుపుజూపులకు మిరిమిట్లుగొలువఁ బ్రభూతవాతంబుతోఁ బెనువా నగురియఁజొచ్చెను. ఆజడి కతఁడు గడగడ వడంకుచు నడుచు నెడ నొకపెడ మెరుపుల వెల్తురున నమ్మవారిగుడి యొకటి గనంబడిన దాని మంచిచెడ్డల విచారింపక శీతభీతిఁదలుపులఁ ద్రోచికొని యందుఁ జొరబడి గుమ్మమునఁ దడిగుడ్డలఁ బిండుకొనుచుండెను. ఇంతలో నొక నెలంత యాక్రందన ధ్వనితోఁ గొందఱు పురుషుల తర్జనధ్వనులు వినంబడిన భయపడి యతఁడు గర్భాలయమున కరిగియందు మిక్కిలి గొప్పదియగు చండికావిగ్రహము మాటున దాగియుండెను.

అంత నొకకాంతం దోడ్కొని భయంకరాకారులగు తస్కరు లిరువురు విచ్చుకత్తులతో నగ్గుడిలోఁ బ్రవేశించిరి. ప్రవేశించునప్పు

డమ్మవారి మాటుననుండి రాముండు మెఱుంగు వెలుఁగున మెఱపు
తీగ ఛాయుంబోని యమ్మానినిఁ బిక్కలదనుక త్రేలాడు నల్లని సోగ
వెండ్రుకలం బట్టితిగుచు కాటుక కొండలవంటి దొంగల నిరువురం
జూచి యప్పడంతియెడఁ గనికరము వొడమినను నప్పటికేమియుఁ
జేయరామిఁ దఱి నరయుచుండెను.

ఆచోరులు నడిదంబుల నొక మూలనిడి యాహోరియాలు
గోలుమని యేడ్చుచు శోకావేశంబున మూర్ఛ మునింగియుండ వార
లొండురు లిట్లు సంభాషించుకొనిరి.

చార్వాకుఁడు—ఓరీ! భుజంగా! మనకిదివరకీ యమ్మవారికిఁ
దొంబదితొమ్మండ్రు చక్కని రాజకన్యకల బలియిచ్చితిమిగదా! దీని
తో వ్రతము పూర్తియగును. ఇఁక మనకీచండిక రేపు వాంఛితము
నియ్యఁగలదు.

భుజంగుఁడు—చార్వాకా! మనముగావుననింత యసాధ్యమై
న వ్రతమును బూర్తిఁజేసితిమి. మఱియెవ్వరైన నూఱుగురు చక్కని
రాజకన్యలందెచ్చి బలియియ్యఁగలరా? ఇంతపని జేసినవారి కమ్మ
వారు వరమియ్యక యేచెరువు నీరుత్రాగఁగలదు?

చా—మనమిదివరకు బలియిచ్చిన ముచ్చెకంటులలో నింత
చక్కనగు నెలంత లేదుసుమీ.

భు—లేదని సందియముగాఁ బలుకుచున్నావు; దీనికతనెఱుఁగ
వు కాఁబోలు. ఆరుమాసములక్రిందట దీనితండ్రి స్వయంవరమునకై
పెక్కండ్రు రాజకుమారుల రప్పించెనుగాని వారిలో నొక్కరినిఁ దన
చక్కఁదతమున కీడుకాదని వరించినదికాదు. నేనప్పుడుచూచియే
దీనిగుఱించి చింతించుచు నేఁటికి పనిపట్టితిని.

చా—ఇట్టియోగము దీనికుండగా నెట్లువారిని వరించును!

భు—ఔనుగాని. చార్వాకా (నాకీకామిని సోయగముజూచిన నొక్కసారి భోగించి పిమ్మట నమ్మవారికి బలినియ్య నూహాపుట్టుచు న్నది. దీనికి నీవేమనియెదవు?

చా—ఛీ! ఛీ! అట్లుచేసిన అమ్మవారికిఁ గోపమువచ్చి వర మీయదుసుమీ!

భు—అమ్మవారివరముదీనిసంభోగసౌఖ్యమునకన్న నెక్కువా?

చా—అయ్యయో! యెక్కువదికాదా? నిజముగా నామెకుఁ గోపమువచ్చిన మనము భస్మముకామా?

భు—ఆలాగైనచో నీవడఁతి నమ్మవారికి బలియే యియ్య వలదు నేనేపెండ్లియాడెదను. బలికై వేరొక రాజకన్యం దెత్తముగాక.

చా—ఓహో! గడుసువాఁడవే. నీవేనా మగవాఁడవు. నాకు మాత్రము చక్కనిభార్యదొరకిననిష్టము లేదనుకుంటివాయేమి? అట్ల యిన నేనేపెండ్లియాడెదను.

భు—చార్వాకా? ముందరనీసంగతినీవు తెచ్చితివా, నేను తెచ్చితినా, నిజము సెప్పుము.

చా—ఎవరు తెచ్చిన నేమి దీనిహక్కు యిరువురకు సమానమే

భు—ఇంతమాత్రమునకై హక్కులుస్థిరపరచవలెనా? జగడ ముసేయకు పోనీ, అమ్మవారికే బలి యిత్తములే.

చా—అట్లయిన నాకుసమ్మతమే.

అని యిట్లాండొరులు మాట్లాడుకొనుచు గొంచెము సేపటికి నిద్దురపోయిరి. ఆసమయములో మేలుకొని వారిమాటలన్నియువినిన రాముఁడు వారినప్పుడు చంపనుంకించుచు నిద్రితులం జంపఁగూడ దను నీతిపాటించి వారికత్తులను సంగ్రహించి ధైర్యముతో నిదుర బోకయే యారాత్రిగేగించెను.

అంతనాతస్కరులు వేకువజామున మేలుకొని కత్తులు వెదకి కానక గుడిబయటికివచ్చి నలుదెసలం బరికించుచు నెవ్వరినింగానక యిది యమ్మవారిమాయ యేమోయని వితర్కింపుచుండ గుడి లోనుండి రెండుచేతుల రెండుకత్తులు నమర్చుకొని యొక్కగంతున రాముడు బైటకురికి తస్కరులు బెదర నోరీదుర్మార్గులారా! రండు. దుర్గకు మ్రొక్కుడు మీశిరంబుల ఖండింతు. చండికకు బలినియ్యం దెచ్చిన వనితను జెరుపందలంచిన మీపాప మూరకపోవునే? శక్తికి భృత్యుంశ. ననుజూడుడని యడిదములం బెదరించుచుండ వారు బొమ్మలవలె కదలకనిలిచి యేమియుంబలుకనేరక పారిపోవదలంచు నంతలో నతండయ్యడిదముల వారితలల నొక్కొక్క వేటున నరికి యమ్మవారికి బలియిచ్చెను.

పిమ్మట నతండాలయములోనికరిగి దేవికిమ్రొక్కి మొగులు మఱుంగున మెరయు మెరపుతీగవలె విడిన పొగవెండ్రుకల నడుమం దళుక్కుమని మెఱయు నత్తరుణిమైదీగ కన్నులకు విందొనరింపంజేరి నారీమణీ! లెమ్ములెమ్ము నీచింత వాసినది. దొంగలు హతులైరి. తెల్ల వారినదనుటయు నప్పలుకులు రోగార్తునకౌషధమువోలె నన్నాతికిం జేతవంబిచ్చిన నల్లన కన్నులందెఱచి యెదురం రాముండోయనంబ్రకా శించు రామునింగాంచి హర్ష పులకిత గాత్రియై యక్కాంచనగాత్రి చిన్న యెలుంగున నిట్లనియె.

మహాత్మా! నీవెవ్వరవు? నిన్నుజూడ నాపదంబుధిమగ్నయై యున్న నన్నుద్ధరింప నేతెంచిన భగవంతుండవని తోచుచున్నది. మీవృత్తాంత మెఱింగింపుడు. ప్రాణదానంబొనరించిన మీకుంబ్రతి చేయనోపనిదే కృతజ్ఞతాసూచకముగా వందనంబొనరించెదనని యతని పాదంబులంబడిన రాముండును లేవనెత్తి యత్తరుణి నోదార్చుచుం దన యుదంత మెఱింగించి మరల నత్తరుణి వృత్తాంత మడిగిన నదియిట్లని చెప్పందొడంగెను.

ఆర్యా! నేను కుంతల దేశాధీశ్వరుఁడగు కుసుమకీర్తి యనురాజు కూఁతురను. నాపేరు కనకప్రభ. నాకుఁబ్రాయమువచ్చినది మొదలు నన్ను వరించుటకుఁ బెక్కండ్రు రాజపుత్రులువచ్చిరికాని నాసమ్మతిలేక నాతండ్రి నన్నెవరికి నియ్యక స్వయంవరముఁజాటించిన నందు వచ్చిన నృపనందనులను సుందరము నాకు సరిపడమని నెవ్వరి వరింపక యూరక మరల నంతఃపురమున కేగితిని. ఆయీర్ష్యమనమున నిడుకొని యేరాజకుమారుఁడు ప్రోత్సాహపరచెనో కాని మొన్నటి రాత్రి మాయింట నంతఃపురమున నిద్రాపరవశనై యున్న నన్ను గన్నము వైచి యీదొంగలు దీసికొనివచ్చిరి నాకు నడవిలో మెలకువ వచ్చినది. చేయునదిలేక యూరక యేడ్చుచుండ నిన్నటిరాత్రి కాతస్కరులీగుడి లోనికిఁ దీసికొనివచ్చిరి. పైననేమిజరిగెనో దుఃఖమున నొడలెరుంగమి నాకుఁ దెలిసినదికాదు.

అట్టి దుర్మార్గులఁజంపి నాకుఁబ్రాణదానము జేసితిరి. దైవమీయాపన్మూలమున మీదర్శనము నాకుఁగలుగజేసెను. నేనిదివరకింత చక్కని పూరుషునెప్పుడును జూడలేదు. ఈశరీరము మీయధీన మైనది. నన్నుఁబెండ్లియాడి కృతార్థురాలిం గావింపుఁడు. నాపినతల్లి కూఁతురు పద్మగంధియనునది మిక్కిలి చక్కనిది. దానికి నడుమ నెద్దియో రోగమునఁ గన్నులుపోవుటయు దానితండ్రి యవి చక్కపరచినవానికి రాజ్యముతో నక్కన్యనిచ్చెదనని ప్రకటించి తుదకట్లు జేసెను. ప్రాణదానంబుజేసిన నిన్ను నేను పెండ్లియాడుట కేమియాశ్చర్యమని పలికిన నామాటలాలించి సంతోషముతో రాముండారామం గౌఁగలించుకొని యోహో! మరదలా! నీవా తెలిసినది. నీయప్పయగు పద్మగంధిని గన్నులిచ్చి పెండ్లియాడిన వాఁడను నేనే. నీచక్కఁదనమును గుఱించి నీయౌన్నత్యమును గుఱించిఁ పెక్కు సారులు పద్మగంధి నాతోఁ జెప్పినది. మేలుమేలు.

దైవగతి యెంతచిత్రముగా సంయోగ వియోగములఁ గావించు చుండును. అని యాశ్చర్యపడుచుండ నప్పుడుచు నతని బాంధవ్య మును గుర్తెరింగిన మీఁదట మించిన యనురాగముతోఁ పద్మగంధి యదృష్టమును వేతెరంగుల నభినుతింపుచుండఁ నతఁడు దానినప్పుడు గాంధర్వవిధి వివాహంబాడి యక్కత్తుల రెంటిని జేతనమర్చుకొని నిర్భయముగా నయ్యడవిలో నామెతోఁ బ్రయాణము జేయుచు సాయంకాలమునకొక కోయపల్లెజేరెను.

ఆపల్లెలో నిళ్ళన్నియుఁ జిన్నవిగానేయున్నవి. కోయదొర యిల్లుమాత్రము కొంచెము పెద్దది. వానియింటి కరిగి యోదొరా! యీరాత్రి నివసించుటకుఁ గొంచెము చోటిచ్చెదవా? యని యడిగిన నతండయ్యంగన యందమునకు వలచి నవ్వుచు నిచ్చెద నీలాగున రండిఁ అని వారికొకగది చూపించి దానిలో బ్రవేశపెట్టెను. అడవి మృగమువంటి కోయదొరను మరులుకొలిపిన నత్తరుణీసోయగము వేరెవర్ణింపవలయునా?

మఱియు నాఁడారాత్రి యామెయందుఁగల మోహంబునం జేసి వారికిఁ దినుటకై మంచి గృహస్థునివలెనే పాలును తేనెయు మధురఫలములు లోనగునవి యందిచ్చుచు నభిప్రాయసూచకము లగు నాలోకనముల నాచకోరాక్షి నీక్షించుచుండెను. వారట్టి పదా ర్థములచే నాకలిదీర్చుకొని మిగుల నొగిలియున్న వారుగావునఁ బెందలకడ గాఢముగా నిద్రఁబోయిరి.

తరుచుగాఁగోయవాండ్రకు మంత్రములుతంత్రములుదెలియు నను విషయము లోకవిదితమే. అకోయదొర యట్టిమంత్రములఁ బెక్కునేర్చినవాఁడగుటమంత్రించిన యక్షతలుకొన్ని నిద్రించుచున్న యారామునిపైఁ జల్లిన నతండొకపక్కకైయె లేచి మొఱుగఁజొచ్చెను.

అయ్యోలుంగున నయ్యంగన మేలుకొని ప్రక్కలో మగనిం గానక తొట్రుపడుచు నలుదెసలం బరికింపుచుండ నాదండ కాకోయదొర యరుదెంచి సానీ! వెరవకుము. నేను నిన్ను వలచితి. నీకే కొదవయు లేదు. నన్నుం బెండ్లియాడి యీకోయరాజ్యం బేలుకొమ్ము ఇదిగో నామంత్రప్రభావము జూడుము. నీమగనిం గుక్కం జేసితి నరచుచున్నాఁడనిన విని యవ్వనిత గుండెలు ఝల్లుమన మూర్ఛిల్లి యంతలోఁ దెలిసి అయ్యో! దైవమా దొంగలనుండి చావు దప్పించుట నన్నీనీచున కొప్పగించుటకా? మంచిమగఁడు దొరికెనని సంతసించు నన్ను బైకెత్తి నేలవైచినట్లు జేసితివి. ఇంతకన్న మరణమే మేలు గదాయని పెక్కుతెఱంగుల లోలోపలఁ బలవించుచు; మూర్ఖునికడ నీతివాక్యములు చెల్లవని యూహించి మాయచే వానివంచింపఁ దలంచి యాచతుర కోయదొరకిట్లనియె

దొరా! నాపూర్వపుణ్యము మంచిది గనుక నీవు నాకు దొరకితివి. కాని యొక్కటియాలోచించుచుంటిని. నీకిదివరకున్న పెట్టకును నాకును బడుటకష్టముగదా! మనమిందున్నచో నదిచూచి సహించునా! దేశాంతర మరిగినచో నేబాధయు లేక సుఖింపవచ్చును. అక్కడ మంచిముహూర్తమున నిన్ను బెండ్లియాడెదననిన వాఁడందులకు సమ్మతించి కామపరవశుండై యున్నవాఁడు గావుననా రాత్రి భార్యాపుత్రుల గణింపక యా కనకప్రభమాట నమ్మి యూరు వెడలపోయెను.

అక్కలికియుఁ గుక్కమెడత్రాడు నొక్కచేతం బట్టుకొని రెండవచేత నాకత్తులలో నొకటిదీసికొని వానివెంట నరిగెను. అట్లయ్యిరువురు మరునాఁడు జాముప్రొద్దెక్కుదనుక నడవిత్రోవంబడి నడిచిరి. అప్పుడెండవేడిమియు మనోవ్యథయుఁ దన్ను బాధింప నయ్యబల బలముచెడి నడువలేక నేలం జతికిలంబడిన వాఁడామె కప

చారంబులు సేయుచు మంచిఫలంబులం దెచ్చి యిచ్చి యలసటఁబోఁ గొట్టెను.

మఱియు నడుచునప్పుడక్కోయ యబ్బాయితో మాటిమాటికిఁ "బెండ్లిమాట యేమిచెప్పితి" వని యడుగుచుండ మంచిముహూర్తమునఁగాని కూడదని యాప్రోడ యుత్తరము జెప్పుచుండెను.

వెండియు రెండుదినములయిన వెనుక నొకనాడా చేడియ వానితో నోరీదొరా? ఈమార్గమెక్కడికిఁబోవునో యెఱుఁగుదువా యని యడిగిన వాఁడిట్లనియె.

* పెట్టా! ఈదారి వంగదేశ రాజధానియగు హేలాపురంబునకరుగును. తరుచు నేనాదేశమునకుఁ గస్తురి జామరములు పునుఁగు జవ్వాజి తేనె మొదలగు వస్తువులు పంపుచుందును. దారి నాకు బాగుగాఁ దెలియుననిన నవ్వనితయు దియ్యనిమాటలు వాని మానసము లాగుకొని మరికొంత దవ్వరిగిన వెనుక నోరీ నీమంత్రశక్తి మిగులఁ గొనియాడఁదగియున్నది. మనుష్యుని నిమషములోఁ గుక్కనుఁజేసితివి మేలు మేలు. బాపురే యని పొగడుచు నీ సామర్థ్యము చూతము. ఈకుక్కనుమరల మనుష్యునిఁజేయఁగలవా యనియడిగిన వాఁడు సాని! నేనట్టి మంత్రము జెప్పకొనలేదు. దానిప్రక్రియ గుర్తెఱింగినవాఁడు హేలానగరములో సత్రపాంతమందున్న మఠములోనున్న బైరాగి యొక్కఁడే. నేనొకనాడు వశ్యమునకై యాయూరరిగినప్పు డతనితోఁ గొంతముచ్చటించి కొన్నిక్రియలు దెలిసికొంటిని. కాని యారహస్య మెఱింగించినవాఁడు కాఁడు. ఇప్పుడట్టి యవసర మేమియున్నది. నా పెండ్లిమాట యేమిచెప్పితివని యడిగిన వానికానాతియిట్లనియె.

---

* కోయవాండ్రలో మగవాని దొరయనియు, ఆఁడుదానిని పెట్టయనియు, పిలుచుట వాడుకగలదు.

ఈదినమునఁ బెండ్లియాడుటకు బాగుగానున్నది. మాకులాచారము చొప్పున ముందుఁ జెట్టునకు మ్రొక్కి పిమ్మటఁ బెండ్లియాడవలయుఁ గావునఁ గొన్నిపూవులఁ దెమ్మని నుడివినంత వాఁడెంతేని సంతసముతో నరిగి మోపెడు పూవులఁ దెచ్చియిచ్చెను.

ఆలతాంగియు నొకవృక్షమూలమున కరిగి యాకుక్కనందుఁ గట్టి విచ్చుకత్తియచ్చటనే నిలఁబెట్టియాకుసుమములన్నియు నాపాదపమునకుఁ బూజించి దాని మొదటసాష్టాంగమెరఁగి కొండొకసేపుభగవంతుని ధ్యానముచేసి లేచి దొరా! నీవుకూడ నిట్లుకన్నులు మూసికొని యీమ్రానునకు మ్రొక్కుము నీకుఁబెండ్లియగుననియె. వాఁడును బెండ్లి సంతోషముతోఁ గన్నులుమూసికొని యాపాదపము మ్రోలఁ జేతులు జోడించి నేలంబండుకొనియెను. వెంటనే బంటుతనముతో నారాచబిడ్డ యక్కత్తి చేతనమర్చుకొని యొక్కవ్రేటున వానితల నరికి మేనితో వేరుచేసెను.

ఊరక యొకనికపకారముఁ జేసినవాఁడు పుడమిఁబెద్దకాలము మన్ననా? అయ్యంగన వానింగడతేర్చి నారూపమేగదా నన్నిన్నిపాట్లు పెట్టినది. దీనింగప్పిపుచ్చినచో నన్నెవరు జూడరనినిశ్చయించి యొడల మసిఁబూసికొని యక్కోయగుడ్డలతో వికారమగు మగవేషమువేసికొని యాకుక్క మెడ త్రాడు గత్తియుఁజేతఁబూని నంగదేశరాజమార్గంబునంబడి కతిపయ ప్రయాణంబున నాహేలానగరముం జేరెను. అని చెప్పునంతలో. ప్రయాణసమయమగుటయు స్వాముల వారంతటితోఁ గథఁజెప్పుట చాలించి గొల్లవానిఁ గావడి యెత్తుమని చెప్పి వానితోఁగూడ క్రమంబున నాల్గవమజిలీజేరి యందు భోజనమైన తరువాత సుఖాసీనుఁడై యగ్గోపాలునకుఁ దరువాతకథ నిట్లు చెప్ప దొడంగెను.

## నాల్గవ మజిలీ.

# ప్రవరుని కథ.



గోపా! అడవిలో మఱ్ఱిమ్రాను పడమటికొమ్మ యెక్కి యరిగిన విప్రకుమారుఁడు ప్రవరుఁడు మూఁడు దినములు దానిమీఁద నడిచినంత నాశాఖాంతము గాన్పించినది. అతండంతటితో మగుడక మతియున్నందున నిందేవేని వింతలుండకపోవు. కొంతదూరమరిగి చూచెదంగాకయని శాఖదిగి యడవిగానున్న యచ్చోట సన్నని దారి యొకటి గానంబడుటయు దానింబడి నడువసాగెను. కొంత దూరమఱిగిన నచ్చట కొందరు విచ్చుకత్తులతో ముచ్చులెదురై యతనియొద్దనున్న మణికనక వస్తుసమితినంతయు దోచుకొనుటయే గాక విలువగల కట్టుబట్టలుకూడ నూడఁదీసికొని తమ మురికిగుడ్డలతనికిఁ గట్టనిచ్చి యథేచ్ఛంజనిరి.

దొంగలు తన్ను దోచికొనినందుల కించుకయేని చింతింపక యతండు సంతోషముతో నరుగుచు సాయంకాలమున కొక పట్టణము జేరెను. ఆదిన మమవాస్యయగుట రాత్రి మిగుల జీఁకటిగా నున్నది. అందుభోజనసదుపాయముజేయు బ్రాహ్మణగృహమెందున్నదో తెలిసికొనలేక నాలుగువీథులు తిరుగఁగ నాపట్టణపు రాజుగారి కోటకుఁ బడమరదెసనున్నగుఱ్ఱములసాలయొకటి గానంబడినది ప్రవరుండందాక వేదికింజూచి పయికినడువలేక యాదినమునఁ జాల బడలియున్న కతంబున దానిమీఁదఁబండుకొని గాఢముగా నిద్రబోయెను.

నిద్రాసక్తులు శయ్యాసుఖంబుల గణింతురా? అట్టినిద్రయు నొకజాము పట్టినది. ఆకలిగానుండుటచేఁ బిమ్మట మెలకువ వచ్చి

నది అప్పుడతం డెద్దియో ధ్యానించుచు నూరకయే పండుకొని యుండెను.

ఇట్లుండగా నాకోటమీదుగా గలగలయనుధ్వని యొకటి వినంబడినది. దానికతండు బెదరి యది యేమోయని యాదెసఁ బరిశీలింపుచుండనాగోడపైనుండి యొకయినుపగొలుసు క్రిందికి వ్రేలవేయఁ బడినది మిగులనద్భుతపడుచుఁ దత్కారణ మరయుచుండ నందుండి తొలకరి మెఱుపువలెనక్కోటికి చీకటిలోఁ దళుక్కురనిమెయిదీగ మెరయఁ బదియారేఁడుల ప్రాయముగల యొకముద్దుగుమ్మ చరచరందిగివచ్చుట కానంబడిన నతండచ్చెరువందుచు నోహో! యింతసోయగము గలయబల యెవ్వనివలచి యిట్లుదిగివచ్చుచున్నదో చూచెదంగాక యని కన్నులుమూయక నిద్రబోవువానివలె గుఱ్ఱుపెట్టుచుండెను.

ఇంతలో నన్నెలంతయు గొలుసుదిగివచ్చి యాసాలనలుదెసలం బరికించి యొకమూలగుఱ్ఱుపెట్టుచున్న యాప్రవరు నొద్దకరిగి మెల్లన వీపుమీఁదఁ జేయివయిచి తడుముచు లెమ్మని పిలిచిన నతండు వెరగు పడుచు నూరుమాటాడక కన్నులు నులిమికొనుచు లేచి కూర్చుండెను. అప్పుడానాతి యాతని హస్తసంజ్ఞచే నందున్న నొకగుఱ్ఱమునుఁజూపి యెక్కుమనవు డతండిట్టట్టనక యట్లు చేసెను.

అక్కలికియు నొక్కవారువ మెక్కి ముందునడువ వెనుక ప్రవరుండును సమముగాఁ దన హయమును నడిపించెను. అట్లయ్యిరువ్వురు పురము వెడలి పడమరదెసనున్న యడవిమార్గంబునంబడి వడివడిఁదత్తడుల నడిపింపసాగిరి. అని యెఱింగించుమణిసిద్ధుని సుద్దులకడ్డమువచ్చి పతంగుడిట్లనియె.

అయ్యా! అయ్యబల యెవ్వతె? అట్లుకోటగోడ దిగివచ్చి యెన్నడును నెఱుఁగని యతనితో నరుగఁ గారణమేమో యెఱింగింపుమన వానిప్రశ్నకు సంతసించి యయ్యోగిపుంగవుం డిట్లనియె.

గోపా! యీపాటలగంధి వృత్తాంతమాకర్ణింపుము. కాంచన వల్లియను పేరంబరగు నాతరుణి జయసేనుం డనందగు నానగరాధీశ్వరునికూఁతురు. ఆరాజుతనకు లేక లేక కలిగిన యక్కన్నెమిన్నను మిగుల గారాబముగాఁ బెనుచుచు నైదేఁడులు ప్రాయము వచ్చినతోడనే సకలశాస్త్రము లామూలచూడముగాఁ దెలిసికొనిన యొక గురువునొద్ద సవయస్కుండగు జయంతుఁడను మంత్రిసూనుని జతపరచి చదువ నేసెను.

అక్కన్యయు నక్కుమారుండును రూపంబునను గుణంబులను శీలంబునను సుకుమారంబునను బుద్ధికౌశల్యంబున నొండొరులను మించుచు నయ్యాచార్యునొద్దఁ గ్రమంబునఁ సకలశాస్త్రములు గ్రహించి సంగీతమునందును గవిత్వమునందును మిగుల నేర్పరులై యశ్వశిక్షయందు సైతము నెన్నఁదగిన పాటవము నేర్చుకొనిరి.

వారిరువురు విద్యాగ్రహణసమయమందుగాక ఆహార విహార నిద్రాది వ్యాపారముల యందును నొక గడియయేని విడిచియుండక యేక దేహమట్లు యతిమైత్రితో మెలంగుచుండిరి. ఇట్లు పదియారేఁడుల ప్రాయము వచ్చుపర్యంతము విద్యలం గఱచుచు నొక నాఁడు సాయంకాలమునఁ జల్లనిగాలి విసరుచుండ నయ్యిరువురు గుఱ్ఱపుబండిమీఁద విహారార్థమై పూవుఁదోటకరిగి యందుఁ గ్రీడింపుచుండ నయ్యండజయాన మంత్రిసూనున కిట్లనియె.

వయస్యా! నిన్నటిరేయి మాయింటజరిగిన వార్త నీవువింటివా? నాకీవక్రంపు జవ్వన మేటికిఁ బొడసూపినదో కాని నీకును నాకు నెడ బాపుటకు మూలమగుచున్నది. నన్నింక బడికినిఁ బైటికిని బోనియ్య వలదనియు గురుదక్షిణ నిప్పించి యంతఃపురమునఁ బ్రవేశపెట్టుమని యు మాయమ్మ మజ్జనకునితో నుడివినది. అతండట్టివనికి రేపు విది యయుక్తముగా నున్నదని యేర్పరచెను. నేటితోడ నాకు నిన్నుఁ

జూచుభాగ్యము దప్పిపోవుచున్నది. పెండ్లివిషయమై గొంత ముచ్చటించిరి. కాని నాకు స్పష్టముగాఁ దెలిసినదికాదు. ఎవ్వరికో నిశ్చయించినట్లు నాకొకదాది చెప్పినది. ఈ రెండువిషయములు నా మనోభీష్టమునకు వ్యతిరేకముగానే యున్నవి. నిన్నుఁజూడ నొక నిమిషమైనను జాగైనచోఁ బ్రాణములు పోవునంతవంతబూను నేను నీచిరకాలవియోగ మెట్లుసైతును. దేహములు మాత్రము భేదములు గలిగి విద్యాగుణరూపశీలధీవృత్తుల నొక్కటిగా సంచరించు మన యిరువురకుఁ బెండ్లిసేయక యశాశ్వతపుసిరికై యాసపడి నన్నెవ్వరికో యియ్యఁదలఁచిన మాతండ్రికన్న మూఢుండుండునే? అయ్యయ్యో! కామినులకు సంపదగలిగినను దగనిమగనితోఁ గాపురము సేయుటకన్న విద్యారూపచతురుండగు మగనితో ముష్టియెత్తుకొనినను సంతుష్టిగా నుండునుగదా.

సీ! ఈయాఁడుజాతి యస్వతంత్రపు బ్రతుకేమని గహీంతు. తల్లిదండ్రులే తుచ్ఛునికిఁ గట్టిపెట్టినను వానిని దైవముగాఁ జూచుకొనుచు శుశ్రూష చేయుచుండవలయునఁట. నాకు జ్ఞానమువచ్చినది మొదలు నిన్నుఁ బెండ్లియాడవలయునని యభిలాష గలిగియున్నను నెన్నఁడును లజ్జాదోషంబున నట్టికోరిక బయలుబెట్టనైతిని. వసంతా! నిన్నుఁగాక వేరొక్కనిఁ బెండ్లియాడవలయునని నాకు లేదు. దీనికెద్దియేని యుపాయమున్న నుడువుమని యడిగిన నప్పడఁతికతండిట్లనియె.

తరుణీ! అట్టికోరిక నాకునుఁ బెక్కుదినంబులనుండి గలిగియున్నను నేను ముందు బయలుపరచినచో నీచిత్తవృత్తి యెట్లుండునో యని మనంబున నణఁచుకొనియుంటిని. మన యిరువురకున్నను నేమి లాభము? కులమున సమానుండనైనను సంపదచే హీనుండనగుటనాకు మీతండ్రి నిన్నియ్య నొడంబడఁడు. దీనికేమి సేయుదము. అందరానిపండ్లకుఁ జేతులు సాచనేల? సాహసకృత్యంబుల కొడం

బదుమని నుడువుట నాయది కాదు. అదియు నీమాటలనే తేటపడ వలయునని భావగర్భితముగాఁ బలికిన నక్కలికి వసంతా! యని మేను గరుపారఁ బిలిచి యింకను సందియమందెదేల? నాడెంద మిదివరకే నీయధీనమైనది. నీయిష్టమువచ్చునట్లు నడుచుదానఁ గర్తవ్యముపదేశింపుమని పలికిన సతండట్లైన నేనొకయుపాయము వక్కాణింతువినుము. నీకు ముఖ్యముగా నన్నుఁ బెండ్లియాడువలయు నను తలంపు గలిగియున్నచో విదేశమరుగవలయును.అంతఃపురంబుల నత్యంత సుకుమారవంతురాలవై సుఖపడుచున్న నిన్నిల్లు వెడలు మని చెప్పుటకు నోరాడకున్నది, పైన నీచిత్తమనవుఁడు నవ్వుచు నవ్వనిత యిట్లనియె.

మనోహరా! నేను నీదాననవి చెప్పినను వేరొక్కరీతిఁ బలికెదవేల? నీతోడ విదేశమున కరుగ సిద్ధపడియుంటి. సరిపడని వరునితోఁగూడి రాజ్యము సేయుటకంటె నిష్టసుగుణునితో ముష్టి యెత్తుకొనినను దృప్తిగా నుండునని యిదివరకే చెప్పితినిగదా. పెక్కేల! యెల్లుండి అమావాస్యనాఁటి రాత్రి మాకోటకు పడమర ప్రక్కనున్న గుఱ్ఱముల సాలలోనికి వచ్చియుండుము. గొలుసువెంబడి గోటదిగివత్తును. గుఱ్ఱములెక్కి యెక్కడికేనిం బోవుద మిదియె ముమ్మాటికిని నమ్మికమయిన ప్రయాణమనిన జయంతుండు నొడం బడియె. అట్లయ్యిరువురు బాసఁజేసికొని బండియెక్కి యిండ్లకరిగిరి.

పిమ్మట ప్రయాణదినంబున విలువగల వస్తువులు నిమిడికగల పుట్టములు నాహారపదార్థములు సాయంకాలము దనుక సంగ్రహించుచు నమ్మంత్రిసూనుఁడు చీఁకటిపడినతోడనే భోజనముసేయఁ బ్రయత్నించెను గాని నాఁడు దండ్రియు రాజునగరినుండి యింటికిఁ బెందలకడవచ్చెను. భోజనముకై మడిగట్టుకొనిన తండ్రిపంక్తినే కుమారునికిఁ గూడవడ్డించిరి. కుడుచునప్పుడు కొడుకుతోఁ దండ్రి యిట్లనియె.

వత్సా! విదేశమునుండి సంగీత విద్యాపారంగతురాలగు వారాంగన యొకతె వచ్చినది. ఈరాత్రి నగరిలో సంగీతసభ జరుగును. దానిం బరీక్షించుటకున్నై నీకు మిగుల పాటవముగలదని మీగురువు రాజుతోఁ జెప్పియున్నాఁడు. నేనింటికి వచ్చునప్పు డతఁడు నాతో నిన్నుగూడ నీరేయిసభకుఁ దోడ్కొనిరమ్మని నుడి వెనుగాన నఁ బరుండక మంచిదుస్తులను గట్టుకొని సిద్ధముగా నుండుము పోదమనుటయు నాపలుకు లతనిచెవులకు ములుకులవలె నాటినఁ గొండొకవడి నేమియుం బలుకనేరక నిశ్చేష్టుండై యూరకున్న నతండేమిరా మాటాడవు. గాన ప్రావీణ్యము నీకులేదా యేమి యనుటయు నతండయ్యా! నాకీదినమునఁ దలనొప్పిగా నున్నదిగాన నట్టిదాని పూర్తిగాఁ బరీక్షింపలేనని తోచుచున్నది. అందులకై యూరకుంటిననిన మంత్రి యెట్లయినను నగరి కరుగకతీరదు. ఓపిక లేనిచో రాజుగారితో నీసంగతిచెప్పి యతని చిత్తవృత్తిప్రకారము నడువవలయుననిన జయంతుండనేక ప్రతికూలవాక్యములు జెప్పి ప్రాల్మాలఁదలఁచెను గాని తండ్రి యొప్పుకొనకపోవుటచేఁ తుదకత నితో రాజసభ కరుగక తీరినదికాదు.

తండ్రితో రాజసభ కరుగునప్పుడా జయంతునికి మనంబుగల చింత యిట్టిదని చెప్ప మనోగమ్యముగాదనినచో వాక్కులకు శక్యమా? అవృత్తాంతమారాజపుత్రిక యెఱుఁగక యనుకొన్న రీతిని గొలుసుదిగి గుఱ్ఱపుసాలఁజేరి యందు నిద్రించుచున్న ప్రవరుని నాజయంతుఁడే యనుకొని యతనితోఁ దురగ మెక్కి యేగినది.

శౌనకా! పూర్వోత్తరసందర్భ మెఱింగితివిగద. తానొకటి దలఁచిన దైవమొకటి దలఁచునను లోకోక్తి యేలతప్పును?

అట్లయ్యిరువురు నరుగుచున్నతరి నత్తరుణి ప్రవరుని గుఱ్ఱము దరికిఁ దన వారువము బోనిచ్చి నాథా! నేఁటికి మన మనోరథ

మీా జేరినదిగదా. మొన్నటినుండియు నేనీ పయనంబున కెంత ప్రయాసపడితినను కొంటిరి. రాత్రియు నొక యవాంతరము వచ్చి నదికాని దైవకృపచే దాటించితిని.

గానకాళానిపుణిక యగు గణిక యొకతె రాత్రి సంగీతము బాడుననియు దానిం బరీక్షించుటకై రమ్మని నాకు మా తండ్రి వార్త నంపెను. తలనొప్పి వచ్చెనని బొంకి యంకిలి జెప్పితి నింత వట్టు దైవానుకూలముగానే యున్నది. మీాకు నట్టి విఘ్నము లేమియు రాలేదుగదా యని యనేక రీతులఁ దన మనంబునంగల కోరికలన్నియు బయలుపరచుచున్న యన్నాతిమాటల నూకొట్టుచు నతండు గొన్నిఁటికి నప్పటికిఁ దగినట్లు ప్రత్యుత్తరము జెప్పుచు నడువ జొచ్చెను.

అంత నక్కాంత మోమున్ను తెలతెల్లపోవునని తెలుపురీతి దిక్కులధావళ్యము బిక్కటిల్ల తెల్లవారఁజొచ్చినఁ గ్రమంబున భానుండు పూర్వగిరిశిఖరం బలంకరించుటయునమ్ముంచుబోఁడి యవ్వే లుంగున వానింబరీక్షించి తనమనోహరుఁడైన జయంతుఁడు కాడని యెఱింగి యంతరంగము తత్తరమందఁ దత్తడినుండి నేలంబడి మూర్ఛిల్లి కొండొకవడికి దెలిసి మరల నతనిఁదిలకించి ధరించిన మలినవసనంబులంబట్టి యతిని నల్పునిఁగా దలంచి తలయెత్తక పొల్లు పొల్లుగాఁ గన్నులనుండి నీరు స్రవింపుచుండ నేడ్చుచు నిట్లని తలపోసెను.

అయ్యోదైవమా! తల్లిదండ్రుల మాటన లెక్కసేయక చుట్టముల ప్రేముడి విడనాడి వయస్యలప్రీతిఁ బూతిగలిపి కులశీల సుగుణపరిపాటిపీటబుచ్చిప్రజానిందకోర్చి ప్రాణత్యాగమునకు సహించి యొక్క చక్కని పురుషునిగూడఁ దలంచినఁ దక్కింపక యీా నిర్భాగ్యుని నాకెక్కడదెచ్చి పెట్టితివి? కటకటా! నాచక్కఁదన

మిక్కుడి యడవిపాలు సేయుదే? ఇప్పుడేమి సేయుదాన? మరల పురికరిగివచ్చి నురిదీయ నియమింతురుగాని వెనుకటి మక్కువ నుంతురా? అహో దైవఘటనము.

"శ్లో॥ అఘటితఘటితాని ఘటయతి ఘటితఘటితాని దుర్ఘటీకురుతే
విధిరేవ తాని ఘటయతి యాని పుమాన్నైవ చింతయతి"

అనుశ్లోకమును పలుమారుపఠించుచు నురియు ధైర్యముదెచ్చుకొని

"శ్లో॥ ఉపస్థితే విప్లవ ఏవపుంసాం సమస్తభావః పరిమీయతేయతః
అవాతి వాయావనహింతూలరాశే ర్గిరేశ్చ కశ్చిత్ప్రతిభాతిభేదః"

అనగా ఆపదలు వచ్చినప్పుడే ధైర్యమును నిలుపుకొనఁదగినది. గాలి విసరునప్పుడేగదా, దూదిరాశికిని పర్వతమునకుగల భేదము దెలియబడుచున్నది. కావున బుద్ధిమంతు లాపత్సమయమందే తమ తెలివిని గనపరచుదురని విచారమువిడిచి యుదుట వహించినది. అట్టియవసరంబున నాపత్రివరుండును వచ్చుటనే గుఱ్ఱముదిగి యమ్మగువ నేమియుఁ బలుకరింపక రెండు దంతకాష్ఠములు విరచి తెచ్చి యొకటి యారమణిముందర వైచి తాను పల్లుతోముకొనియె. అవ్వనితయు దానిం దీసికొని ముఖమార్జనంబు జేసినది.

అట్లయ్యిరువురు ప్రాతఃకృత్యంబుల నిర్వర్తించి యొకరినొకరు పలుకరింపకయే గుఱ్ఱములనెక్కి జాముప్రొద్దెక్కు పర్యంతము నడిచినంత నొకనది యడ్డమైనది.

అచ్చట గుఱ్ఱముల విడిచి అంతకుమున్న కొందరి జనుల నెక్కించుకొని విడుచుటకు సిద్ధముగానున్న చిన్నయోడ నొకదానిం గాంచి వడివడి నరిగి వారుగూడ నాయోడనెక్కిరి.

పిమ్మట నోడదోయించి కర్ణధారుండు అవ్వలి రేవుచేరు నంతలో నందుఁగల జనులవలన దాటించుటకు నియామకమగు సొమ్మడిగిపుచ్చుకొనుచు నందొక బ్రాహ్మణవిశ్వస్థయుండ నామెను సొమ్మిమ్మని యడిగెను.

ఆయవ్వయు దీనస్వరముతో నాయనా! నేను మిక్కిలిదరిద్రు రాలను. నాయొద్ద నేమియులేదు. ఎవ్వరియొద్దనైనఁ బనిచేసి యుదర పోషణజేసికొనవలయునని యత్నించుచున్నదాన ఇట్టిదీనురాలిం గనికరించి యూరక దాటించిన నీకుమిగులపుణ్యము రాఁగలదని యెన్ని విధములనో బ్రతిమాలినది. కాని వానికి దయవచ్చినదికాదు.

అమ్మా! దీనికి మేమెక్కుడుగాఁబన్నిచ్చుకొనవలయును. ప్రతి దినము మీవంటివారు పెక్కండ్రు వచ్చుచుందురు. అందరిని నూరక రేవుదాటించినచో మేమిల్లును వాకలి నమ్ముకొనవలసినదే. సొమ్మియ్యకతీరదు. లేనిచో నవ్వలనే దించివేయుదుమని యా నావికుండుత్తరముచెప్పెను.

అట్లామె నాసరదారుఁడు సొమ్ముదెమ్మని నిర్బంధించుచునాదరించిగూర్చున్న ప్రవరుంజూచి—అయ్యా! తమరుగూడ సొమ్మిత్తురా యనియడిగిన నాప్రవరుండు చింతాక్రాంతుండై యోహో! వీనికిచ్చుటకు నాచేత నేమియునులేదు. వీనిధోరణింజూడ నూరక దాటించునట్లు కనంబడదు. పేదరాలి నీయవ్వనే నిర్బంధించుచున్నాఁడు. వీనిచే నవమానముపడుట కష్టము. ఎట్లాకోయని తలంచుచు నాప్రాంతమందే యధోముఖయై కూర్చుండియున్న యాచిన్నదానిని సంజ్ఞాపూర్వకముగా జూచెను.

అప్పుడా సన్నగ్రహించి యాయించుబోఁడి తాఁదెచ్చిననాణెములలో నొకటివిప్పి యతనిముందరవిడిచినది. దానింగైకొని ప్రవరుండు సంతోషముతో నావికుఁడా! యీనాణెము నీవడిగెడు సొమ్మునకుఁ బదిరెట్లు వెలగలిగియున్నది. దీని నీకుఁ గానుకగా నిచ్చుచున్నాము. ఈయవ్వను నిఁక నిర్బంధింపకుమని పలికి యది వానికిచ్చెను.

వాఁడది సంతోషముతోఁగైకొని యతని మిక్కిలి స్తుతియించుచు నెమ్మదిగా నోడనడిపెను.

అంతకొంతతరి కర్తరి యవ్వలిదరి జేరినంతఁ బ్రవరుఁడును రాజపుత్రికయు నోడదిగినడువఁజొచ్చిరి. అవ్వృద్ధబ్రాహ్మణియువారిని దంపతులనుకొని వారుతనకుఁజేసిన యుపకారమునకుఁగృతజ్ఞతఁజూపుచు వారివెంట నడుచుచు నాప్రవరునితో నిట్లనియె. అయ్యా! నేను దిక్కుమాలినదానను. నాకింతయన్నము పెట్టనోపుదురేని మీయింట వంటజేయుచుందును తోడగొనిపోదురేయని యడిగిన నతండు లోన నవ్వుకొనుచు నవ్వా! అలాగున నేరమ్ము పోషింతునని యామెంగూడ వెంటబెట్టుకొని నడువసాగెను.

ఆచిన్నదియు నేమియుంబలుకక వానిమొగమైనంజూడక దైవమునుందూరుచు హా! జయంతా! జయంతా! యని నడుమ నడుమఁ బలవరింపుచు నేమిసేయఁదలఁచియోగదా? దైవము నన్నీతని కప్పగించెను. వీనివిడిచినచోఁ బ్రమాదమగును. వీనితోడంబోయెద నేమైన నగుంగాక యని యతనివెంట నడువజొచ్చినది.

ఆముువ్వురు మధ్యాహ్నమునకు నాప్రాంతమందున్న హేలానగరముఁజేరి సత్రమున బసఁజేసిరి. ప్రవరుఁడును, సత్రాధికారియొద్దకరిగి నాఁటికి సరిపడిన సామగ్రియడిగి తెచ్చి యాయవ్వకిచ్చిన నాప్రోడ చక్కగాఁ బాకముచేయుటయు ముువ్వురును భుజించిరి.

మరునాఁడరుణోదయంబున లేచి యాబ్రాహ్మణుఁడు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి మేన విభూతినలఁది బ్రహ్మతేజంబు మెరయఁ బంచాంగమొకటి తీసికొని విపణివీధి కరిగి యందు గొప్పవర్తకులందరు నెద్దియోవేరమునకై నొకచోట గుంపుగా జేరియుండ నచ్చటికేగెను. వారు నతనికి నమస్కరించి యాగమనకారణంబడిగిన నాశీర్వదించి యతం డిట్లనియె.

అయ్యా! నేనుబ్రాహ్మణుఁడను. పరదేశస్థుండ. కుటుంబముతో నిన్ననీయూరు జేరితిని. సత్రముమూలముగా నిన్నటికి భోజనముగడిచి

నది. ఈదినమున కేమియును లేదు. నాకు జ్యోతిశ్శాస్త్రమందు మిగుల పాటవముగలదు. మీమీ నక్షత్రములు చెప్పినచో దినచర్యవ్రాసి యిచ్చెదను. దృష్టాంతరముగానుండిన నన్ను మన్నింపుఁడు. లేనిచో రేపు నన్ను గౌరవము సేయవలదని ప్రతిజ్ఞాపూర్వకముగా నుడివిన నతనిమాటలకు సంతసించి తమనక్షత్రములు వ్రాసియిచ్చి యానాఁటికిఁ బిండివంటలతోఁగూడ సరిపడు సామగ్రియిచ్చిరి. ప్రవరుఁడును వారి వారికిఁ దగినఫలములు వ్రాసియిచ్చి యాసామగ్రి గొనిపోయి వృద్ధబ్రాహ్మణిచేతికిచ్చిన నామెయు రుచిగా వండిపెట్టిన సంతుష్టిగా భుజించిరి.

మరునాఁడుదయమునఁ బూర్వమువలెనతండు బాజారునకరిగిన నావర్తకులందరు నొకచోటునఁ జేరియుండి తమకు వ్రాసియిచ్చిన ఫలములన్నియు దృష్టాంతరముగానుండుటకు మిగుల సంతసించుచు నతని వినుతించి మరల నాదివసమున ఫలములు వ్రాయించుకొని పూర్వమువలెనే సామగ్రియిచ్చిరి. దానిచేత వారుమువ్వురే గాక మరికొందఱుగూడఁ దృప్తిగా భుజించిరి.

ఇట్లు ప్రతిదినము ప్రవరుఁ డుదయమున బజారునకరిగి వర్తకులచే గౌరవముబొందుచుండఁ గొద్దిదినములలోనే యతనిఖ్యాతి యాయూర నలుమూలలు వ్యాపించినది.

ఆవార్త పెక్కండ్రు వర్తకులు విని యతనిచే ఫలములు వ్రాయించుకొనుచు మిగులసత్కారములఁ జేయఁదొడంగిరి. మరియొక్క నాఁడొక రత్నవర్తకునికి దినచర్యవ్రాసియిచ్చుచుఁ బ్రస్తావముమీఁదఁ దనకుగూడ రత్నపరీక్షయందు మిగులనైపుణ్యముగలదని నుడివిన విని యావర్తకుఁడు వానిని తనరత్నముల యంగడికిఁగొనిపోయి తన యొద్దనున్నరత్నముల నాణెముసేయుమనిన నతండన్నియుఁ బరిశీలించి యందు వారు రత్నములని కొనియుంచిన పెక్కుగాజురాళ్ళ నేరితీసి

పరీక్షచూపెను. దానికావర్తకుఁ డాశ్చర్యపడుచు నయ్యా! తమకీ బ్రాహ్మణవృత్తియగు దైన్యజీవనమేటికి. నెలకిరువదిరూపికలు వేతనం బిచ్చెద. నాయొద్ద రత్నపరీక్షకులై యుందురే? యనుటయు నతండు వల్లెయని మొదట నట్టియుద్యోగమందుఁ బ్రవేశించెను.

అదృష్టవంతుల కెందేగినను గొరంతయుండునా? అప్పుడా నతఁడా నగరమున బసదీసి యొక చిన్న యిల్లద్దెకుదీసికొని యందుఁ బ్రవేశించిరి కాని యప్పుడు సైతమా రాజపుత్రిక యతని మొగముచూడక మౌనం బవలంబించియు మర్యాదగా నడుచుచున్నందులకుఁ గొంతసంతసిం చుచుఁ బనిపాటలయందుఁ గొంచెమాయవ్వకుఁ దోడుపడుచు నొక రీతి విరాగబుద్ధితోఁ గాలక్షేపము సేయుచుండెను.

ఆబ్రాహ్మణియు వారిని దంపతులేయనుకొని పరస్పర సంభా షణములు లేకపోవుటకు శంకించుకొనుచు నవ్విషయము విమర్శింపక నియమితమైనపనులఁ గావింపుచుండెను. ప్రవరుఁడును భోజనము సేయు నప్పుడుదప్ప తక్కినసమయముల వేరొకచోటఁ గాలక్షేపము సేయు చుండును. ప్రవరుఁడుగాని రాజపుత్రికగాని ముసలియామెగాని యొం డొరుల వృత్తాంతమరయకయే కాపురములుసేయుచుండిరి. ఆహా! వారి బుద్ధిపటిమ మిగులఁ గొనియాడఁదగియున్నదిగదా?

ఆరత్నవర్తకుఁడు నతని తెలివికి సంతసించుచు నెలనెలకు వేతన మభివృద్ధిజేయుచుండెను. ఇట్లుండనంత నొక్కనాఁడు దక్షిణదేశము నుండి యొకవర్తకుఁ డద్భుతమైన రత్నమొకటితీసికొనివచ్చి కందర్ప కేతుని దర్శనమున కరిగిన నారత్నముసోయగమునకచ్చెరువందుచు నట్టిదానిం దనజీవితకాలములో నెన్నఁడునుజూడమి నారాజు దానిఁ గొనుటకు మిగుల నుత్సాహమందుచు దానివెలయెంతయని యావ ర్తకు నడిగెను.

ఆవర్తకుండును రాజుగారియుద్దేశము గ్రహించి దీనివెల కోటిరూపాయలనియు గవ్వయేనియుఁ దక్కువైన నీయననియుఁ గచ్చితముగా నుత్తరమిచ్చెను.

కందర్పకేతుండును తనయొద్దనున్న రత్నపరీక్షకుల చేతికిచ్చి యామాణిక్యమునకు వెలగట్టుమనిన వారును బరీక్షించి కొందరు నలువదిలక్షలు, కొందరు డెబ్బదిలక్షలు, కొందరు తొంబదిలక్షలు చేయునని వెలగట్టిరి. అంతటితోఁ దృప్తిఁబొందక యానృపతి యామణిని వెలగట్టింప కింకరులకిచ్చి విపణివీధినున్న పెద్దవర్తకులయొద్ద కనిపెను.

అప్పురిలోని వర్తకులందఱు దానినాణెముచేసిరి. యేబది లక్షలకుఁ దక్కువవెలకట్టినవాఁడు లేడు. కొందఱు కోటిరూపికలు చేయుననిరి. ఈరీతినంగడులు ద్రిప్పుచుఁ గ్రామంబునఁ బ్రవరుండున్న రత్నవర్తకునియొద్దకామణినిదెచ్చి వెలగట్టుమని రాజభటులడిగిన దానినతఁడు పుచ్చుకొని తత్తేజమునకు వెరగందుచుఁ జెంతనున్న ప్రవరునచేతఁ బెట్టి వెలగట్టుమని యడిగెను. అతండదిపుచ్చుకొని ముమ్మారిటునటు త్రిప్పి పెదవివిరచినంజూచి, యావర్తకుఁడు పెదవి విరచితివి లోపమేమి? వెలయెంతజేయు? నని యడిగిన నతండు నవ్వుచు నిట్లనియె. “అయ్యా యిదియొక కృత్రిమరత్నము. దీనివెల గవ్వయైనంజేయ” దని యెకసక్కెముగాఁ జెప్పెను.

ఆమాటవిని రత్నవర్తకులందఱు దెల్లఁబోయి యతని నందులకు దృష్టాంతమేమని యడిగినఁ బ్రవరుఁడు కావలసినచోఁ బరీక్ష జూపింతునని ప్రతిజ్ఞాపూర్వకముగా జెప్పెను.

రాజకింకరులంత నారత్నమును గొనిపోయి రేనితో వర్తకుల మాటయు బ్రాహ్మణుని వచనంబులు జెప్పినవిని వెరఁగుపడి యాయొడయఁడప్పుడ యాబ్రాహ్మణుని దీసికొనిరమ్మని పరిచారకుల నంపెను. వారును వడివడిజని యనేక రత్నవర్తకులతోఁగూడ నావిప్రవరుని రాజసభకుఁ దోడ్కొనివచ్చిరి.

కందర్పకేతుండును పరివరుని మిగుల గౌరవపరచి కొలువు దీర్చి యాయద్భుతరత్నమును దెచ్చిన వర్తకు నెదుర నిలువఁబెట్టి యా విప్రునితో నయ్యా! తమరీరత్నమునకు వెలయెంతగట్టితిరని యడిగిన నతం డిట్లనియె.

దేవా ! ఇది యథార్థపురత్నమైనచో రెండుకోట్ల రూపికలు వెల జేయునుగాని గాజురాయి యగుటచే నొకరూప్యమైనఁ జేయదు. దానియందమునుబట్టి యిచ్చినచో నొక రూపిక నియ్యవచ్చునని నిర్భయముగాఁ జెప్పెను. ఆమాటవిని యారత్నవర్తకుఁడు లోన దిగు లొందియు నాదైన్యము మొగమునందోపనీయక, యోహో ! మంచి నాణెగాఁడవౌదువు. ఈలాటివారు పదుగురున్నచో మా వర్తకము బాగుగ నేసాగును. చాలు. చాలు. కొందఱు వస్తువులకు వెల గట్టుమనియిచ్చినప్పుడు తమ్ముమిగుల నాణెగాండ్రనుకొందురని తెలియకున్నను దానికిఁ దక్కువవెలగట్టుచుందురు. అంతియకాని దానినాణెమెఱిఁగికాదు. ఇది నిజముగా గాజురాయియని యెట్లు చెప్పఁగలవో తార్కాణముజూపింతువా ? యని పెద్దయెలుంగున గద్దించిపలికిన నతండు వెనుదీయక పెక్కేలచూడు మిదిగో యని యొక యినుప పలకమీద నారత్నము నెత్తికొట్టుటయు నది తిలలంత లేసి శకలములై రూపరినది.

దానితోడన యావర్తకుని హృదయము సైతముభిన్నమైనది. వర్తకులందఱు వెరగందిరి. నృపతి యతనింగౌఁగలించుకొనిసుముఖా! నీమూలమున నాకు మిగుల లాభముగలిగినది. నీవంటి నాణెగాఁ డెందును లేడు. నీకు నెలకు నూరురూపికల వేతనమిచ్చెద. నాయొద్ద రత్నపరీక్షకుఁడై యుండుమని యతనికప్పుడు తదుద్యోగ్యమునకు ముద్రిక నిచ్చెను. ఆదాక్షిణాత్యునియొద్దనున్న ధనమంతయు దోచికొనుటయే గాక యతని బద్ధునింగావించియు నానృపపరివరుఁడు పరివరుని యనునయ వాక్యములచే నటఁ విడిచిపెట్టెను.

అదిమొదలు ప్రవరునికి రాజునగరిలో నుద్యోగమూలమగు గౌరవమెంతేని ప్రబలమగుచుండెను. ఇట్లుండినఁ గొలది దినములకే రాజుగారి ముఖ్యప్రధానిమరణముఁ నొందెను. అప్పుడా రేఁడాయుద్యోగము ప్రవరునికే యిచ్చివేసెను. మంత్రిత్వపదవి వచ్చినతోడనే ప్రవరుఁడా చిన్నయిల్లు విడిచి యొకమేడ బాడిగకుఁ దీసికొని యందప్పటికిఁదగిన మర్యాదగా నడుపుచుండెను. అప్పుడైనను రాజపుత్రిక ప్రవరునిగాని, ప్రవరుఁడు రాజపుత్రికనుగాని బల్కరించుట లేదు. వారి మనోదార్ఢ్య మెట్టిదో చింతింపుము.

ప్రవరుఁడు మంత్రియైనది మొదలు రాజ్యమందు ధర్మప్రవర్తనలు మెండుగ జరుగునట్లును, అధర్మప్రవర్తకుల శిక్షించునట్లును పెక్కుప్రకటనపత్రికల దేశమందు వ్యాపింపఁజేయుటచే నతని బ్రజలందరు ధర్మప్రభువని కీర్తింపం దొడంగిరి.

ఇట్లుండునంత నద్ధరాకాంతు డొకనాఁ డేకాంతముగా నతని కిట్లనియె. సుమతీ! మతికౌశల్యంబున నీవు బృహస్పతియంత వాఁడవు. నీప్రాపునంజేసి లోపములేకుండ రాజ్యము గాపాడుకొనఁ గలనని మిగుల సంతసించుచుంటి. ఇఁక నీకును మాకును దెలుపు కొనని రహస్యములుండవుగదా? వినుమేను దిభువనాశ్చర్యకర రూపంబునం బొలుపొందు నిందుముఖి నొకదాని ద్వీపాంతమునుండి రప్పించితిని. ఎన్నిజెప్పినను నప్పడఁతి నాకు వశవర్తినిగాక సర్వదా దుఃఖించుచున్నది. అత్తలోదరి నిమిత్తముగాఁ జిత్తభవుఁడు నా చిత్తము దుత్తునియలు గావింపుచున్నవాఁడు. ధర్మాధర్మవివేచనము విడిచి రేయింబవలు నేనాకనకాంగి నవకంబు దలంచుకొనుచుఁ జివుకుచుంటిని మఱియు—

ఉ. "ఒకొక్కవేళఁ బద్మముఖి । లొల్లమి సేయుదు నొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షు । ణక్షణముల్ జవరాండ్రచిత్తముల్

వక్కణ వేసరఁజన దు। పాయములం దగునిచ్చకంబులం
జిక్కఁగఁ జేసిడాసి సతి। చిత్తముఁబట్టి సుఖింపగాఁదగున్."

అని వ్రాసిన కవివాక్యము ననుసరించి కాలయాపన సేయు చుంటిని. బలవంతము సేయుటకు నుల్ల మొల్లకున్నది. అక్కాంతా రత్నము తనంతవచ్చి నన్గలసికొనునట్లు చేయుదువేని నీకోరినవరం బిచ్చువాఁడ నీయుపకారముచేయుము. నీబుద్ధిబలంబునకు సాధ్యము కానిది లేదని స్తోత్రపూర్వకముగా నాచిన్నదాని వృత్తాంతము చెప్పిన విని యయ్యధర్మమునకు మిగులఁ బరితపించుచు సమయజ్ఞుండగు యతం డప్పటి కేమియుననక యొక నాఁడచ్చేడియ మేడకరిగి యధో ముఖయై ధ్యానించుచున్న యమ్ముంచుబోఁడి నోదార్చి యల్లన నిట్లనియె.

సాధ్వీ! నేను గ్రొత్తగావచ్చిన మంత్రిని "నీవృత్తాంతమంత యును విని జాలిపడియు నిప్పుడేమియుఁ జేయునదిలేక యూరకుంటిని సమయము వచ్చినప్పుడు నాయోపినంత యుపకారము సేసెద. దుర్మార్గుఁడైన రాజునన్నిప్పుడు నీచిత్తవృత్తి యరసిరమ్మని పంపెను. నాబుద్ధి యధర్మమునందుఁ బ్రవేశించునదికాదు. నీమగని కులశీల నామంబులఁ జెప్పుము. వానింబట్టి తేర నియోగింతునని పలికిన యతని చల్లని మాటల హృదయసంతాపంబు కొంతవాయ మొగ మొకయింత యెత్తియమ్మత్తకాశిని యిట్లనియె.

అన్నా! నీమతి వివేకము వచనగౌరవమే చెప్పుచున్నది. నీవంటి పరోపకార పారీణులు కొందరుండఁబట్టిగదా వసుంధర తిరంబై యున్నది! నాపేరు కళావతి. నామగండు కాశ్మీరదేశ రాజకుమారుఁడు. వసంతుండను సార్థకాహ్వాయముగల యాపురుషరత్నము నలుగురుమిత్రులతో విదేశదర్శనార్థమై దేశమువదలి యందందు సంచరించుచు నొకవటవృక్షమూలమునఁ దనచెలికాండ్రతో వియోగము నొంది రాక్షసనగరమందేకాంతముగానున్న నన్నుగాంధర్వ

విధిం బెండ్లియాడి యందు స్వర్గసౌఖ్యంబు లనుభవింపుచుండ నొకనాఁ డొకముసలిది వచ్చి కొన్నిదినములు మిగుల నమ్మకముగా మానడు మనుండి నామగని యాయువుమర్మము నాచేత నడిగించి తెలిసికొని మేము గాఢనిద్రాపరవశులమైయుండ నాప్రియుని స్మృతితప్పించి నన్నోడమీఁద నీనగరముజేర్చి యీరాజున కప్పగించినది.

ఇతండును, కందర్పజ్వరపీడితుండై యాతురంబున నన్నుముట్ట వచ్చిన వ్రతకైతవంబున నొకవత్సరంబు మితిఁగోరితిని. అదియు సమీపించుచున్నది. దైవము నన్నేమిసేయఁదలంచెనో యెఱుఁగను. బంధుదర్శనంబునంబోలె, మిమ్ముఁజూడ నాకానంద ముదయించు చున్నది. మీయట్టి ధర్మాత్ములకు దీనులయెడ నక్కటికము గలు గుట సహజముగదా! నిర్హేతుకంబుగ నాయెడ మీయెడదఁబొడమిన కరుణఁబెంపుచేయ భగవంతుని మిక్కిలి ప్రార్థించెద. నావృత్తాంతం బిదియ నామనోహరు నరసి తెప్పించెద నంటిరి. అట్టిమాట పాటికిఁ దెచ్చి నాయాపదలఁ దొలంగింపుఁడని మిక్కిలి వేడుకొనియెను.

ఆమెవృత్తాంత మంతయునువిని యతండు మేనుఝల్లుమన హా వసంతా! హారామా! హాసాంబా! హాడుండుఁడా! మీమాట మరచి పోయి యిం దితరవ్యాపారాసక్తుండనై యుంటి. మిత్రఘ్నుండన నేను కానా? అయ్యో! మిమ్ముఁజూచి యెంతకాలమయినది. తరుమూల ముచేరి నాకొఱకు నిరీక్షించి విసిగి యెందేనింబోయితిరా? కటకటా! వసంతునివృత్తాంత మీయింతిమాటలచే దెలిసినది. నావలెనే యతం డును సుఖసక్తుండై మిత్రులమాటమరచి వృక్షమూలము చేరలేదు. మఱియు నావృద్ధాంగనవలన మోసపోయెనే యని యనేకప్రకార ముల విచారించుచుఁ దనవృత్తాంతమంతయు నానాతి కెఱింగించిన నయ్యంచుఁబోఁడి మోమింతయెత్తి సంతోషముతో నతని కిట్లనియె.

ఆర్యా! మీయన్న వసంతుండు నాతోఁ బలుమారు మీచరి త్రలుగ్గడించి చెప్పెను. నీవు మిగులసాధుబుద్ధివి, నాపురాకృతసుకృత

మొద్దియో యించుక బయల్పడినది. లేకున్న నిట్టి యాపత్సమయం బున బంధుదర్శనంబగునా యిఁక నీయన్నజాడ నరయుచు నన్నీ యిడుములనుండి తొలంగించుటకు నీదేభారము. నీకుఁ జెప్పఁ చెప్పనక్కఱ లేదు. అని తత్సమయోచితములగు మాటలచే నతనికి సంతోషమును విచారమును గలుగఁజేసినది.

ఆమె పలుకులకు వెరఁగుపడుచు బ్రివరుండు సాధ్వీ! నీవు చింతింపకుము. నే నిన్నుఁగాపాడుచు నిందుండియే మిత్రుల వెదకించి యిందు రప్పించెదను. మానవులకుఁగోరక దుఃఖము లెట్లువచ్చునో కాలక్రమంబున సౌఖ్యంబులుగూడ నట్లేసంప్రాప్తించును. రెండును దైవాధీనములేయని యనేక నీతివాక్యములచే నామె నోదార్చి వీడ్కొని యతండు రాజునొద్దకరిగి యతనితో నయ్యా! యయ్యతివ యింకను వ్రతపరాధీనయై యున్నదిగాన మౌనంబుగానున్నది. ముందాలోచింతముగాక యని యతని నప్పటికి సమాధానపరచి యింటి కరిగి వారిజాడనరయ నలుదిక్కులకుఁ బెక్కండ్రదూతలం బుచ్చెను. పిమ్మట నొకసత్రికుడ్యమ్మున దనరూపు చిత్తరువును వ్రాయించి వ్రేలంగట్టి దానిని సాభిప్రాయముగాఁ జూచినవారిఁ దనయొద్దకుఁ బట్టితెండని తగిన కింకరుల నియోగించెను.

ఇట్లుండ నంత నొక్కనాఁడు మంత్రిగారియింటికిఁ బిసునమతి యను చాకలిదివచ్చి యుదుకుటకునై బట్టలు వేయుఁడని యడిగిన రాజపుత్రికయుం బరాయత్తచిత్తయై యున్నకతంబునం బరిశీలింపక కొన్నిబట్టలతో దొడిగిన రైక యప్పుడవిప్పివైచిన నవియున్నియు మూటగట్టికొని యది యామెపోయగమున కచ్చెరువందుచు నామూటమోసికొని రాజుగారియింటికరిగి యాచాకలిది మాసినపుట్టములు వేయుఁడని యడిగినది. రాజపత్ని యంతకుముందుఁ దెచ్చినబట్టలెవ్వరివనియడిగిన అమ్మా! ఇవి మంత్రిగారిబట్టలు. వారియింటిపనిగూడ

మేను చేయుచున్న వారము. అని చెప్పుటయు రాజపత్ని ఓసీ ! మం
త్రిభార్య యేపాటిచక్కనిది ? పిల్లలెందఱు ? ప్రాయమెంత ? గుణ
మెట్టిదని యడిగిన నారజకాంగన నవ్వుచు నిట్లనియె.

దేవీ ! మంత్రిగారి భార్యవంటి యందకత్తె నింతకుముందు నే
నెందునుఁ జూచియుండ లేదు. నిజముచెప్పిన మీకుఁ గోపమువచ్చు
నేమో? మీరుగూడ నామెకుఁజాలరు. ఆమె యెప్పుడును విచారిం
చుచు నొకచోటఁ గూర్చుండును. వారియింట నొక ముసలామె
యున్నది. మంత్రిగారిభార్య వయసుబింక మెట్లున్నదియో యీరైక
యే చెప్పుచున్నది. చూడుఁడు విప్పివైచినను దొడిగినట్లెయున్నది.
మేనిపొంకము బింకమంతయు నిట్లేయున్నవి. అనియూరక పొగడు
టయు నారాజభార్యయు నాచిహ్నములు జూచి వెరగుపడుచు
నిట్లనియె.

ఓసీ ! మాప్రధాని మొదట యాచకుఁడుగాఁ గుటుంబముతో
నీయూరువచ్చి తనవిద్యామహిమచేఁ బ్రధానపదవి సంపాదించుకొని
యెనని వింటిని. సామాన్యస్థితియం దింతచక్కనిభార్య యెట్లు లభిం
చినది. ఇది కడు వింతయేయని యారైకగైకొని విమర్శించుచుండ
నింతలో నొడయం డెద్దియోపనిమీఁద నక్కడికివచ్చి భార్యచేత
నున్న రైకజూచి యిది యెవ్వరిది? దీని నిట్లు పరీక్షించుచుంటివేమి?
అని యడిగిన భర్తంజూచి నవ్వుచు నాపువ్వుఁబోఁడి యిట్లనియె.

ప్రాణేశ్వరా! ఈకంచుళి యెవ్వరిదో చెప్పికొనుఁడు. దీనిం
దొడుగుపడఁతి యెంతవయసు గలదియో యూహింపుఁడని పరిహాస
ముగా నడిగిన నానృపతి పరీక్షించి వెరగుపాటుతో నిట్లనియె. ఆహా!
దీనింధరించు మించుఁబోఁడిబింక మంతయు నిది చాటించుచున్నది.
ఎన్నిమడతలుబెట్టి నలిపి పిడిచినను గుబ్బవడువున నిలఁబడుచున్నది.
దీనిం ధరించుమించుఁబోఁడి వయసును సొగసును విస్మయజనకములని
తోచుచున్నవి. ఇది యెవ్వతెదో యెఱింగింపుమని యుత్సుకుఁడై
యడిగిన నావధూటి యిట్లనియె.

మనోహరా! యీరైక విప్రప్రధానిగారి భార్యదని యీచాకెత చెప్పినది. ఆమెచక్కఁదనముగుఱించి యీరజకాంగన యూరక పొగడుచున్నది. ఇట్టి మూఢురాలినే వెరఁగుపరచిన యాతరుణీమణి సోయగము దర్శనీయమని తెల్లమగుచున్నది. అనియెఱింగించుటయు నాభూపతి యాశ్చర్యరసావేశితమతియై యేమీ! ప్రవరునిభార్యయింతచక్కనిదియా! అతండు ప్రధానియైనపిమ్మట వివాహమాడియుండలేదు. అంతకుముందు సామాన్యస్థితి కలవాఁడని వింటిమి. అప్పుడిట్టి యెలనాగ యెట్లుదొరకును. బ్రాహ్మణులలో రూపవంతులుండుట యరుదందురు. ఈసందేహము దీర్చుకొనవలసినదే యనిపలికెను.

అప్పుడారాజపత్ని నవ్వుచు చేపకడుపున రత్నవలయము దొరకినతోడనే దానిం ధరించుమించుఁబోఁడిని సముద్రాంతరమునుండి రప్పించితిరి. ఇప్పు డీరైకధరించు కోకస్తనిని జూడక విడుతురా! యని పరిహాసమాడినది ఆనృపతియు కాంతా! వింతవస్తువులంజూడ నెవ్వనికి వేడుకయుండదు? చూచినంతనే తప్పువచ్చునా? ప్రవరుని భార్యంజూచు నుపాయమొకండూహించితిని. రేపు నీవుస్వయముగా వంటజేయుము. మనయింటి కతని విందునకుఁ బిలిచెదనని చేయఁదగినకృత్యములన్నియు బోధించి యతండప్పుడ యాస్థానమునకరిగెను.

అంతకఁబూర్వమే కొల్వుకూట మలంకరించిన ప్రవరునితోఁ గూడికొని రాజకార్యముల విమర్శించి యనంతర మానృపాలుండతని తోనిట్లనియె. సుమతిప్రవరా! మనమిరువుర మొకచోట భుజింపవలయునని యెన్నియోదినములనుండి వేడుకగలిగియున్నది. రేపు మాయింట భుజించి నాయభిలాషదీర్పుము. మిత్రయుక్తముగాఁ భుజించు దివసమే పండుగయని చెప్పుదురు. నీవు మాకన్నిగతులఁ బూజ్యుఁడవని సాదరముగానుడివిన విని ప్రవరుండు సంతోష మభినయించుచు దేవా! మేము నిత్యము మీయన్నమే భుజించుచున్నారము. అది

యట్లుండె, మీసహపంక్తిని భుజించుటకన్న గౌరవమున్నదియా ? మీరు నన్నింత పెద్దజేసి మన్నించితిరి. రేపు నాకు సుదినమని ప్రవరుఁడు స్తోత్రముజేయుచు నావిందున కనుమోదించెను.

కందర్పకేతుఁడును నమ్మరునాఁడు ప్రవరునిఁ దనయింటికిఁ దోడుకొనివచ్చి యంతిపురములో భార్యవడ్డింప నామంత్రితో నిష్ట గోష్ఠివినోదాలాపములతో భుజించుచుండెను.

దీర్ఘదర్శియగు నా ప్రవరుండును భుజించునప్పుడెద్దియో విచారము మనంబున నంకురింపఁ దలవాల్చుకొనియే చింతించు చుండెను. అప్పుడయ్యొడయండు ఆర్యా! ఈఫలమెంత రసవంత ముగా నున్నదియో చూచితివా ? ఈశాకము రుచిగాఁ జేయబడినది సుమీ ! ఈపాయసంబునవైచిన మిరియపుపొడి కారము, ప్రియుని మునిపంటిపోటిగంటుమంట వాల్గంటికింబలె రహస్యమైయున్నదిగదా! యని యనేకగతుల చమత్కృతివచనంబు లాడుచు భార్యతో బోఁటీ! ఘృతాపూపంబుల నిటుతీసికొనిరా. ఇతనికి వడ్డింపుమనిన నతండు వలదని చేయుద్రిప్పిన నిర్బంధించుచు తన్వీ! నాకంత పూర్తిగా వడ్డింపకుము. రేపు నాకు మంత్రిగారియింట్లో విందు జరుగఁబోవును. మామంత్రిభార్య పదార్థములు నీకంటె రుచిగాఁ జేయఁగలదఁట బ్రాహ్మణులకు రుచి తెలిసినట్లు భోజనమందితరులకు తెలియదు. లోకంబున మైత్రియు బాంధవ్యంబును భోజనంబునం గాని లెస్సగాఁ గలియవు. అని యభిప్రాయసూచకముగా సంభా షించు రాజుమాటలన్నియు విని ప్రవరుఁడు గుండెపగుల దిగులుపడి వేతెరంగుల నంతరంగమునఁ జింతించుచుండెను.

భోజనమైనవెనుక సభామండపమున వారాంగనా నృత్యగాన వినోదంబులఁ గొంతగడిపి యారేఁడు ప్రగ్గడకుఁ గర్పూర వీటీ ప్రముఖములగు పెక్కుసత్కారంబు లాచరించిన నవియన్నియు నాదరపూర్వకముగా స్వీకరించి లేవఁబోవునప్పుడు మంత్రి రాజుతో నిట్లనియె.

దేవా ! మేము దినునదియంతయు దేవరసొమ్మే. ఐనను మా భక్తి విశ్వాసములిట్లు ప్రేరేపించుచున్నవి. తమరిందాక నాడిన మాట యథార్థము సేయ వేడెదను. ఆర్యులు పరిహాసంబుల నయిన నసత్యము దొలుకనీయరు గదా ? దేవరగూడ రేపుమాయింటికి విందునకు దయచేసి గృహపావనముసేయ ప్రార్థించుచున్న వాఁడ ననిన నవ్వుచు నతండిట్లనియె.

మిత్రమా ! దీనికై నన్నింత ప్రార్థింపవలయునా ? విందులనిన నాకు మిగుల సంతసమను విషయము నీవెరుంగవు కాఁబోలు. ఆలాగుననే వచ్చెద. వంటమాత్రము పెందలకడఁ జేయింపుమని యాదరపూర్వకముగా సాగనంపిన నతండును దాని సంతోషము మొగమునకుఁ దెచ్చుకొనుచు నతని వీడ్కొని యింటికరిగెను. అట్లరిగి పర్యంకముమీఁద బరుండి యిట్లు ధ్యానించెను.

అయ్యో ! నాకప్పటికి రాజును విందునకుఁ బిలువకతీరినది కాదు. వంటజేయ నాకు భార్యలేదుగదా ? రాజు భార్యచే వంట జేయించి వడ్డింపించి నప్పుడు నేనొరులచే వంటజేయించుట యుచితముగాదు. అదియుంగాక రమణీప్రియుండగు రాజుచేసిన కపటము బాడకట్టినది. నాయింటనున్న యీవాల్గంటివృత్తాంత మెవ్వరివలననో విని యిది నాభార్యయే యనుకొని దీనింజూచుటకే యిట్టిప్రయత్నమును జేసెను.

ఈకాంత యెవ్వతయో నాకును దెలియదు. తానెవ్వరినో వలచి సాంకేతిక మేర్పరచికొని నన్నే యతండనికొని మోసపోయినది పాపము సంతతము వానికొరకే చింతించుచుండును. ఇన్ని దినయులైనది. నీ వెవ్వఁడవు. నీవృత్తాంత మేమని నన్నడుగలేదు మునలామెయు మాకన్న మనసుగిట్టమిది. మా కాపురము గుట్టిన్ని నాళ్ళేరులెఱుఁగకుండ నిలుపుకొని వచ్చితిమి. ఇప్పుడేమి చేయుదును. నాకు భార్య లేదంటినా మిగుల హాస్యాస్పదముగా నుండును. వినినవారును నమ్మరు ఎల్లరు నిప్పల్లవపాణి నాభార్యయనియే తలంచు

చున్నారు. దాని యునికిచేతనే కదా నేముట్టినది బంగారమగు చున్నది. నాకితండు భార్యచే వండించి వడ్డింపఁ జేసెను. నేనీ యవ్వచే వడ్డింపఁజేసితినేని మర్యాదహీనముగా నుండును. అదియునుంగాక యీమొంజూచుట కొరకేగదా యతం డీవిందులు గల్పించుట. హా! దైవమా! ఈ యాపద యెట్లు దాటునోగదా యని ధ్యానించుచు నల్లిపందుకొనియుండెను.

వృద్ధబ్రాహ్మణియు యథాప్రకారము ప్రవరుఁడు భోజనమునకు రాకపోవుటచే నతనియొద్దకుఁబోయి భోజనమునకు లెమ్మని పిలిచినది. అతం డవ్వా! నాకీదినమున నాఁకలిలేదు. భోజనము చేయను. మీరు భుజంపుఁడనుటయు నామెయు బహువిధముల నిర్బంధించెను గాని యామె ప్రయత్నమేమియుఁ గొనసాగినదికాదు.

అట్లు లేవకయే పరుండి యుత్తరము చెప్పుచున్న ప్రవరుని మాట లన్నియు వినుచున్న రాజపుత్రిక తనబుద్ధి సూక్ష్మతచే నతని విచారకారణము గ్రహించి యతనియందు బద్ధానురాగయైయున్నది గావున నతఁడు వినుచుండ నాబ్రాహ్మణితో నిట్లనియె.

అవ్వా! బుద్ధిమంతు లల్పకార్యవిషయమై చింతించుచు వజ్జులువలె భుజింపమానుట తగునా? తమపోషకత్వములోనున్నవారిచేఁ దీరవలసిన కార్యము లెవ్వియేని గలిగినచో నుడివినం దప్పా? ఒకవేళఁ బలకరించినచోఁ దగులమెక్కుఁడగునని వెరపు గలిగియున్నదేమో? హృదయంబున నట్టిభీతిగొన నవసరములేదు. దైవప్రతికూల దినములలో మిత్రులుమాత్ర ముపచరింతురా? మేమిట్లు చెప్పఁదగిన వారముకాము. అయినను పోషకవిశ్వాస మూరకుండనీయకున్నది. భుజించినవెనుక కార్యమెఱింగించి నియోగింపవచ్చునని పలికిన నాఁపూబోఁణి వాక్యంబులకు సంతసించి యతం డప్పుడలేచి భుజించిన వెనుక యాయవ్వతోఁ జెప్పినట్లు

కార్యవృత్తాంతమంతయు నెఱింగించుటయు నమ్మించుచుఁబోణియు నిప్పని కింత చింతయక్కర లేదు. వంట జేయుదు. విందునకుఁ బిలువ వచ్చునని యతండు వినుచుండ నవ్వకే చెప్పినది.

అంతమరునాఁడా రాజపుత్రిక గొర్తె తరుచుఁ లుప్పతిల్లఁ బెక్కువిధములఁ బిండివంటలతోఁ బాకంబుచేసి సిద్ధపరచినఁ బ్రియుఁడును రాజు నుచితసత్కారంబులం దోడ్కొనివచ్చి భోజనాగారంబునం గనకసుమ విరాజమానంబగు పీఠంబునఁ గూర్చుండబెట్టి వడ్డింపుమని యమ్మానవతి కానతిచ్చిన నాచతురయు నృపతిమతి యెఱింగి మొదటనొక దినసు చీనాంబరముగట్టి కెంపులుచెక్కిన నగలఁబూని తళుక్కురని నిజతనుద్యుతులు మెఱయ హొయలు గులుకు నడల జనుదెంచి వారిముంగలఁ బైడిపాత్రిల నమర్చి యందు పెక్కు పిండివంటకములతో మొదటవడ్డన నడ్డించి పిమ్మట నయ్యాలంకారములు తీసి మరియొక దినుసుపుట్టంబును భూషణంబులు దాల్చి వారు భుజించుచుండఁ గావలసినపదార్థముల నభిప్రాయ మెఱింగి వడ్డింప దొడంగినది.

అప్పుడు రాజు రెండువిధములుగాఁ గాన్పించిన యప్పొటల గంధిని నిరువురుగా భావించి వారిసోయగ మోరగంటం జూచుచు నోహో! యీతనికి నొక్కరితయే భార్యయని వింటి ఏకరీతి సొగసు గల ముగుద లిరువురుండిరే! ఇంతయందకత్తె లెక్కడదొరకిరో గదా? వీనియదృష్టమేమి? మేలుమేలని యప్పడుచుల గుఱించి యాశ్చర్యపడుచు భుజించిన వెనుక యతనిచే సత్కారములనంది యింటి కరిగి భార్యతో నిట్లనియె.

ప్రేయసీ! మనప్రగ్గడ కొక్కరితయే చక్కనిభార్య గలదని వింటిమిగాని నిజంబరయ నిద్దఱుసుమీ. అన్నన్నా! యాయన్నుమిన్న లసొంపు మనము విన్నదానికన్న విన్నదైయె యున్నదిగదా. తెరఁగంటి వాల్గంటులు వారియింట దాస్యంబునకైనం జాలరని యూహించెదను. చక్కఁదనం బొక్కటియే కాక దానికి వన్నెవెట్టు ధీకౌశల్యము

కూడ యున్నదిసుమీ. అదియెల్ల నడలయొయ్యారంబునను వడ్డన
చమత్కృతిచేతను వెల్లడియైనది. అదియట్లుండనిమ్ము. తత్కృతమ్మగు
పాకమునఁ బదార్థభేదమ్ముల కనిపెట్ట నెవ్వరితరంబు ? రుచి పన
చెప్పనేల ?

ఒక్కటియే పెక్కువిధముల రుచిగలుగునట్లు వండినది
భుజించితినిగాని యేది యెట్టిదియో భేదమే తెలిసినదికాదు. బాపురే!
అని యత్యాశ్చర్యముగా నామెను వర్ణించుచున్న నాథునిమాట
లాలించి యాప్రోయాలు దానుగూడ నాచేడియలంజూడ వేడుక
పడుటయు లేఁడు అందులకొక యుపాయ మూహించి మరునాఁడు
సచివుని రప్పించి యిట్లనియె.

ప్రగ్గడా ! మనమెల్లుండి వచ్చుచున్న యర్ధోదయంబునకు
సకుటుంబముగా సముద్రస్నానమున కరుగుదము. మహాపర్వంబులఁ
దీర్థంబులయందు భార్యలతో వలువ చెరంగులు ముడివైచికొని
క్రుంకినచో నెక్కుడుపుణ్యము గలుగునని విద్వాంసులు చెప్పుదురు.
అట్టి ప్రయత్నము గావింపుమని యభిలాషపూర్వకముగఁ జెప్పిన విని
యెడఁద దిగులు వడియు సంతసము మొగమునం దభినయించుచు
వల్లెయని యింటికరిగి మునుపూలె విచార గృహంబునం బండుకొని
యిట్లు ధ్యానించెను.

పాప మీచిన్నదాని యనుగ్రహమున నొకయాపదగడపితిని.
పరకాంతను వంటచేయుమనినఁ గొంత యుక్తముగానున్నదిగాని
సరిగంగాస్నానమాడరమ్మని యెట్లుపలుకుదును ? మొదటనే యా
సుందరి నాభార్య కాదనియు నాకుఁ బెండ్లియే లేదనియుఁ జెప్పి
నచో నీముప్పురాకపోవుఁగదా. వట్టిదంభము బెట్టికొనిన నెవ్వరికిని
గీడురాకమానదు. ఇప్పుడు నాకు భార్యలేదనిచెప్పిన బరిహాసా
స్పదుఁడనగుదును. ఏమిసేయుదును. ఉపాయమేమి? అని ధ్యానించు
చుండ వెండియు ముసిలియామె భోజనమునకు రమ్మనిపిలిచిన నతండు

వెనుకటివలెనే రానని చెప్పిన నాసన్న మెఱింగి యాకురంగనయన యతండు వినుచుండ నవ్వాతో నిట్లనియె.

అమ్మా ! సారెసారెకట్లు కార్యాతురత్వంబునఁ జింతింప నేటికి ? ఒకమాటు నియోగించిన భృత్యులు వేరొకమాటు నియోగించు విషయమాలోచింపవలయునా సతతము దన్నుఁబోషించు వారి కవసరమువచ్చినప్పుడు కార్యములుదీర్చుట భృత్యకృత్యమే కదా ! కావున గార్యమెరింగించి నియోగింపవచ్చునని పలికిన విని సంతసించి ప్రవరుండు సంతోషముతో లేచి భుజించి రాజుచెప్పిన కార్యవృత్తాంతమంతయు నెఱింగించిన నాయించుఁబోఁడి యిట్లనియె.

ఈమాత్రపుపనికే యింత చింతింపవలయునా ! అక్కార్యమేను నవరించి కృతజ్ఞతఁ జూపించుకొనియెదంగాక. ఏడందలములు నేడు రకముల నగలు పుట్టములు దెప్పింపవలయును. స్నానఘట్టమున నేడు గుడారములు నేడు గుమ్మములు గలుగునట్లు కట్టనియోగింపవలయునని కర్తవ్యములన్నియు నవ్వాతోఁజెప్ప నట్లువదేశించిటయు నామంత్రియు నవి యన్నియు నాతీరున సిద్ధపరచి ప్రయాణసమయ మారమణి కెరింగించెను.

అప్పుడబ్బోఁటి నీటులుగులుకు మేటిసోయగంపురూపు దీపింప సింగారించుకొని తానొక యాందోళికమునఁ గూర్చుండి తక్కిన చతురంతయానములలో వింతలగు నగలను బుట్టములను బెట్టి తలుపులు మూయించి నడువ నియోగించినది.

మంత్రియు మిగుల నానందముతో నొక్క పల్లకీయెక్కి యాందోళికా సప్తకంబు దనవెంటరా బోయెల మెలుంగుల నింగి పగుల సముద్రస్నానంబున కరుగుచుండెను.

రాజును భార్యతో నంతకుమున్న వెడలి మంత్రిం గలసికొనెను. తదీయాందోళికా సందోహవాహక రజకకంఠనిర్ఘోషార్భటులకు

వెరగందుచు నాచక్రవర్తి యాచతురంతయానము లన్నియు నెవ్వరివని ప్రాంతగుల నడుగ వార లవియన్నియు మంత్రిగారి భార్యలవి యని యుత్తరము చెప్పిరి.

ఆనుడువుల నాయొడయని యెడద సంశయాశ్చర్యపారావారంబున మునింగి వేదెరంగుల జింతించుచుండఁ గ్రమంబున వారందఱు స్నానఘట్టము జేరిరి.

అందు మంత్రియెక్కిన యాందోళికముదక్క తక్కినవి యా పటకుటీరములలోఁ బ్రవేశపెట్టిరి. అప్పుడు రాజును భార్యయుఁజూచుచుండ నయ్యండజయాన మొదటిగుడారమునుండివచ్చి ప్రవరునితో స్నానముజేసి పోయి యాడేరాలోనుండి రెండవదానిలోనికివచ్చి యందున్ననగలను వలువను ధరించి యప్పటియట్ల యరిగి యత్తరుణి ప్రవరునితో స్నానముజేసెను. ఈరీతిని నగలును జీరలునుమార్చుచు నచ్చేడియ నేడు గుడారములలోనుండి వచ్చివచ్చి ప్రవరునితో సరి గంగాస్నానములు చేసినది.

ఆవింతయంతయుఁజూచి కందర్పకేతుండును భార్యయు మనంబున మిగుల వెరగుపడి యోహో! మొదట మనప్రధానికి నొకతయే భార్యయని వింటిమి. విమర్శింప నిద్దరుగాఁదోచిరి. ఇప్పుడుజూడ నేడ్గురుగా గాన్పించిరి. వీరి చక్కఁదన మొక్కరీతిగానున్నది. ఈతని కిందఱుసుందరులున్నసంగతియే తెలియదు. వీరి యైకమత్యమే యీ గుట్టునకు మూలమని యనేకరీతుల నాదాంపత్యమునుగుఱించి చెప్పుకొనుచు మరల నాందోళికములెక్కి యింటికరిగిరి. ప్రవరుఁడును రాజపుత్రికయు నెప్పటియట్ల గొప్పవైభవముతో బసజేరిరి. జాణలగు మానినులువన్ను కార్యములకుఁ బ్రతిహతముగలదా?

అమరునాఁడు రాజు తెలివిగల యొకపరిచారికం జీరి యేడు జల్తారుచీరలతో మఱికొన్ని కానుకలుంచి వీనిఁ దీసికొనిపోయి మం

త్రిగారిభార్యల కిచ్చి వారివారిపేరుల వ్రాసికొనిరమ్ము. వారేమివిద్య లం జదివిరో తెలిసికొని రమ్మని మఱికొన్నిమాటలం బోధించి యంపెను.

ఆవనికత్తెయు నాకానుకలం బట్టించుకొని మంత్రిగారి ద్వార మునొద్దకుంబోయి తన రాకయు రాజుగారి సందేశప్రకారముం దెలియంజేయుటయుం బ్రవరుండు గుండె ఝల్లుమన నయ్యో! ఈ రాజు నాగుట్టు తెలిసికొనువఱకు విడుచునట్లు లేదు. ఆచిన్నదియు నతనికిం బై యెత్తువైచుచు భ్రమపెట్టుచున్నది. ఇప్పు డేమి చేయం గలదు. ఏడ్వురుభార్యలకు నేడు జల్తారుమేల్కట్టుచీరలు పంపించి యున్నాండు. ఏడ్వురు గనంబడి కానుక లందికొని పేరులు చెప్ప వలయునంట. ఏమిచేయుదును దైవమా! అని ధ్యానించుచు నాము ద్దియ నాకన్న బుద్ధిమంతురాలు. దీని కేమివ్యూహము బన్నునో చూచెదంగాక యని తలంచి యప్పుడే యావృత్తాంతము అవ్వతో చెప్పి యావొప్పులకుప్పకుం దెలియంజేసెను.

అప్పు డాప్రజ్ఞావతి అవ్వా! ఇందులకు వెరవంబనిలేదు. ఆదా దిని గానుకలతో రమ్మనవచ్చును. సరిగంగాస్నానములుజేసినవారు జీరలందుకొనరా? సందియ మవసరము లేదనిచెప్పి తరువాత ముస లమ్మకు గొన్నిమాటలు బోధించి చేయవలసినయుపాయ మెఱిం గించి తాను లోపలకుంబోయినది.

ప్రవరుండు తనపరిచారికవెంట రాజదాసిని దన యంతఃపుర మున కనిపెను. అవ్వ యందుంగూర్చుండి యాదాదికిందగిన మర్యాద గావించినది. అప్పు డాదాది అమ్మా! మంత్రిగారిభార్య లేరీ! వారి కీ కానుక లీయవలయు నెందఱు? వారిపేరులేమో మీ రెఱుంగుదురా వ్రాసికొనవలయునని యడిగిన నాయవ్వ మంత్రిగారికి నెనమండ్రు భార్యలున్నారు. వారిభార్యలుపేరులు శ్రీకృష్ణునిభార్యలపేరులే. వా రందఱుకలిసి యేకముగారారు. ఒకరితో నొకరు మాటాడరు.

సాపత్నీధర్మము లోకవిదితమేకదా ? ఎవ్వరిని పిలువమన్న వారిని నేను దీసికొనివచ్చెదఁ జెప్పుమనుటయు నా దాది మొన్న సముద్ర స్నానమునకు వచ్చినవా రేవ్వ రేకదాయని యేమచీరలే తెచ్చితిని. కానిందు మఱియొకటి నింతలోఁ దెప్పించెద ముందుగాఁ బెద్దభార్యం బిలువుఁడని పలికిన విని యాయవ్వ మొన్న కడపటియామెకు దేహములో స్వస్థతలేక సముద్రస్నానమునకురాలేదు. మంత్రిగారి కినమందుగురుభార్యలు అని చెప్పుచు నాయవ్వ లోపలకుఁ బోయి దివ్యాలంకారభూషితయై యొకదినుసునగలును వలువలును ధరించి మెఱయుచున్న యాయన్ను మిన్నను వెంటఁబెట్టుకొనివచ్చి యీయమె యే పెద్దభార్య. ఈమెపేరు రుక్మిణి. ఈమె సంగీతము నిధి అని యామెగుణంబును వర్ణించి చెప్పినది.

దాది యామెకు నమస్కరించి కొంత ప్రసంగము గావించి యామె పలుకుల కలరుచు దాను తెచ్చిన కానుకలిచ్చి రెండవ యామెఁ దీసికొని రమ్మని ముసలమ్మకు సంజ్ఞఁజేసినది. అప్పుడా యవ్వ యవ్వనితను లోపలకుఁ దీసికొనిపోయి ముహూర్తకాలములో మఱియొక దినుసునగలు వలువలుదాల్చి మఱియొక తెవలె దోచు చున్న యాచిన్నదాని కై దండపట్టుకొని తీసికొనివచ్చి దానికిఁ జూపుచు నీమె రెండవభార్య. ఈమెపేరు సత్యభామ. ఈమెకుఁ దర్క వ్యాకరణములు రెండును గూలంకషముగాఁ దెలియునని చెప్పినది.

ఆదాది యామెతోఁ గొంతముచ్చటించి సంతసించుచుఁ గానుక లిచ్చి మూడవయామెం దీసికొనిరమ్మని సంజ్ఞచేయుటయు వృద్ధ యమ్ముద్దియను లోపలకుఁ దీసికొనిపోయి మఱియొక వేషముతోఁ దీసికొనివచ్చి చూపినది. ఈరీతిగా నానాతి మొనమండ్రిజవరాం డ్రిగా తోచునట్లు వేషములు మార్చి వలువలు తొడవులు చాయలు గూడ నెనిమిది దినుసులుగా ధరించి దానితో సంభాషించునప్పుడు స్వరభేదములు గలుగునట్లుచేసి దానిని మోహింపఁజేసినది.

ఆదాదియు నెనమండ్రుభార్యలకుఁ గానుకలిచ్చి వారివారి నామవిద్యారూపవిశేషములు వ్రాసికొని వారివలన నామంత్రిణము వడసి రాజునొద్దకుఁబోయి తచ్చాతుర్యాదివిశేషంబుల నద్భుతముగా స్తుతిజేయఁదొడంగినది.

రాజు ఆవిశేషము భార్యతోఁజెప్పి మనమంత్రిపుంగవుఁడు శ్రీకృష్ణునికన్న విలాసపురుషుఁడఁట. ఎనమండ్రుభార్యలు దేవకాంతలుగాని మనుష్యకాంతలు కారఁట. అతని కీయదృష్టమెట్లు పట్టినదో యని వెరగుపడుచుఁ బరితపించుచుండెను.

ప్రవరుఁడు రాజనందనచేసిన చమత్కారమునకు మిగుల మెచ్చుకొనుచు నయ్యుపకారమునకు బ్రతియెద్దియుఁ దాను జేయలేనని యవ్వనిత వినుచుండ నవ్వలతోఁ గృతజ్ఞతాసూచకములగు స్తుతులు పెక్కుచేసెను.అక్కన్యయు మనంబున నిట్లు వితర్కించెను.

అక్కటా ! నాజవ్వనమంతయు నడవిఁగాసెడు వెన్నెలవలె వ్యర్థమగుచున్నది ! మంత్రికుమారుఁడగు జయంతుని విడదీసి ప్రతికూలుఁడైన దైవమిప్పుడు నాకనుకూలుఁడగుచున్నట్లు తోచుచున్నది. మొదట నీతనిమొగము నిదానించి చూడమినిన్నాళ్ళుపేక్షించి యూరక కుందుచుంటిని. పరిశీలించినచో నితండతనికన్నఁ జక్కనివాఁడును విద్వాంసుఁడు నగుటచే నాకింత చింతింపవలసిన యవసర మే లేకపోయెను. చక్కఁదనమేకాక యీపురుషశ్రేష్ఠుని జితేంద్రియత్వము మిగుల శ్లాఘాపాత్రమై యున్నది. ఇంత సొగసు గల నెలంత యూరక తన యాధీనమందుండ మఱియొకండెవఁడైన నిట్లుపేక్షజేయునా ? ఆసుగుణసంపత్తియే వీని యదృష్టమునకుఁ గారణమని యూహించెద. నేనిఁక నితని వివాహమాడనిచో నాచక్కదనమునకు దిక్కెది? నేఁడు నాకు శుభసూచకముగా నెడమ భుజ మదురుచున్నది. ఈరేయి వీనితోఁగలసి కొంతముచ్చటించెదం

గాకయని నిశ్చయించి యారాత్రి ప్రివరునికి వడ్డించు నప్పుడవ్వతోఁ బూర్వముకన్న నెక్కుడుగా పదార్థములు వడ్డించుమని రహస్యముగా బోధించినది.

వృద్ధయు నమ్ముద్దులగుమ్మ చెప్పినచొప్పున నెక్కుడుగావడ్డించి నంజూచి ప్రవరుఁ డవ్వా! నాకీదినంబున నిట్లువడ్డించితి వేమి? నాభోజనపుతీరు మరచితివా? నాకడుపు పెద్దదియైనదనుకొంటివా? యని యడిగినఁ దలుపుచాటుననున్న యన్నాతి యతఁడు వినుచుండ నిట్లనియె.

అవ్వా! పదార్థము లెక్కుడైనచో దిగఁబెట్టవచ్చును. వంట జేయుటకును సరిగంగాస్నానములాడుటకును నోడంబడినవారు పదార్థశేషములు దినుటకుమాత్ర మర్హులుగారా? అవసరంబున్న యప్పుడేగాని యాశ్రితజనంబుల మన్నింపరుగాఁబోలునని యుత్తరముచెప్పిన నతండామాట కేమియుఁ బలుకక వలయునంత భుజించి యప్పటి యట్ల తన శయ్యాగృహంబునకరిగి పండుకొనియెను.

పిమ్మట నాకొమ్మయు నాఁడు కాంతునిపాత్రయందు భుజియించి యంతఃపురంబంతయు వింతగా సింగారించి మించుతళ్కులఁ దిరస్కరించు మేనికాంతుల మెఱయు రతనంపు పైడితొడవులఁ బెక్కుదాల్చి యొడలనలఁదిన పరిమళద్రవ్యంబుల వాసనలు దెసలావరింపఁ బెంపగునింపుగులుకు వేషంబునఁ బుడమిఁ జక్కఁదనంబునం బ్రసిద్ధికెక్కిన చక్కఁరబోండ్లనెల్లఁ దిరస్కరించుచు నామేడమీఁద గద్దియంగూర్చుని నిలువుటద్దంబునఁ దన మేనిసొయగంబెల్ల నుల్లంబలర నీక్షించుకొనుచు నావృద్ధంజీరి యిట్లనియె.

అవ్వా! నేనొక్కసారి జీవుఁడుంటినని చెప్పి యప్ప్రివరు నిచ్చటికిం దోడ్కొనిరమ్మని పనిచిన నామెయు జని యతనితో నామాట జెప్పినది. అతండు శంకాన్వితస్వాంతుఁడై కారణం బడిగిరమ్మని

మరల నామెననిచిన నాయువ్వాయు నాజవ్వానివలన బోధింపబడి మరల నరిగి యతని కిట్లనియె.

ఆర్యా! మొన్న సముద్రస్నానముచేయునప్పుడు కాలిలోఁ జేపముల్లు గ్రుచ్చుకొనెనఁట. అది తీయజాలిన వారెవ్వరును లేకపోయిరి. నీకు శక్యమగునని యూహించియే పిలువమన్నదనిపలికిన నులికిపడి యతండయ్యో! పాప ముపకారమునకై వచ్చినయచ్చేడియ ముల్లు విరిగి బాధపడుచున్నదియూ! యింతదాక నేమిటికి జెప్పినదికాదు. అని పలుకుచు ముల్లుతీయు సాధనమొకటి చేతంబూని యతిజవంబున నావృద్ధవెంట నావాల్గంటియున్న మందిరమునకరిగి యొక్కింత తల వాల్చి యోసాధ్వీ! నీకాలిలో నెక్కడ విరిగినదియో చెప్పుము. దీనెడ ననుటయు నల్లన నవ్వుచు నాశుకవాణి యిట్లనియె.

ఆర్యా! ముల్లుదీయవచ్చి యింత తొందరపడియెద రేమిటికి? అది నిదానింపక తీసినచో నొప్పియగుంగదా? యీపీఠమునందొకింత విశ్రమించి ముంటిజాడఁ దెలిసికొనుఁడు. అనిన నతండట్లే యని యామెచే నియ్యఁబడిన పీఠమునం గూర్చుండెను. పిమ్మట నాచతుర చిఱునగవు మొగము నలంకరింప దట్టంపుచూపులతనిం బరగించుచు నిట్లనియె.

మహాత్మా! ఆపత్సముద్రంబునఁబడద్రోసిన భగవంతుఁడే నాకు మీరను తెప్పంజూపించెను. హస్తగతంబగు మణిని గాజుపూసయని యుపేక్షించితిని. అల్లనాఁడు గుట్టమీఁదజూచినప్పుడు కట్టుకొనిన పుట్టములంబట్టి మిమ్ము సామాన్యులనుకొనియే యింతదనుక నుపేక్ష చేసితిని. మీరూపమేకాక విద్యాగుణశీలంబులు ననన్యసామాన్యములై యొప్పుచున్నవి. ఇట్టి మీపాత్రిపుదొరికినను ననాథనవలె నేనీపరువమం తయుఁగాలము పాలుసేయుచున్నదాన. సింతకన్ననవి వేకమున్నదియా?

దీనురాలనై నేఁడు వేడుకొనియెద. నన్ను గాంధర్వ వివాహంబున స్వీకరించి కులంబుద్ధరించుకొనుఁడు. ఒకవేళ నన్ను దుష్టురాలినిగాఁ దలంచెదరేమో వినుండు. నేను రాజకుమార్తెను నాపేరు కాంచనవల్లి. నేను సవయస్కుండును సహాధ్యాయుఁడునగు మామంత్రికుమారుఁడు జయంతుఁడను వానిఁ జిన్ననాఁటనుండియు వలచియుండ నాతండ్రి వివాహసమయమున నతనికీయమిసూచించిన నాజయంతుండును నేనును విదేశగమనమునకై సాంకేతిక మేర్పరుచుకొంటిమి.

ఇంతకన్న నేదోషము నెఱుంగను. అతఁడెట్టి కారణముననో యనుకొనినట్లు రాకపోవుట యెఱుంగక మిమ్ము నతడేయనుకొని వెంటఁబడితిని. ఇంతవట్టు నిక్కము దైవముతోడుగా వక్కాణింపఁగలను. పైన మీరెఱిఁగినదియే గదా యని దైన్యంబున బెక్కుగతులఁదన్ను బ్రార్థించుచుండ దయాళుండగు ప్రవరుండామోదించి యాప్రైదలిం గౌఁగిటంజేర్చి యనునయపూర్వకముగా నిట్లనియె.

కాంతా! నీస్వాంత మన్యథా యున్నదనియే నేనింత కాలము నుపేక్షచేసితిని. మొన్న నవమానము రాకుండఁ గాపాడిన నీవు చెప్పినట్లు చేయుట నాకుచితమే కదా! నీమతి చమత్కృతియేగాక సౌందర్యముగూడ త్రిలోక మోహజనకమైయున్నది. అస్వీకృత దారుఁడనగు నాకు నీయట్టి చేడియంబెండ్లియాడుటకంటె భాగ్యమున్నదియా? దీనికై నన్నింత బ్రతిమాలవలయునా? ఇప్పుడు మంచి ముహూర్తము నిన్నిదిగో గాంధర్వవివాహంబున స్వీకరించుచున్న వాఁడనని యమ్మానవతి మెడలో నొక పూలదండ వైచెను. ఆమెయు నతనిపై బూవులుజల్లినది. అప్పురుషపుంగవుండంగజకళానైపుణ్యము దేటంబడ నాబోఁటి నారేయి బహువిధరతుల నలయించెను. అయ్యువిదయు నాచతురుని రతివిశేషములకు మతి గఱఁగి నానంద పారావార వీచికలం దేలెనని యెఱింగించునంతలోఁ బయ

నంపుతరియగుటయు నానన్యాసి కథ చెప్పుట చాలించి యాగొల్ల పిల్లవాని కావిడియెత్తుమని క్రమంబున బైమజిలీచేరి యందునుఁ కాలకృత్యములు దీర్చుకొనినపిమ్మట నతండొక రమ్యప్రదేశమునఁ గూర్చుండి శిష్యునకుఁ దదనంతరోదంత మిట్లు చెప్పందొడంగెను.

---

అయిదవమజిలీ.

## ధండునికథ.



గోపా! యుత్తరదిశకు వటవిటపిమీఁదుగా నరిగిన కంసాలి కుమారుఁడగు దండునకు నాలుగుదినములరిగినంతనే యాశాఖాంత మగుపడినది. మగుడఁదలంచియు మితి చాల యున్నదిగానఁ గారడవి గానున్న యాప్రదేశములో వింత లేమైన నుండునేమో చూచి పోయెదంగాక యని నిశ్చయించి యాకొమ్మదిగి యటునిటు దిరుగు చుండ నొక దండ నందనవనంబునుంబోని యుద్యానవనం బొండు గనంబడినది.

అతండందులకు వెరఁగందుచు నందు నలుదెసలం బరికింప నొక వంక నభోమణిమణిసోపానములును గాంచనపద్మంబులును సౌవర్ణ కువలయంబులును నింద్రనీల రోలంబంబులునుం గలిగి యమృతోపమానంబులగు జలంబులచే నిండింపఁబడిన సరోవరం బొండు నేత్రపర్వము గావించినది. దానిపొంత కరిగి యందలి జలంబులు గ్రోలి దప్పి దీర్చుకొని తత్ప్రాంతమున నున్న లతావితా నచ్ఛాయం గొండొకవడి బహువిధకుసుమవాసనల హరించి ప్రస రించుమంద మారుతములఁ గతి శ్రమము వాయ విశ్రమించి తదు ద్యాన వైభవం బరయుచుఁ దాను గూర్చున్న కుంజంబున నొక వింతయగు లతాంతము గానంబడుటయు సంతసముతో నాపుష్పంబుఁ ద్రెంచి ముక్కుదరి నిడి తావి నాఘ్రాణించునంతలో నతండొక చిలుకయయ్యెను.

అట్లు చిలుకరూపు వచ్చినను దొల్లింటి తెలివిగలిగి యుండు టచే నతండు తనలోఁ బలుతెరంగులఁ జింతించుచు నయ్యో! దైవము నన్నిందులకే కాఁబోలు వృక్షశాఖాప్రదేశంబున కెంటు కొనివచ్చెను. నేనెట్లు పక్షిరూపముతో వసింతు. దీనికవసానమెద్ది? నన్ను రక్షించువారెవ్వరని యరచుచు నందలి ఫలవృక్షము లెక్కి తత్ఫలరసంబులచే నాకలి యడంచు కొనుచుఁ గొన్నిదినములంతుఁ గాలక్షేపము గావించెను.

ఇట్లుండునంత నొకనాఁడాయుద్యాన వనమునకు సోమప్రభ యను విద్యాధరి కూఁతురు విద్యుత్ప్రభయనునది విహారార్థము సఖులతో వచ్చి యిచ్చవచ్చిన ట్లందంద విహరించుచుండ నయ్యం డజయాన నీక్షించి దండుఁడు మెండు వేడుకతో నెగిరి యమ్మగువ మొ్రోల మృదుమధురములగు పలుకులు వెలయించిన నంతసించి యయ్యంచుఁ బోఁడియు దానిం బట్ట గమకించి పయ్యెద పుట్టంబు నడుమునకుఁ జుట్టుకొని మెల్లన యడుగులిడుచు హస్తసంజ్ఞచే సఖుల రొద సేయవలదని వారించుచు నల్లనల్లన దరి కరిగినను బెదరక పక్షాంచలంబు లార్చుచు నిలువంబడియున్న యప్పిట్ట నట్టెపట్టుకొని మచ్చిక సేయుటయు నదియుఁ బెంపుడిదివ్రోలె నమ్మచ్చెకంటి చేయి విడువక పలువేడుకతో నిలువంబడి సరసము లగు పలుకులచే నచ్చెలు కులకొలికిని రంజింపఁజేసినది.

అది మొదలామదవతి యాచిలుకయందు బద్ధానురాగయై తన వలకేలు దానికిఁ బంజరంబయియుండ నిమునమేనియు విడువక గారాబముగాఁ బెంచుచుండెను. మఱియు దానిఁదన కేలెక్కించుకొని వాణియుఁబోలె నాశుకవాణి తనలోకంబున కరిగి యాందాప్తులతో నాచిలుక పలుకులు మచ్చికయుఁ దేటపడ నెరింగించుచు నది యడవి చిలుకవలెఁ బారిపోవునదిగాదుగాన దానిస్వేచ్ఛగాఁ దిరుగ విడిచి పెట్టుచుండును.

విద్యాధర లోకములోఁ దరుచు విమానములు జేయు పని విద్యార్థులకుఁ బాఠశాలలో నేర్పుచుందురు. చిలుకగానున్న దండూఁడు తన్ను విడిచిపెట్టినప్పుడా పాఠశాలల కరిగి ప్రచ్ఛన్నముగా నుండి సూక్ష్మబుద్ధి గాన నచిరకాలములోనే యావనిని గ్రహించెను.

ఒకనాఁ డావిద్యుత్ప్రభ తన మాతామహుండైన మయునిఁ జూచుటకు నాచిలుకతో వచ్చుటి కరిగి యతనిచే మన్ననలు వడసి కూర్చుండి చిలుకపయినున్న ప్రీతి దేటపడ నతనితో నిట్లనియె.

తాతా! యీచిలుకం జూచితే? ఇది నీవు నాకు విహరింపఁ గ్రొత్తగా నిర్మించి యిచ్చిన యుద్యానవనములో దొరకినది. నాకు దీనియందు మక్కువ మిక్కుటము సుమీ! దీనికిని నాయందట్టి ప్రేముడి గలిగి యున్నది. దీనికిఁ బంజరమక్కర లేదు. విడిచివైచి నను దాని యిష్టమువచ్చినట్టు తిరిగి పిలిచినంతనే చేరుచుండునని గాఢముగాఁ బలికిన మనుమరాలి పలుకుల కలరి యతండిట్లనియె.

అమ్మాణీ! చిలుకయనిన జ్ఞాపకమువచ్చినది. నీయుద్యాన వనములోనున్న తటాకంబుదరిఁ దూర్పుదెస నొక సౌధరిల్లు గలదు. దాని కుసుమమెన్నఁడును నాఘ్రాణింపకుమీ! యట్లాఘ్రాణించిన వారు చిలుక యగుదురు ఎప్పుడేనిఁ బ్రమాదమున నట్టిపని తటస్థించినచో నాసౌధరింటిలోనే వెనుకటిభాగమున పచ్చరంగుగల యొక కుసుమగుచ్ఛము గలదు. దాని నాఘ్రాణించిన నట్టిరూపుపోయి తొంటిరూపము వచ్చునని యెరింగించెను. ఆచిన్నదియు కొన్నిదినంబు లందుండి వెండియుఁ దనలోకముఁ జేరెను.

దండుఁ డామయునిమాటల నాలించి సంతసించుచు దైవకృపకు మెచ్చుకొనుచుఁ దనరూపు మార్చుకొన తెరవుదొరకెనని మురి యుచు విద్యాధర కన్యక యావనమున కెప్పుడుపోవునని సమయము నిరీక్షించుచుండెను మరియు నొక వసంతమున సాయంకాలమున దం

డుం డప్పురోద్యానవనమునం దగు సహకారతరుశాఖ నధిష్ఠించి ప్రాంతహాటక తటాకంబున జలకేళిం దేలుచున్న విద్యాధర వల్లవాధరుల సోయగం బరయుచుఁ దదంతికంబున మెలఁగుచుండ నయ్యెండజయాన లొండొరులతో సంభాషించుకొనుమాట లిట్లు విననయ్యెను.

చెలికత్తెలు—రాగమంజరీ! మనమందరము నిన్నను భూలోకంబున వటసరంబున జలకేళిం దేలితిమిగదా! నీవు మాతో రాకయందు జాగుజేసితి వేల? అటఁ గ్రొత్తవింత లేమైనం గనంబడినవా యేమి?

రాగమంజరి—అక్కలారా! అక్కడ నన్నొక్కదానను విడిచి నాచిక్కులరయక వచ్చితిరిగదా! వినుం డొకమానవుఁ డాచెట్టు చాటున డాగియుండుట మనమెఱుఁగక వలువలు విడిచి జలకేళిఁ దేలితిమి. అప్పుడు చప్పుడు గాకుండవచ్చి యచ్చపలుఁడు నావలువను గొని యరిగెను.

చెలి—ఏమేమీ? మానవుఁడువచ్చి నీపుట్టము గొనిపోయెనే. పిమ్మట నేమైనది?

రాగ—మీరందరు పుట్టంబులఁ గట్టుకొని పయనంపు తొందర నరిగితిరి. నాచీర గనంబడక విభ్రాంతినొంది నలుదెసలుం బరికింపుచు నేనామఱ్ఱికొమ్మలసందున డాగియున్న యొక చిన్నవానిం జూచి మదీయమాయాపాటవంబంతయుఁ దేటపడ వానిఁ జెట్టు దింపించి యాకోక స్వీకరించి వాని రాయిగా శపించి వచ్చితిని.

చె—మేలు. మేలు. వానికి మంచిప్రాయశ్చిత్తముఁ జేసితివి.

రా—దైవకృప నాయందుఁ గలుగఁబట్టి వాఁడాపుట్టము నాకిచ్చెను. లేనిచో నేను వానికి భార్యగానుండవలసి వచ్చుంజూడీ! దానంజేసియే యాలస్యమైనది.

కుసుమగంధి—హాండీ. నీగుండె యెంతకఠినమే. పాప మతని నెంతకాల మట్లుండ శపించితివి.

రాగ — ఔనౌను. కఠినముగాదా. నీవుఁట్ట మతఁడు పట్టుకొని వెళ్ళినఁ దెలియును. మరియొకరికి నీతులు చెప్పుట సులభమే!

కుసుమ — శాపమిచ్చి శాపాంతము చెప్పకపోవుటతప్పుగాదా.

రాగ — నీకంత వానియందు మక్కువగలిగినచో నామఱ్ఱి చెట్టుమొదటనున్న తీగెయాకు జలంబులం గలిపి యాఁరాతిపయి జల్లినచో నతండు మరల పురుషుండగును. అట్లుచేసి యతనినివరింపుము.

కుసు — నాకట్టి యవసరమేటికి. ధర్మము చెప్పితినిగాని వలచి కాదు. నిన్నతఁడు వలచినాఁ నీవలువను గొనెనుగాన నీవే యట్టిపని చేసి యతనిం బెండ్లియాడుము. అనుటయు వారిమాటల కందరు పక పక నగి చేతులు తట్టిరి. అట్లు కొంతసేపు జలకేళిందేలి యారమణు లెల్ల నుల్లంబులలరఁ దమతమ నివాసంబుల కరిగిరి.

ఆమాటలన్నియు విని దండుఁ డోహో! యామానవుఁడు నా చెలికాఁడగు సాంబుఁడు గావలయు. వానికిఁ బాషాణత్వము ప్రాప్తించెనే. కానిమ్ము దైవానుగ్రహము మాయందుఁ బరిపూర్ణముగానున్నది. లేనిచో నాకీపలుకులు వినఁబడునా! సాంబుని తొంటిరూపు దాల్చు తెరవెఱుంగఁబడినది. మాకు మంచికాలమువచ్చినది. అని సంతసించుచు నందుండి మరలవిద్యుత్ప్రభాభవనమునకరిగి నిజవియోగమునకై కుందు నాసుందరి డెందమున కానందము గలుగఁజేసెను.

విద్యుత్ప్రభ యొక్కనాఁడు మరల భూలోకోద్యానవనమున విహరింపఁ జిలుకతో వచ్చి యిచ్చవచ్చిన తావులఁ గ్రుమ్మరుచు మయునిమాట జ్ఞాపకమువచ్చినతోడనే యాపాద దరికరిగి తత్కుసుమముల నానవాలుపట్టుచుండ శుకరూపముననున్న దండుఁ డిదియే వేళయని రివ్వున నెగసి యాపువ్వుఁబోఁడి చూచుచుండ నావచ్చని పువ్వాఘ్రాణించునంతఁ దొల్లిటియాకార మొప్ప ధాత్రి నిలువంబడుటయుఁ గనుంగొని యయ్యంగన వెరగంది యతనితో నిట్లనియె.

ఆర్యా! మీరెవ్వరు? మకరరూప మేమిటికిఁ బూనితిరి? మీ వృత్తాంతమాలింప వేడుకయగుచున్నయది. ఎఱింగింతురే యనుటయు నాయించుఁబోఁడి కతండిట్లనియె.

నాతీ! నేను మీతాత మయునివంశములోనివాఁడనే. నాపేరు దండుఁడు. ఒకానొకకారణమున నీయుద్యానవనమున కరుదెంచి యీపొదరింటి పూవాఘ్రాణించి యట్టి రూపుగాంచితిని. నాపూర్వ పుణ్యవశమున నీప్రాపుదొరకినది. మొన్న మీతాతనుడివినపలుకులు నాకు వినఁబడినవికావున నిప్పుడీపుష్ప మాఘ్రాణించి పూర్వపురూప మందితిని. భవదీయదయావిశేషంబున నీలోకవిశేషములు చూచుటయేకాక, విమానములు చేయుపనిగూడ గ్రహించినాఁడ. నాయందుఁ బరిపూర్ణానుగ్రహముంచి సెలవిచ్చినఁ బోయి వచ్చెదనని వేడిన నాచేడియ యతని యాకారమునకు, మాటలకు, శీలంబునకు మిగుల మెచ్చుకొనుచు నభిప్రాయసూచకములగు లోచనప్రసారము లతని మొగంబునఁ బరగించుచుఁ గామశరపీడితహృదయయై యిట్లనియె.

ఆర్యపుత్రా! నన్నింత నుతింపనేల? నీవు విద్యచేత నేగాక రూపంబునను నసాధారణుండవే నాపూర్వపుణ్యవశమున నిన్నుఁ బొడగంటి నీయట్టిసుందరుఁడు మావిద్యాధరకోటిలో వెదకినను దొరకఁడు. నామనంబు నీయందు లగ్నమైనది. నన్ను భార్యగా స్వీకరింపుము. మరియు మాతాతయగు మయుండొకప్పుడు నన్నుఁజూచి నీకు మానవుఁడు మగఁడగునని చెప్పియున్నాఁడు. ఆసర్వజ్ఞునిమాట దప్పునే? ఇదియునుంగాక నీవును మాకులములోనివాఁడవే యగుట సంబంధమునకుఁ దగియుంటివని చతురోక్తులఁ దన్నాయతివ మిగుల బ్రతిమాలిన సంతసించి యతఁడప్పుడు యప్పడంతిని గాంధర్వవివాహంబునం గైకొని పైకొనిన మోహముతో నక్కలికి నొక్క పూబొదరింటఁ దుంటవిల్కాని క్రీడల నలయించెను.

అదృష్టవంతుల కెందేగినను లాభమేకలుగునుకదా! అట్లు కొన్నిదినము లాయుద్యానవనములో విద్యాధరపల్లవాధరింగూడి యావేడుకకాఁడు కామక్రీడలందేలుచు నొక్కనాఁడు చెలికాండ్ర యుదంత మంతఃకరణగోచరమగుటయు సంతాపాయత్తచిత్తుండై యత్తలోదరితో నిట్లనియె.

కాంతా! నావృత్తాంతమంతయు నీవు వినియున్నదియేగదా. నాచెలికాండ్రు వటవృక్షమూలమున నాకై వేచియుందురు. మే మేర్పరచుకొనిన మితి దాటినది. పోయివచ్చెద సెలవిమ్మని యడిగిన నతని నుడువుల కడదడలుదోప నాపడఁతి యిట్లనియె.

అయ్యో! వేడుకచవిచూపి పోయెదననుట యుచితమా? నా కన్న మిత్రులెక్కుడువారలా? ఎన్నియో క్రొత్తతలంపులు మనం బునఁబెట్టికొని సిగ్గుచే బయలుపరుపక కాలము గడుపుచుంటి. పోవల దని నిర్బంధించిన నతం డిట్లనియె. దేవీ! నీవు కామరూపిణివిగదా! నే నెక్కడనుండి తలంచిన నక్కడకువచ్చి నీయభీష్టముఁ దీర్చుకొ నుము. దీనికింతవలవంతఁ గాంతు వేమిటికనిన నబ్బోఁటియు సమ్మతిం చినది. పిమ్మట దండుఁడా రెండువిధముల కుసుమములను వేరువేర కోసి మూటగట్టికొని వచ్చినదారింబట్టి నాలుగుదినముల కావట విటపి మూలముఁ జేరెను.

అందెవ్వరిం గానక చింతాకులస్వాంతుఁడై యోహో! నిరూ పించుకొనిన మితియుఁగడచినది. మిత్రులలో నొక్కరుండైన నిక్కడ జేరలేదు. కారణముదెలియదు. సాంబునిచరిత్రము నేను విననదియే కదా? తొలుత వానిశాపవిమోచనముగావించి వానింగూడి మీఁదటి కార్యం బాలోచించెదంగాకయని యావిద్యాధరకన్యక చెప్పినయాకు గురుతుపట్టి యదితుంచి జలంబులంగలిపి యందున్న రాలపై నెల్ల జల్లుచున్నతరి నజ్జలస్పర్శము దగిలినంత సాంబుఁ డారూపము విడిచి

తోంటియాకృతిఁగైకొని యెదుటనున్న దండునిం గౌఁగిలించుకొని యిట్లనియె.

అన్నా నీవువచ్చి యెంతసేపైనది. ఇంకను దక్కిన చెలికాండ్రు రాలేదా? ఇందొకసుందరి యుండవలె నెందేగెనో యెఱుఁగుదువా? అప్పుడఁతి, యిప్పుడు నాయొద్ద మాట్లాడుచున్నదే. ఇంతలో నాకు నిద్దురపట్టినదికాఁబోలు. అయ్యయ్యో! పాపపునిద్దుర నాకిప్పుడేల రావలయు. అయ్యబల, నీక్షించినంగాని, మేనఁ బ్రాణంబులు నిలువకున్నవి. వయస్యా! అమ్మదవతిని వెదకితెచ్చి నాకన్నులముందరఁబెట్టి, ప్రాణదానఫలంబు గట్టికొనుము. అని పెక్కుతెఁరగుల విరహావేదనబలియఁ నన్ను బ్రతిమాలుచున్న సాంబునకు నవ్వుచు దండుడిట్లనియె.

అయ్యో, సోదరుఁడా! నీకతయే నీవెఱుంగక యూరక వెతలఁబడుచుంటివే! అయ్యతివనీకు మంచియుపకారమే చేసిపోయినది. వినుమది విద్యాధరకన్యక. దానిపేరు రాగమంజరి. దానిచీర నీవుతెచ్చితివని యెఱిఁగి నిన్ను మాయావచనంబుల మరులుగొలిపి రాయిగా శపించి, తనలోకంబున కేగినది. నీవాయవస్థ నిద్దురనుకొంటివి. దైవకృపచే నాకుఁ గారణాంతరంబున నీశాపాంతసూచకములగు పలుకులు వినంబడినవి. దానంబట్టి నిన్ను దక్కించుకొంటినని తానుద్యానువదలి వెళ్లినది మొదలు మరల నతనితో మాట్లాడుదనుక జరిగిన కథయంతయు నుడివిన వెరఁగుపడి యతం డొక్కింతసేపు విభ్రాంతస్వాంతుఁడై యూరకుండి వెండియు నిట్లనియె.

అన్నా! నీయదృష్టము కొనియాడఁదగియున్నది. దేవతావనితం బెండ్లియాడుటయేగాక నన్ను నీయాపదనుండి దాలఁగించితివి. మఱియు దైవకృప యెట్లున్నదియోకాని నే నెన్నిగతుల మరలింపఁదలఁచుకొన్నను నమ్మగువయందు నాడెందంబు తగులము విడిరాకున్నయది. నన్నుగూడనీతోటివానిం గావించినఁ గావింపుము. లేనిచో

నేనింద సన్యాసినై క్రుమ్మరియెద. ఇంతకంటె నామదియొండు గతికి సమ్మతింపకున్నయది. ఈపాటికార్యము సాధింపుమని వేడికొను టయు దండుఁ డిట్లనియె.

సోదరుఁడా! నీవు దీనికింతవంతఁబడకుము. ఇక్కార్యము సమ ర్థించురీతి యాచేడియ లాడుకొనిన మాటలఁ దేటంబడినది. వినుము వ్రతిభానువారమునాఁడు విద్యాధరకన్యక లిందుజలకేళిఁ దేలవచ్చు చుందురు. రేపటి దివసంబట్టిదియే కాన వారువచ్చి వలువలువిడిచి గట్టునంబెట్టి వనకేళిఁ దేలునప్పుడు మును వ్రాలె నీవురాగమంజరిచీర దెలియకుండ సంగ్రహించి యీమావిను కొమ్మలసందున డాగియుం డుము. తెలిసికొని యాకుసుమగాత్రి వచ్చి యెన్నిగతుల బ్రతిమాలి నను జేరనియ్యకుము. పై కార్యము నేను సమర్థించెదననుటయు నతం డునంతసించి మరుఁనాఁడు తదాగమనంబు నిరీక్షించుచుండ నయ్యండ జయాన లాకసంబుననుండి మెఱపుతీగెలో నా దళుక్కురని మెరయు మేనికాంతులు దేఁలసగ్రమ్మఁ బుడమికిదిగి యొండొరులు వేడుకఁ మాటలాడుకొనుచుఁ బుట్టంబులుగట్టుపయింబెట్టిజలకేళిం దేలుచున్న సమయంబున సాంబుఁడు మెల్లనసరిగి రాగమంజరి కోక సందిట నిరి కించుకొని యరిగి యెప్పటిగతి చెట్టునందు డాగియుండెను.

అక్కొమ్మలట్లు కొంతసేపు క్రీడించి యుత్తటాకంబు వెడలి తమ తమ చీరలం గట్టుకొని వియద్గతి విద్యాధరలోకంబున కరిగిరి. రాగమంజరి మాత్రము తనచీర గనంబడమి నాతపడుచు నందందు వస్త్రాపహారకుని వెదకుచు నెట్టకేలకు నాచెట్టునడుమనున్న సాంబుని గాంచి యచ్చీరసంగ్రహింప ననేకమాయోపాయములఁబన్నినుగాని యతండు దానిమాట లేమియుఁ బాటింపక చీరనియ్యకయే యుత్త రము చెప్పుచుండెను. ఇంతలో దండుఁడాదండకరిగి తన్నుఁజూచిసిగ్గు పడుచున్న యక్కన్నియకు నొకపుట్టంబు గట్టనిచ్చి యబలా! యేమి

యిది. ఈతనితో జగడము చేయుచున్న దానవని యడిగిన నదియిట్ల నియె

పుణ్యాత్మా! మాకు మధ్యవర్తివై యీతగవుదీర్పుము. నేను పుట్టంబు విడిచి గట్టుపైఁ బెట్టి జలకేళిఁ దేలుచుండ నీతండు నావలువ సంగ్రహించుకొనివచ్చె. తెచ్చెఁబో నాయది నాకిచ్చి యిచ్చవచ్చి నచో నన్నుఁ బెండ్లియాడు మనుచున్న దాన. నే నెన్ని చెప్పినను నా కోక నాకీకున్న వాఁడు న్యాయమరసి యది నాకిప్పింపుమనుటయు నతండు నవ్వుచుఁ బువ్వుఁబోఁడీ! ఈతగవు నేను తీర్పునదికాదు. మీ యేలికకూఁతురు విద్యుత్ప్రభ తీర్పఁగలదు. దానినిందు రావించెదం జూడుమని యయ్యంగనను దలంచుకొనినంత న య్యింతియు నంతికం బున నిలువంబడినం జూచి రాగమంజరి వెరగందుచుండ నయ్యండ జయానకు దండుఁ డిట్లనియె.

మగువా! ఈతగవు విని న్యాయము చెప్పుము. ఈతండుసాం బుఁడని పేరొందిన నాచెలికాఁడు. విద్యాగుణశీలంబుల నాకుజోడగు వాఁడు. ఇక్కన్యకవిద్యాధరకన్యకయఁట. ఇత్తరుణియిత్తటాకంబున వనకేళిం దేలుచున్నతఱినీతండీనాతిచీర దొంగలించుకొని పోయెను. అదియిమ్మని యడిగినను నీయక వేడుకమాటలఁ జెప్పుచున్న వాఁడఁట వీని యభిప్రాయమేమియో యెఱుగను. నీవును సూక్ష్మబుద్ధివి గాన వీని చిత్తంబరసి న్యాయము చెప్పుమని పలికిన నచ్చతురుని పలుకు లకు నవ్వుచు నవ్వనిత యిట్లనియె.

ఆర్యా! ఈతండు వస్త్రచోరుఁడని మీమాటలనే తేటయగు చున్నదిగదా! తరుచుదొంగలకుఁ బూనరాని బరువెత్తి మోయించు టయే తగినశిక్షయైయున్నది. కాన నీతనికీనాతి భారమొడ తెగక మోయునట్లు శిక్షవిధించితిననిన నతండోహో? మేటిచతురవు. నీ మాటలు వివాహశబ్దమున కర్థమగుచున్నవి. ఈనాతి నితనివివాహ మాడమంటివా? ఔనౌను. మగవారికెంతకన్న నెక్కుడు శిక్షగలదా!

యథార్థము చెప్పితివి. నీ తీరుపునూటి యబ్బోటి కెటింగించి యొప్పిం పుమనుటయు నావిద్యుత్ప్రభతన్నుఁజూచినది మొదలు వెరచియున్న రాగమంజరిని నాదరపూర్వకముగా దరికిజేరి మానినీ! వీరుమానవసామాన్యులుగారు. విద్యాగుణశీలంబుల దేవతలగూడఁ దిరస్కరింపనోపుదురు. నేనింతకుమున్నీ దండునిం బెండ్లి యాడితిని. తదీయసహాకారుండు సాంబుఁడు నంతవాఁడతని నీవుబెండ్లి చేసికొని నీసౌందర్యము సార్థకము గావించుకొనుము. వీరుతలంచి నప్పుడపోయి మనమిరువురము నభీష్టములఁ దీర్చుకొనియెదముగాకయని తత్కాలోచితములగు మాటల నప్పాటలగంధి నొప్పించి యప్పుడ యప్పుడితికిని సాంబునకును తానును మగండును బెండ్లిపెద్దలై పాణిగ్రహణము సేయించి దీవించిరి.

సాంబుఁడయ్యంబుజనేత్రి నట్లు స్వీకరించి రెండుమూడుదినంబులందుండు నికుంజగృహంబులఁ గందర్పకేళిని దేర్చి యమ్మానినిఁ దానుఁ దలంచినప్పుడ వచ్చుదానిగా నొడంబరచి యంపిపుచ్చెను. దండుడును విద్యుత్ప్రభకును గొంతసంతసము గలుగఁజేసి పైఁగల కార్యాతురత్వంబున సాంతన పూర్వకముగానిజనివాసంబునకంపెను.

పిమ్మట సాంబుఁడును దండుఁడును మిత్రులజాడఁ దెలియగోరి తొలుతవసంతుఁ డరిగినయతిదీర్ఘంబగు శాఖామార్గంబునంబడి కొన్ని దినంబులు చనినంత శాఖాంతమున వసంతునికిఁ గనంబడిన వింతలన్నియు వారికినిఁ బొడసూపినవి వానింబాటించుచుఁ గ్రమంబున నానిర్జనపురంబును, బురాంతరమున నొప్పుకోటయు నతిగూఢంబగు కోటగుమ్మమునుఁ దెలిసికొని యమ్మార్గమున లోనికరిగి యనేకకక్ష్యాంతరములు గడచి తుదకు వసంతుఁడు బరుండియున్న గదిలోని కరిగి యతనిఁజూచిరి. అర్ధనిశ్వాస మారుతములతో సగము బ్రతికియున్న వసంతునింజూచిన తోడనే దండుఁడు గుండె ఝల్లుమనఁ బేరెలుంగున వసంతా! వసంతా! అన్నా! వసంతా! ఇట్లుంటివేమియని

చీరియుఁ బ్రతివచనము వడయక తడబడుచుఁ బర్యంకమున నాలుగుమూలలు వెదకిన నందొకచోఁ దాను మున్నతని ప్రాణంబు లిమిడ్చిన కత్తివర గనబడినఁ గొంత ధైర్యముతోఁ గైకొని యది సగమరగఁ దీయబడియుండుటఁ జూచి గుండెపై జేయిడుకొని సాంబునితో నిట్లనియె.

సఖా! ఇటుచూడుము. నే నతినిగూఢముగా నితని ప్రాణంబు లీవరలో నిమిడ్చితిని. ఆరహస్యమెవరికెఱింగించెనోకాని వారితని మోసముజేసిపోయిరి. దైవానుగ్రహమున నట్టిపని కొనసాగినది గాదు. పాప మీవరఁ మొదలంట నరగదీయలేదు. వీనిఁ బ్రతికించెదఁ జూడుమని యావరయరలన్నియు మరలఁదన యంత్రరచనా పాటవంబు దేటపడునట్లు చక్కఁబరచినతోడనే యావసంతుఁడు నిద్ర లేచినట్లు లేచి కన్నులు నులిమికొనుచుఁ గళావతీ! కళావతీ! యని పిలుచుచుఁ గన్నులందెరచి యత్తెరవంగానక యెదురఁ దనయిరువుర నెయ్యురంగని యంతరంగంబుప్పొంగ వారిం గౌఁగలించుకొని యోహో! మిత్రులారా! నన్ను వనితాలోలుండని యెఱింగియా యిటకరుదెంచితిరి. మీరాకనాకు నీరాకరంబునకు రాకయుంబోలె ముదంబుగూర్చుచున్న యది. రాముండును ప్రవరుండును వచ్చిన వారు కారేమి? వారు కుశలముగా నున్నారా? ఇందిరువురు రాఁడ వాండ్రిండవలయు నెందేగిరో యెఱింగితిరా యని యత్యాతురముగా నడుగుటయు దండుఁడిట్లనియె.

మిత్రమా! నీవు నీవృత్తాంత మెఱుఁగకుంటివి. అత్తరుణు లిరువురెవ్వరోకాని నిన్ను మోసముజేసిపోయిరి. దైవకృపచే వారి ప్రయత్నము కొనసాగినదికాదు. మేము వచ్చునప్పటికి నీవు మృతప్రాయుఁడవై పడియుంటివి. మేమట్టి కారణంబెఱుఁగక చింత నొందుచు నరగఁదీసిన వరమాత్రముదొరకిన మరల దాని యరలం జక్కపరచి నిన్ను బ్రతికించుకొంటిమి. ఇంతియకాని మేమాయింతుల వృత్తాంతమేమియు నెఱుఁగమనిన నతండు దీర్ఘనిశ్వాసపూర్వకముగా నయ్యయ్యో! కళావతి! పోయితివా! ఎందుఁ బరితపించు

చుంటివే ! అన్నన్నా ! మాయముసలిదానిమాట నమ్మితిగదా ? మోసముజేసి నిన్నుఁ దీసికొనిపోయెనే ! హా ! ప్రాణనాయకీ ! నీమక్కువ మరపురాదుగదా! పరిహాసమున కెందైన డాగియుంటివా! కాదు, కాదిదియంతయు ముసలిదాని కపటమే తెలిసికొంటి. కట కటా ! మిత్రులారా ! నన్నేల బ్రతుకఁజేసితిరి. ఈ వియోగశోక మెట్లుభరింతునని గుండెలు బాదుకొనుచుఁ బేరెలుఁగున నేడ్చుచున్న వసంతుని నూరడించుచు దండుఁడిట్లనియె.

అన్నా ! చిన్నవానివలె నశ్లేదువవచ్చునా ? ఆపువ్వుఁబోడి యెవ్వతె యామునలిది యెక్కడవచ్చినది. వారి వృత్తాంతము కొంచెమెరింగింపుము. పై కార్యంపు తెరవరసెదఁగాకయని యడిగిన నతండు దీనస్వరముతో దాను మట్టిచెట్టు విడచినది మొదలు కళా వతితో రాత్రి గదిలోఁ బరుండువరకును జరిగినకథయంతయు నుడివి యడలుచున్న యతనితో దండుఁడిట్లనియె.

ఆర్యా ! నీవు ధైర్యముగానుండిన కార్యమంతయు నేనే చక్క పరచెదను. ప్రాజ్ఞులాపదలయందు ధైర్యమును విడుతురా ? శోకించు వానికి సంపదలు నశించునను నార్యోక్తి మరచితివా ! ఊరడిల్లుము దైన్యము విడువుము. నిన్నుఁ బ్రాణసఖితో శీఘ్రకాలంబునం గూర్తు. నేను గొత్తగా విమానము జేయుశక్తి సంపాదించితిని. తదీయగమనంబున భూలోకంబంతయుఁ దిరిగి యత్తరుణినరయవచ్చు నని తన వృత్తాంతమును సాంబుని వృత్తాంతము నంతయు నతని కెరింగించి యప్పుడ యయ్యడవి దారువులఁగొన్ని నరికి తెచ్చి శీఘ్ర కాలములో నొక కీలురథము నిర్మించి దానినెక్కి తిరుగుచు నమ్మ వ్వురు భూలోకంబునం బ్రసిద్ధంబులైన పట్టణంబు లన్నిఁటను గళా వతిని వెదకుచుండిరి.

అని యెఱిఁగించునంతఁ బ్రయాణసమయమగుటయు నయ్యో తీందుఁడంతటితో కథఁజాలించి పై మజిలీయందు నాగోపాలునకుఁ దదనంతర వృత్తాంతమిట్లు చెప్పఁదొడంగెను.

## ఆరవ మజిలీ.

వత్సా! వినుమమ్మువ్వురు నట్లుతిరుగుచు నొకనాఁడు సాయంకాలమున హేలాపురోపరిభాగమున నారథంబరుగఁ దత్పురగృహదీపికాశ్రేణి నేత్రంబులకు విందొనరింప దండుఁడు అన్నలారా! ఇది యొకపట్టణమువలె నగపడుచున్నయది. ఈరేయి నిందువసించి కళావతి వృత్తాంత మరయుదమే యనుటయు వారియ్యకొనిరి. ఆరథంబు తదీయమనోరథంబు వడువునఁ బుడమికిదిగి యప్పోటి నడివీథి నిలుచుటయు దానినొకచో దాచి వారు పౌరులవలనఁ బరదేశులకు నివాసయోగ్యంబగు నమాత్యుని సత్రము వృత్తాంతమును విని యందుఁ జేరిరి. సత్రాధికారులు వారి కారాత్రి దగురీతి భోజనసదుపాయములు జేసిరి. వారు మరునాడుదయంబున సత్రపువీథి వేదికపై గూర్చుండి యందు వ్రేలఁగట్టియున్న చిత్రఫలక మీక్షించి యొండొరులిట్లు సంభాషించుకొనిరి.

సాంబుఁడు—అన్నా! వసంతా! ఇటురా! ఈపటముచూచితివా? ఈప్రతిమ మన ప్రవరుని పోలికగానున్నదేమి?

వసంతుఁడు—(చూచి) ఔనౌనట్లెయున్నది. మనదండునింబిలువుము. (పిలిచి) తమ్ముఁడా! ఈచిత్రఫలకమును జూడుము. ఇందున్న రూపమెవ్వరిదియో చెప్పికొనుము.

దండుఁడు—ఓహోసోదరులారా! ఆరూపము గురుతుపట్టజాలననుకొంటిరా? ఇది మన ప్రవరునివలెనున్నది.

సాం—అచ్చుగా నతని మొగమువలెనే యున్నది. అతని రూపమిందుండుటకుఁ గారణమేమో?

దం—ఒకవేళ నీచిత్రఫలకము వానిపోలికఁగల మఱియొక పురుషునిదేమో?

సాంబు—కాదు. కాదు. తప్పక మన ప్రవరునిదే.

వసం—తమ్ములారా! నాకుఁగళావతీవియోగ శోకమునకన్న మిత్రవియోగసంతాప మెక్కుడుగానున్నది. వారిజాడయు నెందునుఁ దెలియరాకున్నది. హాప్రవరా! హారామా! మిమ్ముఁగన్నులార నెన్నఁడు చూచెదనోకదా! అని కన్నీరు విడుచుచు నొండొరులు మాట్లాడుకొనుచుండ నాదండనున్న కింకరులు వారినాటంకపరిచి యిట్లనిరి.

అయ్యలారా! తమరెవ్వరు? ఈచిత్రఫలకమును సాభిప్రాయముగా నీక్షించితిరిగాన మిమ్ము నొండొకచోటునకుఁ బోనీయము. మంత్రిగారియొద్దకు రండు. పోదమని కరంబులు పట్టుకొనుటయు వారు జడియక యోహో! మీమంత్రి మంచి శాసనకర్తయే! చిత్రఫలకము జూచుటయే నేరమా? అట్టిది యిందేల వ్రేలగట్టవలయును. పరదేశుల వంచించుటకేనా యేమి యీసత్రము నిలుపుట? పదుఁడాయననే యడిగెదమని ధైర్యముగా వారివెంట నడువసాగిరి.

ఆముష్వురను దోడ్కొని రాజకింకరులు ద్వారపాలకునిచే నావార్తఁ బ్రవరునికిఁ దెలియఁజేసిన నతండప్పుడు తనభార్యతో మిత్రులగుఱించియే సంభాషించుచుండి యావార్త వినఁబడినతోడనే వేడుకతో వారిని లోపలఁ బ్రవేశపెట్టుఁడని యాజ్ఞాపించెను.

అప్పుడు కింకరు లోహో! వీరి నంతిపురికిఁ గొనిరండని మంత్రిగా రాజ్ఞయిచ్చినారు. భూషించుటకో దూషించుటకో తెలియదని పెక్కుగతులఁ దలపోయుచు వారిని మంత్రియెదుటఁ బెట్టియాభటులు మరల సత్రముదరికరిగిరి.

వారింజూచి ప్రవరుండు ప్రహర్షసాగరమున మునుఁగుచుఁ దన్నుఁ దెలిసికొనెదరో లేదోయని యేమియుంబలుకకయూరకున్నంత వసంతుండు అయ్యా! ఇందుఁబ్రధాన ప్రవరులఁమీరేనా? పరోపకారబుద్ధితో నన్నసత్రముపై చితిరిగదా? అందుఁజూచుటయే యపరాధముగా గణింపఁబడు చిత్రఫలక మేమిటికి వ్రేలం గట్టించితిరి?

దాని మేము జూచితిమని మీకింకరులు మమ్మపరాధులఁబోలె మీ యొద్దకుఁ దీసికొని వచ్చిరి. ఇదియేమి పాలన మని యడిగిన నతండు కంఠంబు డగ్గుత్తిక పడ మీరా విగ్రహము నేమిటికి నిరూపణపూర్వకముగాఁ జూచితిరని యడిగెను. అది మామిత్రుఁడు ప్రవరుని పోలికగానున్నది. దానంజేసి నిరీక్షించితిమి మనవుఁడు మీమిత్రుఁ డేమయ్యెను? మిమ్ము మరచి విగ్రహమయ్యె ననుకొంటిరా? యని వలుకుచుండఁగనే దండుఁడు గ్రహించి యీతఁడే మన ప్రవరుఁడని యరచెను.

అప్పుడతండును సంభ్రమముతో వారినెల్లఁ గౌఁగిలించుకొని అన్నలారా! నన్ను గురుతుపట్టలేక పోయితిరిగదా! మీనిమిత్తమే నేనాచిత్రపట మందుఁగట్టించితిని నేఁటికి మన పుణ్యాపు ఫలించినదని తాను మఱ్ఱికొమ్మయెక్కి బయలుదేఱినది మొదలంతదనుక జరిగిన కథయంతయుం జెప్పి కాంచనవల్లిం జూపెను.

వారును దమతమ వృత్తాంతముల వేరువేర యెఱింగించిరి. అప్పుడు వారందఱు సంతోష పారావార వీచికలం దేలియాడుచుఁ బీఠంబులం గూర్చుండి రాముఁడొక్కరుఁడే చేరవలసినవాఁడని యతని గుఱించి సంభాషించుకొనుచున్న సమయంబున ద్వారపాలుఁడు వచ్చి దేవా! జయపరాక్. సత్రమందలి చిత్రఫలకమును సాభిప్రాయముగాఁ జూచెనని యొక మిథునమునుఁ దీసికొనివచ్చి కావలివారలు ద్వార మందున్నవారు. ప్రవేశమునకు సెల వేయని యడిగిన నతండు రాముఁడేయను సంతోషమున వడిగాఁదీసికొనిరమ్మని యాజ్ఞాపించెను.అతండప్పుడుపోయి యమ్మిథునముదోడ్కొనివచ్చి వసంతాదుల మోల విడిచిపెట్టి పోయెను. వారతని దూరంబునం జూచి రాముఁడు రాముఁడను కంఠధ్వనులు సభాభవనమునం బ్రతిధ్వను లీయ నందఱును లేచి యెదురేగి యతనిం కౌఁగిలించుకొని యాలంకాలతోడనే తోడ్కొని వచ్చి యుచితపీఠంబునం గూర్చుండఁబెట్టిరి.

కనకప్రభయుఁగాంచనవల్లిచే నుచిత సత్కారములందితదీయ సంభాషణము లాలించుచుఁ బ్రాంతమున నిలువంబడెను. అప్పుడు వసంతుడు రామునితో మిత్రమా! నిన్నుజూచి యెంతకాలమైనది. మాకన్నులు వాచినట్లే యున్నవి. ఈచిన్నది ఎవ్వతె? ఎందెందు సంచరించితివేమేని వింతలం జూచితివి? యని యడిగిన నతండుతాను మఱ్ఱివృక్షము విడిచినది మొదలు నాఁటివరకు జరిగిన వృత్తాంత మంతయుఁ జెప్పి నిన్ననే నన్నీచిన్నది సత్రిప్రాంతమందున్న సన్యాసిం బ్రార్థించి పురుషుని గావించెను. ఇమ్ముదిత దయావిశేషంబుననే నేను మిమ్ములం బొడఁగంటి. ఎన్నిగతులనైన దీనిబుణంబు దీర్చికొన లేనని యాపూఁబోఁణిం జూపించిన వారందఱు నందుల కాసుందరిం బ్రశంసించిరి.

పిమ్మట వారొండొరు లభిముఖముగాఁ గూర్చుండి తనివిదీరని ప్రీతితో నొకరిమొగము నొకరు జూచుకొనుచుండ నత్తరి వసంతుం డిట్లనియె. తమ్ములారా! ఈదినంబెంత సుదినమో చూచితిరా? అయత్నోపసిద్ధముగా మనమందఱ మొకతావుచేరితిమి. ఆహా! దైవ నియోగ మెట్టిదో చూడుఁడు.

మ. ఎట నెవ్వారికి నెన్ని రేల్సుఖముగా ♦ నీ, దుఃఖముల్గాని, వి
స్ఫుట పూర్వాచరితాత్మకర్మవశత ♦ నోభ్కర్తవ్యమై యుండునో
ఘటనాచాతురిఁ దాఁ బ్రశ్నఁ గట్టుచు బలా ♦ త్కారంబుగా వానిన
చ్చోటికిం దోడ్కొనివచ్చి దానిగుడిపిం♦ చుఁ దైవమన్నాళ్ళగిన్.

పురుషకారమెందులకునుఁ బనికిరాదుసుఁడీ ? మనమెంతకాల మెట్టియిడుమలఁ బడితిమో చూచితిరా ? దైవకారంబునఁ దుదక య్యిడుములే మనకుఁ దలంప శుభంబు లొనఁగూర్చినవి,

ఉ. కోరక దుఃఖముల్ మనుజ ♦ కోటికి నేగతివచ్చు నాగతిన్
ధారుణి సౌఖ్యముల్గలుగు ♦ దానికి వీరిప్రయత్న మేమియున్

గారణమై తలిర్పదది ♦ కాలవిశేషముపట్టివచ్చులో
నోరిమి దక్కి కుందుటయు ♦ నుబ్బుటయుంజుమి వీరధర్మముల్.
సోదరులారా! మన కింతటి యామోదంబొనఁగూర్చిన భగవంతున కనేకవందనము లౌఁగాక యని బహుప్రకారంబుల దైవకారంబునుం గూర్చి ప్రశంసించుచు మఱియు రామునితో నిట్లనియె.
రామా! కళావతీ వృత్తాంతమంతయు మన ప్రవరునిచే వింటిమిగదా! యిప్పుడకాంత నేకాంతముగా రప్పింతమా, లేక సంగరంబున దర్పంబుజూపి నాకందర్పకేతు నోడించి పిమ్మటఁ గొనివత్తమా? ఇప్పుడు చేయఁదగిన కృత్యమెద్దియో విచారింపు మనుటయు రాముం డిట్లనియె. సామాదిచతురోపాయంబులు వైరుల యెడ గ్రమంబున నడిపింపఁదగినవిగదా? తొలుత నతనియెడ సామంబుప్రయోగించి యొడంబడనినాఁడు దండంబ కర్తవ్యము. ఇంతకును మన ప్రవరుని యనుమతి యెట్లున్నదో విచారింపుమనుటయుఁ బ్రవరుండిట్లనియె.

అన్నలారా! యీరాజు పరాక్రమునను బుద్ధికౌశల్యమునను మనలను మించినవాఁడుకాడు. సర్వసేనలు నాయధీనములో నే యున్నవి. తృటిలో నీకోట స్వాధీనము చేసికొనఁగలము. కాని కృతఘ్నతాభీతి నన్ను బాధింపుచున్నది. కావున మన రాముఁడు చెప్పినట్టు సామంబుననే సర్వకార్యములు చక్కఁబరుచుకొన వచ్చును. సామంబెవ్వరికిని మేలు. దైవప్రతికూలదినములలో నితండు మనలనింత జేసెంగాని యిప్పుడేమిసేయఁగలఁడు. ఒండు వినుం డిప్పుడ యప్పుడమియొడయనినడ కరిగి యీవిషయము వినిపింతమనుటయు నందులకందఱు నియ్యకొనిరి.

పిమ్మట వారేగురు నడుములఁ గాసికోకలు బిగియించి జెట్టిలాగులు నీలికంచుళులు నరుణోష్ణీషంబులుఁ దాల్చి భయంకర వేషములతోఁ గరంబులఁ గరవాలంబులం బూని భూమికంపించునట్లు చటులగతినడుచుచుఁ జూచినవారెల్ల భీతిల్లి యోరసిల్ల నల్లన నన్నా

హీవల్లభు నాస్థానంబుచేరి రాజసింహాసనముమీఁద, వసంతుఁడును ప్రాంతపీఠంబులం దక్కినవారును గూర్చుండి తత్సభారక్షకునిచే రాజునకు వార్తనంపిరి.

వాఁడతిజవంబునంబోయి యంతఃపురంబున భార్యతో వినోదంబుననున్న యన్నరపతింజూచి స్వామీ! అయినది. అయినది. తమ సింహాసనము శాత్రవు లాక్రమించుకొనిరి. ఏమిటికో దేవరను దీసికొనిరమ్మనిరి. మీఁదటికార్య మాలోచించుకొనుఁడని యా వృత్తాంతమంతయుం జెప్పెను.

రాజు—ఓరీ! ప్రవరుని శీఘ్రముగాఁ దీసికొనిరమ్ము.

సభారక్షకుఁడు—ఎక్కడిప్రవరుఁడు! వారితోనవచ్చి పీఠమాక్రమించుకొని మనలను బెదరింపుచున్నాఁడు. ఆయాసనమూలము ననే యీముప్పు వచ్చినదని తలంచెదను.

రాజు—మనమంత్రి యందేయున్నాఁడా? నీవు చూచితివా?

సభా—నేను జూచితిని, అందేయున్నవాఁడు, మునుపటి వేషముకాదు. వారివలెనే భయంకరవేషము వైచికొని హస్తంబునఁ గరవాలంబుఁ బూని కూర్చున్నవాఁడు.

రాజు—ఒహో! అతనికి మనమేమి యపకారముచేసితిమి? ఇట్టి కార్యమేమిటికిఁ బూనవలయును? వారు శత్రువులు కారేమో?

సభా—వారు మైత్రిసేయ నరుదెంచినచో సింహాసనము నాక్రమింతురా? యుద్ధసన్నద్ధులై రానేల? వారియాకారములు తేరిచూడ శక్యము కాకున్నవిగదా.

రాజు—అలాగునా! అలాగునా! (అని వడంకుచు భార్యతో) కాంతా! యీయుదంతము వింటివా? యిప్పుడేమి చేయఁదగినది.

రాజపత్ని—క్షత్రియవంశంబునఁ బుట్టి యిట్టిపిరికితనం బెటికిఁ బూనెదరు. కత్తి గట్టి పరాక్రమముతో సంగరంబున శత్రులఁ బరిభవింపుఁడు.

రాజు—సంగరమని సులభముగా బలికితివి. నేను జిన్నతనముల్లో నెంతగారాముగాఁ బెంపఁబడితినో యెఱుంగుదువా? యించుకదెబ్బయైనఁ బడియెఱుంగను. అట్టి నేను అసిధారాపాతంబుల నెట్లు సైరింతును ?

పత్ని—అయ్యో! సంగరవీరులగు క్షత్రియకుమారు లెల్లఁ జిన్నతనమునందు దెబ్బలు పడిన వారేనా? శ్రీరామునికన్నను అర్జునుని కన్నను మీరు సుకుమారులా? వారెట్టిసంగ్రామంబులం గావించిరి.

రాజు—సీ! నీయాఁడుబుద్ధి పోనిచ్చుకొంటివి కావు చెప్పినం దెలియదేమి. వారివలె నేనడవులఁ గుమ్మరి కాకుకూరలం దింటినా? నాసుకుమారత నీకేమియెఱుక.

పత్ని—మీరట్టివారే కానిండు ఇప్పుడేమి చేయుదురు ?

రాజు—రెండవదారిం బారిపోయి ప్రాణములు దక్కించుకొంట లెస్సయని తోఁచుచున్నది. అట్లు చేయుట నీకభిమతమేనా?

పత్ని—పారిపోయి మనమెన్నిదినములు బ్రతుకుదుము. ఈ యపఖ్యాతి వసుంధరఁ దిరంబై యుండదా.

రాజు—ఉన్నను సరియే కాని నేను పోరుసేయనోప (అని బలుకుచున్న సమయంబున నెవ్వరో వచ్చుచున్న యలుకుఁడు వినంబడునంత వడంకుచుఁ బారిపోవఁ బ్రయత్నించుటయు నడ్డపడి బిగ్గరగాఁ బట్టుకొని)

పత్ని—అయ్యయ్యో! శత్రువుల బలాబలములఁ దెలిసికొనక యెద్దియో యలుకుడైన నడలుచు నూరక పారిపోవ బ్రయత్నింపనేల? నిలువుఁడు నేనుబోయి సంధిచేసికొని వత్తును.

రాజు—విడువిడు. అదిగో వారిక్కడకే వచ్చుచున్నట్లు తోఁచుచున్నది. నిలిచితినేనిఁ బ్రాణహానికాఁగలదు. నీవు వారితో

మాట్లాడి సంధి కుదిరినచో నాకు వార్త నంపుము. వెండియు రాక్షసుల కడకేఁ బోవుదును.

పత్ని — వారు శత్రువులు కారు. అదిగో మనపరిచారకులే వచ్చుచున్నారు. భయమువిడిచి నిలువుఁడు.

రాజు — నాకు లోపలినుండి చలివచ్చుచున్నది. నిలువలేకున్నాను. బిగ్గగాఁ బట్టుకొనుము. (అని ముసింగిడుకొని మంచముపయి పండుకొనుచున్నాఁడు)

ఇంతలో పరిచారకులువచ్చి అమ్మా! రాజుగారెచ్చట నున్నారు. వారెవ్వరో సభాభవనంబంతయుఁ బ్రతిధ్వనులీయ సింహనాదములు సేయుచు వెరపుగలుగ రాజుగారినిఁ దీసికొనిరండని మాకు నియోగించిరి. ఇట్లుపేక్ష చేయుచున్నారేమి? ముందటివార్త తెలియలేదాయేమి యని చెప్పినవినియామె తెలిసినది. దానికే యాలోచించుచున్నాము. మీరు గ్రమ్మరజని రాజుగారస్వస్థులై యున్నవారని చెప్పి మనమంత్రి నొకసారి నేనురమ్మంటినని చెప్పి తీసికొనిరండు పొండని పంపెను.

వాండ్రుపోయి కొండొకవడి మరలనరుదెంచి అమ్మా! తమవార్త మంత్రిగారితోఁ జెప్పితిమి. మామాటలువిని వారు నవ్వుకొనిరి. అదియేమి సాంకేతికమో తెలియదు. మంత్రియొక్కఁడేల మేమందరము వచ్చుచున్నారము. రాజుగారి రోగకారణ మరసెద మని చెప్పి బయలుదేరిరి.

అని చెప్పునంత రాజుతటాలున లేచి వస్త్రమాల్యాను లేపనాద్యలంకారములఁ దీసివైచి మలినవస్త్రంబులఁదాల్చి పారిపోవఁ బ్రయత్నించుచుండ రాజపత్ని పోవలదని నిర్బంధించి పట్టుకొనినది. ఇంతలో వరప్రసాదు లచ్చోటికి వచ్చిరి. రాజును మంచముపై ముసింగిడికొని యెన్నఁడో చచ్చినపీనివలెఁ బరుండియుండెను.

అప్పుడు రాజపత్ని చాటుననిలిచి ప్రవరునితో అన్నా! అమాత్యప్రవర! నీవిట్లుకృతఘ్నుండవై వీరినేటికిఁదీసికొనివచ్చితివి. వీరెవ్వరు? వీరికి

మేమేమి యపకారము గావించితిమి? రాజుగారితో వీరికేమి పని యున్న దని యడిగినఁబ్రవరుండు సాధ్వీ! వీరివృత్తాంతంబు చాల కలదు. పిమ్మటం జెప్పెదంగాని యీతండి ట్లచేతనుండువలెఁ బడి యుండుటకుఁ గారణమేమని యడిగిన నచ్చేడియ యేమియుంబలుకక యూరకున్నది.

అప్పుడు ప్రవరుఁడు రాజునొద్దకరిగి ముసుంగుదీసి చూచెను. కన్నులు తేలవైచి పళ్ళుబిగియఁబట్టి యూపిరిరానీయక గతాసుం డట్లున్న యన్నరనాథుంజూచి వరప్రసాదులు పకపక నవ్వఁదొడం గిరి. అప్పుడు ప్రవరుఁడు పెద్దయెలుంగున రాజా! రాజా! యనిపిలిచి పలుకకున్నంత స్వాంతమున విస్మయముఁగొనుచు అయ్యో! యీనృ పాలుం డకారణముగాఁ జేతనముబాసిన వానివలె నొప్పుచున్నాఁడు. వీనికిఁదగిన చికిత్సఁ జేయింపవలయు. వీనితత్వ మెఱింగినది బ్రాహ్మణ విస్వస్తయొకతె యుండవలయును. ఆమెఁదీసికొని రండని కొందఱు కింకరుల బంపెను.

ఆజరఠయు నంతకుమున్న యన్నరపతికిఁ బ్రాణోత్క్రమణ సమయమైనదను మాటవిని వడివడి వచ్చుచున్నది కావున వారికె దురు పడినది అప్పుడు కింకరులామె కాతెరంగెఱింగించి యచ్చటికిఁ దీసికొనివచ్చిరి. నిశ్చేష్టితుండై పడియున్న రాజుంజూచి అయ్యో! అయ్యో! యని గుండెలు బాదుకొనుచు నిఁకనన్ను మన్నించువారె వ్వరు. నాపారితోషిక మియ్యలేదే. యేమిచేయుదును పిక్కటిక్క లుపడి యప్పుడుచుం దీసికొనివచ్చితినే, యేమియు లేకపోయినది. హా! దైవమా! యని యేడ్చుచున్న యన్నీచురాలిం జూచి రాముండిట్ల నియె. అవ్వా! నీవీ రాజునకేమి యుపకారము జేసితివి. ఇతఁడు నీకేమికానుక నిత్తునని చెప్పెను. చెప్పుమనుటయునావృద్ధయిట్లనియె.

అయ్యలారా! నేనీతండు కోరినచిన్నదానిని ద్వీపాంతరము నుండి తీసికొనివచ్చితిని. అర్థరాజ్యమిచ్చెదనని వాగ్దత్తముచేసి

యున్నాఁడు. వెంటనే యడుగుటకు నాచిన్నది వీనివరింప సంవత్స రము వ్రతము నెపంబున మితిగోరినది. అందుమూలమున వీలుపడి నదికాదు. ఇంతకును నేను దురదృష్టవంతురాలను. అని యాకథ యంతయుం జెప్పినది. అప్పుడు ప్రవరుఁడు వసంతునిఁజూపుచు అవ్వా! యీతని నీవెప్పుడైనఁ జూచితివాయని యడిగిన నామెయతని జూచి గురుతుపట్టి గుండెఝల్లుమనఁ దెలతెలపోవుచు నెచ్చటనో చూచినట్లు జ్ఞాపకమున్నదని పలికినది. అప్పుడు వసంతుండు కోప మాపనేరక యట్టెలేచి దానింజంప గమకించిన నడ్డమువచ్చి ప్రవ రుండు స్త్రీవధ మహాపాతకము దీని వేరొకరీతి శిక్షింతమని దాని నప్పుడు పెడకేలుకట్టించెను.

ఆచర్యలన్నియుంజూచి రాజపత్ని వెరచుచు వారిపాదంబు లంబడి పతిబిక్షపెట్టుఁడని వేడుకొనినది. అప్పుడు ప్రవరుండు సాధ్వీ! వీరునామిత్రులు. ఈరాజు చెరఁగొని తెప్పించినచిన్నది యీవసంతుని భార్య. ఈతండు సార్వభౌముని కుమారుఁడు. మేమందరము తల్లిదం డ్రులెఱుంగకుండ నిల్లువెడలి దేశాటనముచేయుచుఁ జిక్కులంబడి తిమి. దైవకృపచే నందఱము చేరుకొంటిమని తమవృత్తాంతమంత యుంజెప్పెను.

ఆకథవిని యీమె వెరగుపడుచుండ నారాజుతటాలున లేచి వారి పాదంబులంబడి మహాత్ములారా! మీరులోకాతీతులు. ఏమి చేసినను చేయగలరుఁ మీపాదసేవకుండనై బ్రదికెద. రక్షింపుఁడు, నాయపరాధంబుల మరువుఁడు. కళావతిని నేనుముట్టలేదు. ఆచిన్నది సాధ్వీతిలకమని చెప్పఁదగినది. నన్నుఁగన్నెత్తియైనఁ జూచియెఱుం గదు. గడ్డిగరచితినని యనేకప్రకారములఁ బ్రార్థించెను. దయార్ద్ర హృదయులైన వరప్రసాదు లారాజుంగరుణించి విడిచిపెట్టి యా వృద్ధబ్రాహ్మణిని మాత్రము విడువక గెంటుకొనుచుఁ గళావతియున్న యంతఃపురమునకుఁ దీసికొనిపోయిరి.

అందయ్యింతిం జూచినతోడనే వసంతునకు శోకంబును నక్కటి కంబును నానందంబును మనంబున జనింప నాగలేక పెద్దయెలుంగున "హా! కళావతీ! యిట్లున్నదానవే యని పయింబడి కౌఁగలించుకొనిన నులికిపడి యప్పడఁతియు నట్టె చూచి యతని తనమనోహరుఁడు వసంతునిగా నెఱింగి యోహో! నాయదృష్టమేమి? ప్రాణనాథుఁడే వచ్చెనా? యిది కలగాదుగద? కాదు నిజమే తొలిబామున నెప్పుడో కొంచెము సుకృతము గావించితిని. లేకున్న నాకింతటిభాగ్యము మరల లభించునా? యని యనేకప్రకారంబులఁ దనభాగధేయమును గుఱించి మెచ్చుకొనుచు నార్యపుత్రా! మీజీవితాంతముగావించిన దుష్టురాలిం జూచుటకై యెట్లువచ్చితిరి. ఏపుణ్యాత్ముఁడు మిమ్ము బ్రతికించెను. పాపపుముసలిముండ యెంతచేసినదో చూచితిరా! అని తన్నాముసలిది పెట్టినచిక్కు లన్నియుఁ జెప్పి తనివి వొనిచూడ్కులతని మొగంబు నం బరగించుచున్న యయ్యంగనకుఁ దనవృత్తాంతమును మిత్రుల వృత్తాంతము నింతేనిం దాచక యెరింగించి వారిం జూపించిన సంతసించి యమ్మింఁచుఁబోఁడి వారి మైత్రినిగుఱించి వేతెరంగులఁ బ్రశంసించెను. పిమ్మట ముసలిదానిం జూచి యది మొత్తపెట్టుచుండ జాలిపడి వారిని బ్రార్థించి దానినిఁ గూడ విడిపించినది. దయాళువు లపకారులనైనను శరణువేడిన రక్షింపక మానరు.

కళావతీలాభసంతుష్టి నొంది వసంతుఁడు మిత్రులఁ జూచి యిట్లనియె. తమ్ములారా! మనము వచ్చి పెక్కుదినంబులైనది. మొదట శీఘ్రకాలములోనే మగుడ దలంచుకొంటిమిగాని దైవగతిచే నట్లు సాగినదికాదు. ఈక్షణమందరము కుశలముగా నొకతావునకుఁ జేరితిమి. మనకై మనతలిదండ్రులెంత చింతించుచున్నారో వారిం జూడ వేగఁబోవలయుఁ గావున మీయుద్దేశ మేమనిన నందులకందఱు నియ్యకొనిరి.

పదపడి సాంబుఁడు దండుఁడును రాగమంజరిని విద్యుత్ప్రభను దలంచుకొనునంతలో నయ్యింతులు పాణులవీణలంబూని గాంధర్వంబు వెలయించుచు నచ్చోటికరుదెంచిరి. ఇట్లు సపత్నీకులై వారేగురు నొక్కతావుంజేరి దండునిచే రచియింపబడిన కీలురథమెక్కి యచ్చటి వారెల్ల నత్యద్భుతస్వాంతులై చూచుచుండనాకాశమార్గంబుననరిగిరి.

మొదటమంత్రికుమారుఁడగు రాముడు కన్నులిచ్చి పెండ్లియాడిన పద్మగంధియున్న పట్టణమరిగి యాతగుణిగూడ రథంబెక్కించుకొని క్రమంబున ననేకదేశములుగడిచి పుష్పకారూఢుండగు శ్రీరామచంద్రుండువలె భార్యలతో నిష్టగోష్ఠివిశేషంబుల సంభాషించుకొనుచు నక్కాంతలకుంగల చక్కఁదనంబుల తారతమ్యములఁ దెలిసికొనుచుఁ దామువడిన యిడుమల నొండొరుల కెరింగించుకొనుచు స్వదేశాభిముఖులై యరుగుచున్నారు. గోపాలా! నీవుచూచినది వారి కీలురథముసుమీ! యని యెఱింగించిన సంతసించు గొల్లవానికి వింటివా! కథ స్పష్టముగ దెలిసినదికద. వారట్లరిగి తమకై కుందుచున్న తల్లిదండ్రుల కానందము గలుగఁజేసిరి.

అని యెఱిఁగించిన యాకథావృత్తాంతమంతయు నాగొల్లవాడు ప్రయాణంబు సేయునప్పుడు జ్ఞాపకమునకు దెచ్చుకొనుచు నవ్వరప్రసాదుల యదృష్టమునకు మెచ్చుకొనుచుఁ గ్రమంబున నాయతీంద్రుని వెంటఁ గావడి మోసికొని ముందరమజిలీ జేరెను.

---

## యేడవ మజిలీ.

# విక్రమసింహుని కథ.

అదిరియొక పట్టణముగాన నందొకసత్రమున బసజేసిరి. ఆసత్రము చిరకాలముక్రిందట నొకమహారాజుచే స్థాపింపబడినది. అందభ్యాగతుల కహోరాత్రంబులు నిరభ్యంతరముగా నన్నదానముచేయఁబడుచుండును. ఆసత్రమందిర సింహద్వారోపరిభాగంబున వ్రేలఁగట్టఁబడి

యున్న చిత్రఫలకములలోని స్త్రీరూపముజూచి తదీయ సౌందర్యా తిశయమునకు వెరగుపడుచు నాజవ్వని యెవ్వతె? అందేల వ్రేలగట్ట బడినది? తద్వృత్తాంతం బెఱింగింపుఁడని యడిగిన గోపకుమారునకు మణిసిద్ధుండు తదుదంతం బారత్నప్రభావమునం దెలిసికొని యక్కథ జెప్పందొడంగెను.

చోళదేశంబునం బ్రజావతియను పట్టణంబునఁ జిత్రసేనుం డను రాజు గలఁడు. అనపత్యుండగు నారాజు సుకీర్తియను మంత్రితో న్యాయమార్గంబునఁ బ్రజాపాలనంబు సేయుచుండఁ బెద్దకాలమున కతనికి నొకపుత్రుం డుదయించెను. జననలగ్నమును బట్టి వానికి విక్రమ సింహుఁడని పేరుపెట్టిరి. ఆవిక్రమసింహుఁ డుద యించిన మూఁడవదినముననే యారాజు మంత్రియగు సుకీర్తికిని నధిక తేజస్సమంచితుండగు సూనుండుదయించెను. వానికిని దైవ జ్ఞులు బహుశ్రుతుఁడను నామధేయ ముంచిరి.

ఆబాలుర కైదేఁడులు వచ్చినతోడనే సకలవిద్యాపరిపూర్ణుఁ డగు నొక యుపాధ్యాయునొద్ద జదువ నేసిరి. నారాయాచార్యునివ లన బదియారేఁడుల ప్రాయములోపలనే సకలవిద్యలు గ్రహించుట యేగాక ధనుర్విద్యయందసమానప్రజ్ఞ గలవారైరి. మరియు సంగీత మునందును గవిత్వమునందును వారింజెప్పియే మరియొకరిం జెప్ప వలయును.

చిన్నప్రాయములోనే యెక్కుడుపాండిత్యము సంపాదించిన యాకుమారుల బుద్ధికౌశల్యమునకు మిక్కిలి సంతసించుచు నొక్క నాఁడు చిత్రసేనుఁడు హితపురోహిత బంధుసామంత మంత్రిపౌర సూరివారంబు సేవింపఁ పేరోలగంబుండి యందులకు బహుశ్రుతుని తోఁగూడఁ గుమారుని రప్పించి మిగుల గారవించి యెల్లరు విన నిట్లనియె.

చిరంజీవీ! నీవును బహుశ్రుతుండును సకలవిద్యలయందు మిగులఁ బ్రవీణుఁడవైతివని విని నాడెందం బెంతయు నానందమందుచున్నది. "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్" అను రీతిని దనకంటెఁ గుమారుఁడధికుఁడగుట తండ్రికే యశముగదా!

మరియు నేను మంత్రియుఁగూడ బెద్దలమైతిమి మాకీరాజ్యభారంబువహింప దుస్తరమగుచున్నది. ఇదియునుంగాక నవనవోన్మేషంబుగల మిమ్ముఁ బ్రభువులుగా మేదిని గోరుచున్నది బహుమంత్రునితో క్షితిభారంబు వహింపుము. నేనును బూర్వాచార ప్రకారము నిన్నుఁ బట్టభద్రునింజేసి, తపోవనంబునకరిగెద. నీవును రాజ్యభారంబంతయుఁ బూని దండనీతి ప్రకారము ప్రజలం బాలింపుము. దండనీతి రీతినెఱుంగని రాజునకు రాజ్యంబు దక్కనేరదు. సప్తవ్యసనముల దారింబోక యాయముంబట్టి వ్యయము చేయుచు సమర్థులును విద్వాంసులును దయాసత్యనిరతులగు వారి ప్రధానులుగాఁ జేసికొని యల్పులఁ దరికిఁజేరఁనీయని రాజు శుభమ్ములందును మరియు తేనికెట్టి యనుగ్రహమున్నను జాలినంత ధనమియ్యవలయునుగాని యెవ్వరికిని జనువుమాత్రమియ్యరాదు సంధివిగ్రహయానద్వైధీభావసమాశ్రయ సామదానభేదదండములు మొదలగునవి యాయావేళకుఁదగినట్లు నడుపవలయును. తరుచు చారులచే, రాష్ట్రవర్తమానములు నిత్యమును దెలిసికొనుచుండవలయును. దేవతాభక్తియు బ్రాహ్మణభక్తియుఁగలిగి యుండవలయును. బ్రాహ్మణులంగనినతోడనే యభిమానమూనక చేతులెత్తి మ్రొక్కవలయు, బ్రాహ్మణాశీర్వాదంబుల సకల కామంబులు వడయవచ్చును. విప్రులకు నమస్కరించని వాఁడు యమలోకంబునఁ బీడింపఁబడునని యనేక నీతివాక్యములుపదేశించి పుత్రునకుఁ బట్టాభిషేకంబు నిశ్చయించి తన యభిప్రాయం బెఱింగించెను. విక్రమసింహుఁడును బహుశ్రుతుండును, సామాజికులు నట్టి మాట లాలించి మిగుల నానందించిరి. ఆరాజు నంతటితో సభ చాలించి వారినెల్ల స్వస్థానముల కనిపెను.

మఱునాఁడు పూర్వమువలె నాకుమారు లిరువురు సాయంకాలమున విహారార్థమై యుద్యానవనమునకరిగి యందుఁ గ్రీడించుచున్న సమయంబున మంత్రినందనునకు రాజనందనుం డిట్లనియె.

వయస్యా! నిన్న మాతండ్రి సభలోఁ బాడిన మాటలు వింటివిగదా! నాఁటనుండియు నామనంబున నొక వింతయగుచింత బొడమినది. నాకు మొదటినుండియు దేశసంచారము చేయవలయు నను నభిలాష గలిగియుండుట నీవెఱింగినదియేకదా? రాజ్యభారము మీఁద బడినచో నట్టిదాని కవకాశముండదు ఇంతదనుక విద్యాగ్రహణమూలముగాఁ గాలము వెళ్ళబుచ్చితిమి.

ఇప్పుడు కాళ్ళకు సంకిలి దగులుకొనుచున్నది. ఈభారము మీఁద బడకమున్న రహస్యముగాఁబోయి యొకసారి దేశసంచారము చేసివత్తమాయనుటయు నతనికిఁగూడ నట్టివేడుకయే యుండుటచే నందునకు సమ్మతించెను.

ఆదినముననె వారిరువురు మిగుల విలువగల రత్నములు బంగారమును సంగ్రహించి యర్ధరాత్రంబున నొరులెఱుఁగకుండ వాయువేగంబుగల తురంగములెక్కి పురంబు వెడలి యడవిమార్గంబునం బడి పోయిరి. ఆహా! వారు రాజ్యముకన్నను విదేశ విశేషము లరయుటయే యెక్కుడుగా నూహించిరి. ఆరేయంతయు నాగకగుఱ్ఱములఁ దోలుకొనిపోయి తెల్లవారు నప్పటికొక గ్రామము జేరిరి. ఆదివసమున నందుఁగల విశేషములరసి యటనుండి వేరొక పట్టణమున కరిగి యందలి వింతల నరయుచుఁ గ్రమంబున ననేక పురంబులు దిరుగుచు నొకనాఁడు మధ్యాహ్నమున కీవీడుచేరిరి. వారు నీనతంబుననే బసచేసి భోజనంబైన వెనుక వీధియరుగునం గూర్చుండి పురవిశేషములరయుచు రాజనందనుఁ డేమిటికో సింహద్వారము దెసకుఁ దలదిప్పి యిప్పుడు నీవు చూచినచిత్రఫలక మీక్షించెను.

అట్టిదానిం జూచినతోడనే యారాజకుమారుఁ డది నిజమైన వనితయే యనుకొని మూర్ఛవడి కొండొకవడికిఁ దెలిసి దాని మరలఁ దిలకించి యోహో? యిది నిజమైన మోహనాంగి యను కుంటినిగాని కాదు కాదు. చిత్తరువా! నామది భ్రమయలేదుగద! లేదు; నిజమే బహుశ్రుతా! యీద్వారముప్పై వ్రేలంగట్టిన చిత్ర ఫలకంబున నొప్పుచున్న యొప్పులకుప్పను చూడు. చూడు. మొదట ధాళధళ్యముచేత దీనిం జేతనమే యనుకొంటినిగాని తుద కది భ్రమయని తెలిసికొంటిని.

ఆహా! కలకల నవ్వుచున్న దీని మొగ మెంత వింతగా నున్నదియో పరీక్షింపుము. దీనిం జిత్రకారుఁడు చేతితోఁ వ్రాయ లేదుసుమీ! చేతితో వ్రాసినచో దీనియంగములు కందక యింత లావణ్యమయములుగా నుండునా? లిపికారుం డెందైన నొక సుంద రింగని దానిమాదిరిగా నిది వ్రాసెనో? లేక స్వమనీషా విశేషకల్పన నిట్టిదాని వ్రాసెనో? యెరుంగరాదు? లోకములో నింత చక్కఁదన ముగల కలకంఠు లుందురా? ఉండినచో నట్టిదానిం కౌఁగిటఁ జేర్చు కొనువానిదే గదా భాగ్యము. మిత్రమా! నీబహుశ్రుతత్వము సార్ధ కమునొంద దీని వృత్తాంతమరయుము. దీనివంటి వాల్గంటిందెచ్చి నాకుఁ బెండ్లిఁ జేయనిచో నిప్పుడ ప్రాణంబులఁ బోగొట్టుకొనియెద నని యత్యంత విరహతాపంబునఁ గొట్టుకొనుచున్న యా రాజపట్టికి మంత్రిపట్టి యిట్లనియె.

విక్రమసింహా! రంగులతో వ్రాసిన విగ్రహమును జూచియే యింత విరహతాప మందుచున్నావేమి? అయ్యో! మంచి ధైర్య శాలివే. ఇది నిజముగా రమణియైనచో నెంత విరాళిందూలెదవో గదా? చాలు చాలు. ఊరకుండుము. ఎవ్వరైనం జూచిన నవ్వు దురు. దీని నిజం బరసి నిజముగా నిట్టికాంత యీభూమియం దెక్క డనున్నను గన్యకయైనచో నీకుఁ బెండ్లి శేసెద. నీవూరుపుగలిగి యుండవలయుననుటయుఁ దదీయవచనంబుల కెంతేని సంతసించి ప్రియవయస్యా! వయస్యునకీయుపకారము వేగముగాఁ జేయు

బ్రియత్నింపుమని దైన్యముగాఁ బ్రార్థించుటయు నతండు వల్లెయని యప్పుడు క్రమంబున నయ్యూరనున్న వృద్ధులనెల్ల నాచిత్రఫలక వృత్తాంత మడుగుటయు నందొక వృద్ధబ్రాహ్మణుం డిట్లనియె.

అయ్యా! మూఁడేండ్లక్రిందట మళయాళదేశ రాజధానియగు నన౦తపురమునుండి నిపుణికుండను చిత్రకారుఁడువచ్చి యిచ్చటదీనిం గట్టిపోయెను. కట్టుటకుఁ గారణము నాకుఁ దెలియదు. ఇంతియ మే మెఱింగిన వృత్తాంతమనిన విని మంత్రినందనుఁడు కొంత సంతసించి వాని నామంబును, గ్రామంబును వ్రాసికొని విక్రమసింహునితో నప్పుడ యప్పురంబు వెడలి కతిపయప్రయాణంబుల నయ్యనంత పురంబు సేరి తత్పురజనులవలనం దెలిసికొని వానియింటి కరిగెను.

నిపుణికుండును వారి నుచితసత్కారంబుల నాదరించికూర్చున్న పిమ్మటఁ గొంతసేపునకు వినయంబున నాగమనకారణం బడుగుటయు సంతసించి బహుశ్రుతుం డిట్లనియె.

నిపుణికా! యీతండు చోళదేశపురాజకుమారుండు. నేను దదీయ మంత్రినందనుఁడ. మేమిరువురము దేశసంచారమునకై వెడలి తిరుగుచు నీచేఁ గ్రౌంచపురంబుననున్న సత్రమందిరపు సింహద్వారమున వ్రేలంగట్టఁబడిన చిత్రఫలకముఁ జూచితిమి. అందు వ్రాయఁబడిన పడతుకం జూచి మారాజనందనుండు విరాళిందూలుచున్నవాఁడు.

అచ్చటివారిచే నది నీచే వ్రాయఁబడినదని విని మేము నీచెంత కరుదెంచితిమి. అది నీవు బుద్ధిసూక్ష్మతచే వ్రాసితివా? అట్టిసుందరి యందైనఁ గలదా? దాని యుదంత మెఱింగింపుమని యడిగిన నతండు మొగంబునం జిరునగ వంకురింప వారి కిట్లనియె.

అయ్యా! నేనొకప్పుడు కాశీపురి కరిగితిని. ఎచ్చటనుండియో కాని యప్పుడే యచ్చటకిఁ బురుషద్వేషిణియను రాజపుత్రికవచ్చినది. సార్థకనామముగల యాకలకంఠి పురుషుల మొగ మెన్నఁడునుచూడక పోవుటయేగాక యాందోళిక మెక్కి వీధినరుగునప్పు డా పల్లకినిగూడ

పురుషులు చూడఁగూడ దఁట. ఆచిన్నది మణికర్ణి కాఘట్టమునకు స్నానమున కరుగునప్పు డట్లు చాటించుచుండ నేనాలించియమ్ముంచుఁ బోఁడి యెంతచక్కనిదోయని దానింజూచువేడుక నాకెడదఁబొడమిన బెక్కు తెరంగులఁ జింతించి తుదకొక్క యుపాయ మూహించితిని.

నేను జలస్తంభనముఁ జేయఁగలను. ఆమెకన్న ముందర నే యరిగి మణికర్ణి కాఘట్టంబున జలంబుల మునింగియుంటి. పిమ్మట నావాల్గం టియుఁ బెక్కురుచెలికత్తియలు బెత్తంబులంబూని చుట్టుముట్టి రా నాఘట్టంబున కరిగి మాటుగట్టిన పుట్టంబు లెంకి బల్లకి దిగి గంగలో మోకాలిబంటిజలంబున నిలిచి చెలికత్తియలు కనకకలశంబులెత్తి జలంబులు పైనిడఁ దీర్థమాడెను. జలచరభీతిచే నవగాహస్నాన మాచరించినదికాదు. దానం జేసి జలంబులమునిఁగియున్న నాకు నీటిలో గుందనపుకమ్ములవలెఁ దళుక్కురని మెరయుచుఁ దదీయ పదాంగు ష్ఠంబులుమాత్రము గనంబడినవి. ఇతరాకార మేమియుఁ గనంబడ లేదు.

స్నానముఁజేసి యాసరోజముఖి యేగిన వెనుక నేనును జలంబు వెడలివచ్చి సాముద్రికశాస్త్రమంతయుఁ బూర్ణంబుగాఁజదివినవాఁడఁ నగుట నాయంగుష్ఠంబు పోలికంబట్టి రూపమంతయు వ్రాసితిని. ఆ సుందరి యట్లుండుట కేమియు సందియంబు లేదు.

దాని నట్లు వ్రాసి నేను దేశంబునకువచ్చుచు దారిలో మీరు చూచిన సత్రమున నొకనాఁడుబసచేసి యది పదుగురు వచ్చిపోవుసత్ర మని యూహించి యది యందు వ్రేలఁగట్టి యేగితిని. ఇదియ దాని వృ త్తాంత మింతకన్న నాచిన్నదాని దేశ, కుల, శీల, నామంబులు నాకుఁ దెలియవని యెఱింగించిన నామంత్రినందనుఁడు తలకంపించుచు నో హో! యికార్యము సమర్థింప మిగులనసాధ్యముగనున్నది. ఆచిన్న దియున్న నెలవు పీనిమాటలచేఁ దేటపడ లేదు. విక్రమసింహునివిరహ తాపమగ్గలమగుచున్నది. దైవానుగ్రహ మెట్లున్నదోగదాయని పరిపరి గతులఁ దలబోయుచుండ బహుశ్రుతునకు విక్రమసింహుం డిట్లనియె.

అన్నా! యీచిత్రకారుని మాటలు వింటివిగదా? పురుష ద్వేషిణి యను పేరంబరగు నానారీమణి పటములో నున్నట్లుండుట కేమియు సందియము లేదు. తనకుసరిపడిన పురుషులు లేమిం జేసి సామాన్యులం జూడనొల్లకయే యప్పల్లవపాణి పురుషద్వేషిణియను పేరు పెట్టుకొనినది. ఎట్లైనను వెదకి యమ్మదవతిని నాకుం గూర్తు నంటివేని మేనం బ్రాణంబులం బూనియుందును. లేనిచో నిప్పుడ యొడలువిడుచువాఁడ నాయుల్లంబెల్ల నప్పల్లవాధరిదరిం జేరియున్నది దీనికేమనియెదవని యడిగిన నతండు శీఘ్రకాలములో నీధరిత్రినెక్కడనున్నను నాచిన్నదానిందెచ్చి నీకుం బెండ్లిచేసెదనని ప్రతిజ్ఞచేసెను.

పిమ్మట నాచిత్రకారునిచే ననిపించుకొని వారిరువురు నప్పురంబు వెడలి యప్పఁడతి నరయుచుం బెక్కుదేశంబులు దిరిగిరి.

ఒక్కనాఁడుదయంబున లేచి వారొక యడవిమార్గంబునంబడి నడుచుచుండ నెండతాకునకు మేనువాడ విక్రమసింహుడు నడువలేక యొక మ్రాకునీడం జదికిలంబడి అన్నా! బహుశ్రితా! నాకీయెండలో నడువ మిగుల శ్రమముగానున్నది. నాలుకయెండి మాటరాకయున్నది. దాహమగుచున్నది గాన నేనిక్కడనే పండుకొనియుండెద. ప్రాంతమున జలప్రదేశమున్నదేమో యరసి జలము దెత్తువేని దప్పితీర్చుకొని నడిచెదంగాని యిప్పుడొక యడుగైన నడువనోప! అయ్యయో యిదియరుప్రదేశములాగున్నది. నీరు దేర నాలస్యమైనచోం బ్రాణంబులు నిలువవు త్వరగా దెమ్మని దీనుండై యడిగిన చెలికాని దైన్యంబునకు వగచి యప్పుడాదిట్ట యొకచెట్టు కొననెక్కి నలుదెసలంబరికింప నొకవంక జలవిహంగము లెగురుచుండుటం దిలకించి మేనుబులకింప సంతసముతోం జెట్టుదిగి వయస్యా! యొకనిమిషము తాళుము. ప్రాంతముననే జలమున్నది. వేగమున బోయి కొనివచ్చెదనని యతని నూరడంబలికి వడివడి జలంబులు దేర నాబహుశ్రుతుం డరిగెను. అప్రాంతముననే మానస సరోవరంబు నుంబోని యొకతటాకం బతనికి నేత్రపర్వము గావించెను.

అదియు రత్నసోపానంబులును కాంచన పద్మంబులునుబం గారు కలువలు గనకమణిరజితజలచరంబు నింద్రనీలబంభరంబులు గారుత్మతజలపతంగంబులుం గలిగి కుసుమతరు లతావితానంబుతీర ధారుణి నలంకరింప నమృతప్రాయంబగు తోయంబులచే నిండింపఁ బడి యలఁతియలలచే వెలయు నక్కొలనుఁ గనుంగొని మిగులఁ జెలఁగుచు నతండు ప్రాంతమ్ముఁ జేరునంతలో నందున్న శిలాఫల కంబున నిట్లు వ్రాయఁబడియున్నది.

ఇది పురుషద్వేషిణియను రాజపుత్రిక క్రీడించు కేళీసరోవర ము. దీనిప్రాంతకుఁ బురుషులెవ్వరును రారాదు. వచ్చినవారిని క్షమింపక నురిదీయుదురు. అనియున్నలిపి మున్మారుచదివి సంతోష భయంబులు మనంబునం బెనఁగొన నతఁడౌరా! నాకీనీటిసెపంబున నాకోఁటి కత దేటపడినది. దైవానుగ్రహమిట్లుండవలయు. వేగ బోయి యీవృత్తాంత మెఱింగించి నామిత్రునిడెందమున కానం దము పొందుపరచెదనని నాలుగుమూలలు పరికించి వడివడి న త్తటా కంబులోనికిఁదిగి కడుపునిండ నీరుద్రాగి విశాలపర్ణపుటంబున జలంబు లంబట్టి యత్యంత జవంబున మిత్రునికడకు వచ్చుచుండెను.

ఇంతలో నచ్చటఁ జెట్టుక్రిందఁ బండుకొనియున్న విక్రమసిం హుఁడు ప్రాంతమందొక భయంకరమగుధ్వని వినంబడిన నిరా యుధుఁడైయున్న కతంబున వెరచి తటాలున నికటంబుననున్న సాలవృక్షమెక్కెను.

పిమ్మట నొకసింగమ్మతిరయంబునం బరతెంచి వీకమై తోకఁద్రిప్పుచు సటలు నిక్కబట్టి యాచెట్టుక్రింద గద్దియంబెట్టుకొని కూర్చుండెను. అంతకు మున్నుచెట్టుమీదఁ గ్రౌంచంబనుపక్షి వసియుం డియున్నది. సింహాభీతిచే విక్రమసింహుఁడు నిదానింపక దాని రెక్క లనుగూడ చెట్టుశాఖలే యనుకొని దట్టముగానున్న తత్పక్షంబుల మధ్య దాగియుండెను.

ద్వీపాంతరమున వసించునదియు మిక్కిలి గొప్పదియు నగు నాపక్షి యప్పుడు కొంచెములుకుడు తగిలినందున చెట్టుకొమ్మలు విరుగ రివ్వున నగసిగగన మార్గమునఁ గ్రౌంచద్వీపాభిముఖముగాఁ బోవజొచ్చెను.

అప్పుడాపక్షి రెక్కలమధ్యను జిక్కుపడిన విక్రమసింహుఁడు భయపడి దానిరెక్కలపట్టు విడువక అయ్యో! మే మొక్కటిదలంచిన దైవ మొక్కటిదలంచెనే? అక్కటా! నన్నీపక్షి యెక్కడికెత్తుకొనిపోవునో కదా! నాదినములు మంచివికావు. ఇంటియొద్దనుండి సుఖముగా రాజ్యముసేయక విదేశ గమనబుద్ధి యేలపుట్టవలయును. మిత్రుఁడు ననుఁగానక యెంతచింతించునో యేమిసేయుదు? వానికీవార్త యెట్లుతెలియునో యని యనేక ప్రకారంబుల విలపించుచు నొకచీటి వ్రాసి యది నేలంబడవైచెను.

## క్రౌంచద్వీపముకథ.



ఆపక్షియు నక్షీణజవంబున ననేక దేశంబులును ద్వీపంబులు దాటి క్రౌంచద్వీపమున నొకచెట్టుమీఁద వ్రాలెను తరుచుగ నాపక్షు లాద్వీపమున వసించి యెప్పుడైన జంబూద్వీపమునకు మేతకై వచ్చుచుండును. దానంబట్టియే యాద్వీపమునకుఁ గ్రౌంచద్వీపమని పేరు వచ్చినది.

అట్లు వాలినతోడనే విక్రమసింహుఁడు మెల్లన దానిరెక్కల సందునుండి తప్పించుకొని యామ్రానుకొమ్మ లాధారముగా భూమికి దిగెను. ఆపక్షి యతఁడు తనరెక్కలలోఁ జిక్కుటయు దిగుటయు గూఁడ నెఱుఁగదు. దానిబల మెట్టిదో చింతింపుము.

అట్లుదిగి ధైర్యమే తనకు సహాయమైయుండఁ గొండొక దెసగా నడువఁజొచ్చెను. నడువనడువఁ గొంతసేపున కొకపట్టణ ప్రాంతముజేరునంత నొకనెలఁత యెదురైనది.

దానింజూచినంత నతండు నివ్వెరపడి పలుదెరంగులఁ జింతిం చుచుండ నయ్యండజయానయు నంతికమున కరుదెంచి యత్యంత సుకుమారుండగు నారాజకుమారునింజూచి మోహించి తనభాషతో నీవెవ్వఁడవని యడిగెను. ఆమాట వానికిఁదెలియక నతఁడు మరల దానితో నీవుచెప్పినది నాకు దెలియలేదు. నీవెవ్వతెవని యడిగెను.

అతనిమాటయు దానికిఁదెలిసినదికాదు. ఇట్లొండొరుల యభి ప్రాయములు మాటలచేఁ దేటపడమి వెరగంది చూచుచుండ నమ్మత్తకాశిని హస్తసంజ్ఞచే నతనిఁ దనయింటికిరమ్మని సూచించినది.

అతండప్పు డేమియుఁ జేయునదిలేక వెంటవచ్చెదనను భావము మరల సంజ్ఞమూలముగానే తేటపరచెను. అది క్రౌంచ ద్వీపమునకు రాజధానియైన యేకశిలానగరము. దానిం గ్రౌంచవతి యను రాణి పాలించుచున్నది. అందున్న స్త్రీలకు మిగుల చక్కఁ దనము గలదుగాని వారికృత్యములు రాక్షసకృత్యములు. పురుషు లందఱు నల్లని కోతిముఖములవంటి ముఖములు గలవారును బొట్టి వారునగుట వికారముగ నుందురు.

పూర్వము రామరావణయుద్ధంబున మూర్ఛంబడియున్న లక్ష్మణునిం బ్రతికింప హనుమంతుఁడు ద్రోణగిరిఁదెచ్చి వెండియు నగ్గిరిఁ దీసికొనిపోవుచు నాక్రౌంచద్వీపమున నొక నిమిషము విశ్ర మించెను. మిక్కిలి చక్కనివారగు నచ్చటిపురుషు లతనిం గని పరిహాసించిరి. దానం గోపించి యప్పవననందనుఁ డందున్న పురుషు లును వారికిఁబొడము పుత్రులును వానరముఖములును వామనులై యుందురనియు స్త్రీలు రాక్షసకృత్యములు గలవారై యొప్పుదు రనియు శపించిపోయెను. సాధులంగని పరిహాసించిన పాతక మూరక పోవునా ?

అట్టి దీవియందు మిక్కిలి చక్కనివాఁడగు విక్రమసింహునిఁ జూచి యాచిన్నది సంతసించుట యేమియాశ్చర్యము? పట్టరాని యా

నందముతో నారాచపట్టిని వెంటఁబెట్టుకొనిపోవుచు నాబాలిక దమ యేలికసానియైన క్రౌంచవతి కావృత్తాంతము దెలిసినచో వానిఁదనకు దక్కనీయదను భయమున నతని రహస్యముగాఁ దన యింటికిఁగొనిపోవఁ దలంచెను. తాననుకొనినయట్లుచేయసాగినదికాదు.

దారిలో మరియొకతె దారసిల్లి పుష్పవతియను పేరంబరగు మొదటిదానింజూచి యక్కా! ఇంతచక్కని పురుషుం డెక్కడ నుండి వచ్చెనే? పురుషులలోఁగూడ నింతవింతగలవారుందురుకాఁ బోలు. వీనికథ యెట్టిదని యడిగినది. నాతీ! యీతఁడెందుండి వచ్చెనో యెవ్వండో నాకుఁదెలియదు. ఇప్పుడే చూచితిని. వీని యందు మనభాష తెలియనిలోపమొక్కటియే యగుపడుచున్నది. మనమిరువురము వీనిరహస్యముగా నింటికిం దీసికొనిపోయి పెండ్లి యాడుదము. మనరాణికిఁ దెలిసినచోఁ గామాతురురాలగు నామె వీనిమనకు దక్కనీయదుసుమీ! యనుటయు నప్పొలఁతియు నంతన ముతో నందులకియ్యకొని చయ్యన వారివెంట నడువఁజొచ్చెను.

ఇంతలో నింకొకనెలంతి యంతికమున కరుదెంచి యాదేశ మునకు వింతగానున్న విక్రమసింహునిఁ జూచి మోహముతో నోహో! ఇంతులారా! యింతసొగసుకాని నెక్కడ సంపాదించి తిరి? నాకుఁగూడ భాగమీయవలయును. అనుటయు వారొడంబ డనివాఁడు తమగుట్టు బయలగుననియే యట్టిపని కియ్యకొనిరి.

ఆముగురుమగువలు వానిందోడ్కొని వేగముగాఁ బోవు చుండుటయు మరియిరువురు తరుణులుగనంబడి వానిసోయగంబున కచ్చెరువందుచుఁ దమకుగూడ వానిం బతిజేయుఁడని మొదటివారిం బ్రతిమాలిరి.

అప్పనికొప్పుకొని యప్పుడఁతులెల్ల నడచుచుండ నింతలోఁ బురంబంతయు వింతపురుషుఁడువచ్చెనని ప్రతీతిమీరియు నాయూ రంగల కలకంఠులెల్ల నుల్లము లలర వానింజూచుటకై గుంపుగుంపు

లుగా రాఁదొడఁగిరి. అచ్చట స్త్రీలకేగాని పురుషులకేవిధమగు స్వాతంత్ర్యములేదు. దానంజేసియే యాదేశంబున స్త్రీలకుజారత్వము నింద్యములేదు.

వచ్చినవారెల్ల వానింజూచి విస్మయమందుచు దమకుఁ బతి జేసికొనవలయునని నుద్దేశముతోఁ దమయిళ్ళకు రమ్మని సూచించిరి. కాని విక్రమసింహుఁ డానెలంతలరాక యంతయుఁజూచి స్వాంత మున బెక్కుతెరంగులఁ జింతించుచు నెవ్వరివెంటబోక మొదటఁ దన్నుఁజూచిన పుష్పవతి యింటికే యరిగెను.

అదియు నతని బహుప్రకారముల సత్కరించెను. దాని సత్కా రములేమియు వానిహృదయమునకు సంతోషము గలుగజేసినవి కావు వారి యాహారవిహారములుగూడ వానికి మిగుల విపరీతము లుగాఁ గనంబడినవి. వారు పచ్చిమాంసమునే భుజింతురు. కోపము వచ్చినపుడు మగవారింజంపి తినుచుందురు. విక్రమసింహుడందుఁ బాలచేతను ఫలములచేతను నాకలి దీర్చుకొనుచుండెను. ఏవిధమైన మాంసమును దినుటలేదు.

పురుషద్వేషిణీవిరహాసంతాప మూలకమగు మిత్రవియోగ శోకమతని హృదయమునం దత్పురహాసక్లేశము బలపరుచు చుండెను.

బుద్ధిమంతుఁడగు నతండు పదిదినములలోనే వారి భాషా మర్మమంతయు గ్రహించి వారుచేయు దారుణకృత్యములకు భయ పడుచుమాట్లాడినచోఁ దగుల మెక్కుడగునని భాష రానివానివలెనే యభినయించుచుఁ దరుచు మౌనముగానే యుండెను.

ఇట్లుండునంత నన్నెలంత యొక్కనాఁడు తన్నుఁగామక్రీడల దేల్చుమని బ్రతిమాలిన నతండు పెక్కుగతుల నట్టిపని మానివేయుట యేయుత్తమమని తలఁచెనుగాని దానిదైన్యోక్తు లతనితలంపు నిలువ నిచ్చినవికావు.

అతండుచితసురతంబున నయ్యతివమతి కుతుకపరచుచుఁగొన్ని దినంబులు గడిపినపిమ్మట నొక్కనాఁడా పుష్పవతిపయింగల యాసు

నంజేసి కొందఱు సుందరులు క్రౌంచవతియను రాణియొద్దకరిగి వాని వృత్తాంతమంతయుం జెప్పిరి. చపలస్వభావయగు నయ్యగువ యట్టి మాట లాలించినయంత మేనెల్లం బులకరింప నెదుటనున్న యొకచేటి కంజేరి నీవతిరయంబుననరిగి యావన్నెకానితోఁగూడ పుష్పవతిం దోడ్కొనిరమ్మని పంపిన నమ్మించుఁబోఁడియు రాణినానతి నయ్యతివ కెఱింగించిన సంచలించిన డెందముతో నమ్మందయాన యాసుంద రుం దోడ్కొని యప్పుడయ్యేలికసానియొద్ద కరుదెంచినది.

దానిపజ్జవచ్చుచున్న యారాచచిన్నవానింజూచి యాకాంత యత్యంతకంతుసంతాపవేధితస్వాంతయై యెదురేగి యమ్మదవతీ మద నునికంఠంబు భుజమృణాళంబుల బిగయంబట్టి తోడ్కొనివచ్చి యర్థ సింహాసనమునఁ గూర్చుండఁబెట్టి మిగులగౌరవించి పుష్పవతికిట్లనియె.

పుష్పవతీ! యంధకారకూపంబునకు భాస్కరుండువోలె విప రీతజననివేశనంబగు మనదేశంబునకు నీదివ్యపురుషుం డరుగుదేర నాకాతెఱంగెఱుకపఱచక నీయింటం దాచుకొంటివేల "రత్నహారీతు పార్థివః" అనునట్లు వింతవస్తువులు దొరకినప్పు డేలికలకుఁ దెచ్చి యిచ్చున్యాయ మెఱుంగవా? చాలుచాలు పోపొమ్మని దాని మంద లించి విక్రమసింహునిం దోడ్కొని యంతఃపురమున కరిగినది.

విక్రమసింహుఁడా రాణివైభవమంతయుఁ జూచియు నామెకాఁ దనపైఁగల మోహమెఱింగియు నించుకయేని సంతసము వహింపఁ డయ్యెను. "దుఃఖితేమనసి సర్వమసహ్యం" అనుమాట దప్పునా? పిమ్మట రాణియు వానిఁజూచి యార్యా! మా పూర్వపుణ్యంబున మిమ్ముఁ బొడగంటిమి. మాదురవస్థఁ బాపుటకై వచ్చిన భగవంతుఁడ వని తోచుచున్నది. సుందరపురుష సంయోగంబు లేమింజేసి యీ దేశస్త్రీలకుఁ బొడము పురుషసంతానమంతయు వికృతిరూపముగా వెలయుచున్నది. నేనును గోత్రగా సింహాసనమెక్కితిని. నాకును

వికృతరూపుఁడగు నొకపురుషుఁడు గలఁడుగాని వానిమొగ మిదివ రకు నేను జూడలేదు. నన్ను నీవు భార్యగా స్వీకరించి నాకొక పుత్రుం దయచేయుఁడని ప్రార్థించిన దానిమాట లంగీకరించి యతం డనురాగముదోపఁ దదభీష్టముల నెరవేర్చెను.

అట్లుకొన్నిదినంబు లారాణితో విక్రమసింహుఁడు వేడుకగాఁ గ్రీడలఁదేలునంత నాకాంత గర్భవతియయ్యెను.

ఆదేశమందు గర్భిణీస్త్రీలు పురుషసాంగత్యముచేయరు. అట్టి చిహ్నములు దేటపడినచో నాబోఁటి యతనితో నాథా! నీకరుణా విశేషంబునఁ బుత్రుండుదయించు లక్షణములు గనఁబడుచున్నవి. కొన్ని నెలలవఱకు నాకు బురుషసాంగత్యము కూడదు. నాకు కుసుమ గంధియను చెల్లెలుగలదు. అదిరూపంబునను శీలంబునను నన్నుమించి యున్నది. అంతదనుక దానిడెందంబున కానందము సంఘటింపుమని యవ్వనితను రప్పించి యతనికిఁ జూపించిన సంతసించి నాటంగోలె యావిక్రమసింహుఁ డాతలిరుఁబోఁణితోఁ గ్రీడించుచు దానికిఁ గూడ నెలతప్పినచో నప్పు తెల్లమైనతోడనే యావాల్గంటి నంట మానివేసెను.

అప్పుడాయూరఁగల నారీమణు లావిధం బెఱింగి యారాణి ననుమతిం బ్రతిదినమును వంతుప్రకారమరిగి యతనివలన నభీష్టకా మంబులఁ దీర్చుకొనుచుండిరి.

విక్రమసింహుఁ డాభాష సాంగముగా నెరింగియున్నకతంబున నప్పుడప్పుడు సభలుచేయుచు వారి దురాచారములగుఱించి యుప న్యాసములు వ్రాసి చదువుచుఁ గ్రమంబున వారికార్యములఁదగ్గింప దొడఁగెను.

మఱియు నొ శుభలగ్నంబున నారాణికొక పుత్రుం డుద యించెను. ఆబాలుండును నాదేశపురుషులవలెఁ గాక సర్వావయవ సుందరుండై యుండుటంజూచి రాణియు బంధువులు నానందమం దుచుఁ గ్రౌంచద్వీపచక్రవర్తి యుదయించెనని ప్రకటింపందొడంగిరి.

కాలక్రమంబున విక్రమసింహునితోఁ గ్రీడించిన చేడియలం డఱు నందముగల నందనులంగనిరి. అప్పుడందఱు నావిక్రమసింహుని క్రౌంచద్వీపపురుషులకుఁగల దుర్దశలఁబాపుటకై వచ్చిన పరమేశ్వరుఁడని వినుతించుచు నతఁడు చెప్పినపనులెల్లఁ జేయ సిద్ధముగ నుండిరి.

అట్టి గౌరవమువచ్చినప్పుడు గూడ విక్రమసింహునకు మిత్రవియోగసంతాపంబు ద్వీపాంతరవాస క్లేశంబును సంతోషమును గలుగ నిచ్చినవికావు. అతఁడు పెక్కుతెరంగులఁ దన దేశమునకుఁ బోవఁ బ్రయత్నించెనుగాని అచ్చటివారికి జంబూద్వీపనామమే తెలియమి నట్టి యుద్యోగము కొనసాగినదికాదు.

ఆదేశస్త్రీలకుఁ బూర్వమే పురుషులయెడ గౌరవమలఁతియై యున్నది. విక్రమసింహుఁడు వచ్చినది మొదలమ్మదవతులు పతుల మరియుం జుల్కనగాఁ జూడఁదొడంగిరి.

ఒకనాఁడాదేశపురుషులందఱు నొక్కచోటఁజేరి యిట్లుతలపోసిరి. అయ్యో! మనగతి యేమైనదియో చూచితిరా. మనభార్యలందఱు మనలంజూడక యెచ్చటనుండియో వచ్చినవానియెడ మక్కువగలిగి వానితోఁ గ్రీడించుచు సంతానమును గనుచుండిరి. కొలఁదికాలములో నీదీవియంతయు వానిసంతానమే వ్యాపించును. మనమును మనసంతానమును మృగములవలె నిఁక నడవిపాలు గావలసి వచ్చును తనసతి యుపపతితోఁ గ్రీడించుచుండ నెట్టినీచునకైనను మనంబున నీర్ష్య జనింపకుండునా? వీఁడుమనకు శత్రువు వీని నెట్లైననుఁ బరిభవింపవలయును. మనలోఁ గొందఱికి రాణీయంతఃపురమున కరుఁగ జనువు గలిగియున్నదిగదా? రాత్రివాఁడు నిద్రించునప్పుడు మంచముతోఁగూడ మోచికొనిపోయి సముద్రంబునం బారవేయుదమని యొండొరు లాలోచించుకొని యారేయి వాఁడు నిద్రించుచున్న మంచము మెల్లన నెత్తుకొని యతిరయంబున సముద్రంబునం బారవేయుటకై నడుచుచుండిరి.

ఇంతలో విక్రమసింహుఁడు మేల్కాని కన్నులు దెరచిచూడ నాకాశమును నక్షత్రింబులు గనంబడినవి. వెరచి యతండదరిపడి లేచి మంచముమీఁద గూర్చుండి యావామనులాడుకొను వాక్యములు గొన్ని విని వారుదన్ను సముద్రింబునం బడవేయఁ గొనిపోవుచున్న వారని నిశ్చయించి తప్పించుకొను నుపాయం బరయుచుండ నొక వృక్షము క్రిందుగా నరుగునప్పు డాతండు తెప్పున శాఖనందుకొని యాచెట్టుపై కెగఁబ్రాకెను.

వారది యెఱుంగక క్రమంబునంబోయి యామంచమును సముద్రింబునం బారవైచి తమదాయాదుఁడు హతుఁడయ్యెఁగదా యని సంతోషముతో నింటికరిగిరి. రాణియు నచ్చటి స్త్రీలందఱు మఱునాఁడు విక్రమసింహునింగానక పెక్కుతెరంగుల శోకించుచుఁ దుదకుఁ దమపురుషుల కపటమునలననే హతుఁడయ్యెనని యెఱింగి యట్టివారిని నుగ్రశిక్షకుఁ బాత్రులఁజేసిరి. కాలక్రమంబున యౌవన వంతుఁడైన విక్రమసింహుని పుత్రుఁడే యాదీవికి రాజయ్యెను. ఇదియునుంగాక బ్రహ్మసంతతిఁబోలె నాదీవియంతయు విక్రమసిం హుని సంతతియే క్రమంబున వ్యాపించెను.

అర్ధరాత్రంబున విక్రమసింహుడట్టు చెట్టుపై కెగఁబ్రాకిన తోడనే మున్ను తన్ను జంబూద్వీపమునుండి క్రౌంచద్వీపమునకుఁ గొని తెచ్చిన పక్షియే యందు బరుండియున్నది. ఆసంగతి యతండెఱుఁగక పూర్వమువలె దానిరెక్కలసందున డాగియున్నంత నప్ప తంగంబు దైవగతి రివ్వున నెగసి మరల జంబూద్వీపాభిముఖముగా నతిజవంబునం బోవదొడంగినం జూచి యతండోహో ! యిది మునుపటి పక్షిలాగున్నది. నన్ను మరల జంబూద్వీపమునకుఁ గొని పోవుచున్నదా యేమి ? నాయందు దైవమున కనుగ్రహమువచ్చి యుండఁబోలు. కష్టములు కోరక సంప్రాప్తించునట్లు కాలక్రమం బున సౌఖ్యంబులు నొన గూడునని పెద్దలు చెప్పుదురు. ఆమాటలు నేఁటికిఁ దార్కాణమైనవి.

దైవము నన్ను రక్షించుచుండునని యనేక ప్రకారంబుల భగవంతుని ధ్యానించుచుండ మార్తాండుం డుదయగిరిశిఖర మలంకరించినంత నాశకుంతంబు పూర్వము విక్రమసింహుఁడు సింహభీతిచే నెక్కిన చెట్టుమీదనే వ్రాలెను. దైవానుకూలదినములలో నొరులు తనకుఁ జేయు నపకారములు నుపకారములే యగును. విక్రమసింహుని మరణవిధికై నడిపించిన వామనుల దురాలోచన మతని స్వదేశము జేర్చినది.

అప్పుడు విక్రమసింహుఁడు మెల్లన కొమ్మలఁబట్టుకొని పుడమికిడిగి యది మున్ను దాను బహుశ్రుతునితో వియోగముపొందిన ప్రదేశముగాఁ దెలిసికొని దైవగతి ననేకగతులఁ గొనియాడుచు బహుశ్రుతుని గుఱించి పరిపరిగతులం దలంచుచు నతనిజాడఁ దెలియఁగోరి కొంచెము సాగినంత నతం డెదురుగా వచ్చుచుండెను.

అల్లంతదవ్వున వానింజూచి విక్రమసింహుఁ డంతరంగమున నోహో! యితండు బహుశ్రుతుఁడేనా? కాఁడు. అంతటిభాగ్యము నాకింతటిలో లభించునా? వాని విడిచి సంవత్సరమైనది. ఇంతదనుక నిందే యుండునా! అని వేతెఱంగుల దలపోయుచుండెను. విక్రమసింహునిం జూచినతోడనే యతనికిఁ దోచిన యూహాలన్నియు బహుశ్రుతుని హృదయమందును జనియించినవి.

ఇరువురు దారసించినతోడనే యోహో బహుశ్రుతా! కనంబడితివా! యనియు ఏమి నాప్రాణమిత్రుఁడు విక్రమసింహుడే యనియు నొండొరులఁ బలకరించుకొనుచు గాఢాలింగనములు సేసికొని పెద్దతడవు కంఠంబుల నెలుఁగురాక యట్టు నిలువంబడి యొట్టకేలకుఁ దెరపి తెచ్చుకొని యొక చెట్టునీడంజేరి యన్యోన్యముఖావలోకనంబులం దనివినొందక యానంద మందుచున్న సమయంబున బహుశ్రుతుం డిట్లనియె. అన్నా! విక్రమసింహా! ఎందుబోయితివి? ఏమేమివింతలం జూచితివి? ఇన్నిదినంబులును సుఖంబుండితివికదా! నేఁడీయుదయ మిచ్చటి కెట్లువచ్చితివి. యెఱింగింపుమనుటయు విక్రమ

నింహుడు తాను సింహభీతిచేఁ జెట్టెక్కినది మొదలు బహుశ్రుతు నిం జూచువరకు జరిగిన కథయంతయుఁ జెప్పెను.

బహుశ్రుతుఁడు వయస్యా ! నీవెండతాకున దాహార్తుండవై పడియుండ జలంబులు దేర నే నరిగితినికదా? అట్లరిగినంత ప్రాంతము న నే వింతయగు నొకకొలను గనంబడినది. దానివిలాసంబు మానస సరోవరంబునకైన లేదని నుడువవచ్చును. దాని కచ్చెరువందుచు నలుదెసలం బరికించుచుండ నొకదండ శిలాఫలకంబున "ఇది పురుష ద్వేషిణీ విహారసరోవరంబు. దీని చెంతకుఁ బురుషులు రాఁగూడదు. వచ్చిన వారికి మరణదండన విధింపఁబడు" నని వ్రాయఁబడియున్నది.

దానింజదివి భీతియు సంభ్రమంబును జనింపనట్టి యుత్సా హంబు నీకెఱింగింపఁగోరి యతిజవంబున జలంబుల నొకపర్ణపుటంబు నంబట్టి యిచ్చటికి వచ్చితిని. ఇందు నిన్నుఁగానక పెద్దయెలుఁగున విక్రమసింహా ! యని పెక్కుసారు లడవి ప్రతిధ్వనులీయ నఱచితిని. యెప్పటికిని బ్రతివచనంబు వినంబడినదికాదు.

అప్పుడు గుండెపగుల ధైర్యమాపుకొనుచు నీయడుగులజాడ నరయుచుండ నందు సింహపాదచిహ్నంబులు గనంబడినవి. ఆసింగము నిన్ను మ్రింగెనని నిశ్చయించి నేలంజతికిలఁబడి పెక్కువిధంబుల శోకించితిని. మిత్రమా ! అప్పటిరీతిఁ దలంచుకొనిన నిప్పుడును గుండెలు కొట్టుకొనుచున్నవి చూడుము. అరణ్యరోదనంబుగా నేన న్నింతశోకించినను నామొర వినువారు నోదార్చువారు లేకపోయిరి. నాకు నేనయుపశమించుకొని యొంటిమై నింటి కరుగ నిచ్చలేక చచ్చుటయే మేలని నిశ్చయించి యప్పంచాననమే నన్ను గూడఁ బట్టుకొని చంపునని నిశ్చయించి దానిజాడ నరయుచుఁ గొంతతడ వయ్యడవిలోఁ గుమ్మరితిని.

అప్పుడొకచోట నొక కంటక లతాగ్రమ్మునం దగులుకొని వ్రేలాడుచున్న పత్రికయొకటి గనంబడినది. అది యేమియోయని

దానినందుకొని విప్పిచూడ నందు "మిత్రుఁడు బహుశ్రుతునికి నమస్కారములు. నేను సింహభయంబునం జెట్టెక్కి యందొక్క పక్షి రెక్కలలోఁ జిక్కుపడిన నదినన్నెక్కడికో యెత్తుకొని పోవుచున్నది. దైవమీరీతి మనకు వియోగము సంఘటించెను. నన్ను మనంబున నెప్పుడును స్మరించుకొనుచుండుము. నీనుక్కువ మఱపురాదు. మిత్రుఁడు విక్రమసింహుఁడు" అని వ్రాయఁబడియున్నది. దానిఁ జదివినంత నీవు బ్రదికియుంటివిగదా యని కొంత ధైర్యము తెచ్చుకొని మనుష్యునెత్తుకొని బోవునంత బలముగలపక్షి యెద్దియోయని యూహించుచు భవదీయ దర్శనాశంజేసి మరణనిశ్చయంబువిడిచి ప్రాంతంబులఁగల పల్లెలకరిగి యాపక్షి విశేషం బడిగిన నందొక వృద్ధకిరాతుం డిట్లనియె.

అయ్యా! ఆపక్షి యెద్దియో దానిపేరు మాకుఁ దెలియదు. అది సంవత్సరమున కొకసారి యీయడవికివచ్చి రెండుమూఁడు దినంబులిందుగల సాలవృక్షముపయి వసించి యేగుచుండును. అది బహుకాలమునుండి యట్లె మాసపక్షదివసంబు లతిక్రమింపక యేకరీతి వచ్చుచున్నయది. అది క్రూరమైనదికాదు మనుష్యులఁజాలకనగా మోచుకొనిపోవునంత బలముగలిగియున్నదని దాని వృత్తాంత మెరింగించినంతఁ గొంత సంతసించి యదిమరల వచ్చుదివసంబడిగి తెలిసికొని క్రమ్మర నీవాపక్షితో వత్తునేమోయనునాసచే నింత దనుక భగవంతుని నారాధించుచుఁ గందమూలంబుల నాఁకలి యడంచుకొని జడదారివ్రాలె నీయడవి సంచరించుచుంటిని. ఈదినం బుదయమున నదివచ్చునని వినియుంటినిగాన దానిం బరీక్షించి నీవు రానిచో నొడలు విడువఁదలచియే యీసాలవృక్షముకడ కరుగుచున్నవాఁడ.

ఈదినం బెంత సుదినమో నిన్నుఁ జూడఁగంటి. ఇదియ మదీయ వృత్తాంతమనుటయు వాని విశ్వాసమునకుఁ దెలివికిని మిగుల మెచ్చుకొనుచు విక్రమసింహుఁ డన్నా! అదినరియేకాని నీమాటలలో

నమృతము సోకినట్లు నాచీనుల కనుకూలములగు వాక్యములు కొన్ని వినంబడినవి. పురుషద్వేషిణి విహారసరోవరంబుగంటినంటివి. ఆవా ల్గంటియున్న పట్టణదిూపాంతమున నుండఁబోలు. ఆప్రియాలు మిన్నను నాకుఁగూర్చి మున్నుపట్టిన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనవా ? యనిన నతండు చాలు చాలు. ఈయాపదలతో నింటికరుగరాదా? యాపైదలి నామము వినినంత భయమగుచున్నది. దానిం బెండ్లి యాడుట సులభసాధ్యముకాదు. పెక్కిడుములఁ బడవలసివచ్చును. ఈపాటి కింటికరిగి మనకై చింతించుచున్న తలిదండ్రుల చింత యుడిగించి సుఖంబున రాజ్యము సేయుదమనిన విని విక్రమసిం హుఁడు మోమున విన్నదనంబు దోఁప నిస్పృరని యిట్లనియె.

అయ్యో! నాకాతొయ్యలింగూడక ప్రాణంబులు నిలుచునా? విదేశములోఁ గూడ నాస్వాంతమాకాంతమీఁదనే యున్నది. ఆ చిన్నది యున్న తావెఱింగియు విరాగవచనంబులు బలుకుచుంటి వేమి ? వెనుక జెప్పిన మాట మరచితివా ? ఆవాల్గంటింగూడక నేనింటికిరాను. నాకు రాజ్యమును గీజ్యమునుగూడ నక్కరలేదని యనేకవిధంబుల విలాపింగుందుచున్న యారాజనందను నోదార్చి బహుశ్రుతుం డిట్లనియె.

విక్రమసింహా! మిగుల నిడుములు గుడిచితిమిగాన విరాగ బుద్ధి నిట్లంటిని. నీవు జింతింపకుము. తృటితో నీకు నాకుటిలాలకం గూర్తు నమ్ముంచుఁబోడి విహరించు జలాకరము వీక్షింతువుగాన పోదమురమ్మని యతని వెంటఁబెట్టుకొని యాసరసిదరి కరిగెను. దానింజూచినతోడనే విక్రమసింహునకుఁ బురుషద్వేషిణిం జూచి నట్లయొడలు పులకరింప స్వాంతమున మిగుల సంతసము గలిగినది.

---

# పురుషద్వేషిణికథ.



ఇంతలోఁ బురుషద్వేషిణి జలకేళిఁ దేల వచ్చుచున్నదనియు బురుషులు దూరముగాఁ బోవలయుననియుఁ జాటించు ధ్వనియొకటి వినఁబడినది. అదరిపడి వారు తత్తటాకతీరంబున దట్టముగా నల్లుకొని యున్న యొకచెట్టెక్కి దానికొమ్మలసందున డాగి యావిలాసవతి జాడ జూచుచుండిరి.

పిమ్మట స్త్రీలచే వహింపఁబడిన బంగారుపల్లకినెక్కి వేత్రపాణులై పెక్కండ్రు పల్లవపాణులు చుట్టును గొలిచిరాఁ జెలికత్తియలం గూడి యచ్చేడియ వేడుకతో నక్కొలనుదరికరిగి యందాందోళికము దిగి సఖులతో నత్తటాకంబున జలకేళిం దేలుచున్న సమయంబున నయ్యంబుజానన సోయగం బీక్షించి యామెవయస్యలొండొరులిట్లు సంభాషించుకొనిరి—

కలభాషిణి—మంజువాణీ! చూడుచూడు. జలంబుల వెల్లకితలంబడి యీదుచున్న పురుషద్వేషిణి కుచంబులకును, నెత్తామర మొగ్గలకును నంతరంబెఱుఁగ రాకున్నదిగదా?

మంజువాణి—ఔను. చూచుకంబుల నలుపు చిఱుతుమ్మెదలు వ్రాలినట్టున్నది.

భ్రమరవేణి—బోఁటీ! నీయుపమ సమంజసమే. నీటిపై వెల్లకితలంబడి తేలియున్న యాపోఁడియూలు మిన్న మోమెట్లున్నదో చెప్పుము.

కలభాషిణి—ఓసీ! ఆమాత్రము తెలిసికొనలేననుకొంటివా! తటాకజలంబునఁ బ్రతిఫలించిన చంద్రబింబమువలె నున్నది.

భ్రమర—మేలుమేలు. నాయూహతో నీయూహ యేకీభవించినది. కనుల నలమికొనిన కాటుక కళంకమువలె నున్నదిసుమీ!

మంజుభాషిణి.—ఈసారి గుబ్బలెట్లున్నవో చెప్పుము.

కలభా—మొగంబను చంద్రుని నాశ్రయింపనరుగు చకోర మిథునంబువలె నుండలేదా ?

మంజు—భళిరే కలభాషిణీ! మిక్కిలిచక్కనిపోలిక దెచ్చితివి

కల—మొగము గూడ నాకొకరీతి నగుపడుచున్నది. చూడుము.

మం—ఎట్లు.

కల—నాచుప్పైఁ దేలుచున్న కెందమ్మివలె శిరోజంబులపై నొప్పుచుండలేదా.

మంజు—నీవు మిగుల చతురవే, లెస్సగాఁబోల్చితివి మఱియు నరసి కలుషించిన కారణం బెఱింగితివా?

కలభా—ఎఱిఁగితిని. పద్మపాదయు, మకరజంఘికయుఁ నావర్తనాభియుఁ దరంగవళియుఁ, గోకస్తనియు, మృణాళభుజయు, నిందీవరనేత్రియు, శైవాలకేశయునగు నీకు శేశయపాణి యాయాయవయవంబులఁ దన్ను నిరసించుచున్నదని కాదా.

మం—చెలులారా! సర్వావయవ సుందరయగు నీసుందరి యరణ్యకౌముదియుంబోలె తన జవ్వనమంతయు వృథసేయుచుఁ బురుషులయెడ ద్వేషించు కారణమెద్దియో యరసితిరా?

సఖులు—మాకును దెలియదు. పెక్కుదినములనుండి తెలిసికొనవలయునను తాత్పర్యము గలిగియున్నది.

మం—అడిగి తెలిసికొందమా ?

భ్రమ—అమ్మయ్యో! ఆమెయొద్ద పురుషులమాట తలపెట్ట నెవ్వరితరంబు.

మం—మన మడిగినను గోపము సేయునా?

కల—యుక్తిగా నడిగినచో మనకుఁ జెప్పకమానదనుకొందును.

భ్రమ—అందులకు సమర్థురాలు మనమంజువాణియే.

మంజు—నేనేయడిగెదను రండి. భయమూయేమి యని యం
దఱు నామెయొద్దకరిగి సఖీ! నీళ్ళు చల్లుట మానుము. కొంచెమునీతో
మాట్లాడవలసిన పనియున్నది.

పురుషద్వేషిణి—సఖులారా! ఇంతలో నాయాటనుమాన్పఁ
దగిన పనియేమివచ్చినది?

మంజు—మఱియేమియును లేదు. సమదుఃఖసుఖులమగు మా
తోఁజెప్పఁదగని రహస్యముండునా.

పురు—మీకు నుడువరాని యేకాంతము నాకేమియును లేదే

మంజు—అట్లైన వినుము. నీవు లోకపరిపాటిస్త్రీలవలెఁగాక
విరుద్ధంబగు వ్రతము బూని సుఖోచితంబగు కాలంబంతయు నూరక
గడపుచుండుట కెంతయు మాస్వాంతములు చింతిల్లుచున్నవి. కార
ణంబెద్దియేని కలిగిన నుడివి మాచింతఁ బాపవేడెదము.

పురుషద్వేషిణి—ఓహో! ఇదియా మీప్రశ్నము (అని తల
వాల్చి యూరకొనును.)

మం—చెలీ! ఏమి తలవాల్చుకొని యూరకుంటివి. నేనిట్లడి
గితినని కోపమా?

పురు—దానికేమి, పోనిమ్ము, వాలాడికొందుము రండు.

మంజు— మన యాటలును, పాటలును, నీటులునుజూచి
సంతసించువారెవ్వరు?

పురు—మనకు మనమే సంతసింతము. ఒరులసంతోషముతో
మన కేమిపని.

మంజువాణీ—అయ్యో! స్త్రీవిలాసము పురుషుని, బురుష
విలాసము స్త్రీని సంతోషపెట్టునుగాని తనవిలాసము తన కెన్నఁడు
నానందము గలుగఁజేయదు.

పురు—ఇస్! అట్టిశబ్దము నాకుఁ గర్ణకఠోరముగా నున్నది.
ఏమిటి కుచ్చరించితివి?

మంజు — అదియేకాదా, నిన్ను మేమడుగుచుంటిమి. వారి యెడ నీకింత క్రౌర్యమేలకలిగెనో తెలుపుము.

పురుష — వారిమొగము జూడకపోవుటయేగాక వారితలంపు గూడ నామది కసహ్యాముగ నుండును.

మంజు — అయ్యో! వెఱ్ఱిదానివలెఁ బలుకుచుంటివి? మనతండ్రులు నన్నలు దమ్ములు బంధువులు మాత్రము మగవారుగారా? వారు హితులును పై వారలహితులునా?

పురు — (చెవులుమూసికొని) నాకందఱును సమానులే! నాకు జ్ఞానమువచ్చినతరువాత నాతండ్రిమొగముకూడఁ జూడలేదు.

మంజు — అట్టికారణము చెప్పినంగాని విడువము.

పురు — నాతలిదండ్రు లడిగినను జెప్పినదానఁగాను. ఆమాటలు నాకసహ్యాము.

మంజు — చెప్పకతీరదు. మేము తల్లిదండ్రులకన్న నెక్కువవారముకామా?

అప్పుడు పురుషద్వేషిణి బలవంతముమీఁద నిట్లు దనవృత్తాంతము జెప్పఁదొడగెను.

# రత్నాంగికథ



నాకు జాతిస్మృతి గలిగియున్నది. నేను పూర్వజన్మము నందొకరత్నవర్తకుని కూఁతురను. నాపేరు రత్నాంగి, లేకలేక కలిగితిని. మాతండ్రినన్ను గారాబముగాఁ బెనుచుచుఁ బ్రాయమువచ్చినంత కాంతివర్మయను వైశ్యకుమారునకిచ్చి పెండ్లిఁజేసెను. నేనును బెండ్లియైన కొలదిదినములకే, కాపురమునకు వెళ్ళితిని. నామగండు మంచి కుటుంబములోనివాఁడేకాని సహవాసదోషంబుననో పూర్వకర్మంబుననో జూదరియై తిరుగుచుఁ గ్రామంబునఁ దాతతండ్రులు

సంపాదించిన సొమ్మంతయుఁ గర్చుపెట్టఁ దొడంగెను. నేనును బెక్క-సాధులట్టి పనికూడదని బోధించితిని. నాబోధ వానియెడ నుపచరించినదికాదు. ఇంటిలో ధనమంతయు వ్యయమైన వెనుక నొకనాఁడు జూదంబునఁ దాకట్టుపడియున్నవానిని నాయొడగి నగలిచ్చి విడిపించితిని.

అప్పటికైన సిగ్గులేక నామె త్తతనము గనిపెట్టి నాకు మాతండ్రి యిచ్చిన సొమ్మంతయు నడిగిపుచ్చుకొని జూదంబున నోడిపోయెను. మఱికొన్ని దినంబులు ఋణముచేసి జూదంబాడెను. తుదకు దినఁగూడును గట్ట వస్త్రమును లేక మొగము వాచితిమి. అప్పులవారు నామగనిం బెట్టు నిర్బంధమునుజూచి సహింపక యొక్క-నాఁడు నేనతని వెంటఁబెట్టుకొని పుట్టినింటికరిగితిని. నాతండ్రి మాహీనస్థితి దెలియనివాడగుట మమ్ము మిగుల గౌరవించెను. అట్టి గౌరవముతోఁ గొన్నిదినంబులందుండి యొక్క-నాఁడు మగని నిమి త్తము బొంకి యతనితో నిట్లంటి.

నాయనా! మీయల్లుఁడు మిగుల భాగ్యవంతుఁడనువిషయము నీవెఱింగినదియేకదా! ఆయన యిప్పుడు సముద్రవర్తకము చేయనారంభించెను. కొన్ని దినములకిందట నోడమీఁద రెండులక్షలు వెలగల సరకులు విదేశమున కెగుమతిచేసెను. ఆయోడ యింకను రాలేదు. ఇక్క-డఁ గొన్నిసరకులు గొనవలసియున్నది. కొంతసొమ్ము బదులిచ్చినచో వడ్డితో వెంటనే తీర్పించెదను. ఈపాటి యుపకారము మల్లునికిఁ జేయనోపుదువేయని యడిగిన నామాటలకు సంతసించి యతండు తల్లీ! మీరుమాత్రము నాసొత్తుదిన నర్హులుగారా? నాకు మరల నియ్యనక్క-రలేరు. అవసరమున్న సొమ్ము తీసికొనిపొండని యుత్తరముజెప్పెను.

ఆమాట నామగనిలో రహస్యముగాఁజెప్పి మరల జూదమాడకుండునట్లును, నదివరకున్న ఋణములనుదీర్చి మిగిలిన సొమ్మున యథోచితవ్యాపారములు చేయునట్లును నతనిచే ముమ్మారు ప్రమాణికము చేయించి నాతండ్రియొద్దఁ గొంతసొమ్ము తీసికొని యతని

కియ్యక నాయొద్దనేయుంచుకొని వానితో మరల నత్తవారియూరి కరుగుచుంటిని. ఆదుర్మార్గుడేమిచేసెనో చూచితిరా?

నేనావిత్తము స్వేచ్ఛావిహారమున కీయనని యూహించి మార్గంబున నొక యగాధమందు నూయిగనంబడిన దానివింతనాకుఁ జూపించువానివలె నభినయించుచు నేను దానిలోనికిఁ దొంగి చూచు చుండ నారెండుపాదంబులునెత్తి నన్ను దానిలోఁబడద్రొబ్బి యా ధనంబంతయుఁ దీసికొని యింటికరిగెను. దుష్టులకుఁ జేయరాని కృత్యములుండునా? కూపంబునంబడినతోడనే దైవకృపచే నీటి మట్టమున గోడలో మొలచిన మఱ్ఱిమొక్క యొక్కటి నాచేతికి దొరకినది. దానియాధారమున నీటిలో మునుఁగక తేలియుంటిని. ఇంతలో బాటసారులెవ్వరో యాత్రోవంబోవుచు నీటికై వచ్చి యాబావియందుఁ దేలి కొట్టుకొనుచున్న నన్నుఁజూచి "మనిషి మనిషి" యని యఱచుచు నతివేగంబునఁ బగ్గంబులును గెడలు ఁకూతగానిచ్చి మెల్లననన్నుఁబైకిఁదీసిరి. సముద్రంబు వెడలివచ్చు లక్ష్మీయుంబోలె నొప్పుచున్న నన్నుఁజూచి యాపుణ్యాత్ములు విస్మయ మందుచు నావృత్తాంతమడిగి తెలిసికొని మాతండ్రి ప్రసిద్ధి యంతకు మున్న వినియున్నవారగుట మిగుల నాదరముతోఁ గొనిపోయి నన్ను మాతండ్రి కప్పగించిరి.

నాతండ్రి నాయవస్థకు మిగులఁ బరితపించుచు అమ్మా! నీమగండేమయ్యె. నూతిలో నేఁటికిఁబడితివి? నేను మీకిచ్చిన ధనము సురక్షితముగా నున్నదా! యని యడిగిన నేనొక్కింతచింతించి నిజము చెప్పిన గాపురము చెడునని యూహించి యిట్లంటి. నాయనా! నేనును మీయల్లుఁడును ధనంబుగొని యిచ్చటినుండి మాయూరి కరుగుచుండ నడుమ నడవిలోఁ గొందఱుదొంగలువచ్చి మా ధనం బంతయు దోచుకొనుటయేగాక మీయల్లునిఁ బారఁగొట్టి నన్ను నూతిలోఁ బడద్రొబ్బిపోయిరి. నేనును దైవప్రేరితులగు మార్గస్థుల కరుణను నిన్నుఁ జేరితిని.

నాపతియు నూరుజేరి యుండవచ్చును. ఆయన నాకై తొట్రుపడుచుండును వేగ నచ్చటి కరుగవలయునని ప్రయాణంబునకుఁ దొందరపడుదానివలె నభినయించుచుఁ దండ్రి నిర్బంధమునఁ గొన్ని దినంబులుండి యొకనాఁడు నామగనిం జూడఁ బోయెదనని మాతండ్రితోఁ జెప్పితిని. అతం డందులకు సంతసించి మరలఁ గొంతధనం బిచ్చి నన్నత్తవారింటి కనిపెను.

నాపల్లకీబోయెల నాదము వినినతోడనే నామగఁ డెద్దియో యనుకొని వాకిటకువచ్చెను. నేనును బల్లకిదిగి యెదురనున్న పతికి నమస్కరించి లోనికరిగితిని. నన్నుజూచినంత యతఁడు విభ్రాంతుఁడై యేమియుననలేక నిలుచున్నంతఁ దత్కాలోచిత వాక్యంబులచే నతని దిగులువాపి పూర్వమువలె ననురాగముతోఁ గాపురము జేయుచుంటిని. నన్నవమానపరచి తెచ్చిన ధనమంతకుమున్నే జూదంబున నోడిపోయెను. ఎప్పటి దారిద్ర్యముతో నొప్పుచున్న వానిదైన్యమునకు మనంబునఁ బెక్కుగతులం జింతించుచు, నెప్పటికైనను బుద్ధి వచ్చునేమోయని యప్పుడప్పుడు కొంచెము ధనసహాయము చేయుచుంటిని.

పాములకుఁ బాలుపోసినను విషమేయగు ననునట్లునా జేయు ధనసహాయమువలన నతనికి విపరీతబుద్ధి పుట్టినది. నేనుపుట్టింటనుండి మిగుల ధనము తెచ్చితిననియుఁ దనకుఁ జూదమాడుటకు నియ్యనని యుఁ దలఁచి యొక్కనాఁడు నేను నిద్రించుచుండ దయావిహీనుఁడై కటికివాఁడు పసువుంబలె నాగొంతుదరిగి చంపెను. నేను బలవన్మరణము నొందియుఁ బాతివ్రత్య విశేషమహిమం జేసి యిట్టి యుత్కృష్ట జన్మమెత్తి జాతిజ్ఞానముగలిగి యుంటిని.

ఎట్టి యుపకారము జేసినను మనంబున నిడికొనక యెన్నో గతులఁ దన్నాశ్రయించుచుండ నాయెడ నొక్కించుకేని యక్కటికము ముంచక నన్నుం బరిమార్చెను. వానిక్రూరత్వము వింటివిగద! సీ! వానినొక్కని నలనేల? యాజాతియందట్టి క్రౌర్యము గలిగియు

న్నది. ఇచ్చకపుమాటలచే మత్తకాశినుల చిత్తవిత్తంబులు హరించి మోసపుచ్చుచుందురు. నాకట్టి దొల్లింటి తెలివిగలిగియున్నది. వాడుఁ చేసిన మోసంబునకు మనంబున నీసుజనింప నాజాతియే చెడుజాతి యని నిరసించి యిట్టియుత్కృష్టవ్రతంబు బట్టితిని. మీరు నాకుఁ బ్రాణతుల్యులుగాన నింతవట్టు శమించి యెఱింగించితిని. ఇఁక నెన్నఁడు వారిప్రస్తావము నాచెంతఁ దేరాదు. తెచ్చినచో క్షమింపక శిక్షింప నియమింతునని కన్ను లెఱ్ఱఁజేసి యుగ్రంబుగాఁ బలికినది. అక్కలికి పలుకుల కులికి వారేమియు ననక యామె యానతి కొడఁబడిరి. పిమ్మటనాకొమ్మయు చెలులతో మరలఁగొంత సేపు జలకేళింజేలి యప్పూఁబోఁడులు సేవింప నెప్పటియట్ల నిజని వాసంబున కరిగినది.

పిమ్మట విక్రమసింహుఁ డమ్ముంచుబోఁణిజూచినది మొదలు పంచేంద్రియ వ్యాపారంబులు నయనేంద్రియ మంద ప్రసరింప నన్య మెఱుఁగక తదీయరూపవిభ్రమవిలాసంబులు వర్ణించుచు నాచిన్నది యరిగినప్పుడుసైతము వానిమనంబుఁగన్నుల వెంబడి నాయండజ యాన వెన్నంటి యరిగెను. అయ్యతివ ప్రతిమఁ జూచినప్పుడే మోహపరవశుండైన వాఁడు నిజమైనయాకృతిఁజూచినప్పుడు వివ శుఁడగుటయక్కజము కాదు.

బహుశ్రుతుండును నాపాటలగంధులు మాటలాలించుచు నాటలంజూచుచుఁ దదీయవిలాసంబంతయుం గాంచియు నప్రమత్తుఁడై యామానినులరిగిన పిమ్మట మెల్లన చెట్టుదిగి విక్రమసింహుని దిగు మని పలికిన నతఁడొడలెఱుఁగక చెట్టుకొమ్మసందున చిక్కుపడి దిగకుండుటకు వెరగందుచు బహుశ్రుతుఁడు మరలజెట్టెక్కి యెట్ట కేలకు వానిఁబ్రబోధితునిఁజేసి బలాత్కారంబుగఁ జెట్టుదింపించెను.

అప్పుడు విక్రమసింహుఁడు తెలివితెచ్చుకొని విరహతాపము తో అన్నా! పురుషద్వేషిణి యెటఁదేగినది ఇప్పుడునన్నాసుందరిం జేర్పుము. యోహో! యామోహనాంగిసోయగం బీక్షించితివా? అది

యంతయు నాకొక కలగానున్నదిసుమీ! నిజముగా కలయేకాదుగద. కాదు. అదిగో! ఆముద్దులగుమ్మ జలకేళిం దేలిన కొలను కనఁబడు చున్నది. ఆచిన్నదానింగూడక నాప్రాణంబులు నిలువవు వేగ నట్టి ప్రయత్నముచేయు నీపాదంబులకిదే మ్రొక్కుచున్నవాఁడనని యడుగులంబడిన బహుశ్రుతుఁడు వానిలేవనెత్తి నవ్వుచు ఆహా! మేటిధైర్యశాలివే. మాటిమాటికి నింత తొందరపడినచోఁ గార్యములు సమకూరునా? ఆచేడియ లొండొరులాడుకొనిన మాటలాలించితివా? యని యడిగిన నతండన్నా! అప్పుడు నాచిత్తం బమ్మత్తకాశినీ విలాసవర్ణనాయత్తంబై యున్నదిగాన వారిమాటలలో నొక్కటియు వినఁబడినదికాదు. ఏమేమి సంభాషించుకొనిరో తెలియఁజేయుమని వేడిన బహుశ్రుతుండు నాపూవుఁబోఁడు లాడుకొనిన మాటలన్నియుఁ జెప్పి మిత్రమా! నీవు చింతింపకుము. నీకార్యము సులభమార్గమున సాధించెదరమ్మ. ఆపురుషద్వేషిణి యున్న పురంబునకుఁ బోదమని యతని తాపంబు గొంతయుడిగించి వానితో సాయంకాలమున కాపట్టణంబు జేరెను.

వారిరువురు నందొక పూటకూటి పెద్దమ్మయింటబసఁ జేసి దానికెల్లరు నిచ్చుదానికన్న నెక్కుడు రొక్కంబిచ్చి భుజించిన వెనుక అమ్మా! ఈయూరివింత లేమని యడిగిన నామె వారికిట్లనియె. అయ్యలారా! వింతలకేమిగాని యొకటివినుండు. భానుమంతంబను పేరంబరగుచున్న యీయూరు భానుమంతుండను రాజు పాలించుచున్నవాఁడు. అతనికిఁ బురుషద్వేషిణి యని సార్థకనామముగల కూఁతురుగలదు. ఆచిన్నది పురుషులంచూడదు. నిత్యమును బ్రొద్దుట జలకేళిం దేలనూరిబయలనున్న విహారసరోవరంబున కరుగుచుండును. అప్పుడువీథిలోఁ బురుషులునిలిచినచో రాజభటులు శిక్షింతురు. ఎన్నఁడును బ్రొద్దుట వీథిలోని కరుగకుఁడీ యని చెప్పిన విని మరల వారమ్మా! యమ్మానినికి పెండ్లియైనదియా యని యడిగిరి. దానికా పెద్దమ్మ నవ్వుచు నోహో! గొడ్రాలా! నీకెందఱు బిడ్డలని యడిగి

నట్లు ఆమగువ మగవారిమొగమే చూడదని చెప్పుచుండఁ బెండ్లి యైనదాయని యడిగితిరి. వేయేల ? ఆబాల తండ్రినిగూడ చూడ దనియె. మరల వారు అవ్వా! అవ్వనిత యట్టిఁ యుగ్రవ్రతము బూనుటకు హేతువెద్దియో తెలియునా యని యడిగిన నాకారణము నాకుమాత్రమేగాక దాని తలిదండ్రులకు గూడ తెలియదని యుత్తరము జెప్పెను.

వారట్లు కొన్నిదినంబు లామెయింటనుండి తమవెంట గొని వచ్చిన వజ్రపురవ్వలు పెక్కురొక్కమునకు మార్చి యాపట్టణము నకుఁ జేరియేయున్న విశాలంబగు పొలమొకటి వెలకుఁదీసికొని గృహ నిర్మాణ దక్షులగు పెక్కండ్రు శిల్పపుపనివాండ్రు రప్పించి శీఘ్ర కాలంబుననే బహుసౌధవీథీమనోహరంబగు నొకపురంబును నప్పు రాంతరంబున నొకకోటయుఁ బురబాహ్యోద్యానవనంబున కేళీ సరోవరంబును నిర్మించిరి. మఱియు నాయూరిలో భవంతులన్నియుఁ గాపురముండ జనులకు నుచితముగా నిచ్చి ధనసహాయము చేయు చుండిరి. అప్పురంబంతయు స్వల్పకాలములో బహుజనాకీర్ణమై యొప్పినది.

విక్రమసింహునకు వనితాద్వేషి యను పేరుపెట్టి యతని రాజుగాఁజేసి బహుశ్రుతుఁడు మంత్రియై శుభముహూర్తమునఁ గోటలోఁ బ్రవేశించి కొంత సైన్యమును గూర్చుకొని పెక్కండ్రకు నుద్యోగంబులిచ్చి వారిరువురు రాజచిహ్నముతో నాగ్రామంబు పాలింపదొడంగిరి.

విక్రమసింహుడు సింహాసనమెక్కిననాఁడే యాపురంబువనితా ద్వేషిమహారాజు పాలించుచున్నవాఁడనియు నాయన ప్రతిదినంబు నుదయమునఁ గేళీసరోవరంబున కరుగుచుండుననియు నప్పుడు స్త్రీ లెవ్వరు బయటకు రాఁగూడదనియు వచ్చినవారు శిక్షింపఁబడుదు రనియుఁ బ్రకటన పత్రికలవ్రాయించి యాయూరి యిండ్లగోడల కంటింపజేయుటయేగాక పురుషద్వేషిణి యున్నపురములోఁగూడ వ్యాపింపఁజేసిరి.

నిత్యమును పూర్వదివసంబున వనితాద్వేషిమహారాజుగారును బెక్కుసైన్యము చుట్టును గొలిచిరా స్త్రీలు దూరముగాఁ బోవలయునో యనుచాటింపు ముందువెలయ నించుమించుగాఁ బురుషద్వేషిణి బయలుదేఱువేళకే బయలుదేఱుచుఁ గేళీసరోవరంబున కరిగి కొంతసేపందు జలక్రీడలనాడి మధ్యాహ్నమున కింటికి వచ్చుచుండును.

పురుషద్వేషిణియుఁ దనవిహారదీర్ఘికకు వనితాద్వేషిమహారాజుగారు కొత్తగాఁగట్టిన యూరుమీఁదుగానే యరుగవలయును గాననప్పుడట్టి చాటింపువిని వెరఁగుపడుచు నెదురుపడకుండ మారుత్రోవను బోవుచుండును. అట్టి చాటింపులు రెండునువిని వనితాద్వేషి వచ్చునప్పుడు స్త్రీలును బురుషద్వేషిణి వచ్చునప్పుడు పురుషులును జాటున కరుగుచుండ నట్టిబాధలు పడలేక నొక్కనాఁడా యూరి ప్రజలు రాజునొద్ద కరిగి యిట్లు చెప్పుకొనిరి.

మహారాజా! ఇదివరకే తమకూఁతురు స్నానార్థమరుగుచుండ వీథులయందెట్టి యగత్యపుపని చేయుచున్నను మగవారు వానినివిడిచి తటాలున లోనికరుగవలసివచ్చుచున్నది. పులిమీఁదపుట్రయనునట్లు మగవారికేగాక యిప్పుడు స్త్రీలకుఁగూడ నట్టి యుపద్రవము వచ్చినది. వనితాద్వేషియనుపేరు పెట్టుకొని యెవ్వరో యీయూరిబైట నొకగ్రామము కట్టుకొని యచ్చటస్త్రీలను బైటకు రానీయక బాధించుచున్నారు. మన పురుషద్వేషిణి పురుషులన్న నెంతయలుగునో యాతండు స్త్రీలమాటఁ దలపెట్టినంత నంతకు నిబ్బడిగా నలుగుచుండునఁట. వారిరువురవలన నీయూరి స్త్రీపురుషులు కాపురము సేయనోపరు. బాధ లుడిగింతువేని యుందుము లేనిచో నెక్కడికేని లేచి పోయెదమని మొరపెట్టుకొనిన పౌరులతో నానృపతి యిట్లనియె. ఔను. ఇదివరకే యీరాజకుమారుని విపరీతచర్యలు వినియుంటిని.

మీబాధలుడిగించెదఁ జింతింపకుఁడని వారినోదార్చి యంపి యప్పుడ యొక్క పరిచారకుని, సగౌరవముగా నొకయుత్తరము వ్రాసియిచ్చి వనితాద్వేషిమహారాజునొద్ద కంపెను. వాఁడాచీటింగొనిపోయి బహు శ్రుతునితోఁ గూడఁకొని కొలువున్న విక్రమసింహుని కిచ్చెను. బహు శ్రుతుఁడు దానిం బుచ్చుకొని చదివి వేరొక్కచీటి యిట్లువ్రాసెను.

అయ్యా! తమరువ్రాసినయుత్తరమందినది. అందలిసంగతులు బోధపడినవి. మావనితాద్వేషిమహారాజుగారి నొకసారి యచ్చటికి దయచేయుమని కోరినందుల కెంతయు సంతసించి యాయన యట్టి ప్రయాణమున కాజ్ఞయిచ్చియున్నారు. మారాజుగారి వృత్తాంతమంతయు నిదివఱకే మీరువినియుండవచ్చును. ఆయన వచ్చునప్పుడు వీథులలో స్త్రీలుండకుండునట్లును, మీ సభలోనికి నాడువారిని రానీయనట్లును, నాజ్ఞచేసితిమని జాబువ్రాయించిన తక్షణము బయలుదేరి వచ్చుచున్నారు. అనివ్రాసి యారాజభటుని చేతికే యిచ్చి యంపి యట్టి యొడంబడికతో నుత్తరమురాగానే, బహుశ్రుతుండుఁ గొన్ని రహస్యములు విక్రమసింహునకు బోధించి పెక్కండ్రు వీరభటులు వేత్రహస్తులై యిరువంకల నలంకరింప నతని బంగారుపల్లకి నెక్కించి తానుదోడ నడుచుచు స్త్రీలు దూరముగాఁ బోవలయునో యనుచాటింపుతోఁ బౌరులాశ్చర్యపడి చూచుచుండ నతండు రాజసభ కరిగెను.

ఆవింతజూచుటకై యంతకుమున్న యారాజు పౌరులకును సామంతులకును, మఱియుఁ బెక్కండ్ర పెద్దమనుష్యులకును వార్త పంపియున్నవాఁడు. వారందఱువచ్చి సభ నలంకరించిరి. పురుషద్వేషిణియుఁ జెలికత్తెలవలన నావృత్తాంతమాలించి యతం డట్టివ్రతము పట్టుట కేమికారణము చెప్పునో వినవలయునని యాసభాభవనపు గోడ ప్రక్కకువచ్చి సఖులతోఁ గూర్చుండియుండెను. ఆ రాజును విక్రమసింహున కెదురేగి మంత్రితోఁ దోడితెచ్చి సాదరముగానుచిత

పీఠంబులఁ గూరుచుండఁబెట్టెను. అందఱును గూర్చున్నతర్వాత గొంచెము సేపాసభ చిత్రితమైనదివోలె నిశ్శబ్దమైయుండెను. అప్పుడు రాజశాసనంబున లేచి యతనిమంత్రి విక్రమసింహుఁడు విన బహుశ్రుతునితో నిట్లనియె.

ఆర్యా! ఆదిని సృష్టికర్త తనశరీరములో నెడమభాగము స్త్రీనిగాను కుడిభాగము పురుషునిగాను జేసెను. అమ్మిథునంబువలననే ప్రజావృద్ధియైనట్లు మనపురాణములు చెప్పుచున్నవిగదా? ఇదియునుంగాక త్రిమూర్తులును భార్యలను శరీరమునందే ధరించుకొనియున్నారు దానింబట్టి చూడ ప్రతిపురుషునకు భార్యయుండవలసిన విధి గనంబడుచున్నది. తెలివిమాలిన యబలలెవ్వరేనిఁ బట్టినం బట్టుదురుగాని మీరాజుగారు ప్రజాసృష్టి ప్రధానహేతుభూతంబగు స్త్రీజాతియందుఁ బగబూని వ్రతంబుఁ బట్టుటకుఁ గారణము తెలియకున్నది. అట్టిహేతువు వినుతాత్పర్యముతో మారాజుగారు మిమ్మిందులకు రప్పించిరి. ఆవివరం బెఱింగించి మామనంబులంగల సందియం బుడిగింపుఁడని యడుగునంత నితాంతకోపంబునఁ గన్ను లెఱ్ఱఁజేయుచుఁ జెవులుమూసికొనియున్న విక్రమసింహుని శాంతిపరచుచు బహుశ్రుతుండు మరల వాని కిట్లనియె. ఆర్యా! ఈరాజు స్త్రీప్రసంగము సహింపనోపఁడు. అట్టిమాటలఁ దలపెట్టినచో నెట్టిహితులనైన నహితులుగాఁ జూచుచుండును. జ్ఞానమువచ్చినదిమొద లిట్టివ్రతము పట్టియున్నవాఁడు. దానికారణమడిగి నేనును పెక్కుసారు లవమానింపఁబడితిని. ఇప్పు డందఱు గోరియడుగుచుండఁ జెప్పకునికి మంచిపరిపాటిగాదు. అడిగిచూచెదనని యతనిదిక్కు మొగంబై యడుగుటకును భయపడువానివలె నభినయించుచు నల్లన నిట్లనియె.

దేవా! ఎట్టిరహస్యమైనను పదుగురు పెద్దమనుష్యులుగూడి యడిగినప్పుడు దాచక చెప్పవలయునని బృహస్పతినీతిలో నున్నది. మఱియు వీరు మిమ్మిట్టి యుగ్రవ్రతముపట్టుటకుఁ గారణమడుగుచుండిరికాని వ్రతము మానుకొనుమని చెప్పుటలేదు. తమ యంతరంగ

మున కట్టిప్రసంగము సంతోషభంగమైనను సహించి తత్కారణం బెఱుఁగగోరుచున్న యీసభాసదుల మదులకామోదము గలుగఁ జేయుఁడని యడుగుటయు, గోడమాటునుండి యామాటలవినుచున్న పురుషద్వేషిణి యారాజకుమారుని యభిప్రాయము తెలిసికొనవలయు నని నభిలాషగలిగియున్నది. గానఁ జేసన్నలచే సఖులరొద చేయవల దని వారించుచు నతండేమి చెప్పునో యని చెవియొగ్గి వినుచుండెను.

అప్పుడు విక్రమసింహుఁడట్టకేలకు మోముపైకెత్తి విధిలేక చెప్పువాఁడుంబలె నెల్లరువిన నిట్లనియె. సభ్యులారా! నేను పూనిన వ్రతంబు సకలలోకవిరుద్ధంబైనను నాచెప్పఁబోవు వృత్తాంతము విని నచో మీకు యుక్తమేయని తోఁచకమానదు. నాకు జాతిస్మృతి గలిగియున్నది. వినుండు. నేను పూర్వజన్మమందొక వర్తకుని కుమా రుండ నాపేరు కాంతివర్మ. నాకు యుక్తవయస్సు వచ్చినప్పుడు మా తండ్రి పెక్కురు వరదక్షిణలతోఁ గన్యనిత్తుమని వచ్చినను నంగీకరిం పక రూపమునకు నాశపడి యొకరత్నవర్తకుని కూఁతురు రత్నాంగి యనుదానిం బెండ్లి జేసెను.

అది పెండ్లియైన కొలదికాలముననే కాపురమునకు వచ్చినది. “భార్యారూపవతీశత్రుః” అనునట్లు దాని చక్కఁదనమే నాదుఃఖము నకు మూలమైనది. దాని దుర్గుణములగురించి యెన్నియో నీతులు చెప్పి మందలించితిని గాని నాబోధ యేమియు దానిమది కెక్కినది కాదు. నాతలిదండ్రులు నాభార్య కాపురమునకు వచ్చినవెంటనే చనిపోయిరి గాన నింటిపెత్తనమంతయు దాని యధీనమేయైనది. అది సొమ్మంతయు దుర్వ్యయముచేయుచు స్వల్పకాలములోనే నన్ను ఋణస్థునిగాఁ జేసెను. ఒకనాఁడది నేను వలదని యెన్నివిధములఁజెప్పి నను వినక తనపుట్టింటికి లేచిపోవఁ బ్రయత్నించిన నపకీర్తి భయ ముచే నేనును వెనుకొని యరిగితిని.

నేనుఁగూడ వచ్చుట యిష్టములేక మార్గమధ్య మందొక నూతిలోఁ దొంగిచూచుచుండ నన్ను బలాత్కారముగా నందుఁ ద్రోసి పుట్టింటి కరిగినది. దైవవశమున నందొకమత్తిమొక్క నా చేతికిఁ దొరకినఁ బట్టుకొని నీటిపై తేలుచున్న నన్నుఁజూచి యా దారినరుగుచున్న పుణ్యాత్ములు కొందఱు పైకిఁదీసిరి. క్రౌర్యమను నది స్త్రీజాతికి సామాన్యమేగదాయని యూహించి యప్పుడుగూడఁ గోపమువహింపక యత్తవారింటి కరిగితిని.

అందు నన్నుఁజూచినతోడనే విభ్రాంతయై తెలతెలపోవుచు నిలుచున్న యాతరుణి నెరుగనివాఁడువలెఁ బలుకరించి మంచిమాట లచే దాని దిగులువాపితిని. దాని చెడుగుణంబు లెన్నేని సహించి కొన్నిదినంబు లందుంటినిగాని నాయునికి యిష్టములేక యొకనాఁడు నేను నిద్రించుచుండ నన్ను గటికివాఁడు పశువుంబలె గొంతుదరిగి చంపినది. అట్లు బలవన్మరణము నొందియు నీతిమార్గముగా సంచ రించితిని గాన రాజునై పుట్టి పూర్వజన్మజ్ఞానము గలిగియుంటిని. ఎన్ని చెడుకృత్యములు చేసినను మనంబున నిడుకొనక పెక్కుగతులఁ దన్ననుసరించి తిరుగుచున్న నన్నెంతచేసెనో వింటిరిగద. సీ! దానినొక్కదాని నననేల. యాజాతియందె యట్టి క్రౌర్యము గలిగి యున్నది. “మధుతిష్ఠతి వాచి యోషితాం హృది హాలాహలమేవ కేవలం” అను వచనం బెఱింగినవారు స్త్రీలను నమ్ముదురా? తొలి జన్మమం దిన్నిపాట్లు పడితినిగాన నీజన్మమునందుఁ బెండ్లియాడనిచో నేకష్టము నుండదని యూహించి యిట్టి వ్రతమును పూనియుంటినని చెప్పుచున్న సమయంబునఁ నామాటలన్నియు గోడచాటుననుండి యాలించుచున్న పురుషద్వేషిణి తటాలున లేచి యొకగుమ్మము వెంబడి సభాంతరమున కరిగి సభ్యులెల్లరు విస్మయమంది చూచు చుండ విక్రమసింహునితో నోహోహో! నీతిమంతుఁడా! యేమి

మాటలు చెప్పుచుంటివి. చాలు చాలు. నీపూర్వోత్తర మెఱుఁగని వీరియొద్ద జక్కఁగా బొంకుచుంటివే! ఇప్పుడు నీవుచెప్పిన ఘోర కృత్యము చేసినవాఁడవు నీవా? నేనా? నీవుచేసి యెదురనామీఁద పెట్టుచుంటివా? ఈపాటి కూరకుండుమని యహంకారముఖముగాఁ బలికిన నక్కలికి పలుకుల కులుకువాఁడుంబలె గన్ను లెఱ్ఱచేయుచు నో రత్నాంగీ! మరల నాకిచ్చుటఁ దటస్థించితివా? నన్నిట్లు గద్దరించినచో వీరు నిన్ను ముద్దరాలనుకొందురనుకొంటివా ఏమి! అట్టి కూరకృత్యము నీవు చేయక నేనే చేసితినా? ఎట్టికూరులైనను మగవారట్టి సాహసములకుఁ దెగింతురా? ఇదియునుంగాక స్త్రీలకుఁ బురుషులకంటె సాహసమెక్కుడని చెప్పుగ్రంథములే సాక్ష్యములని పలికిన నతని నాక్షేపించుచు నాపద్మాక్షి బొంకులు పలుకువారికి సాక్ష్యముల కేమికొరంత. మేలుమేలు సాక్ష్యము లిప్పించి యానిందఁ బాపుకొనదలంచితిరిగాని యెట్లును నది మిమ్ముబాయదు. చేసితినని యొప్పుకొని పైన మాట్లాడుడనుటయు నతండు భళిభళి మంచి జాణవౌదు. నీదు మాటలకు మోసపోవుదు ననుకొంటివా? ఈగడుసు తనం బుడుగుము. నేరంబున కొడంబడుమనియె.

ఇట్లియ్యిద్దరును పెద్దతడవు శ్వానంబువలె మొఱగుచు హస్తం బులుసాచి నీవే నీవే యని పోరాడుచుండు సమయంబున సభ్యులును నారాజును విస్మయముతోఁ జూచుచుండిరి. అప్పుడు బహుశ్రుతుఁడు నవ్వుచు వారిరువురతగవులు వారించి యోహో! వృథవ్రతులారా! మీవ్రతములు జక్కఁగానున్నవి. ఇట్లూరక పోరాడ నేల. ఈసభ్యు లకు వివాదకారణం బెఱింగింపుఁడు. ఉత్తాపక్షంబు లుడిగి వీరే నేర మొకరియందు స్థాపింతురనుటయు నప్పు డాపురుషద్వేషిణి సభ్యుల దిక్కు మొగంబై ఆర్యులారా! యీతండు పూర్వజన్మంబున నామ గండు. ఇప్పుడు మీతో నితండు చెప్పినకథలో తాను జేసిన నేరము లన్నియు నామీఁద పెట్టి యబద్ధము చెప్పుచున్నాఁడు. అరత్నాం గిని నేనే. నేను నిద్రించుచుండ నన్ను బలాత్కారముగాఁ జంపెను.

ఆకోపముచేతనే నేనును పురుషులయెడ క్రౌర్యముబూని యిట్టివ్రతము బట్టితి. నేఁ జెప్పినదంతయు యథార్థమనిన విక్రమసింహుఁడును ఆర్యులారా! నాకీరాజపుత్రిక పూర్వజన్మమునందు భార్య. అప్పుడు నన్ను బలాత్కారముగాఁ జంపిన రత్నాంగియిదే దీనిమూలముగా నే నేయిట్టివ్రతము పట్టితిని. ఇది తానుజేసిన నేరము నామీఁద పెట్టుచున్నది. దీనిమాటల నమ్మవలదని పలికెను.

ఆ యిద్దరిమాటలనువిని సభ్యులేమియుఁ జెప్పలేక యొకరిమొగం బొకరు చూచుకొనుచున్న సమయంబున బహుశ్రుతుండు లేచి సభ్యులారా! వీరితగవునుగుఱించి నాకొక్క యూహ తోచుచున్నది. నేజెప్పినట్లు వినెదమని వీరొడంబడెద రేనిఁ జెప్పెదననుటయు నందుల కాచిన్నది యొప్పుకొనినపిమ్మట విక్రమసింహుఁడు నెట్టకేలకు నొప్పుకొనెను.

పిమ్మట బహుశ్రుతుండు అయ్యా! వీరిరువురు పూర్వజన్మమునందు దంపతులైనట్లును నొకరిచే నొకరికిఁబడక బలవన్మరణము నొందినట్లును వీరుచెప్పిన మాటలచేతనే తెల్లమగుచున్నదిగదా! వీరిలో నిజముగా నపరాధ మెవ్వరుచేసిరో తెలిసికొనుటకు మనవశంబుగాదు. వీరీజన్మమునందు మరల దంపతులై పూర్వవైరమును స్మరించుకొనక యొండొరులయం దత్యంతానురాగంబున మెలంగినచో దానికి నిష్కృతియగునని నాకుఁదోచుచున్నది ఇప్పటికి వీరొడంబడఁదగునని పలికినవిని పురుషద్వేషిణి యేమియుం బలుకక తలవాల్చుకొని విక్రమసింహునిం జూచినదిమొదలు వానియందు బద్ధానురాగయై యున్నదిగాన బహుశ్రుతుఁడు చెప్పిన తగవుకొంతయు స్వాంతంబున సంతసించుచు విక్రమసింహు డందుల కొడంబడునో యొడంబడడో యను సందియంబు మనంబున బాధింప దానొడంబడినయట్లు సూచించుచుఁ దండ్రిమొగంబుపై దృష్టిప్రసారంబులు బరగించినది.

ఆరాజు తదీయాభిప్రాయంబుగ్రహించి తానంతకుమున్న నొక్క దినములు పెండ్లి జేసికొమ్మని బ్రతిమాలినను వినక యప్పుడొప్పు కొని నందులకు మిగుల సంతోషించి బహుశ్రుతునితో అయ్యా! మాచిన్నది మీరు చెప్పిన యట్లొప్పుకొన్నది. మీరాజకుమారునిఁ గూడ నొప్పింపుఁ డనునంతలో నాకాంతకు సిగ్గెక్కుడనుండి వచ్చెనో మేనుగరుపొడువ దిగ్గున లేచి యంతఃపురమున కరిగినది.

బహుశ్రుతుండును రాజుగారితో అయ్యా! మారాజు పెండ్లి యాడుటకు సులభముగా నొప్పుకొనఁడు ఇంటియొద్ద నెమ్మదిగా బోధించి యొప్పించెద. ఇందులకు నేను పూటయని పలికినవిని రాజును సభ్యులును వారి వివాహమునుగుఱించి మిగుల సంతసించిరి. అంతటితో సభ చాలించి యెవరిబసకు వారరిగిరి. ఆపట్టణము లోని స్త్రీపురుషులు వారి వివాహవృత్తాంతము విని తమబాధ తగ్గెనని తమయిండ్లలోఁ బెండ్లియైనంత సంతోషము వహించిరి.

ఆరాజును శుభముహూర్తమున విక్రమసింహునకుఁ బురుష ద్వేషిణినిచ్చి యధికోత్సవముతో వివాహము గావించెను. విక్రమ సింహుఁడును బహుశ్రుతుని మతిచమత్కృతి గురించి పెక్కు తెరంగులఁ గొనియాడుచుఁ బురుషద్వేషిణితోఁ గొంతకాలమందుఁ గ్రీడా సౌఖ్యము లనుభవించి యొక్కనాఁడు బహుశ్రుతునిచే బోధితుండై భార్యఁగూడి చతురంగబలయుక్తముగా స్వదేశంబునకరిగినిజదర్శనా యత్తచిత్తులైయున్న తలిదండ్రుల చింతమానిపి పట్టాభిషిక్తుండై, పెద్దకాలము రాజ్యసుఖంబుల ననుభవించెను. గోపా! ఈచిత్రపట వృత్తాంతమిదియే. ఈరూప మాపురుషద్వేషిణిది. అని యెఱింగించి యయ్యతి వల్లభుండు శిష్యుఁడుచిత్తమని వెంటగా నెనిమిదవమజిలీ చేరెను.

---

శ్రీ ర స్తు.

ఎ ని మి ద వ మ జి లీ.

# కృ ష్ణ దే వ రా య ల క థ.

---

ఎనిమిదవ మజిలీయందుఁ గోపకుమారుండు భోజనసామాగ్రి దెచ్చుటకై యంగడకిఁ బోవుచు నొకయింటనున్న విగ్రహమును జూచి యాశ్చర్యపడి యప్పుడే క్రమ్మరనమ్మణిసిద్ధునొద్దకరిగి స్వామీ యొకయింటిలో ననల్పశిల్ప రచనాసమన్వితంబగు నొక విగ్రహ మునుఁ జూడగంటిని. అది శిలాదారు మృత్తికాదులచే రచియింపఁ బడినట్లు కనంబడదు. యథార్థపు పురుషునివలె నున్నది. ప్రాణము లేదు. దేవతావిగ్రహముకాదు. ఉత్సవములు చేయుచుందురు. దాని కథ యెవ్వరినడిగినను జెప్పలేదు. సర్వజ్ఞులైన మీవలన నావృత్తాం తము వినవేడుకపడివచ్చితి నెఱిగింతురేయని యడిగిన నాసిద్ధుండు నవ్వుచు నిట్లనియె.

వత్సా! నీకుఁ గథలయందింత వ్యసనమేమి? యంగడికిఁ బోయినవాఁడ వూరకరానేల సామాగ్రిదెచ్చినపిమ్మట నడిగినఁ జెప్పనా? ఈవృత్తాంతము మిగుల చిత్రమైనది భోజనంబైనపిమ్మట సావధానముగాఁ జెప్పవలయును. వడిగాఁబోయి సామగ్రిదెమ్ము. పిమ్మటఁ జెప్పెదనని బ్రతిమాలుకొని యెట్టకే వానిచేనట్లు చేయించి భోజనానంతరమున మనోహరప్రదేశమునఁ గూర్చుండి యమ్మణిచే నాకథయంతయుం దెలిసికొని యిట్లు చెప్పందొడంగెను.

తొల్లి యాంధ్రదేశాధీశ్వరుండగు నరసింహదేవరాయలు ధర్మంబున రాజ్యంబు సేయుచుండ హటాత్తుగా నతని ప్రధాని మరణము నొందెను. తగిన మంత్రిలేనిచో రాజ్యముసేయుట దుర్ఘ టమని నరసింహరాజు తెలివిగలవానికి నాయుద్యోగమిచ్చెదనని

దేశదేశంబుల చాటింపించెను. అట్టివార్తవిని బుద్ధిమంతులని పేరు పొందినవారు పెక్కండ్రు వచ్చి యాయుద్యోగము తమకిమ్మని వేడుకొనిరి.

రాజు వారిబుద్ధికుశలతకు మెచ్చుకొనక మంత్రిత్వపదవికిఁ దగినవారుకారని వారిప్రార్థనాపత్రికలఁ ద్రిప్పివేసెను. లోకంబున నేర్పరులని పేర్పొందినవారుగూడ రాయలచే నిరసింపబడుటచే వారికి మునుపున్న కీర్తికిఁగూడ గళంకము రాఁదొడంగినది. అట్టి భయముననే యెట్టివాఁడును ఆపనికిఁ బ్రయత్నముచేయుట మానివేసెను. రాయలు మంత్రిలేని భారమెక్కుడైనను సహించెనుగాని యల్పబుద్ధికిమాత్రమాయుద్యోగమియ్య నియ్యకొనఁడయ్యెను.

ఒక్కనాఁడతండు పెద్దయుంబొద్దు చింతించి కొందరి పరిచారకులంజీరి యొక కాగితముమీఁద నాలుగంగుళముల గీత సిరాతో గీసి యోరీ! మీరీ కాకితము ప్రతిగ్రామమునకు గొనిపోయి కనఁబడిన వానికెల్ల చూపించుచు నీగీటు చెరపకయే చిన్నదిగాఁ జేయగలరా యని యడుగుఁడు. అట్లుచేసిన వాని నందలమెక్కించి నాయొద్దకుఁ దీసికొనిరండని యాజ్ఞాపించి పంపెను.

వారాపత్రమును దీసికొని యనేక పట్టణంబులకరిగి పెక్కండ్రు బుద్ధిమంతులకుఁ జూపించి యాగీటు చిన్నదిగాఁ జేయుఁడని యడిగిన నెవ్వరు నప్పని జేయలేకపోవుటయేకాక యదియెట్లును నొనఁగూడని పనియని పరిహాసము చేయఁదొడంగిరి.

అయ్యా! మీ రాజెంత పిచ్చివాఁడో కదా! యేమియు లేని దానికై యూరకింత ప్రయత్నము చేయుచున్న వాఁడని కొందఱును, ఆహా! సిరాగీటు చెరపక యెట్లు చిన్నదగునని కొందఱును, మేలు మేలు. దీనిని చెరపక హ్రస్వముగాఁ జేయుటకు మాయొద్ద మంత్రశక్తిలేదని కొందఱు నవ్వసాగిరి.

లోకంబునఁ దమకుఁ దెలియని పనులు అసంగతములే యని మందమతులనుకొనుచుందురుగదా! ఎవ్వరేమనినను గోపముజెందక

రాజభటులు తమయేలిక యాజ్ఞచొప్పున గనంబడినవారికెల్ల నాకాకి
తము చూపింప దొడంగిరి.

ఒక్కనాడొక్క యగ్రహారమున కరిగి యందలి వారల
కుఁజూపించుచు నొకబడిలో బాలురకుఁ జదువు జెప్పుచున్న యుపా
ధ్యాయుని యొద్దకరిగి యతనికా కాగితమునుజూపించి అయ్యా
తమ రీ గీటును జెరపక చిన్నదిగాఁ జేయఁగలరా? యని యడిగిన
నతం డిట్లనియె. చాలు చాలు. మీకుఁ బిచ్చిపట్టినదా యేమి. అసం
దర్భపు మాటలాడుచుంటిరి. అట్లు చేయుటకు నాయొద్ద గారడీ లేదు
పొండు. మీకతంబున బాలురు చదువుటమానివేసిరి. అనుటయు
వారు నిరాశులై మరలిచనుచుండ, నాబడిలోఁ జదువుకొనుచున్న
తిమ్మర్సను పదియారేడుల ప్రాయముగల బ్రాహ్మణకుమారుఁ
డామాటలాలించి గురువుతో, అయ్యా వారు మిమ్మేదియో యడిగి
యూరక ఖిన్నముఖులై యరుగుచున్నవారే మనవుఁడు అతండు
ఓహో! అసంబద్ధ ప్రలాపంబులకుఁ దగిన యుత్తరంబెవ్వఁడియ్యఁ
గలండు. సిరాగీటు చెరపక చిన్నది చేయవలయునఁట. అది బుద్ధి
చాతుర్యంబునఁ దీరుప శక్యమైనదికాదు. మనయొద్ద గారడీలు లేవు
అది మాకు శక్యముగాదని చెప్పిన నూరకచనుచున్న వారనిన,
గురువుగారితో, తిమ్మర్సు అయ్యా! ఆపని నేను జేసెదను. వారింబి
లుపింపుఁడు అను నంతలో వారును ప్రాంతమందేయుండి యామా
టలు విని తటాలున మరలివచ్చి యాచిన్నవానికా కాగితమును
చూపించిరి.

అది చూచినప్పుడు, తిమర్సు, మేలు, మేలు, యీపాటి
పనికే యింతదూరము వచ్చితిరి. ప్రపంచకంబింత నిపుణతాశూ
న్యమే యని పరిహసించుచు నాకాకితమును బుచ్చుకొని సిరాతో
ఆగీటుప్రక్కను వేరొక్క పెద్దగీటుగీచి, యిప్పుడు మీరు తెచ్చిన
గీటు చెరుపకయే చిన్నదికాలేదా? యనిన వారు సంతసించుచు
నోహో! నేడు మాపుణ్యమున బుద్ధినైపుణ్యముగల నిన్నుఁబొడ
గంటిమి. రాజశాసనమును చిత్తగింపుము. మీరిప్పుడు మాసంస్థాన

మునకు రావలయును. పల్లకీ తెప్పింతుము. వయనము కండని వినయపూర్వకముగా బ్రార్థించుటయు వారిమాటలును తిమ్మరుసు చేసిన పనియునుజూచి యతని యుపాధ్యాయుఁడు మిగుల వెరఁగు పడుచు శిష్యునితో నిట్లనియె.

వత్సా! నీవుచేసినపని యుక్తిగానున్నది. నిన్నింతవానిగా నేనెరుఁగను. ఈమాత్ర ముపాయము మాకెవ్వరికిం దోచినదికాదు. రాజు వట్టిప్రయత్నముచేయుచున్నాఁడనుకొంటినిగాని యింత తెలివి గలవాఁడని యూహింపనైతిని యిప్పుడు రాజు నీకు గొప్పబహుమానము జేయఁగలడనితోచుచున్నది. ఇంకొక్కటివినుము. నీవు నాకు శిష్యుఁడవుగదా? శిష్యునివిద్యాగౌరవము గురువుదే యని చెప్పుదురు. నీవుజేసినపని నేనేజేసితినని రాజుగారితోఁజెప్పెదను. మంచి పారితోషికము దొరకగలదు. రాజభటులకెద్దియేని లంచమిచ్చి యట్లనిపించెదను. నీవు సమ్మతింపుము. మొదట దొరికినబహుమానము గురుదక్షిణగా నిచ్చుట న్యాయమని యడిగినవిని తిమ్మరుసు, ఆర్యా! దీనికై నన్నింత బ్రతిమాలవలయునా? ఇదియంతయు మీయనుగ్రహమేకదా! నిజముగా నీపనిచేసినవారు మీరేకాని నేనా? అని యొడంబడినపిమ్మటఁ తనకు రాజుగారిచ్చుదానిలో సగము మీకిచ్చెదనని రాజభటుల నొప్పించి శుభముహూర్తమున నాందోళికమెక్కి తగినవేషముతోఁ జట్టును రాజకింకరులు గొలిచిరాఁ గతిపయ ప్రయాణంబుల నరసింహదేవరాయలవారి నికటంబున కరిగెను.

ఆ భూభర్త యావర్తమానమునువిని చిరకాలమునకుఁ దగిన మంత్రిదొరకెఁగదాయని మిగుల సంతోషించుచు నెదురేగి పల్లకీలో గూర్చుండిన యతని వేషముచూచి "ఆకారసదృశఃప్రజ్ఞః" అనునట్లు రూపమునుబట్టియే యతనిబుద్ధిమాంద్యమును దెలిసికొని, పరీక్షించి చూచెదంగాక యని, తగుసత్కారములతో నతనిసభాంతరమునకు గొనిపోయి యుచితపీఠంబునం గూర్చుండఁబెట్టి యిట్లనియె.

అయ్యా! యీగీటు నిట్లుచేసినవారు మీరేనా? యని యడిగిన నా బ్రాహ్మణుఁ డెన్నఁడును రాజసభల కరిగినవాఁడుకాఁడు సభాకంపముతో నెట్టకేలకు గద్గదకంఠమున, నేనే, నేనేయని యుత్తరము చెప్పెను. ఆస్వరంబుననే యతండట్టి నేర్పరికాఁడని తెలిసికొని రాజు మరల విప్రునితో అయ్యా! మీబుద్ధిచాతుర్యముఁ బరీక్షింప నింకొకపని చెప్పెదను. అదిమీరు చేసినచో నిదియు మీరేచేసినట్లు నమ్మెదనని యాభవనాంతరమందొక పీఠంబున మంత్రి ముద్రికలనుంచి చుట్టును పరుపులుపరిపించి యవి త్రొక్కకయేపోయి యాముద్రికలఁ దెచ్చుకొనుఁడనిచెప్పిన నప్పని కేమియు నుపాయము తోఁచక బ్రాహ్మణుండాకాశముదెసకు మోమెత్తి యిట్లు చింతించెను.

అయ్యో! యీరాజు నాకిద్దియో బహుమానము జేయునను కుంటినిగాని మరల పరీక్షజేయునని యూహింపనైతి. ఊరక వట్టిడాంబికముఁ బెట్టుకొనువారి కవమానము రాకుండునా? ఇప్పుడేమిచేయుదును. తిమ్మరుసునుగూడ వెంటఁబెట్టుకొనియైన రానైతిని. దైవమీయాపద నాకు దాటించినచో నిఁక నెన్నఁడును యిట్టిడంబములకుఁబూనుకొనను.ఇప్పుడు యథార్థముచెప్పకతీరదు. నిజముచెప్పి రాజుపాదంబులం బడియెద నింతకన్న వేరొక్కయుపాయములేదని యూహించి యావైదికుఁడు గడగడవడఁకుచు భూవల్లభునితో మెల్లన నిట్లనియె.

దేవా! నేనుబ్రాహ్మణుఁడను. కుటుంబముగలవాఁడను. నన్ను శిక్షింపక మన్నింతురేని యథార్థముఁ జెప్పెద. నాకు భయంబున మాట తిన్నగ రాకున్నది. దేవరవారి చల్లనిమాటవిని పిమ్మటఁజెప్పెదనని పలికిన నృపతి వాని పిరికితనమునకు నవ్వుచు బ్రాహ్మణుఁడా వెరవకుము. నీకేమియు భయములేదు. యథార్థముచెప్పుము నిన్ను మన్నించితినని పలికినపిమ్మట నావైదికుఁడు తెరపితెచ్చుకొని అయ్యా యీగీటు నేనుచేయలేదు. నాయొద్ద చదువుకొనుచున్న తిమ్మరసను పేరుగల చిన్నవాఁడు దీనిమర్మము గ్రహించెను. వాఁడు మంచి బుద్ధి

మంతుఁడు ఇప్పుడు వానిని బిలిపించినచో, మీరువన్నిన యుక్తులన్ని టిని జేయఁగలవాఁడని పలికిన సంతసించి రాజు ఆక్షణము భటుల గొందఱంబంపి వేరొక్క చతురంతయానమున సబహుమానముగా నాతిమ్మరుసును రప్పించెను.

రాజు తిమ్మరుసు ముఖవిలాసము జూచినంతటనె యతండనన్య సామాన్యబుద్ధిచాతుర్య దురంధరుండని తెలిసికొని మిగుల సంతో షముతో గాఢాలింగనము జేసికొని యతనికి కైదండ యిచ్చి సభాం తరమునకుఁ దీసికొనిపోయి బాలుఁడా! యీగీటు చిన్నగాఁ జేసినవా రెవ్వరనియడిగిన గురువేమిచెప్పునో తనకుఁదెలియమి నతండుశ్లేషగా అయ్యా! అది మద్గురుప్రసాదంబున నైనదని యుత్తరము చెప్పెను.

ఆమాటలాలించి రేఁడు వానిమతి చమత్కృతి వేర పరీక్షింప నవసరము లేదని యెఱిఁగియు నెల్లరకుఁ దెల్లముకావలయునని నీకు నేను మంత్రిత్వమిచ్చితిని. ముద్రికలవిగో పీఠంబుపై నున్నవి, ప్రక్క లనున్న పరుపులఁ ద్రొక్కకయేపోయి వానిఁ గైకొనుమని యాజ్ఞాపిం చిన దిమ్మరుసు వల్లెయని మెల్లన నాపరుపులు చుట్టుకొనిపోయి యా ముద్రికలం దీసికొని మరల నాచుట్టలవిప్పి రాజుగారిముందర నిలిచి ఇవిగో తెచ్చుకొంటిని పరుపులు త్రొక్కలేదు. చూడుఁడని పలికిన నాయుక్తికెల్లరు సంతసించిరి. రాజు తిమ్మరుసును మిగుల గౌరవపరచి యాదినముననే మంత్రిత్వపదవికిఁ బట్టాభిషేకము జేసెను.

నాఁటినుండియుఁ దిమ్మరుసు వారి యాస్థానమునకు మంత్రియై సకలరాజ్యకార్యములు యథాప్రయోగములుగా నడుపుచుండెను. అతని బుద్ధివిశేషముచేత నేకదా! నరసింహదేవరాయలకుఁ గృష్ణదేవ రాయలుజనించెను. ఆకథనీవింతకుపూర్వము విన్నదేకదా? తిమ్మరుసు మంత్రియైన కొంతకాలమునకు వృద్ధరాజు పరలోకగతుండయ్యెను. పిమ్మటఁ గృష్ణదేవరాయలు రాజయ్యెను. అష్టదిగ్గజములనుబిరుదులు

వడసినకవీంద్రులును బుద్ధివిశారదుండగు మంత్రి తిమ్మరుసును చెంతనొప్పుచుండనతనికి నై భవమాఖండలునకైన లేదని చెప్పుటయేమి యాశ్చర్యము. అతండు కవిత్వప్రియుండై భోజుండువోలె వితరణంబు నకుఁ బండితబృందంబుల కానందంబు గలిగించుచుండ నతనికీర్తి దిగంత విశ్రాంతమై యొప్పుచుండెను. కృష్ణదేవరాయల చరిత్ర మంతయుఁ జెప్పుటకు పెక్కుదినంబులు పట్టునుగాన బ్రస్తుతోప యుక్తమగు కథను మాత్రము చెప్పెద నాకర్ణింపుము.

తిమ్మరుసుతోఁగూడ మిగుల విఖ్యాతిగా రాజ్యంబేలుచున్న రాయలకు దాసీపుత్రుఁడను కళంక మొకటికూడ దేశంబున వ్యాపించి యున్నది. దానంజేసి యతనికిఁదగిన రాజులెవ్వరు కన్నె నిత్తునని వచ్చినవారుకారు. అతఁడు పెద్దకాలము వివాహము లేకయే యుండెను. ఇట్లుండునంత నొకనాఁడు కళాసిధియను బ్రాహ్మణుఁ డొకఁడు రాజదర్శనార్థమై వచ్చి యతనిచే సత్కారములంది తన విద్యాప్రౌఢిమయంతయుఁ జూపించిన సంతసించి యతనితో రాయలు అయ్యా! మీ పాండిత్యము మిగులఁ గొనియాడఁదగియున్నది. మీరు పెక్కుదేశంబులు తిరిగియుందురు యెందేని పాండిత్యముగల స్త్రీలను చూచితిరా యని యడిగిన నతండొక్కింత స్మరణ మభినయించి మహారాజా! సేతుహిమాచలాంతరమందున్న భూమియంతయుఁ దిరిగితిని. అందు విద్యావతులైన యువతులు నెందరేనిఁగంటివారిం బేరొకన నేలవినుఁడు.

కుంతలదేశంబునకు రాజధానియైన గోపాలపురంబున గోపాలుండను రాజు రాజ్యంబేలుచుండెను. ఆ రాజునకుఁ జిరకాలమునకు గళానిలయ యనుపుత్రిక జనించినది. దాని పేరు సార్థకమైనదిగాని సంజ్ఞామాత్రమునకై యుంచినదికాదు. కళలకును విద్యలకును నివాసభూమియగు నామగువ యిప్పుడు పదియారేడుల ప్రాయము గలిగియున్నది ఆచిన్నది యెట్టిరాజకుమారుఁడు వచ్చియడిగినను

దనకుఁ దగినవాఁడుకాఁడని వివాహమాడకున్నది. అనేకవిదేశవస్తు విస్తారరుచిరంబగు సౌధాంతరమున వసించి పండితులైన బ్రాహ్మణులకు మాత్రము దర్శనంబిచ్చుచు నేవిద్యయం దెంతపాండిత్యమున్నవారినైనను పరీక్షించి యోడించి జయపత్రికలఁ గైకొనుచుండును పాండిత్యములేని మానవపశువులఁ జూడనని యామె శపథము జేసియున్నది విద్యలమాట యటుండనిమ్ము ఆయతివ సోయగ మనిమిషకామినులకైనను లేదని రూఢిగాఁ జెప్పఁగలను.

సర్వాంగ సుందరయగు నత్తలోదరి యొక్కతెయ భూలోకంబులో స్త్రీలలోఁగాక పురుషులలోనైతము విద్యామహిమచేఁ బొగడ దగియున్నది. ఆయొప్పులకుప్పను దేవరవారికి కూర్చినచో జతురాననుండు చతురాననుండని నమ్మెదను.

భూమండలమున బండిత రాయలని బిరుదుపొందిన నేను గూడ నేవిద్యయందును నాచిన్నదానితో సమముగా మాటాడ నేరక జయపత్రికనిచ్చి యచ్చటినుండియే యిచ్చటికివచ్చితిని ఇంతకన్నానా యెఱిఁగినది లేదని చెప్పిన పండితునిమాట లాలించి కృష్ణదేవరాయలు శ్రవణరూపమైన దృగవస్థతోఁగూడ మనస్సంగమను రెండవమన్మథావస్థ పొల్పడెను.

పిమ్మట నాపండితుని యథోచితసత్కారములచేఁ బూజించి యంపి మరికొన్ని దినములకుఁ దనదర్శనంబునకు కొందఱు పండితులు వచ్చుటయు వారి నర్చించిన పిమ్మట బ్రస్తావముగాఁ గళానిలయ వృత్తాంతము మీకేమైనఁ దెలియునాయని యడిగెను. వారును ఆ చిన్నదానిగుఱించి మున్ను చెప్పిన బ్రాహ్మణునికన్న నెక్కుడుగా స్తోత్రములు చేయఁదొడఁగిరి. నాటినుండియు రాయలు తనయొద్దకు వచ్చెడు పండితులనెల్ల నడిగి తెలిసికొనుచు నామెయందు బద్ధానురాగుండై యెల్లమన్మథావస్థలకుఁ బాల్పడి క్రమంబున క్షీణింపం దొడంగెను.

ఇట్లుండునంత నొక్కనాఁడు తిమ్మరుసు రాజుగారి యవస్థయంత యుఁ బరిశీలించి శంకాన్విత స్వాంతుండై యక్కారణంబేమని యడిగిన నతండు మంత్రితోఁ దన యవస్థా వృత్తాంతమంతయు జెప్పుటయేకాక యాకుముద వదనం దనకుఁ బెండ్లిజేయనిచోఁ గొద్ది దినములలోనే మేనంబ్రాణములు బాయుదునని జెప్పెను. ఆమాటలాలించి తిమ్మరుసునవ్వుచు రాజా! నీకోరిక యసాధ్యముగా నున్నదే. ఆగోపాలుఁడు, మనకంటె నధికారముచేతను సంపదచేతను నధికుఁడు ఆతని కూఁతు నీకెట్లిచ్చును. ఇదియునుంగాక నీకు దాసీపుత్రుఁడను కళంకము జగద్విదితమై యున్నది. సంపత్కులంబులం దులగాని వాఁడధికునితో సంబంధముజేయఁ దలంచుట పొట్టివాఁడు పెద్దచెట్ల ఫలములకై చేయి చాచినట్లగు. కోరరానివస్తువులంగోరి యూరక వెతలఁబడ నేటికి? సాటిబోటిం బెండ్లియాడి వేడుకలం దీర్చుకొనుమని విరక్తిమాటలం బలికిన విని మరుమాటలాడక యుస్సురని నిట్టూర్పుచ్చుచుఁ గొండొక వడికి మోముంతయెత్తి యతని మొగంబుపై వేడిచూడ్కులు బరపించుచు నిట్లనియె.

వయస్యా! ఇదియా నీవు చెప్పునది, చాలు, లోకాతీత మతిచమత్కృతిగల హితుండు గలిగియుండు నాకేమికొరంత. నా కార్య మెట్లో సఫలముచేయుదు వని సంతసించుచుంటినిగాని తుదకు నీవిట్టి పిరికిమాటలు చెప్పుదువని యెన్నఁడును దలంపనైతిని. కానిమ్ము దైవంబేమి సేయదలఁచెనో చూచెదంగాక. నేను సామాన్యస్త్రీని బెండ్లియాడనుఁ నీకు సామర్థ్యమున్నఁ గళానిలయం బెండ్లిచేయుము. లేనిచో నూరకుండుము. నేను సన్యాసినై దేశాటనంబు గావించెద. రాజ్యంబు నీవేచేసికొనుమని వైరాగ్యముగాఁ బలుకుటయు తిమ్మరుసు, రాజా! నీవింతటి యల్పకార్యమునకే యలంతి మాటల నాడవలయునా? యొక పడంతుకకు నెక్కుడు ప్రయత్న మేమిటికని యట్లంటి నిజముగా నట్టికామితము నీకుఁగలిగినచో నెట్లోకార్యము సమకూ

ర్చిదంగాని పోనిత్తునా? వినుము. బుద్ధిమంతు డెన్నడును కొంచెము పలికి యెక్కుడుచేయును నాసామర్థ్యమంతయుఁ గనపరచి యత్తరుణి నీకుఁగూర్ప యత్నించెదను. దైవ ప్రతికూలమున నొకవేళ కార్యము సఫలము కానినాఁడు మాత్రమిట్టి యుగ్రప్రతిజ్ఞ పట్టఁగూడదు నీవాంఛయంతయు దీర నానారీమణిని నీకుం జూపించెద. ఇంత పట్టు శపథము చేయఁగలను. దీనికి నీయభిప్రాయమేయని యడిగిన నతండు నందహాస ముముఖారవింద మలంకరింప నతనిని గౌఁగలించుకొని మిత్రమా! నీవునిక్కముగాఁ దలంచినపని కాకపోవునా? ఎట్లైనను సరే, యొక్కసారి యక్కలికిని గన్నుల కరవుదీరఁ జూచినంజాలు అట్టిప్రయత్నము చేయుమని తొందరపెట్టిన తిమ్మరుసు మరల నిట్లనియె.

రాజా! నీవుచూడగోరిన చేడియ యన్నిటను మిగుల ప్రౌఢ యని వినియుంటిమి. దానింజూడ బాడబవేషంబునంగాని పొసంగదు. నీవు నట్టివేషము వేయవలసియుండును. ఇట్టిరాజవేషముతీసి బ్రాహ్మణవేషము వేయుమనిచెప్పుటకు నాకు సందియముగానున్నది. అని పలికి నవ్వుచు రాయలు తిమ్మరుసుతో నిట్లనియె. మిత్రుఁడా! నీవు దీనికై సంకోచమందుచుంటివేమి. నాయెడ రాజభావము వదలి మిత్రభావముగా మెలఁగుమని యిదివరకే చెప్పియుంటిని. ఈమాట మరచితివా యేమి. ఇదియునుంగాక బ్రాహ్మణులు సర్వోత్కృష్టులుగదా! అట్టి వేషము వేయుట కేమి నీచము. ఆపద్మాక్షి నీక్షింప బ్రాహ్మణవేషంబేగాదు వైరాగి వేషంబైనను వేయుమనినచో సిద్ధముగా నుంటినని పలికినఁ దిమ్మరుసు మిగుల సంతసించి కార్యనిర్వాహ కత్వమునకు నొడఁబడెను.

అంతట వారొక్క శుభముహూర్తమునఁ దీర్థయాత్రాకైతవంబునఁ బురంబువెడలి యొక్కచోఁ బ్రచ్ఛన్నముగాఁబ్రభు వేషములఁ

దీసివైచి శ్రోత్రియ బ్రాహ్మణవేషంబు వైచుకొని బ్రాహ్మణత్వం బాకృతిగైకొని నట్లొప్పుచు వేదంబులు వర్ణించుచు ధవళయజ్ఞో పవీతంబుల వ్రేళులకుజుట్టి పనసల రువ్వుచుఁ జూచువారలకు నేత్ర పర్వమాపాదించుచుఁ గతిపయ ప్రయాణంబు లరిగి యొకనాఁడు సాయంకాలమునకుఁ గాంపిల్యంబను పురంబుజేరి యందు బ్రాహ్మణు లలో నన్నదాత లెవరని యడిగి యాపట్టణపు రాజుగారి పురో హితుండుగాఁ దెలిసికొని వారింటికరిగిరి సోమశర్మయను నాబ్రాహ్మ ణుఁడు అప్పుడింట లేకున్నను నతనిగృహిణి వారుక చొప్పున వారి నుచితసత్కారములచే నాదరించి వారి విశ్రమింపజేసి యతివేగం బునఁ బాకంబు గావించెను. సద్గుణవంతులగు సతులు దొరకుట పతుల భాగ్యముగదా! ఇంతలో నాసోమశర్మయు నింటికివచ్చి యెద్దియో విచారముతో నతిథులఁ బరామర్శింపక యొకగదిలోఁ బండుకొని చింతించుచుండెను.

వంటయైనపిమ్మట నతనిభార్య యతిథులతోఁగూడ బతిని భోజమునకు లెమ్మని పలికిన నతండు ప్రాణమిత్రుండగు మంత్రి రేపురిదీయఁ బడుచుండ నాకీరేయి నన్నమెట్లు నోటికిఁబోవును? నీవును నతిథులు భుజింపుఁడు. నాకన్నమక్కర లేదని యుత్తరము చెప్పెను. ఆమాటలు విని యామె మంత్రికెద్దియు నాలోచన తోఁచ లేదా? తోఁచనినాఁడు మూఁడు దినంబులు మితియిచ్చి యుండెనే ఇంతలో నెవ్వరినేనియడిగి తెలిసికొనలేకపోయెనా? యూరక చావ వలసి వచ్చెనా? పాపమయ్యయ్యో! యని వగవఁ దొడంగినఁ బురోహితుండు భార్యతో, నారీమణీ! మంత్రికిఁ దోఁచునంత తెలివి గలిగియున్నచో మొదటనే తోఁచును. అతనిబుద్ధి మన మెఱుఁగనదియా మూఁడుదినంబులుగాదు సంవత్సరము మితియిచ్చినను యతనికిఁ దెలి యదు. మరియు నతనికి బోధింప నంతమతి చమత్కృతిగల తిమ్మరుసు లిందెవ్వరున్నారు. పాపమతఁడూరక చావవలసి వచ్చినది. బుద్ధి

నైపుణ్యము లేనివాఁడైనను మంత్రిసుగుణంబులచేఁ గొనియాడఁ దగినవాడుసుమీ? కౄరులగు ప్రభువుల యొద్దనుత్తములు పనికి రారు. నాకు మిత్రనాశన శోకంబుగాక వేరొక్కచింత పుట్టుచున్నది. ఈవేళ మంత్రినురిదీయుచున్నాఁడు. రేపు నన్నదియో యడిగి చెప్పలేకపోయినచో మంత్రివలె నన్ను నురిదీయ నాజ్ఞచేయును. అననుకూలప్రశ్నములకు నుత్తరం బెవ్వఁడు చెప్పగలఁడు? అవివేకి యగు రాజును సేవించుటకంటె ముష్టి యెత్తుకొనుటయే యుత్తమ మని చెప్పుదురు. ఎట్లయినను నీరాజు కొలువు మానుకొనుటయే మేలని విచారముతోఁ బలుకుటయు నాబ్రాహ్మణుని మాటలన్నియు విని తిమ్మరుసు రాయలతో నాలోచించియావిప్రదరికరిగియతనికిట్లనియె.

అయ్యా, మేముయజమానుఁడు భుజింపనిచో భుజించువారము కాము. మీరెద్దియో యాపన్మాలమున విచారించుచుంటిరి. ఆయా పద యెట్టిదో యెరిగింపుఁడు మఱియు నట్టియాలోచన చెప్పుటకుఁ దిమ్మరుసులు లేరని యంటిరి. తిమ్మరుసును మీరెరుఁగుదురా! యని యడిగిన వారికా బ్రాహ్మణుం డిట్లనియె. ఆర్యులారా! నేను తిమ్మరుసు నెప్పుడును చూచియుండలేదు. కృష్ణదేవరాయల మంత్రి యనియు మూఁడులోకముల నతనికి సమానుఁడగు బుద్ధిమంతుఁడు లేడనియు నతనిచర్యలు కథగాఁ జెప్పుకొనుట విని యిట్లంటిని. మొన్న మారాజు మంత్రికిఁ మూఁడుప్రశ్నములిచ్చి వానికి నాలుగవనాఁ డుత్తరము జెప్పలేకపోయితివేని నురితీయింతునని కఠినముగా నాజ్ఞ చేసియున్నాఁడు. ఆమితి యీరాత్రితో సరిపడినది. వానికి నుత్తరము లతనికిఁ దోఁచకపోవుటయేగాక, యెవ్వరినడిగినను దగినయాలోచ నము చెప్పలేకపోయిరి. ఈలాటివానికిఁ దిమ్మరుసు సమాధనము చెప్పఁగలడని యందఱు ననుకొనిరి. కాని యంతదూర మరిగి తెలిసి కొన వచ్చుటకు గడువు చాలినదికాదు. రేపె మంత్రి నురితీయుదురు.

నాకు మంత్రి మిగుల మిత్రుఁడగుటఁ దోచకున్నది. మీరు భుజింపుఁడు. నాకు నన్నము నోటికిపోదని పలికిన యజమానుని మాట విని రాయలతని కిట్లనియె,

అయ్యా! యీబ్రాహ్మణుఁడు తిమ్మరుసునకుఁ బ్రాణమిత్రుఁడు తీర్థయాత్రకై వెడలెనుగాని యెప్పుడు నతనియొద్దనే యుండువాఁడు. బుద్ధిచే నతనితో సమానుఁడే. ఆమూఁడు ప్రశ్నములు నెట్టివో చెప్పుఁడు. తప్పక నితఁడు సమాధానము చెప్పును. మీపుణ్యము బాగున్నది. మీరు చింతింపకుఁడు. మీమంత్రి ప్రాణముల నితఁడు కాపాఁడగలఁడు. అని ధైర్యముగాఁ బలుకుటయు నతనిమాట లాలించి యత్యంత సంతోషముతో సోమశర్మ వారికి వందనములు జేయుచు నయ్యా వినుండు మారాజు పెద్దసభ జేసి మంత్రికిచ్చిన ప్రశ్నములు:—

౧. సంతతము భగవంతుడేమి చేయుచుండును?

౨. నక్షత్రముల సంఖ్యయెంత ?

౩. భూమికి నడిభాగ మెద్ది ?

అని మూఁడుప్రశ్నములిచ్చి నాల్గవనాఁడు తగినసమాధానము చెప్పనిచో నురితీతునని యాజ్ఞాపించి మంత్రి నింటి కనిపెను. వానిలో నొక్కదానికైన మంత్రికి నుత్తరము తోఁచినదికాదు. ఇప్పుడే నేనతని యొద్దనుండి వచ్చితిని. అతండు భార్యాపుత్రులు చుట్టునుం బరివేష్టించి శోకింపుచుండ మరణకృత నిశ్చయుండై చింతించుచున్నాఁడు.

వీనికి మీకెద్దియేని దోఁచినచో సెలవిచ్చి మంత్రిప్రాణములు గాపాడుఁడు. మీపుణ్యమెవ్వరికిరాదని వేడుకొనినఁ దిమ్మరుసు రాయలతో దీనికి మీకేమైనం దోచినదా? అని యడిగిన నతం డీప్రశ్నములకు నిజంబైనయుత్తర మెవ్వండును నియ్యజాలఁడుగాని కపటముచేసి రాజు నొప్పింపవచ్చునని పలికిన విని తిమ్మరుసు, ఔను. అలాగుననే చేయవలెను గాని నిజముగాఁ జెప్ప నెవ్వరి తరమసి యొండొరులు మాట్లాడుకొనినవెనుక తిమ్మరుసు సోమశర్మతో అయ్యా! ఈకార్యము

నేను జక్కబెట్టెదను. మీరు భుజింపుఁడు. భోజనంబైన వెనుక మంత్రి నొకసారి మాయొద్దకుఁ దీసికొని రండని పలికిన సంతసించి యాబ్రాహ్మణుఁడు వారితో నానందముగా భుజించిన వెనుక వేగంబున మంత్రి యింటికరిగి యతనితో నిట్లనియె.

అయ్యా! నేఁడు మాయింటికి దిమ్మర్సునకు మిత్రులైన బ్రాహ్మణు లిరువురువచ్చిరి. వారితో మీప్రశ్నములవృత్తాంతము చెప్పితిని. వానికి సమాధానముచెప్పెదమని ప్రతిజ్ఞపట్టి మిమ్ముఁదోడ్కొని రమ్మనిన నేనువచ్చితిని. పోదముఁరండని పలికిన నమృతోపమానంబులగు నతనిమాటలువిని మంత్రి దిగ్గున లేచి సోమశర్మా! ఆపుణ్యాత్ము లెక్కడనున్నారు. త్వరగాఁబోవుదము రమ్మని యతనివెంట వారింటి కరిగి యందు నాకపట బ్రాహ్మణులంగని సాష్టాంగముగా వారి పాదంబులంబడి పుణ్యాత్ములారా! మీరునాయాపద బాపుటకై వచ్చిన భగవంతులని తోచుచున్నయది, రాజుతో రేపు నే నేమిచెప్పవలయునో బోధించి నాకుఁ బ్రాణదానంబు సేయుఁడు. మీయుపకార మెన్నటికిని మరువ నని పెక్కుగతుల నుతియింపం దొడంగిన నతని లేవనెత్తి తిమ్మర్సు అనఘా! నీప్రాణంబులు గాపాడెదము. నీవింక చింతింపకుము. రాజు నిన్నడిగిన ప్రశ్నముల కుత్తరములు మాటలచే నీవు చెప్పనవికావు. నేను క్రియలచే జూపించెద. రేపుదయమున నీవు రాజనగరి కరిగి తన ప్రశ్నములకు సమాధానము చెప్పుమని యడిగినప్పుడు రాజుతో నిట్లనుము.

అయ్యా! తమ ప్రశ్నములు త్రిలోకజన మేధాభేద్యములు గదా! వాని జెప్పుటకు లౌకిక వ్యాపారపారాయణుఁడనగు నాకెట్లు సాధ్యమగును. దురవబోధ్యములగు వానిం బోధింప నొకవిప్రుని నియమించితిని. సెలవైనచో నతనిం బిలిపించెద నని యడిగి యతండొడం బడినప్పుడు నాకు వార్తనంపుమని చెప్పిన విని మంత్రియు వారి

ముఖవిలాసములంబట్టి యట్టి పనిసేయ సమర్థులే యని నమ్మి సంతో షముతో వారిచే ననుజ్ఞాతుండై యింటికరిగెను.

మఱునాడు రాజు సకలసామంత బంధుపౌర వార సమేతుండై కొలువుతీర్చి మంత్రిరాక కెదురు చూచుచుండ నింతలో మంత్రియు సంతోషముతో రాజసభ చేరి యథా యోగ్యపీఠంబునం గూర్చుండి యుండ రాజతనిఁజూచి యమాత్యోత్తమా! నాప్రశ్నములకు సదు త్తరంబూహించితివేని సత్వరంబుగ నుడువుము. లేకున్న నురి స్తంభ ముకడకుఁ బొమ్మని పలికిన నతండిట్లనియె.

దేవా! మీప్రశ్నములు అమానుషంబులగుటచే నవి సామా న్యముగాఁ జెప్పనలవడునవి కావు. వాని ననుకూలముగా నిరూపించి చెప్పుటకొక పండితుని నిర్దేశించితిని. సెలవైనచోఁ బిలిపించెదననిన రాజు యింక నాలస్యము చేసెదవేటికి త్వరగా బిలిపింపుమనిన మంత్రి యప్పుడొక భటునిచే దిమ్మరున్నకు వార్తనంపెను. తిమ్మరున్న సామాన్యవస్త్రములు ధరించి చూచువారెల్ల నోహో! యితండా! రాజప్రశ్నముల కుత్తరము చెప్పువాఁడని పరిహాసము చేయుచుండ రాజసభ కరిగెను. సభ్యులెల్ల నతనిజూచి యుల్లసమాడిరి. పిమ్మట నతండొక పీఠంబున గూర్చునియుండ నతనికి రాజిట్లనియె.

విప్రా! నీవు నాప్రశ్నములకు లెస్సగా నుత్తరములీయఁ గలవా? అని యడిగిన నతండపియొట్టివ్వో తెలుపుఁడనియె రాజు వాని మూఁటిని చదివి వినిపించి సమాధానము చెప్పుమనిన నతం డయ్యా! మీశంకలు సామాన్యములుగావు. మూఁడుప్రశ్నములకు నొకదినముత్తర మీయ శక్యముగాదు, మూఁడునాళులు గడువిచ్చి నచో దినమున కొకదానికుత్తరమిత్తును. నేఁడు దేనికుత్తరమీయ వలయునో నుడువుఁడనిన రాజు దానికి సమ్మతించి మొదటిదినంబున మొదటి ప్రశ్నము, సంతతము భగవంతుండేమి చేయుచుండును? అను దానికి నుత్తరం బిమ్మనియె.

అప్పుడు తిమ్మరుసు నిలువంబడి, రాజేంద్రా! సకలలోక నిర్మాణరక్షకుఁడును, సచ్చిదానంద స్వరూపుండును, అవాఙ్మానసగోచరుండునగు భగవంతుని దినచర్యలు చెప్పుట సామాన్యము గాదని యెల్లరు నెఱుంగునదియే. భగవదంశచే జనించిన మీయలంకారములు నాకిచ్చి, నాబట్టలు మీరుగట్టుకొని, మీసింహాసనముపై నన్ను గూర్చుండఁబెట్టి నాయెదుట మీరునిలిచినచో నప్పుడు భగవచ్చర్యలు చెప్పుటకు సమర్థత నాకుఁగలుగును. అనుటయు నతండందులకు నియ్యకొని తనయాభరణములన్నియు నూడ్చి యతనికిచ్చి యతఁడు గట్టిన పాతబట్టల దానుగట్టుకొని యతనిఁ దన సింహాసనమునఁ గూర్చుండబెట్టి తానతనియెదుటఁ జేతులు జోడించుకొని యిప్పుడు భగవంతుండేమిచేయుచున్నాఁడో చెప్పుమని యడిగిన నతండిట్లనియె.

రాజా! నేనింతకు మున్నెట్లుంటినో యిప్పుడెట్లుంటినో చూడుము. నీవెట్లుంటివో చూచుకొనుము. మునుపు సామాన్యవిప్రుఁడనైన నేనిప్పుడు కిరీటకేయూరకటకాద్యలంకారములుదివ్యాంబరములు దాల్చి రత్నసింహాసనమునం గూర్చుండి ప్రజాపాలనదక్షుండగు మహారాజునైతిని. పూర్వము మహారాజవగు నీవిప్పుడు సామాన్యబ్రాహ్మణుఁడవైతివి. భగవంతుఁడనుదిన మీరీతిని గొప్పవానిని, కొలఁదివానిగాను కొలఁదివానిని గొప్పవానిగాను జేయుచుండును. ఈక్షణంబున భగవంతుఁడు నన్ను నిన్ను, నిన్ను నన్నుఁను జేసెను. దీనికి శాస్త్రదృష్టాంతము.

శ్లో. అంభోధిః స్థలతాం స్థలం జలధితాం ధూళీలవ శ్శైలతాం
మేరు ర్మృత్కణతాం తృణంకులిశతాం వజ్రంతృణప్రాయతాం
వహ్ని శ్శీతలతాం హిమం దహనతా మాయాతి యస్యేచ్ఛయా
లీలాదుర్లలితాద్భుత వ్యసనినే దేవాయ తస్మైనమః॥

అనగా, సముద్రమును దిబ్బగాను, దిబ్బను సముద్రముగాను, అణువుమేరువుగాను, మేరువునణువుగాను, తృణమువజ్రముగాను, వజ్రాయుధమును తృణముగాను, అగ్నిని మంచుగాను, మంచు నగ్నిగాను,

నిత్యమును జేయుచున్న భగవంతునకు ననేకనమస్కారంబులు అని చదివి యిదియే భగవంతుని దినచర్యయని యూరకున్న యతని సమాధానమునకు యుక్తికిని నెల్లరు సంతోషించిరి. రాజు తిమ్మరుస్సు మాటలకు సమాధానము జెంది సవినయముగాఁ దన యాభరణాది కముగ్గొని యాదినంబునకు మంత్రితోఁ గూడ తిమ్మరుస్సును బస కనిపెను.

మరునాఁడు రాజు పూర్వమువలె సభజేసి యాబ్రాహ్మణుని రాకకెదురు చూచుచున్న సమయంబున తిమ్మరుస్సు యొడనిండ సన్న యిసుక పోసికొని మంత్రితోఁగూడ రాజసభ కరిగెను.

రాజు వారి నుచిత మర్యాదలఁ గూర్చుండఁబెట్టి తిమ్మరుస్సుతో నార్యా! ఈదినమున రెండవ ప్రశ్నము (నక్షత్రముల సంఖ్యయెంత) అనుదానికి నుత్తరంబీయుఁడనిన నతండెల్లరు చూచుచుండఁ దన యొడిలోనున్న యిసుకను రాజుముందర రాశిగాబోసి రాజా! నేను చుక్కల లెక్కఁబెట్టుచో నొక్కొక్క చుక్కకు నొక్కొక్క యిసుము చొప్పున వడిలోవైచితి. ఇన్ని నక్షత్రములైనవి చూచు కొమ్ము. అని చెప్పి యాయిసుక నతని ముందరఁ బోసెను. ఆయుత్తగ మునకు సభవారందఱు నొకరిమొగం బొకరు చూచుకొనుచు నోహో! ఈబ్రాహ్మణుఁడసాధ్యుఁడు. రాజప్రశ్నములకుఁ దగినట్లు త్తరము చెప్పుచున్నాడు. కుక్కకాటునకు చెప్పుదెబ్బ యనునట్లు వీనికిట్లు చెప్పవలయును లేనిచో నక్షత్రము లెవ్వఁడు లెక్కఁబెట్టఁ గలఁడు. అని గుజగుజలాడఁ దొడంగిరి. ఆనృపతి యేమియుఁ జెప్ప నేరక సరియేయని యొప్పుకొని యాదినంబునకు వారివారిబసలకనిపెను

మూఁడవనాఁడు తిమ్మరుస్సు మంత్రితో నొకచోట నొక స్తంభము పాతించుమని ప్రచ్ఛన్నముగాఁజెప్పి మునుపటికన్న గొంచెము ప్రొద్దెక్కించి రాజసభ కరిగెను. రాజుగారతని రాక కెదురు చూచుచు వచ్చినతోడనే బ్రాహ్మణుఁడా! నేడింత యాలస్యము

చేసితివి. నీకు వేళ తెలియుదా యేమి? త్వరగా మూఁడవప్రశ్నము (భూమికి నడిభాగ మెద్ది) అనుదాని కుత్తరంబు చెప్పుమనుటయుఁ దిమ్మరుసు అయ్యా! భూమి యనంతముగదా! దానింజూపుటకు మంత్రశక్తి కావలసియున్నది. ఆదేవత నారాధన జేయుచుండుటచే నాలస్యమైనది. క్షమింపవేడెదను. భూమి నడిభాగము చూడ నాస గలిగినచో దేవరవారు బాదచారులై నాతో రావలయును. ఇతరు లెవ్వరును రాఁగూడదనిన రాజుగా రందుల కొడంబడి యప్పుడే యతనితో భూనాభిస్తంభమును చూడ వాహనాదికము లేకయే నడువ జొచ్చెను.

తిమ్మరుసు ఆరాజుగారిని కాఱెండలో నడిపించుచు నిసుక త్రోవలంబడి యడవిలోఁ ద్రిప్పుచుండ గొండొకసేపునకుఁ గ్రిందఁ బాదంబులు మీఁద శిరంబు నెండవేడిమి నంటుకొని మాడ నారేఁడు నడువ నాయాస మెక్కుడగుటచే నొగర్చుచుఁ బాఉఁడా నిలునిలు మింకెంతదూర మరుగవలసి యున్నది నాకు శ్రమగా నున్నది. నడువలేనన రమ్ము రమ్ము దాపునకే వచ్చితిమి ఈమాత్రమునకే యోఁగలేరా? అని నడుచుచుండెను.

మరికొంత దూరమఱిగి యానరపతి యేమయ్యా! నాయా యాసము చూడక యూరక పరుగిడుచుంటివి. నాకాళ్ళంటుకొను చున్నవి. నేనిక నడువనోపఁ గొంచెము సేపు విశ్రమింపవలయు నని యడుగుచుండ నతఁ డోహో! విశ్రమింపకు విశ్రమింపకుము. విశ్ర మించినచో నామంత్రశక్తి కంతరాయము గలుగును. మనమింటికి జేరలేము. ఓపికబట్టి రమ్ము దాపుచేరితిమి. భూనాభి యూరకయే కనుపించునా? యని మరల నడువ జొచ్చెను.

ఆమాటలకు వెఱచి రాజు మెంతకాళ్ళు కాలినను నొప్పిపట్టి ననుగూర్చుండక యోపికతో నడువలేక మరికొంతదూరము నడిచెను. పిమ్మట దాహమై నోరెండజొచ్చి మాటరాక అయ్యో బ్రాహ్మ

ణుఁడా! నన్నూరక చంపెదవాయేమి? నాకు భూమధ్యభాగము జూపింపనక్కరలేదు. నాకింత దాహము దెచ్చియిచ్చి నన్నింటికిఁ జేర్పుము నీకుఁ జాలపుణ్యముండును. ఇంటికరిగిన వెనుక నీకుఁ బారితోషిక మిత్తునని బ్రతిమాలఁదొడంగెను.

అప్పుడు తిమ్మర్సు రాజుంజూచి యింతయశక్తుఁడ విట్టికోరిక కోరనేటికి? ఇల్లుచేరుట సామాన్యముగా లేదు. మంత్రశక్తిచే వేగము వచ్చితిమిగాని తిరుగ నరుగుటకుఁ బదిదినములుబట్టును. మంత్రశక్తిని బాసి యరిగినచో మృగములు భక్షించును. రమ్ము ప్రాంతములోనే యున్నది. అని యెట్లో మరికొంతదూరము నడిపించెనుగాని యతి సుకుమారవంతుఁడగు రాజువడదాకి మూర్ఛపడి యేమైననుసరే యని యొకచెట్టునీడం జతికిలంబడి బ్రాహ్మణుఁడా నాకు భూమధ్యభాగ మక్కరలేదు. చూచినదానికన్న వేయిరెట్లు సంతసించితిని. నాకు దాహముదెచ్చి బ్రతికింపుము కొంచెముసేపులోఁ బ్రాణము పోవు నట్లు తోచుచున్నది. చచ్చినవెనుక నీప్రశ్నములతోఁ బనియేమి. నీమేలెన్నటికిని మరువనని యతనిపాదంబులంబట్టుకొని ప్రార్థించెను.

అప్పుడు తిమ్మర్సు రాజా! నీప్రాణములవంటివేగదా యితరుల ప్రాణములు అసాధ్యప్రశ్నలువైచి యుత్తరముచెప్పలేనిచో మంత్రిని జంపఁ బ్రయత్నించుట నీకుమాత్రము దగునా? నీవిప్పుడెంతపరితపించుచుంటివో మంత్రియు నాదినమున నంత తపించెనే. ప్రజల న్యాయాన్యాయములఁ బరిశీలించు ప్రభువే యన్యాయముచేయ యత్నించినచోఁ బ్రజలెవ్వరితోఁ జెప్పుకొందురు. ఇటుమీఁద నిట్టి ప్రశ్నములవైచి ప్రజలబాధింపనని ప్రమాణముచేసినచో నామంత్ర శక్తిచే నీయాపదఁ దృటిలోఁ బాయుజేయుదునని విని రాజు బ్రాహ్మణుఁడా! నాకు బుద్ధివచ్చినది. యెన్నడును నిటుమీఁద నిట్టిప్రశ్నముల నెవ్వరి నడుగను నీమంత్రదేవతసాక్షి యని ప్రమాణికముచేసిన

తిమ్మరుస్సు ఆప్రాంతమందే పాతించిన స్తంభము చెంతకుఁ దీసికొని పోయి యిదిగో భూమధ్యభాగము చూడుమని యా స్తంభము చూపించిన రాజు సంతసించి చూచితినిగాని నాకు నాఁకలియుఁ దప్పియు నగుచున్నది. ఎట్లు తీర్చెదవో నాప్రాణము నీయధీనమైనదని వేడిన నతండు రాజా! చింతింపకుము. నామంత్రశక్తిచే నాహారాదికము నిచ్చటనే పుట్టించెదనని యంతకుమున్న ప్రచ్ఛన్నముగా నాహార పదార్థములు మంచినీళ్ళును దెప్పించి యందొకచోట దాపించియున్న వాఁడగుట నొకపొదరింటనుండి యవి తీసికొనివచ్చి భుజింపుమని రాజుమ్రోల నుంచెను.

రాజు వానింజూచి యతని మంత్రశక్తికి నద్భుతమందుచు నాపదార్థములచే నాఁకలి యడంచుకొని బ్రాహ్మణోత్తమా! నీఋణం బెన్నటికిని దీర్చుకొనలేను. నారాజ్యంబంతయునిచ్చినను సరిపడదు నన్నింటికిఁ జేర్పుము సాయంకాలమగుచున్నది రాత్రి యీయడవిలో మృగముల బాధ మెండుగానుండునని తోఁచుచున్నది. నీమంత్రశక్తిఁ జూపింపుమనిన నతండు రమ్ము పోదము. నామంత్రసామర్థ్యమున జీకటిపడకపూర్వమే యిల్లుఁ జేర్చెద నని పూర్వము మెలికలుగాఁదీసి కొనివచ్చిన మార్గమునగాక నిదానముగానున్న దారిని నడచినంత ప్రాంతమందే పట్టణమున్నది సాయంకాలములోపుననే యూరు జేరిరి. రాజు తన్నుఁ జచ్చి బ్రతికినవానిగాఁ దలఁచి మరునాఁటిసభలో నా బ్రాహ్మణుఁడు తనప్రశ్నములకుఁ జెప్పినయుత్తరములకై సంతసించుటయేకాక నడవిలోఁ దనకుఁజేసిన మేలునుగురించి పెద్దయుందడవు స్తోత్రములు జేసెను.

పిమ్మట మంత్రియు సభ్యులును అతఁడుపన్నిన యుక్తులకు వేతెరంగుల సంతసించి మంత్రియాపదఁ దొలగించుటకు వచ్చినభగవంతుఁడుగాఁ దలంచి జయజయధ్వనులతోఁ బెక్కుస్తోత్రములుచేసిరి. రాజును మంత్రియు, తిమ్మరుస్సును బుష్పములచేఁ బూజించి అయ్యా!

తమకిష్టమైన కోరిక యెద్దియేని యుండిన సెలవిండు దానంజేసి మా
కృతజ్ఞత జూపించుకొనియెదమని యడిగిన తిమ్మర్సు వారితో
నయ్యా! మీరు సంతసించుటకంటె నాకుఁ గావలసినది యేమియు లే
దు. మీయిరువురకుమంచివాఁడనైతి. ఇదియేపదివేలు. పోయివచ్చెద
ము సెలవిండు తీర్థయాత్రికరుగుచున్న వారమని వారిచే సబహు
మానముగా ననిపించుకొని యప్పురంబువెడలి క్రమంబుగఁ గోపాల
పురంబుజేరిరి. అందొక శ్రోత్రియ బ్రాహ్మణునియింట బసఁజేసిరి.
ఆవిప్రుండును భక్తిపూర్వకముగా వారికాతిథ్యంబిచ్చి భోజనంబైన
వెనుక వినయంబున నాగమనకారణంబడిగిన నతనికి తిమ్మర్సిట్లనియె.

ఆర్యా! మేము విద్వాంసులము మాకుఁ బెక్కు విద్యలలోఁ
బాండిత్యముగలిగియున్నది. ఇప్పుడుకాశికరుగుచుంటిమి. ఈపట్టణపు
రాజునొద్ద నెవ్వరేని బండితులున్నచో వాదించి రాజుగారిచేఁ బారి
తోషికంబంది యరుగవచ్చితిమి. అనిపలికినవిని యాకుటుంబి,పక్కున
నవ్వి, యీరాజునొద్ద బహుమతిఁ దీసికొనివెళ్ళు విద్వాంసుఁడు గలఁ
డా! పాపము మీరెఱుఁగకవచ్చితిరి? ఈరాజుకూఁతురు చరిత్రమీరు
వినలేదుకాఁబోలు. ఆచిన్నది సకలవిద్యలలో నసమానపాండిత్యము
గలిగియున్నది. రూపంబునఁ ద్రిలోకకోకస్తనులుఁ దాని కీడుకారు.
విద్యారూపంబులఁ బరిశీలించియే దానికినుభయార్థ ప్రతిపాదకంబగు
కళానిలయయని పేరుపెట్టిరి. ఇదివఱకెంతలేసి పండితులు వచ్చినను
వారిని సులభంబున నోడించి జయపత్రికలనందుచున్నది. తనకుసాటి
యగు విద్వాంసుఁడు లేడని పలుకుటయేగాక దేశదేశంబులకువార్తా
పత్రికల బంపుచున్నది. మరియు నదియెట్టి రాజకుమారుఁడు వచ్చి
పెండ్లియాడుమనియడిగినను దనకెనగాడని నిరసించుచున్నది. మీ
రాతలోదరితోఁ దులగావాదము జేయుదురని నమ్మఁజాలను. ఊరక
మీగౌరవమేల చెడఁగొట్టుకొనియెదరు. మఱియొకరాజు నాశ్రయించ

రాదా? గౌరవింపక యిచ్చుబహుమానము గొనుటకంటె నీచముం డునా? నామాటవిని రాజనగరి కరుగకుడని యుపదేశించిన నవ్వుచు నాపాలునకు వారిట్లనిరి.

ఆర్యా! ఆకాంతవలన మాకు లేశమును భయములేదు. దీని తాతలవంటివారిదగ్గర జయపత్రికలను బుచ్చుకొంటిమి. మాకొక యాడుదిలెక్కా? అనిన నతండయ్యా! ఆకన్యను సామాన్యముగాఁ దలంచుచున్నారే, ప్రతిపండితుఁడును మొదటనీలాగుననే బింకముగా బలుకుచుఁ దుదకు నాసుదతితో వాదించి యోడి జయపత్రికనిచ్చి ఖిన్నముఖుండై యరుగుచుండును. నేను జెప్పవలసినమాటఁజెప్పితిని. పిమ్మట మీయిష్టమనుటయు రాయలు ఆబ్రాహ్మణున కిట్లనియె.

అయ్యా! ఆతొయ్యలి మిక్కిలిచక్కఁదనముగలదనియు నెవ్వరింబెండ్లియాడ లేదనియుంజెప్పితిరిగదా? పెండ్లియాడనిచో నాచక్కదనమునకు సాద్గుణ్యమేమి? దాని యభిప్రాయము పెండ్లియే యాడ ననియా? తగినవరుఁడుదొరక లేదనియా? దెలుపుఁడనిననతం డయ్యా! అఖిలవిద్యా పారంగతురాలగు నయ్యంగన పెండ్లియాడక పోవుటకు జోగురాలాయేమి? తనకుఁదగినవరుఁడు దొరక లేదనియే మానివేసినది. అధముఁడగు వరునివరించుటకంటె వాల్గంటికి హైన్యమున్నదా మీరింత సాభిప్రాయముగా దానిగురించి యడుగుచుంటిరేమి?అయ్యబల విద్వాంసులైన బ్రాహ్మణులకుఁగాని దర్శనంబియ్యదు వారైనను నన్యథాబుద్ధిశ్శృంగార విలోకనములఁజూచిరేని గ్రహించియుగ్ర దండనలకుఁ బాత్రులుగాజేయును. ఆమెతో మాట్లాడునప్పుడు మిగుల నేర్పుగా మాట్లాడవలయు. మాటలచేతనే లోనియభిప్రాయము గ్రహింపఁగలదు. అనిచెప్పిన సంతసించి రాజు ఆచేడియం జూడ మిగుల వేడుకపడిన దిమ్మరుసు రాయలతో అయ్యా! యింత తొందరపడియెదవేల? ఇప్పుడు బ్రాహ్మణుఁడు చెప్పినమాటలువింటివి

గద. కడు తెలివిగా నుండవలయు సుమీ? అది మిగుల జాణ, మాటల చేత నే గ్రహించును మనగుట్టుబయలైనచో మోసమురాఁగలదు దాని తో నేను మాట్లాడునప్పుడు నీయభీష్టముదీరులాగునఁ జూచుకొనుము ఇంతియ నీకులాభమని కొన్నివిషయములు బోధించి మరునాఁడుద యంబున, ప్రాతఃకృత్యముల నిర్వర్తించుకొని రాజునగరి కరిగి ద్వార పాలకునిచేఁ దమరాక రాజున కెఱింగించిన గోపాలుఁడును వారి నుచిత సత్కారంబుల నాదరించి సుఖాసీనులైన వారితో వినయం బున నిట్లనియె.

అయ్యా, మీదేశమేది ? ఇప్పుడెప్పటికిఁ బోవుచు నిచ్చటికి వచ్చితిరి ? స్వాగతంబేకద, మీరాక నాకెంతయు సంతోషము గలుగజేసినది, నేను కృతార్థుండనైతినని పలికిన నారాజు ప్రార్థనా వాక్యంబులకు దగినట్లుత్తరము చెప్పి తిమ్మరుసు రాజా ! ఇప్పుడు మేము కాశి కరుగుచున్నాము. మార్గంబున మీయశంబాలించి దర్శనముచేసి పోవుదమని వచ్చితిమి. మేము విద్వాంసులము మీపుత్రిక పాండిత్యము గలదనియు బెక్కండ్రఁ బండితుల నోడిం చెననియు విని యామెంజూచి నేత్రానందము గావించుకొని యామెతో గొంతముచ్చటించి శ్రోత్రానందము గావించుకొను టయే మాయభీష్టము. ఇంతకన్న వేఱుకోరిక లేదని పలికినవినిఁ యారాజు మేలుమేలు ఇంతకన్న పండువేది, నాకూఁతురుఁ పండితు లనిన మిగుల సంతసించును. అలాగుననే చూడవచ్చును. మీకే విద్యలోఁ బాండిత్యము గలదో చెప్పుఁడు, ఇప్పుడే చీఁటివ్రాసి యాబోఁటి కనిపెదననిన వారు, దమకు సకల విద్యలలోఁ బాండి త్యము కలిగియున్నదని చెప్పిరి. గోపాలవల్లభుండును వారిస్థితియం తయు వ్రాసి యాచీఁటిని గూఁతున కనిపెను. దానిం జదువుకొని యమ్మదవతి మిగుల ముదమంది తక్షణమే ప్రవేశపెట్టుమని మరల చీఁటివ్రాసి తండ్రికనిపినది.

రాజాజ్ఞాపత్రికారము సేవకులువారిని గ్రమంబునననేక కక్ష్యాం తరములు దాటించి కళానిలయ నిలయంబునకుఁ దీసికొనిపోయిరి.

ఆమె చెలికత్తె లాగదియందొకచో రత్నకంబళి పరచిరి. వారు దాని యం దుపవిష్టులైరి. ఆగదియందు నలుమూలలను తదీయరామణీయక ము విభ్రాంతస్వాంతులై చూచుచుండిరో యనునట్లు భూమియందు బ్రసిద్ధులైన రాజులచిత్రపటంబులు దర్పణంబులఁగట్టి యమర్పఁబడి యున్నవి. దేవతావిగ్రహముల లెక్కగొన నెవ్వరికశక్యము? త్రిలోక ములలో రూపంబునఁ బ్రసిద్ధలైన స్త్రీలపటంబులును వేనవేలు గట్టఁ బడియున్నవి. రాజును, తిమ్మరుసును, అందొకచో నొకపటంబున వ్రా యబడిన తమ రూపంబులంజూచి యించుకేనియు భేదములేకున్నరీతి కెంతయు నద్భుతమందిరి.

మఱియు నందున్నస్త్రీలపటంబులకెల్ల వన్నెయిడుచున్న కళా నిలయపటంబును జూచి తదీయవిలాసంబు విలాసంబున గ్రహించి మోహపరవశుండై నేలవ్రాలఁజొచ్చు నతనివెతయెఱింగి తిమ్మరుసు, అట్టె నిలఁబెట్టి వయస్యా! ఇదియేమి! ప్రతిమఁజూచినంతనే యింత వికారమందుచుంటివి. నిజముగా నాగజయానంజూచినచో మనగుట్టు బయలుపెట్టెదవని తోచుచున్నది. అట్లుచేసినఁ బ్రాణహానియగును సుమీ! యెంతతమియున్నను మనంబుననే యడంచుకొని యూరక వెఱ్ఱిచూపు చూడక యెద్దియో మిషచేఁ దదీయరూప వైభవంబం తయుఁజూచి, నేత్రపర్వంబుగావించుకొనుము. ఇది బాగుగా జ్ఞాపక ముంచుకొనుము. ఇఁక నీకుఁజెప్పుటకు వీలుండదు. కళానిలయ వచ్చు వేళయైనదని బోధించుసమయంబునఁ గళావతిచెలికత్తెయొకతె ప్రక్క నున్నగుమ్మమునకుభిత్తికాతుల్యముగాఁ గన్పడియున్న తెరఁదప్పించు కొనివచ్చినఁజూచి రాయలు, కళానిలయయేయనుకొనెనుగాని, తిమ్మ రుసుచేసిన కనుసన్నచేకాని యట్లూహించుకొనెను. అదియు వారి తెలివిని బరీక్షించుటకై కళానిలయచేఁ బంపఁబడినది కాని దాని యాటలు తిమ్మరుసునొద్దఁ బనికివచ్చునా? అది యాకారంబున నెక్కు డుగానున్నను దాని హస్తపాదంబుల కాఠిన్యమునుఁ బరీక్షించియే

తిమ్మరుసు దాని గురుతుపట్టెను. అదియు నిటునటు నొక్కింత సేపు త్రిరిగి వారుతన్నుదాదిగాఁ దెలిసికొనిరని గ్రహించివారి బుద్ధికౌశల్యమునకు మెచ్చుకొనుచు నందొక త్రాడులాగిన, జల్తారుతోను, బట్టుతోనుఁగట్టఁబడిన యొక విచిత్రపు జాలరు వారి ముందువ్రేలఁబడినది.

పిమ్మట నాకొమ్మయు లోనికరిగియుత్తరణితో అమ్మా! వారు విద్యలనెట్టివారో నాకుఁ దెలియదు లౌకికమం దసమానప్రజ్ఞలగలవారుగానున్నారు. వారు విద్యలలో నిన్ను జయింతురేమో యని భయమగుచున్నది. ఇదివరకు వచ్చిన పండితులెల్ల నన్నుఁ జూచిన నీవేయనుకొని మర్యాదగా లేవబోయి మాట్లాడుచుండిరి. వీరు నన్ను గౌరవింపక పల్కరింపమానివేసిరి. వీరితోఁ గడు తెలివిగా మాట్లాడవలయుఁ జుమీయని బోధించిన సంతసించుచు నాకళావతి విద్వజ్జనుల మ్రోలమాట్లాడఁదగిన యలంకారము వైచుకొని, యాచెలికత్తె కైదండంగొని హంసగమనంబునం జనుదెంచి మెఱపువలెఁ దళుక్కురని మెరయుచు నాగదిలోఁ బ్రవేశించుటయు, అది కళావతియని రాయల కెఱింగించుచు లేవఁబోవునట్లభినయించుచుండ నయ్యండజయాన హస్తసంజ్ఞచే వారించి నమస్కరించుచు నిట్లనియె.

కళానిలయ—(సంస్కృతముతో)శ్లో. యూయం యం భో భజధ మహీసురా నతింమే.

తిమ్మరుసు—కళ్యాణం భవతు కళాన్వితే భవత్యై.

కళా— దాతవ్యా నివసితుమత్ర సాధ్వనుజ్ఞా

తిమ్మ—స్థాతవ్యం సుఖమబలె బలేనవక్తుం.

అని యిట్లు సంస్కృతముతో శ్లోకపూర్వకముగా నిచ్చిన ప్రశ్నలకు శ్లోకపూర్వకముగానే యుత్తరంబిచ్చినంత వెరగుపడుచు మరల నాంధ్రముతో—

కళా—క. వందనమిదె గోవర్ధనధరా, బృందారకులార
తిమ్మ—సుందరీ! కల్యాణం, బందుము
కళా—మీచెంత వసింపఁదగు గతి నాజ్ఞయిండు
తిమ్మ—వసియింపుమిటఁ.

అని యిట్లు తనమాటలకు సమముగా నుత్తరము జెప్పినందులకు వెరగుపడుచుఁ దదానతిచేనాచేడియరత్నకంబళముపైఁ గూర్చుండెను.

అప్పుడు కృష్ణదేవరాయలు తద్రూపలావణ్యరసంబత్యులం గ్రోలుచున్నవాఁడోయన నవ్వనితామణిం జూచుచు నితరేంద్రియ వ్యాపారముల మగచి తదాయత్తచిత్తుండై సంభ్రమంబున మేనెల్లంబుల కలునిండ మోహపరవశానంద మనుభవింపుచుండెను. ఆసమయంబున నానారీమణికినిఁ దిమ్మరుసునకును నీరీతి సంవాదము జరిగినది.

కళానిలయ—అయ్యా తమదేశంబెద్ది?
తిమ్మరుసు—అవంతి.
క—భవదీయాభిధేయవర్ణంబు లెవ్వి?
తి—తిమ్మయ్యశాస్త్రి యని పేరువ్రాసి చూపి, యీతని పేరు కృష్ణయ్యశాస్త్రి.
క—ఆయనయు మీరును సతీర్థులా? సహాధ్యాయులా?
తి—సహాధ్యాయులమే.
క—మీరేమేమి విద్యలం జదివితిరి?
తి—మాకు సర్వశాస్త్రములయందుఁ బాండిత్యము గలిగి యున్నది.
క—మీవిద్యాభ్యాసం బెచ్చట?
తి—కాశిలో.
క—మీమతమో?
తి—ఆచరణము ద్వైతము. అద్వైతము నియమము. విశిష్టాద్వైతసహవాసముఁ గలిగియున్నది గాన మాకు మూఁడు మతములు సమ్మతములే.

క—విద్య లెన్నిగా మీరు పాఠముచేసితిరి.

తి—పదునాలుగుగాను పదునెనిమిదిగాను, అరువదినాలుగు గాను సంఖ్యాభేదముగాఁ జెప్పచుందురుగాని క్రియాసామరస్యముచే నెట్లు చెప్పినను నొక్కటియే.

క—అన్నిటియందు మీకుఁ బరిశ్రమగలదా ?

తి—కలదని చెప్పట యిది రెండవసారి.

క—మీకు మంత్రశాస్త్రమున స్వతంత్రముగలిగియున్నదా!

తి—నీప్రశ్నలు విపరీతముగా నున్నవే.

క— ఎందువలన?

తి—నీకేయేవిద్యలలోఁ బాండిత్యముగలిగియున్నదో చెప్పము

క—నేనును గొంచెము గొంచెముగా, నన్నివిద్యలందడవి చూచితిని.

తి—అదియే నాకు మీమాటలంబట్టి సందియముగానున్నది.

క—సందియమేల, దేనిలోనైనను నడుగుఁడు.

తి—సర్వవిద్యలన నేమి ?

క—అన్నియునని

తి— మంత్రశాస్త్రమెందులోనిది.

క—అథర్వణవేదములో నంతర్భూతము.

తి—నీవు దోషప్రకరణము చూచితివా

క—చూచితిని.

తి—పునరుక్తదోషమన నెద్ది!

క—చెప్పినది మరల హేతువులేకయే చెప్పట.

తి—ఇప్పుడు నీమాటలకు పునరుక్తదోషము పట్టినదా లేదా? అబలా చెప్పుము.

క—ఎట్లు

తి—సర్వవిద్యలు వచ్చునని రెండుసారులు చెప్పితిని. పిమ్మట నన్ను నీకు మంత్రశాస్త్రమునందు బరిచయముగలిగినదా యని యడిగితివి. అన్నివిద్యలయందు నాకుఁ బరిశ్రమము గలిగిన దనగా నిట్లేల యడగెదవు? మంత్రశాస్త్రముమాత్రము వానిలోనిదికాదా! సర్వవిద్యలు వచ్చినవారికి మంత్రశాస్త్రమందుఁ బరిచయము గలిగి యుండదా! అనవసరమయిన ప్రశ్నముచేయుట శబ్దదోషముకాదా యని చెప్పెను.

క—ఔరా! ఇదియా నాకుఁ బట్టినతప్పు.

తి—ఇదిచాలదా! ఇంతకన్న నధికమేది ?

క—మాటలకేమి, బలాబలములు విద్యలలోఁ జూపించ వలయును.

తి—మాటలే సందర్భముగా రానివారికి విద్యలు బాగుగఁ దెలియునని నమ్మకముండునా.

క—వ్యర్థపుమాటలతోఁ గాలక్షేపము చేయనేల! నన్ను మీరడిగెదరా! మిమ్ము నే నడుగుదునా ?

తి—ఎట్లయిననుసరే.

క—మొదట నేవిద్యలోఁ బ్రశంసచేయుదము.

తి—మొదట నేవిద్యపుట్టినదో దానిలోనే.

క—మొదటపుట్టినది వేదముగదా. దానిలోఁ బ్రశంసింతము నేను ప్రశ్నవేయనా ?

తి—మాటిమాటికి నడుగవలయునా

త—(అరుణముచదివి) దీనికి సూర్యపరముగాక పరబ్రహ్మ పరముగా నర్థము చెప్పుడు

తి—శివశివా! యని చెవులు మూసికొనియెను.

క — ఏమి చెవులు మూసికొనుచున్నారు? నా చదువు మీకుఁ గర్ణకఠోరముగా నున్నదా.

అనుటయు తిమ్మరుస్సు కళానిలయు కిట్లనియె. కాంతా! దాని యర్థముమాట పైనచూచుకొందముకాని ముందు నీకు వేదముచదువ నధికార మేగ్రంథములోఁ జెప్పఁబడినదో చెప్పుము స్త్రీముఖమునుండి వేదోచ్చారణము వినినవాని చెవులలో యమదూతలు సూదుల జొనుపుదురని శాస్త్రములు చెప్పుచుండ లేదా. అనిన విని నప్పడఁతి యుల్లము ఝల్లుమన నేమియుంబలుక లేక తెల్లబోయి యొక్కింతతల వాల్చి యంతరంగమున నోహో! ఇతండెవ్వఁడో గూఢవేషుఁడువలె నున్నాఁడు. ఇంతకుమున్ను వచ్చినపండితులలో నొక్కండైన నన్నీ ప్రశ్నచేయలేదు. వారు ధనకాంక్షచే నట్లు బలుక లేకపోయిరి. ఇతనికి ధనమందు దాశలేనట్లు తోచుచున్నది. కపటంబున నన్ను వంచించుటకై వచ్చినవానివలెనున్నాడు. పరీక్షించెదంగాక యని గోడపై క్కల వ్రేలంగట్టియున్న చిత్రపటంబులన్నియుఁ బరిశీలించి చూచి; వీరా! తెలిసినది. ఇతండు తిమ్మరుస్సు. నన్నుఁ దదేకదృష్టిగాఁ జూచుచున్నవాఁడు కృష్ణదేవరాయలు. రాయలకు నాయందనురాగము గలిగియున్నట్లు ఇంతకుమున్నే వినియుంటిమి. అతండు నన్నుఁజూచుటకై యిట్టివేషమువైచుకొని తిమ్మరుస్సుతోఁగూడ వచ్చెను. ఈతండు తిమ్మరుస్సుకానిచో నన్నిట్లువంచనచేసి మాట్లాడగలఁడా? అయ్యారో! ఈరాజు నామానభంగముజేసెనే. ఈదాసీపుత్రుఁడు నన్నుఁ జూడ నర్హుఁడా? ఛీ. ఈనీచుని జంపించినను నాకు దోషములేదు. వీనిపని పట్టించెదనని, తిమ్మరుస్సుతో మాట్లాడుచునే వీరు కేవలము బ్రాహ్మణులుకారు ఒకఁడు కృష్ణదేవరాయలును, రెండవవాఁడు అతనిమంత్రి తిమ్మరుస్సును నన్నుఁజూచు తాత్పర్యముతో వారిట్టివేషములు వైచికొని వచ్చిరి. నామానభంగముచేసిరి. వీరి నురిదీయు నాజ్ఞయిండని

యొకచీటివ్రాసి తండ్రికనిపినం దానిం జదువుకొని యతం డయ్యో పాప మూరక యింటికివచ్చిన బ్రాహ్మణులంజంపుమని వ్రాయుచుం టివేమి. రాయలును, మంత్రియు నిట్టి వేషముతో నిచ్చటి కేల వత్తురు? నీవు తలంచినది యసత్యము. వారు వీరగుటకుం దగిననిదర్శ నము జూపించిన వెనుకగాని యట్టియాజ్ఞ యియ్యనని, మరల జీటి వ్రాసి కూఁతునకంపెను.

దానిం జదువుకొని కళానిలయ అయ్యో ! మాతండ్రి యేమి యుం దెలియనివాఁడు, యెక్కుడు నిదర్శనమిచ్చినగాని యట్టిపని చేయఁడు. ఆలస్యమైనచో గ్రహించి వీరు లేచిపోదురు. కానిమ్ము. నే నొకమార్గంబున వీరి నానవాలుపట్టజేసెదనని యూహించి యత్తెరగంతయుం జీటిలోవ్రాసి తండ్రికనిపెను. ఆరాజు చీటిలో నున్నప్రకారము జరుపఁ బరిచారకుల నియమించెను.

ఆచిన్నదాని తొట్రుపాటంతయుంజూచి తిమ్మరుసు తమ్మాకో మ్మగ్రహించి యెద్దియో మోసముచేయఁ బ్రయత్నించుచున్నట్లు తెలిసికొని యచ్చేడియతో, మానినీ! మాకనుష్ఠానమునకు వేళయతి క్రమించుచున్నది. పోయివత్తుము, సెలవిమ్ము. మరల రేపుప్రొద్దుట సభజేయుదముగాక యని యడిగిన, నాతొయ్యలి యయ్యా! తొం దరపడకుఁడు కొంచమైన ప్రసంగముజరుగలేదు. మీమాటకు సమా ధానముచెప్పఁ నప్పువడియుంటిని, తగినయుత్తరంబిచ్చెదఁ గూర్చుం డుఁడని పలికిన నతఁడంగనా మరలవత్తుము. బాగుగా నాలోచించి యుండుము. పిమ్మటఁజెప్పెదవుగాని యనిపలుకుచుఁ దటాలున లేచి యొడలెఱుంగక మోహపరవశుండైన రాయలను హస్తంబుబట్టి లేవ నెత్తి యతనితోగూడ నతిరయంబున నడుచుచు, ముందుసింహద్వా రమునఁ జేతు లడ్డముగాఁబెట్టి నిలువఁబడియున్న యొక చాకలివానిఁ జూచి తిమ్మరుసు రాజుతో నిట్లనియె.

రాజా! ద్వారమున కడ్డముగా నిలిచియున్న చాకలివానింజూ చితివా, ఆచిన్నది మనస్థితిని గ్రహించి పరీక్షించుటకై యటు నిలిఁ

పినది. మనమిప్పుడు వానినిఁ జేతులు తీయుమని పలికినంతలో మన
అను రాజభటు లాటంకము సేయుదురు. వానిచేతులక్రిందనుండి దూరి
యుఁ బోరాదు. దీనికి నేనొక యుపాయమువన్ని వాని చేతులు
దీయించెదఁ నంతలో నీవు దాటిపోవలయును లేనిచో మోసము
వచ్చునుజుమీ యనిపలికి సింహద్వారముదగ్గరఁ బోయి, తిమ్మరుసు
రెండుచేతులు ఫాలంబునఁజేర్చి, యోహో, చాకలిమడేలుగారా, దం
డాలు, దండాలు దండాలండోయని, పెద్దయెలుంగునం బలికెను, వాఁ
డంతదిట్టముగా బోధింపబడినవాఁడైనను బ్రాహ్మణుఁడు నమస్కరించి
నంత నూరకుండ లేక మరల రెండుజేతులు జోడించి, అయ్యయ్యో!
మీరు గొప్పవారు. నాకుదండము పెట్టనచ్చునా, మీకేదండాలని
పలుకుచుఁ జేతులె త్తినఁ గృష్ణదేవరాయలు దాటిపోయెను. రాజ
శాసనము, జ్ఞాపకమువచ్చువాఁడు అయ్యో! మోసమయ్యెనే, నన్నుఁ
జేతుల్లుతీయవలదని చెప్పినమాట మరచి దండముపెట్టుటకై జేతులు
తీసితివి. ఆసమయంబున నాతఁడు దాటిపోయెను. రెండవవానిని
మాత్రము దాటనీయనని రెండుఁ జేతులడ్డముగాఁ బట్టెను.

అప్పుడు తిమ్మరుసు బ్రాహ్మణుఁడే కావున వానిని జేతులు తీయ
మనక యే బాహులుసందునుండి దూరిపోయెను కోట దాటినతోడనే
రాయలు మంత్రియు నంతకుబూర్వమే సిద్ధపరచియుంచిన యంచె
గుఱ్ఱము లెక్కి ప్రచ్ఛన్నముగా నిల్లుజేరిరి. బుద్ధిమంతుల కసాధ్యమైన
పనులుండునా! వారఱిగిన వెనుక జరిగినకథయంతయు నాచాకలి, రాజ
సమ్ముఖమునం దాచిన్న దాని కెఱింగించినవిని కళానిలయయతిశోకముతో
వాకెంత మోసముచేసిరో చూచితివా? నిజముగా బ్రాహ్మణులుగా
లని నేనెంత చెప్పినను వినకుంటివి తిమ్మరుసు మాయజేసి చాకలివాని
చేఁ జేతులు తీయించి రాజును దాటించెను. తాను బ్రాహ్మణుఁడు.

అభిమానమువహింపక దూరిపోయెను. దొరికినవారిని వృథాగావదలితివిగదా? దాసీపుత్త్రుఁడు, నామానభంగముజేసెను. వానిం జంపించినంగాని నేను భుజింపను. వారిని వెదకఁబట్టి తెప్పించి నామ్రోల జంపించినం జంపింపుఁడు, లేనిచో ప్రాణంబులు విడుతునని, యెక్కుడు పట్టుగాఁ బలికిన కూఁతు నోదార్చి రాజు మిగులఁగోపముతోఁ దత్క్షణము యమకింకరులవంటిభటులఁ బెక్కండ్రఁజీరి, ఆకపటబ్రాహ్మణుల యాకారములు వ్రాసియిచ్చి, వారుఁగనబడినచోట రెక్కలు విరుగఁగట్టి నాయొద్దకుఁ దీసికొనిరండని యాజ్ఞాపించి నలుదిక్కులకుఁ బంపెను. రాజభటులలోఁ గొందరు వారి నెందును గనుగొనలేక విసిగి మరలివచ్చుచుండఁ దోవలోఁ గాశికరుగుచున్న యిద్దరుబ్రాహ్మణులు కాలవశమున వారి కన్నులంబడిరి.

వారినే, వారనుకొని రాజసేవకులా పాంథులకు సంకెళులువైచి రాజసముఖమునకుఁ దీసికొనివచ్చి రాజద్రోహులం బట్టితెచ్చితిమని విన్నవించిన రాజు వారినందరఁ గూఁతుఁనొద్ద కనిపెను. బుద్ధిశాలిని యగు నమ్మగువ వారింజూచి నవ్వుచు మందులారా! వీరుఅంతఃపుర ద్రోహులుకారు! వీరు నిజముగా బ్రాహ్మణులే, నిష్కారణము వీరి నేల బట్టితిరి. తిమ్మరుసుతోఁగూడికొనియున్న రాయలు మీకు దొరకునా! పో పొండని వారినదల్చి నిరపరాధులమని మొరపెట్టుచున్న యాపాంథుల కపారసువర్ణంబిచ్చి సంతోషము గలుగఁజేసెను.

పిమ్మట మఱికొందరు రాజభటులువచ్చి అమ్మా! వారు, మీరనుకొనినట్లు రాయలును మంత్రియేసుఁడీ! అంచెగుఱ్ఱములెక్కి పరుగిడుచుండ మేమడ్డము వెళ్ళితిమి గాని వారు పిచ్చుకత్తులతో మమ్ముఁ బరాభవించిరి. వారికి వెరచి పారిపోయివచ్చితిమి, వారు సాధారణముగా, మాకు వశమగుదురా! యెద్దియో, యెక్కుడుప్రయత్నమున వారింబరిమార్ప యత్నించుమని పలికి తమ నివాసంబులకరిగిరి. పిమ్మట నక్కాంత యత్యంతసంతాపముతో అన్ననా! నేనొకసిద

జాతులకన్నులంబడితినికదా ? ఒక యధముని కన్నులంబడి వేరొ కని నెట్లుపెండ్లియాడుదును? వృధాగా నాయౌవనము సౌందర్యము సంపదయు నీటిపాలయ్యెనే? అయ్యయ్యో, ఆదురాత్మున కేమి లాభము వచ్చినది అంతమాత్రముననే నేను వానిం బెండ్లియాడుదు ననుకొనెనా. తిమ్మరుసుయొక్క బుద్ధినైపుణ్య మంతయు నాయెడ వినియోగపరచెనే కానిమ్ము, ఆదురాత్ము నెట్లైనను సాధించి పిమ్మటఁ బ్రాణంబులు విడుతునని నిశ్చయించి తండ్రికిఁ గొన్ని రహస్యములు బోధించి యతనిచేఁ గృష్ణదేవరాయల కిట్లు శుభలేఖ వ్రాయించినది.

"రాజాధి రాజ రాజపరమేశ్వరాది బిరుదాంకిత కృష్ణదేవ రాయ మహారాజుగారి సన్నిధికి గోపాలవల్లభుఁడు వ్రాయు శుభలే ఖార్థములు ఆధునికనృపాలురలో నధికవిఖ్యాతిగల మీకు సకలవిద్యా పరిపూర్ణయగు కళానిలయ యనుసార్థకనామముగల మదీయతనూజ నిచ్చి వివాహము జేయనిశ్చయించినారముగాన నిందువ్రాసిన శుభ ముహూర్తమునకు సకల పరివార సహితముగాఁ తరలి రాఁగోరు చున్నాను" అని వ్రాసినయాచీఁటి, బ్రాహ్మణుల చేతికిచ్చి యంపిన వారతిరయంబునఁ గృష్ణదేవరాయలనగరికిఁజని యావాచిక మా రాజునకెఱింగించిరి. సంతసముతో నతండప్పుడ వచ్చి నిలిచియున్న తిమ్మరుసున కాచీఁటి చూపి యిట్లనియె.

మిత్రమా ! నీయుద్యమ మూరకపోవుగా! ఇదిగోచూడుము. నేనుగోరిన చిన్నది నన్నేకోరినది నాకుఁబెండ్లి కాఁగలదు. వేగమ వివాహ సన్నాహము గావింపుమని పలికిన విని నవ్వుచు తిమ్మరుసు రాయలకిట్లనియె ఔనౌను నీపెండ్లి జేయుటకే వారీశుభలేఖ నీకం పిరి. పాపము నీవాకపటమెరుఁగక అందలి యంశములన్నియు నిక్కమని నమ్మి సంతసించుచుంటివి. వారియుద్యోగము వినుము, మనము అంతఃపురభంగము జేసితిమని తెలిసికొని కోపముతో

నారాచచిన్నది నిన్ను వివాహము మిమచే నచ్చటికిఁబిలిపించి చంప నిశ్చయించినది. ఆపూఁబోఁడి మిగులజాణ సామాన్యురాలుకాదు. కానిమ్ము దీనికే సమాధానము చెప్పలేనిచో నాబుద్ధిసూక్ష్మత యేటిది? దీనికిఁ దిరుగ సమాధానము పంపవలసియున్నదని యప్పుడే యిట్లు వ్రాసెను.

"గోపాలభూపాలుఁడంపిన శుభలేకార్థములు చదువుకొని యెంతయు సంతసించి కృష్ణదేవరాయలు వ్రాయునది యేమనగా మీకన్యకను స్వీకరించుటకు సమ్మతించడమైనది. మీశుభలేఖ ప్రకారము తరలివచ్చుటకు మాలో నాచారములేదు. మాకు మారుగా గులాచారప్రకారము కత్తినంపుచుంటిమి గనుక వైవాహికక్రియలన్నియు దానికే జరిగించవలయును" అని వ్రాసి యొక కత్తితో నాలేఖనుమున్నువచ్చిన బ్రాహ్మలచేతికిచ్చి యంపివేసిరి.

అట్టిదానిం జదువుకొని యాచిన్నది బళిరే! ఇప్పటికి దాటి పోయిరి. కానిమ్ము ముందైనను దొరకరా! యెప్పటికైనం బగ సాధించెదంగాక యని మరికొన్ని దినములు గడిచిన పిమ్మట తండ్రి పేరుపెట్టి మరల నొకచీటి వ్రాసినది.

"మీయాజ్ఞానుసారముగాఁ గత్తికి బెండ్లిజేసితిమి ఇది వసంత కాలముగాన, మీరువచ్చి పైకార్యములు జరిగించుకొనవలయును" అట్టిచీటిం జదువుకొని రాయలు కొంతసంతసించి యంతలో తిమ్మరుసు మాట జ్ఞాపకము తెచ్చికొని యదికపటమని తెలిసికొని తిమ్మరుసును బిలిపించి యతనిచేఁ బ్రత్యుత్తర మిట్లువ్రాయించెను. ప్రస్తుతము మాకు రాజకార్యముల తొందరగలిగియున్నది. వచ్చుటకు వీలు లేదు. తీరికజేసికొని ముందు జాబుపంపెదమని వ్రాసిన దానిం జూచి యాచిన్నది, కొంచెము చింతించి కానిమ్ము యెప్పటికైన రాకపోవునా? నాఁడుదొరకకపోవునా? యని యోపికపట్టి మరికొన్ని దినముల గడపినది. ఇట్లు రెండుసంవత్సరములు త్తరప్రత్యుత్తరముల తోడనే కాలము జరిగినదికాని యామెకోపము తగ్గినదికాదు.

మఱియొకప్పు డప్పడఁతి మరల తండ్రిపేరుతో మేమెన్ని యుత్తరములు వ్రాసినను మీరువచ్చుమాట వ్రాయరు. వివాహమై రెండు సంవత్సరములైనది. మమ్మును మిమ్ముసుఁగూడ జనులు నిందించుచున్నారు. మీకు వచ్చుటకుఁ దీరికలేనిచో వచ్చుటకి మాచిన్నదానినే యంపుచున్నాను. శుభముహూర్తమునఁ గార్య మును జరిగించుకొనుఁడు. ఈడువచ్చిన పడఁతి యత్తవారింటియొద్ద నుండఁదగినదికదా? దీనికి మీయభిప్రాయము వ్రాయుఁడు. అని యుత్తరమువ్రాసి యంపిన దానింజూచి తిమ్మరుసు అమ్మానిని దీర్ఘ క్రోధమునకు నాశ్చర్యపడుచు, మీరు వ్రాసిన విషయములకు సమ్మతించితిమి. ఇచ్చటనే యన్నికార్యములు జరిపించుకొనియెదము. శీఘ్రముగా నయ్యాబల నిందుఁబంపుడని ప్రత్యుత్తరము వ్రాసి యంపెను.

దానిం జదువుకొని యవ్వనిత, తండ్రికావృత్తాంత మెఱింగించి యతఁడెన్నివిధములచే, బోధించినను వినక, కొంతసైన్యమును, దాసదాసీజనంబును వెంటబెట్టుకొని నిక్కముగా నత్తవారింటికరుగు మెఱుఁగుఁబోఁడియుంబోలె బయలుదేరి కతిపయప్రమాణంబుల కృష్ణ దేవరాయఁల నగరంబున కరిగెను. ఇంతలో దిమ్మరుసు బాల్యస్నేహి తుండును విచిత్రవస్తునిర్మాణదక్షుండునగు చిత్రకారునిం బిలిపించి యతనితో రాయలవంటి విగ్రహ మొకటి రచింపుమని యారీతి యంతయు బోధించిన, నాచిత్రకారుండధిక ప్రయత్నముతో నట్టి విగ్రహ మొకటిచేసి యొకగదిలో పంచముమీఁదఁ బరుండబెట్టెను. దానిఁజూచినవారు. యథార్థముగాఁ గృష్ణదేవరాయలే నిద్దుర పోవు చున్నవాఁడని యనుకొనకమానరు. మరియు నాగదిలో నొకమూల నేలసొరంగముంకునట్లేర్పరిచెను. అందున్నవారెవ్వరికినిఁ గనంబడరు అందులోనివారికి పైవారు గనంబడుచుందురు. ఆకృత్యము తిమ్మ రుసును రాయలును ముచ్చియునుగాక యితరులెవ్వరును నెఱుంగరు. ఆగది యద్భుతమైన యలంకారములచే నిండింపఁబడినది.

అట్లు తమగ్రామమునకు వచ్చిన కళానిలయకుఁ దగు విడుదలు నియమించి సకలోపచారములు జరుగునట్లేర్పరిచెను. కళానిలయ వచ్చిన తరువాత ముహూర్తము నెపంబున రెండుమాసములు జాగు జేసిరి. మరియు నొకనాఁడు గర్భాధానమునకు ముహూర్తము నిశ్చయించినట్లు ఆచిన్నదానికిఁ దెలియఁజేయుచు మాకు, వధూవరులు పీటపై గూర్చుండి యాశీర్వచనములు పుచ్చుకొనుట యాచారము లేదనియు నూరక గదిలోనికిఁ బోవుటయే సంప్రదాయమనియు నాఁడు సాయంకాలముననే నియమింపఁబడిన గదిలోనికి రావలయు ననియుం దెలియఁజేసిరి.

అట్టివార్తవిని యక్కలికియుఁ దానేర్పరచుకొనిన కపట కృత్యమున కావిధం బనుకూలముగానే యున్నదని మిగుల సంతసించెను. అంతట సాయంకాలమున రాజభటులు పల్లకీ గొనిపోయి కళానిలయనిలయంబునకరిగి ముహూర్తసమయమునకు నయ్యండజయానను గళ్యాణగేహప్రాంతమునకు దీసికొనివచ్చిరి.

అందు నమ్మకమైన దాదులు కొంచెముగానుండిరి, వారా కళానిలయకు మంగళకృత్యములు నిర్వర్తించి దేవీ ! నీపతియింతకు మున్నె గదిలోని కరిగి నీరాకను వేచియున్నాఁడు, నీవును ద్వరగా నరిగి యతని యభీష్టము నెరవేర్చుమని పలికి యుచితసల్లాపములతో నాపల్లవపాణినిలోనికిఁ ద్రోసిరి.

అగ్గజయాన సిగ్గునంబలె కొంతదనుక శృంగారచేష్టల నభినయించుచు నెట్టకేలకు బలాత్కారముగా లోపలకుఁ బోయి తలుపు మూలను నిలువంబడెను. ఆ రాజును తిమ్మరుసును అంతకుఁ బూర్వమే యాగదిలోనున్న నేలసొరంగములోఁ బ్రవేశించి యాచిన్నది చేయు కృత్యములం జూచుచుండిరి. దివ్యాలంకారమండితంబగు నాగదిలో గాజుదీపములచే బట్టపగలుగా నుండెను.

ఆకాంతయుఁ గొంతదనుకఁ దలుపుదెస నిలువంబడి యెంతకుఁ దన్నుఁగాంతుఁడు బిలువనికి సంకోచమందుచు నతనికి నిద్దురపట్టినది గానూహించి సంతోషించుచు నామంచముదాపునకరిగి యందున్న విగ్రహము మొగముపైఁ జూట్కులు నెరయజేసి కన్నులుమూసి యుండుట తిలకించి గాఢముగా నిద్రించుచున్న వాఁడనియేయూహించి యిప్పటికి దనకోరిక భగవంతుఁడుఁ దీర్చినవాఁడుగదా! యని సంతసించుచు నలుదెసలు బరికించి తనరవికలో మడతలుబెట్టి యిమిడ్చిన కత్తియొకటిదీసి చేతితో సాపుచేసి పిమ్మట నాకత్తి ఝుళిపించుచు హుమ్మని యావిగ్రహముపై జందెముపెట్టుగా నొకవ్రేటు వేసినది.

అప్పుడా విగ్రహము కసుపుఁలో బోసియుంచిన వసంతము, చిమ్మనగ్రోవిని జిమ్మినట్లువచ్చి యచ్చెలువ కనులంబడిన నక్కత్తిం బారవైచి చేతులతోఁగన్నులు నులుముకొనుచుండెను. ఇంతలో తిమ్మరుసును రాయలును గోతిలోనుండి పైకివచ్చిరి. ముందుతిమ్మరుసు నేలఁబడియున్న కత్తినందుకొనెను. రాయలు కళానిలయచేతులు బట్టుకొని మిత్రుఁడా! ఆకటారి నీటుతెమ్మ యీద్రోహురాలిం బరిమార్చెదనని యుగ్రముగాబలికి యతని చేతనున్న కత్తినందుకొని యోసి ఘాతుకురాలా! చూడు మిదిగో నన్నుఁ బరిమార్చవలయునని తెచ్చినకత్తి నీప్రాణంబులే గ్రోలుచున్నది. నీయిష్టదైవంబును బ్రార్థించుకొమ్మని పలికి కత్తిపైకెత్తినతోడనే యాచేడియ యొడలు గడగడవడఁక దేవా! నేనిప్పుడు నీయాధీననైతిని, యెందుఁబో గలను. నాచేయు విన్నపంబాలించి పిమ్మట వధింపుము. ఇప్పుడు నీయెడ నేనుజేసిన కార్యముంబట్టి యుడుగక వధించిన బాపంబు లేదు. కాని స్త్రీపురుష తారతమ్యంబునంచేసి కొంత పరిశీలింపనగు. ఒక్కొక్క కారణంబునంబుట్టిన కోపంబు ఒక్కొక్కవనితోడ వతీరును. ఆమెత్తినకత్తి వాల్చినంగాని నాకు వాక్కు రాకున్నది.

కంఠగత ప్రాణనైన నామొరవినుట నీకేపాటిలోపంబని పాణిభయ యార్తయై యేడ్చుచున్న చూచిన్నదాని యేడుపువిని సహజ కృపాళుండగు నారాజు డెందంబున బొడమిన కనికరంబు పైకిఁ దోపనీయక చాలుచాలు నీనీతివాక్యములకేమి లే? లోకములో స్త్రీలే దుర్మార్గమతులు. వారిలోఁ నీవంటివారు మరియును దురితా త్మలట్టివారియెడఁ గనికరముచేయుట లోకంబున కపకారము సేతగా భావింతురు. ఒకవేళనిప్పుడు చెప్పు నీతివాక్యములు వినినిన్ను విడిచి నచో నీబుద్ధి చక్కబడునా? పాములకుఁ బాలుపోయుట విషవృద్ధికే గదా? నిన్ను విడువను అయినను నీవుచెప్పునది యెద్దియో చెప్పుము అంతదనుక వేటువేయను. కర్తవ్యాల్పకయిట్టియుంచెదనని పలికిన నక్కలికి యలుకుచు దయారస మతనిమది మొలకలెత్తు పలుకుల నిట్లనియె.

ఆర్యపుత్రా! శరణాగతరక్షకత్వమే పరిత్రాణముగా నెంచు నీయట్టి పుణ్యాత్ములు పెరవారి గుణాగుణ తారతమ్యము గణింతురా; స్త్రీలు వధ్యులుకారని మీరెఱుంగనిదా? ఇప్పుడు నే నేమి యన్నను అసత్యముగానే తోచును. కోపము సేయక స్వపక్ష పర పక్షములు విడిచి యొండు వినుఁడు. ఏదోషము నెఱుంగక పండిత గోష్ఠితో నంతిపురములోనున్న నన్నుఁ గపటముగావచ్చి చూచి నావ్రతభంగముచేసిన మొదటితప్పు నాయదియో మీయదియో మాధ్యస్థులెవిచారింపుఁడు ఎంతవాఁడువారైనను శూరతగల రాచ వంగడంబునం బుట్టినవారికి బిమ్మటఁ దత్ప్రతీకారము సేయదలంచుట యెక్కుడు తప్పుగాదని బుద్ధిమంతులకుఁ దోచకమానదు. అయినను నధికవిద్యాగుణరూప సంపన్నుఁడగు భూపాలుఁడువచ్చి వరింపవ లదని తోఁయుటయుఁదప్పునిన నేనయొప్పుకొనియెదను. ఇదియె నాకోపంబునకు బలియైనది. మీయెడ మున్నెంత క్రౌర్యముగలిగి యుండెనో యిప్పుడంతప్రీతి జనించుచున్నది. నావిద్యారూపంబులు

వృథా సేయకుఁడు. మీయెడ నెన్నఁడును నట్టిదోహమును దలపె ట్టను. యథార్థముగా మిమ్ముఁబెండ్లియాడి మీకు ద్రోహముజేసి కాపురమునకు నీళ్ళుబోసికొన నేనంతచేలనా! యొకవేళ నింతకు మున్నిట్లుచేసితివని యనెదరేమో! మిమ్ముఁ బరిమార్పవలెనని యట్లంటినిగాని మనస్ఫూర్తిగా వరింపలేదు. నామాటనమ్ముఁడు. దైవసాక్షిగామిమ్మే పతిగాఁజేసికొనియనుకూలవర్తనముల మెలఁగుచు హృదయానందమాపాదించెద. మున్ను నాయెడఁ బొడమిన మోహం బిప్పుడు తలంచుకొనుఁడు. యెదిరి మనంబెట్లున్నదో గ్రహించు సామర్థ్యముగల తిమ్మరుసునకు నామాటలంగల సత్యాసత్యంబులు దేటపడవా? బాగుగా విదారింపుఁడని యత్యాతురముగాఁ బ్రార్థిం చుచున్న యవ్వధూటిమాటలు నిక్కములేయనినమ్మి తిమ్మరుసు రాజునకుబోధించి యామెంజంపుట మానిపించి యామెకు మఱియుం గొన్ని బుద్ధులుగరపిభార్యాభర్తలగుటకు వారిరువుర నొడంబర పించెను.

పిమ్మటఁ దిమ్మరుసును కళానిలయ తండ్రియగు గోపాలవల్లభు నకుఁ వార్తనంపి యొకశుభముహూర్తమున నధికవైభవ మొప్పఁ గళానిలయకును కృష్ణదేవరాయలకును వివాహమహోత్సవము జరి గించి యతని యభీష్టము తీర్చెను. అధికబుద్ధిమంతుఁడగు తిమ్మరుసును మంత్రిగాఁగల రాయలు కోరిన కోరిక దీర్చుకొనుట యేమి యాశ్చర్యము.

తర్వాతఁ జిత్రకారుండు తానధిక ప్రయత్నముతో నంద ముగాఁ జేసిన విగ్రహంబట్లు విచ్ఛిన్నంబగుటకు జింతించి రాయలు నొద్దకరిగి, దేవా! నేనీప్రతిమ నప్రతిమ సామర్థ్యంబునంజేసితి దాని వృథాపారవైచిన నామనంబునకుఁ గష్టముగానుండును. దానియుద రము మరల బాగుజేసితి నది నీయాకారమేగాన సప్తసంతానముల వలె భూమియందుఁ జిరకాలముండునట్లేర్పాటు చేయుఁడని వేడు

కొనిన నతనిమాటలు విశ్వసించి రాయలును తిమ్మరుసును మిగుల సంతోషముతో భూరిశిలానిర్మితంబగు నాలయంబునం బర్యంకమునం బండుకొనియున్నట్లు ఆవిగ్రహమును స్థాపించి దానికి నిత్యోత్సవములు జరుగుటకుఁ బెక్కు అగ్రహారములిచ్చి పరిచారకుల నియమించి నిత్యకళ్యాణములు వెలయఁ జేయించెను.

నాటంగోలె నేఁటి తుదదాక దానికా యుత్సవములు జరుగుచున్నవి. అదియట్లుజరిగి చిరకాలమగుటచే నిప్పుడు దాని దేవతావిగ్రహమని భావింపుచుండిరి, గోపాలా! నీవు చూచిన విగ్రహవృత్తాంతమిది. ఈరహస్య మెవ్వరును నెఱుఁగరు. మద్గురు ప్రసాదలబ్ధంబగు రత్నప్రభావంబునంజేసి నాకుఁ దేటపడినది చిత్రకారకుని రచనాచమత్కృతిచే నది యిప్పటికిని జెక్కుచెదరక క్రొత్తదానివలెనున్నది. దానంజేసియే దానికన్నులు మూయబడియున్నవి. కథయైనది. లే లెమ్ము బొద్దెక్కినది. మరల నడువవలెనని చెప్పిన విని యాగొల్లవాఁడుల్లంబున నెంతేని సంతసించుచు నతనికి నమస్కరించెను. తరువాత వానితోఁగూడ నాస్వాములవారు క్రమంబునఁ బ్రణవాక్షరజపమ్ముఁ జేయుచు దొమ్మిదవమజిలీ జేరిరి.

---

తొమ్మిదవమజిలీ.

# సింహదమనునికథ.



అందు గోపాలుండాకులకై పొలమున కరిగి యొకచో మేదోమాంసచర్మశూన్యంబై మిక్కిలి పెద్దదియగు పుఱ్ఱెనొకదానింజూచి దాని వృత్తాంతము జెప్పుమని యడిగిన మణిసిద్ధుండా రత్నప్రభావంబునఁ దెలిసికొని యక్కథనిట్లు చెప్పదొడంగెను.

కళింగదేశాలంకారంబగు విజయపురంబున శత్రుంజయుండను రాజుగలఁడు. అతండు పెద్దకాలంబు రాజ్యంబుజేసియు సంతానము

గలుగమిఁ బరితపించుచు సంతానకాంక్షంజేసి క్రమంబున రూప యౌవన కళావిశాలలైన చేడియల నేడ్వురం బెండ్లియాడెను. వారి యందును సంతతిఁబొడమిన్నదికాదు. అప్పుడు చింతించి యమ్మహీ కాంతుం డొకనాఁడు విజ్ఞానసిద్ధుండనుయోగి నాశ్రయించిన నతం డును దదీయభక్తివిశ్వాసములకు మెచ్చి దివ్యప్రభావుండగు తనూ భవుం డొకడుద్భవించునని మామిడిపండొకండిచ్చి యది నీకిష్టురా లగుభార్య కిమ్మని చెప్పియంపిన నారాజు సంతోషముతో నింటికి వచ్చి యేడ్వురుభార్యలయందును సమానప్రీతికలవాఁడగుట నొక దాని విడిచి యొకదాని కియ్యనేరక యందరకు సమముగాఁ బంచి యిచ్చిన నాఫలంబు దిని యా సుందరులందఱు గర్భవతులైరి.

అంత రాజొక్కనాఁడు పెక్కండ్రు మృగయులు సేవింప వేటకై యడవికఱిగి యందందు వెదకి వెదకి పెక్కుమృగంబులం జంపి యొక్కవరాహంబు తనవేటుఁబడియు మడియక పారిపోయిన వెంట నొంటిగానరిగి తరిమిన నదియుఁ బెద్దదూరం బతనింగొనిపోయి యం దదృశ్యంబగుటయు నతండు వెఱఁగొందుచుఁ దత్ప్రదేశ మం తకుమున్న తాసెఱుఁగనిదగుట వేగంబున సేనాముఖంబుజేరవలయు నని తలఁచి యతిరయంబున నరుగుచుండ నొకదండఁ గన్నులపండు వుగ నుద్యానవనం బొండుగనఁబడినది. మున్నెన్నఁడును కనివిని యెఱుఁగని యవ్వాని సొబగునకు వెఱఁగొందుచు నతం డివ్వన మెవ్వ రిదియో! దీని రామణీయక మరయ నమరనిర్మితంబని తోఁచుచున్న ది. ఇందమానుషంబులగు వింతలుండక మానవు. చూచిపోయెదం గాక. అని యల్లనల్లన నయ్యుపవనాంతరమున విహరింపుచుఁదదీయ విశేషమరయుచు నడుచుచుండ నొకపొదరింటిదండ నవ్వనంబునకు మండనాయమానం బగు వనదేవతయో నాగనొప్పారు నొక యొప్పులకుప్ప గనంబడినది.

అప్పుడమితేం డాశ్చర్యమందుచు, నిలువంబడి యాపో్ర యాలు సోయగంబంతయు నయనంబుల గో్రలుచున్నవాఁడో యన నిరీక్షించుచుఁ బాపురే! ఇట్టిపాటలగంధిని వసుంధర నెందునుజూడ లేదు. ఇత్తోట వేల్పులదని నేఁటికిఁ దేటమైనది. ఇది దేవతాకాంత లలోఁ బ్రసిద్ధివడసిన యూర్వశి కావచ్చును. యూర్వశియైనచో నేత్రంబులు మూతపడునా? కాదు. భూలోకములోని వనితామ ణియే. దీని వృత్తాంతమడిగి తెలిసికొనియెదంగాక యని యమ్ముద్దు గుమ్మ డగ్గరకరిగి మోజవ్వనీ! నీవెవ్వతవు? ఇవ్వనంబున నొంటిగా నుండనేమిటికి? నీయభిధేయమెద్ది? నిన్నుఁ గన్నదల్లిదండ్రు లెవ్వరు? నిన్నుఁ బతిగాఁ బడసిన ధన్యునిపేరెద్దియో యెఱింగించి శ్రోత్రా నందము గావింపుము. అని యడిగిన నతనిమాటలు విని సహించని దానివలెఁ గన్నులు మూసికొని యవ్వాలఁది తలవాల్చి మాటాడ కున్న నారాజు వెండియు నిట్లనియె.

వధూటీ! మాటాడవేమి? నన్నుఁజూచి సిగ్గుపడుచుంటివా? నన్నన్యునిగా భావింపక నీవృత్తాంత మెఱింగింపుమని తరిమి తరిమి యడిగిన నక్కపటపు టక్కులాడి యొక్కింతతలయెత్తి నాతోనీకేమి పనియున్నది? నీవచ్చినతో్రవం బోవరాదా? యేకాంతముగానున్న కాంతలఁ బురుషులు పలుకరింపవచ్చునా! చాలుచాలు మగవారి చెయువులు నేనెఱుఁగనివికావు. మొదట మృదువైన పలుకులచే ముదవతుల మతులుఁగరిగించి పిమ్మటఁ జిక్కులుపెట్టెదరు. నన్నూ రక పలుకరింపక నీతో్రవంబట్టిపొమ్మని నిరసించి పలికిన నక్కలికి మాటలచే ననురాగ మంకురింప నతఁడు మెల్లన నిట్లనియె.

వాల్గంటీ! అట్లంటివేమి? మగవారిగుణంబు లేమి పరిశీలించి తివి? నన్నుఁ బురుషసామాన్యునిగా దలంపకుము. నీకథ తెలుపుము పిమ్మట నాయభిప్రాయ మెఱింగించెద ననుటయు నప్పాటలగంధి

ఆహా! రాజుల మాటలు మరియు నమ్మఁదగినవే. అడవియందు దేకాం తముగానున్న శకుంతలను మోసముచేసి క్రీడించి పిమ్మట నిడుములు పెట్టిన దుష్యంతునికథ నీవెఱుఁగవు కాఁబోలు. మొదట నతండును నింతకన్న నెక్కుడు మాటలాడ లేదా? మఱుమాటాడక నీదారిని నీవు పొమ్మని పలికిన నమ్మగువ పలుకులు రాజుహృదయమునకు లంకెలై తగులుకొనిన మించిన తమకముతోఁ గ్రమ్మర నిట్లనియె. నారీమణీ! సారెకు నన్నిట్లు వట్టిమాటల నలయించనేల. నీపలుకుల చేతనే నీవుఁ బెండ్లికానియట్లు తోఁచుచున్నది. బాలా! విను నన్ను నీవు స్వీకరించినచో సర్వకృత్యములయందు నీ చెప్పినట్లు నడుచువాఁడ నెక్కేల, నా రాజ్యంబే నీయధీనంబు జేయుదు. నీ తెరం గెఱింగింపు మనిన, నల్లన నవ్వుచు నక్కురంగనయన యిట్లనియె.

రాజా! అట్లైన నాకథవినుము నేను అవంతీశ్వరుని కూఁతు రను. నా పేరు సూర్యప్రభ. నాకుజవ్వనము పొడసూపినంత మాతండ్రి వివాహముసేయ ప్రయత్నించెనుగాని మగవారి ద్రోహకృత్యము లెఱింగిన నాకు వివాహమునందే యిష్టముగలుగమి వలదని మాతం డ్రితోఁ జెప్పితిని. అతండును నాకుఁ బెక్కు తెరంగుల బోధించెను. నాయనుమతి లేని యప్పుడేమి చేయఁగలఁడు? అట్లు నేను కన్యావ్ర తంబు బూనియున్న యప్పుడొకనాఁడు సిద్ధవ్రతుండను యోగివ చ్చెను. అమ్మహానుభావునకు శుశ్రూషచేయ నాతండ్రి నన్ను నియ మించెను. నేనును ఆయనయందు భయభక్తి విశ్వాసములు గలిగి శుశ్రూషఁ జేసితిని. దానికతండు మెచ్చి వెళ్ళబోవునపుడు నన్ను బిలిచి నీకెద్దియేని యిష్టమైనవరం బడుగుమనిన నేనేమియుఁ గోరక మనోహరోద్యానవనమునం దేకాంతముగా విహరింపవేడితిని.

అత్తపోధనుండు సంకల్పమాత్రంబునం బ్రభవించిన యీయు ద్యానవనంబు నాయధీనంబుజేసి యెక్కడికేని జనియె. నేనును మా

తండ్రియనుమతి వడసి నాఁటినుండియు నిందుఁ గ్రీడించుచుంటిని. ఇంతకుమున్ను నిన్నుగాక యిందువచ్చిన వారిఁనిగానను. నిన్ను జూచిననాఁటఁగోలె నాడెందమునఁ గామక్రీడాభిరతిజనించినది. కాని పూర్వులచర్యలఁ దలంచుకొనినంత స్వాంతమువిరాగమందుచున్నది. యథార్థముగా నీవు నేచెప్పినట్లు చేసెదవేని నీవెంటవచ్చెదను. నిదానముగా విచారించి మరలఁజెప్పుము. ఇంతకుమున్న నీకుఁగలిగియున్న భార్యలవలన నీకుఁ జిక్కులు రాఁగలవని యమ్మగువపలికిన వచనంబులు విని యింతయేని సంకోచింపక యతం డిట్లనియె.

అబలా! నీవువచ్చినంజాలును, పదివేలమంది నీకు సాటియగుదురా! నీవు చెప్పినట్లు చేయుటయేమి యాశ్చర్యము? నాతోరమ్ము. నామాటల సత్యాసత్యములు నీకే విశదములగునని పలుకుచుండ నావగలాడి సంతసించుదానివలె నభినయించుచుఁ గొంచెము లేచి, యతనికంఠంబు బిగియ యమపాశంబులంబోని హస్తంబులఁ దగిలించి గాఢాలింగనముజేసికొనుటయు నుల్లంబు గరంగి యక్కురంగనయనను స్వీకరించి కొంతతడవు తులలేనివేడుకతోఁ గైదండయొసంగి మెల్లమెల్లన నడపించుచుఁ గ్రమంబున సేనాముఖంబును గలసికొని యామెతోడం గూడ రథంబెక్కి చతురంగబలంబులు గొలువఁ బురంబున కరిగెను.

అది యొక బ్రహ్మరాక్షసి. ఆరాజును మోసముజేయఁదలఁచి యట్టి రూపముపూనియున్నది. పాపమాభూపాలుం డాకపట మెఱుంగక నిజముగా రాజనందనయేయనుకొని కాళరాత్రివలె దానిఁబురంబునకుఁ దీసికొనివచ్చి యందొక సుందరమందిరము దానికి నివసింప నిచ్చి తగినయుపచారములుచేయ బెక్కండ్రు దాసదాసీజనంబుల నియమించెను. మరియు నిత్యము దానికి భుజింప సన్నబియ్యము మంచికూరలు శర్కరఘృతఫలాదికమగు నాహారపదార్థములఁబంపుచుండునుగానియవి యారక్కసికేమిలెక్క, దాన నాకలిదీరక రాత్రు

లందారాకాసి రహస్యముగా నిల్లువెడలి రాజుగారి యేనుఁగులలో నొకదానిని భక్షించి తెల్లవారునంత మరలవచ్చి యంతఃపురములో నెప్పటియట్ల నివసింపుచుండును. ఆరీతిఁ బ్రతిదినంబును నర్ధరాత్రంబునం బయలుదేరి యేనుగులను గుఱ్ఱములను లొట్టియలను భక్షింపుచుండ గారణము తెలియక కావలివారలొకనాఁడు రాజునొద్ద కరిగి యిట్లనిరి.

దేవా! పదిదినంబులనుండి యొకబ్రహ్మరాక్షసి మనయూరి మీఁదబడి తోటలోని యేనుగులను గుఱ్ఱములను లొట్టియలను దినుచున్నది. నిత్యము అర్ధరాత్రంబున వచ్చుచుండును. ఆచర్యను రహస్యముగానుండి నిన్నఁగనిపెట్టితిమి. రక్తమును మాంసమునుమాత్రము బీల్చి యెముకలు మిగుల్చును. దేవరవారు దానికిద్దియేని ప్రతిక్రియ జేయనిచోఁ గొలఁదికాలములోనే మన యేనుఁగులు గుఱ్ఱములు లొట్టియలు నాశనమగును. అని యెఱింగించిన నదరిపడి యతండేమేమి? బ్రహ్మరాక్షసి వచ్చినదా? దానిఁబారగొట్టుట దుర్ఘటమే యని పలుకుచు వారివెంటఁబోయి యాయాస్థానములోనున్న జంతుశల్యంబులఁ బరీక్షించి వగచుచుఁ దక్షణమే రాత్రులయందు గస్తుదిరుగుటకై పెక్కండ్రుశూరుల నియమించెను. వారి కాపుదల యేమియు నారక్కసి ఘోరకృత్యమున కాటంకము చేయనోపదయ్యెను. ఇట్లెంతప్రయత్నముచేయుచున్నను రాత్రులఁజరుగుచున్న జీవహింస తగ్గినదికాదు. అందులకుఁ జింతించుచు నొకనాఁడురాత్రి తనయింట వాల్గంటిగానున్న యారాత్రించరితో నిట్లనియె.

ముదితా! పదిదినములనుండి రాత్రులందు మాయూరి కొక బ్రహ్మరాక్షసివచ్చి యేనుఁగుమొదలగుజంతువులం దినుచున్నది. ఎన్నికాపులుంచినను లెక్కసేయుటలేదు ఉపాయమేమియుఁ దోఁచకున్నది తుదకుఁ బ్రజలనుగూడఁ దిన మొదలుపెట్టునేమో యని భయమగుచున్నది. నీవును బుద్ధిమంతురాలవు నీకేమైన నుపాయము

తోఁచినఁ జెప్పుమని యడిగిన నదినవ్వుచు మీ కేమియుఁ దెలియదు. కాఁబోలు వేరే యెక్కడనుండియో బ్రహ్మరాక్షసి వచ్చుచుండుట లేదు. బ్రహ్మరాక్షసులు మనయింటనేయున్నవి మీకు గోచరము రానిచో నిక్కము వక్కాణించెదననుటయు రాజు తొందరపడుచు అక్కటా! అట్టిదుర్మార్గులు నాయింటనేయుండిరా! వారిం బేర్కొ-నుము. ఎవ్వరైన నుగ్రదండనలకుఁ బాత్రులఁజేసెదనని యడిగిన నది నాథా! మాటలతోఁ బ్రయోజనమేమి? రేపు సూర్యోదయము నకు రమ్ము నీకుఁబట్టియిచ్చెదనని చెప్పిన నొప్పుకొని యతండు నిజ నివాసమునకుం బోయెను.

ఆరక్కసి రాత్రిపూర్వమువలె బయలుదేరి తోటలోనున్న పట్ట పుటేనుఁగను పట్టిచంపి మాంసఖండములందినక రాజభార్యలవంటశా లలోఁబెట్టి యెప్పటియట్ల యంతఃపురమునకుం బోయెను. అంత మఱు నాఁడు రాజు దానియొద్దకుఁబోయి వాల్గంటీ! మనయింటనున్నరక్కసు లెవ్వరో చూపింపుమనియడిగిన నదినవ్వుచు దేవా! మఱియెవ్వరును కారు దేవరవారిభార్యలే! వారే రాత్రులు బయలుదేరి యిట్లుచేయు చున్నవారు దృష్టాంతము కావలసినచో వారివంటశాలలఁ బరీక్షించు కొనుఁడు రాత్రిచచ్చిన మృగముల మాంసఖండము లుండకమాన వనిపలికిన రాజు తెల్లబోయి యేమేమీ! నాభార్యలే యిట్టిపనిచేయు వారు, చూచినంగాని నమ్మనని యప్పుడే వారియిండ్ల కరిగెను.

వారివారి వంటశాలల భటులచేఁ బరీక్షించి యందు రాత్రి చచ్చిన భద్రగజముయొక్క మాంసఖండము లుండుటఁజూచి మితి లేనికోపముతో మరల నారక్కసియింటి కరిగి తరుణీ! నీవుచెప్పినది యథార్థమే నేను దెలిసికొనలేక పెక్కుచింతలఁబోయితిని. ఈరహ స్యము నీవెట్లుగ్రహించితివి? కటకటా! భార్యలని యెక్కుడుప్రేము డిగాఁ జూచినందుల కింతఘోరకృత్యములు చేయుచుండిరో చూచి తివా! సామాన్యపురాజస్త్రీలనుకొంటినిగాని రక్కసులని యెఱుంగ నైతిని. వారి కేమిశిక్షవిధింపవలయునో నీవే చెప్పుమని యడిగిన నది సంతసించుచు నిట్లనియె.

నాథా! స్త్రీలచర్యలు స్త్రీలకేగాని యెఱుకపడవు వారికృత్యములు నాకుఁ దెలియక మీకుఁ దెలియునా? ఈరహస్యము నాకు మొదటినుండియుఁ దెలిసియేయున్నదిగాని నాకు నేనై చెప్పిన యుక్తముగాదని యూరకుంటిని. నన్నడిగితిరిగాన యిప్పుడు చెప్పితిని. వానికి దగినశిక్ష చెప్పెద వినుండు. వారు గర్భములుధరించి యున్నవారుగావున జంపుట యుక్తముగాదు. మహారణ్యములోఁ గనుగ్రుడ్డులు పెరికి విడిచివేయవలయును. ఇట్టికృత్యములు చేసినవారి కిదియే దండనయని చెప్పెను.

అతండు సమ్మతించి యప్పుడే భటులంబిలిపించి గర్భవతులని కొంచెమేని సందియమందక దయారహితుండై భార్యల నడవిలో విడిచి కన్నులు బెరకిరండని యాజ్ఞాపించిన రాజకింకరులును తదాజ్ఞానుసారముగా నామగువలతో నేమియుంజెప్పక యెద్దియోమిషచే మహారణ్యమునకుఁ గొనిపోయి యందు వారి కన్నులంబెరకి పెద్దయెలుంగున నేడ్చుచున్న వారిని విడిచి యానవాలుగా నాకన్నుం దెచ్చి యారక్షకునకిచ్చిరి. పిమ్మట రాజభార్యలు అందుమితిలేనిశోకంబున గుందుచుండ నందులోఁ బెద్దదానికిఁ బ్రసవవేదన యావిర్భవించినది. వెంటనే పుత్రుండుదయించెను. అబ్బాలుండు జనించిన కొంచెముసేపులోనే తల్లుల యంధత్వంబు గనిపెట్టి దాపుననున్న మృగములాశిశువుం జంపి భక్షించినవి.

ఆసుందరులందరు తమముందు శిశువుంగానక యుల్లంబులు పగుల బలుదెరంగుల నేడువఁజొచ్చిరి. వారియరణ్యరోదనం బాలించి యోదార్చువారెవ్వరు? ఆమరునాఁడే రెండవదిగూడ మగశిశువుం గనెనుకాని యప్పసికూననుగూడ మునుపటి మృగములే తినినవి. క్రమంబున దినము వరుసవ నార్గురు రాజభార్యలు పిల్లలంగని మృగములపాలుచేసిరి. కటకటా! పుత్రశోకంబున నడలునప్పుడంతుల కంఠనాదంబులు నయ్యడవియంతయుఁ బ్రతిధ్వనులిచ్చినవి. ఏడవ

దానికిఁగూడఁ బ్రసవవేదన యంకురించినతోడనే వారిలో బుద్ధిమంతురాలగు మూడవది తక్కినవారి కిట్లనియె.

అక్కలారా! మనమిక్కడ నూరకయేడ్చుచున్న నోదార్చువారెవ్వరు? మనపురాకృతదుష్కృతఫలం బిట్లుఫలించినది. మనయార్యురకుఁబోడమిన బాలుర నడవిపాలు సేసితిమిగదా! ఇప్పుడు రేఁడవదానికిఁగూడ నొప్పులు పుట్టుచున్నవి. దాని పిల్లనుగూడ నేదియో యీడ్చుకొనిపోవును. కావున నాకొక్క యుపాయము తోచుచున్నది. వినుఁడు మనయొక్కచిన్నవాని నేని బ్రతికించుకొనకపోయితిమేని మనలను రక్షించువారెవ్వరు? ఇప్పుడు మనమార్యురము దీనిచుట్టు జేతులు లంకెలు వైచుకొని కాచియుందము. ప్రసవమైన తోడనే యాబిడ్డ నెత్తుకొనినచో మృగబాధయుండదు.

పిమ్మట వానిని క్రమంబుగాఁ బెంచవచ్చును. దైవానుగ్రహమున వాఁడు పెద్దవాఁడైనచో మనకు నన్నమైనఁ దెచ్చిపెట్టును. కావున నట్లుచేయ సిద్ధముగనుండుఁడని చెప్పెను. ఆమాట కాబోటులెల్లరు సంతసించిరి. ఇంతలో నాకాంతకుఁ బ్రసవవేదన యెక్కువయైనది. అప్పుడప్పడఁతులందరు దానిచుట్టును నిలిచి చేతులు లంకెవైచుకొని కాచుచుండ నక్కలికి చక్కని మగశిశువుం గనినది తోడనే యాచేడియలలోనొకతె యాబాలునిందడివి తీసుకొని మృగములబారి తప్పించెను. కడు జాగరూకతతో నాసుందరులందరు నా పిల్లవానిం గాపాడుచు నొకరువిడిచి యొకరు యెత్తుకొని పాలిచ్చుచు నొకప్పుడైనఁ గ్రిందదింపక రొమ్ములం బెట్టుకొని పెంచుచుండిరి.

అధికరూపవిశాలుండగు నాబాలుండు నేడ్గురు తల్లులపాలుం ద్రావి క్షణక్షణప్రవర్ధమానుండగుచు నైదేండ్లకే పదియేండ్లప్రాయముగలవానివలెనుండెను. దిక్కులేనివారికి దైవమేదిక్కనురీతి నాగుడ్డివారి కాహారాదికవిషయమై యాయడవిలోనున్న తపసులు ఫలాది

కను సహాయము చేయుచుఁ దమయాశ్రమములో నుంచుకొని కాపాడుచుండిరి. అయిదాఱు సంవత్సరముల ప్రాయమప్పుడే యా బాలుండడవిలోనికరిగి ఫలములు మొదలగునవి తల్లులకుఁ దెచ్చి యిచ్చుచుండును.

సహజ పరాక్రమశాలియగు నబ్బాలుం డొకనాఁడు అడవిలో దిరుగుచుండఁ భయంకరమగు నొకసింహము గనంబడెను. తోడనే యాయర్భకుండు నిర్భయముగా నాయుధములేక యుద్దానివయింబడి సాధారణ సాధనములతోడనే దానిం గడతేర్చెను. ఆవిశేషమందలి తపసులుచూచి యతని బలపరాక్రమములకు మెచ్చుకొని సింహదమనుండని యతనిఁ బిలువఁజొచ్చిరి. వానికిఁబదియేఁడులు వచ్చిన తోడనే కొండవాండ్రయొద్ద విల్లును అమ్ములను సంపాదించి సులభముగనే శరభశార్దూలాది మృగంబులంజంపుచు బహువిధమాంసంబులఁ దెచ్చి భయభక్తివినయ విశ్వాసంబులు తేటపడఁ దల్లుల కిచ్చుచు వారు సంతోషించి యాశీర్వాదింప నంగీకరించుచు వారి దుఃఖ మొకరీతిమరుపు పుట్టించెను. మఱియు నయ్యడవిలోఁ బ్రసిద్ధులై యున్న కిరాతుల రప్పించి వారిచేఁ బనులుచేయించుచు వారి కెల్లనాయకుండై రాత్రులయందుఁ దల్లులచే లోక వ్యవహారంబు లన్నియుఁ దెలిసికొనుచు నరణ్యరాజ్యము సేయుచుండెను. ఇట్లుండ సింహదమనుఁడొక్కనాఁడు తల్లులతో నిట్లనియె.

అమ్మలారా! మీరీయరణ్యంబున ననాథలై యుంటిరేమి? మీరు గుడ్డివారగుటకుఁ గారణం బేమైనగలదా! మీరు చెప్పుచున్న లోకవ్యవహార సిద్ధంబులగు కథలనువినుచుండఁ బురుషులకు స్త్రీలును స్త్రీలకుఁ బురుషులు నుండవలసిన యగత్యము గానంబడుచున్నది. మిమ్ము నెవ్వరేని బురుషులు పెండ్లియాడిరా, లేదా? మీ వృత్తాంతము చెప్పఁదగినదేని జెప్పుఁడని వేడిన నతని మాటలకు సంతసించి యాచేడియలిట్లనిరి.

పుత్రా! మావృత్తాంత మేమని వక్కాణింతుము. ఏచింతయు నెఱుఁగకున్న నీకుఁగూడ విచారము గూర్చినవార మగుదుము. నీవు పుట్టినది మొదలు సంతసించుచుంటిమి. అంతకుమున్ను మేము దుఃఖించిన ఘోషంబు కొండగుహలనుండి యిప్పటికిని వెడలు చున్నది. మమ్మింతకుఁ బూర్వమిట్లడుగువా రెవ్వరును లేకపోయిరి. నేఁటికి మాపూర్వపుణ్యంబున నీవు బయలుదేరి మాయాత్రము తెరంగరయుచుంటివి. అని యతని గారవించుచు దాముశత్రుంజయ మహారాజును బెండ్లియాడినది మొదలు సింహాదనునుండు బోడమువరకు నడుమ జరిగిన వృత్తాంతమంతయుం జెప్పి యయ్యా యింతకును నామానవతియే మూలమని కన్నీరు విడువజొచ్చిరి.

అప్పుడబ్బాలునకు వచ్చిన శోకమును రోషమును యింతింత యని చెప్పుటకు నలవికాదు. తన్నుఁదాన యుపశమించుకొని కట కటా! మాతండ్రి యెంతకూ్రరాత్ముఁడు! మిమ్ము నెట్టియిడుములఁ బెట్టెను పితృవధ మహాపాతకంబని సందియమందు చుంటినిగాని యిప్పుడే యతని లోకాంతరగతునిఁజేయకపోవుదునా! ఇంతకు మన పురాకృతకర్మమిట్లున్నది. యొకరిందిట్టనేల కానిండు? ఇంతటితో నీయాపదలు తొలఁగినఁజాలు మనమీయడవిలో నుండనేమిటికి? ఎద్దియేని పట్టణమునకుఁ బోయిసుఖింపరాదేయని యప్పుడే కిరాతులఁ బెక్కండ్రరప్పించి వారిచేఁ గట్టఁబడిన బొంగునవారీలలోఁ దల్లుల నెక్కించి యాబోయెలచేతనే మోయించుకొనిపోయి క్రమంబున ననేకపురంబుల గడచి చివరకుఁ దండ్రిగారి పట్టణమే చేరెను.

ఆపురంబేలురాజు తనతండ్రియని యెఱింగియుఁ దనకు దాను పోయి తనకథ జెప్పనేలయని రాజునొద్దకరుగక సామాన్య గృహస్థు నింటికరిగి యుదియే బాడిగకుఁదీసికొని యందుఁదల్లులునుదాను నుచితవ్యాపారములచే గొన్ని దినములు గాలక్షేపము చేసెను.

అట్లుండ నొక్క నాఁడియ్యూరియంగడికి యొకగుఱ్ఱము పెద్దకత్తియు నమ్మకమునకు వచ్చెను. అశ్వముఖంబునఁగట్టబడియున్న పట్టంబున నిట్లు వ్రాయబడియున్నది.

"ఈగుఱ్ఱము కత్తితోఁగూడ పదివేలరూపాయలు. ఆకత్తిని చేత సులభముగా నెత్తినవారుగాని యీవారువము నెక్కలేరు ఇది భూమిమీఁదవలె నాకాశముమీఁదను వేగముగా నడువగలదు. అన ర్హులు దీనింగొనినచోఁ బరాభవమును బొందుదురు." అట్టి శాస నముతో నున్న యీయశ్వవర్తమానమును విని రాజుగారు దానిఁ గొనఁదలంచి దాని యొద్దకువచ్చి తన సమస్థానములోనున్న యోధు లందఱిచేత నాకత్తి నెత్తింపనిరూపించెను. అట్టిపని యెవ్వఁడును చేయలేకపోయిరి.

అంతకు పూర్వమే తానాకత్తిని కదుపలేకపోయెను. ఆరాజు సిగ్గుపడి వచ్చినదారింబట్టి యూరకయింటికరిగెను. ఆతురగవృత్తాంత మంతయు విని సింహదమనుండు అంగడికరిగి దానిం గొనదలఁచిన వారు తొలుతనాకత్తి నెత్తి చూడవలయుంగానఁ జులకనగా నావాలు కేలనమర్చి యాతత్తడిపై కెగిరి యచ్చటివారెల్లఁ జూచుచుండక్షణ మాత్రములోఁ బహుదూరము పోయివచ్చి నిలిచెను. అప్పుడచట నున్న వారాతని బలపరాక్రమములు శ్లాఘించుచు రాజునకుం దెలియఁజేసిరి..

ఆనృపతి యద్భుతము జెందుచు, అట్టివీరుండెవ్వఁడు. వాఁడు నాకొలువున నుండినచోఁ గోరిన వేతనమిత్తునుకద. పోయి చూచె దంగాక యని కడువేగముగా నతనియొద్దకరిగెను. సింహదమనుని రూపంబు జూచినంత రాజుమిగుల వెరగుపడుచు నౌరా! యీకుమా రుండు సుకుమారుండు. ఇతని పరాక్రమమేగాక సౌందర్యముగూడ నసన్యసామాన్యమైయున్నది. ఇట్టివాఁడు నాయొద్ద వేతనంబునకు నిలుచునా? వీఁడు నిజముగా దలఁచికొనినచో నారాజ్యమేకాదు భూలోకంబంతయుఁ దనవశము జేసికొని పాలింపగలఁడు. అయినం-

ప్రార్థించి చూచెదంగాకయని యతనితో వినయముగా అయ్యా! యీగుఱ్ఱమును సవారుచేసినవారు తమరేనా? మీదేశమేమి? మిమ్ముఁ గన్న తల్లిదండ్రులెవ్వరు? వారెట్టిపుణ్యము చేసిరోగదా? యెవ్వరేని మీకుఁదగిన వేతనమిచ్చినచో నుందురా? అని యడిగిన సింహాదమనుం డారాజు తనతండ్రియని యెఱింగియు నింకను తన్నెఱింగింప రాదని యతనితోఁ గులదేశనామంబులు మఱుఁగుపెట్టి చెప్పి యీగుఱ్ఱమును నాకుఁ గొనియిచ్చి నెలకు నూఱునూడలు జీతమిచ్చినచో మీయొద్ద నుండెదనని యుత్తరము చెప్పెను.

అప్పుడా రాజు మిగుల సంతసించుచు నతఁడు కోరినట్లొప్పు కొని యావెలకా ఘోటకమునుఁగ త్రితోఁ గూడ కొనియిచ్చి తన సభకుఁదీసి కొనిపోయెను అదిమొదలు సింహాదమనునకు రాజసభకు రాకపోకలు గలిగియుండెను. అవిచ్ఛిన్న కీర్తి జేతంబూని యాగుఱ్ఱ మెక్కి వీధివెంబడి నరుగు నప్పుడు సింహాదమనుని జూడ నెంతవానికైన భయము పుట్టక మానదు.

గోపాలా! భూపాలుని వంచనజేసి రాజుభార్యల నడవికి ద్రోయించి రాత్రుల ఘోరకృత్యములు చేయుచున్న యారక్కసి కొన్ని దినములు మాత్రము రాజునకు నమ్మకము బుట్టుటకై జీవహింసచేయుట మాని తరువాత మరల రాత్రులయందు బయలుదేరి పూర్వమువలెనే గజాశ్వహింస సేయదొడంగినది. రాజు పెక్కు గతుల చింతించి యెన్నియో ప్రతీకారము లాచరించెను. ఏమియుఁ బనికి వచ్చినవికావు.

సింహాదమనుఁడు తనకొలువునఁ జేరినవెంటనే యారాజు కక్కనాఁడతనితో నాహింసవిషయమై ముచ్చటించి దానిబాధతొలంగింపు మని ప్రార్థించెను. అప్పుడు సింహాదమనుఁడుమందహాసముచేసిచంద్రహాసము జళిపించుచు రాజా! వెరవకుము. యీరాత్రియేనారాత్రించరి

బాధయుడిగించెద. సుఖముగా నిద్రింపుమ్మని ధైర్యముఁ బలికి యతని యనుజ్ఞవడసి యింటికరిగి పెందలకడ భుజియించి జెట్టిలాగును గాశికోకయు బిగించి చంద్రహాసము చేతనమర్చి, యాగుఱ్ఱమెక్కి రాత్రిల వీధులయందు గస్తుదిరుగఁ జొచ్చెను.

ఆరాక్షసియుఁ బూర్వమువలెనే యర్ధరాత్రింబున గృహంబు వెడలి యాయేనుఁగులుండు తోటకరిగెను అందుభయంకర వేషముతోఁ గుఱ్ఱమెక్కి కత్తిజళిపించుచుఁ దిరుగుచున్న సింహదమనునిఁ జూచి యతని బలపరాక్రమము లంతకుమున్నే వినియున్నది కావున భయపడి చేరలేక యూరక మరలి నిజనివాసమున కరిగినది. మరునాఁడుదయంబున రాజు రాత్రి జంతుహింస జరగమికి నాశ్చర్యపడుచుఁ సింహదమనుని వేతెరంగులఁ గొనియాడి కొన్నిదినములు రాత్రిల నారీతినే గస్తు దిరుగుటకు మిక్కిలి వేడుకొనెను

అతండప్పార్థివుని ప్రార్థన మంగీకరించి రాత్రి ప్రతిదినమును గాచుచుండెను ఆరక్కసియు ననుదినము ఇల్లువెడలి యాయేనుఁగుల భక్షింపఁ బ్రయత్నించెనుగాని యతని రక్షణలో నున్నవానిని జేరలేక చింతతో నూరక నింటి కరుగుచుండును.

అట్లు కొన్నిదినములైన వెనుక యారక్కసి యాహారములేక సుక్కి యొక్క నాఁడిట్లు తలంచెను. అయ్యో నాప్రాణమునకీవీరుఁ డెక్కడనుండి వచ్చెనో కదా! నాకు వీనిం జేర భయమగుచున్నది. వీఁడు రాత్రిల నొక్కనాఁడుగాని యేమరక తోటలో నేనుఁగుల గాపాడుచున్నాఁడు. ఎన్నిదినంబు లిట్లు తిండిలేక బ్రతుకగలను. వీఁడు ఈ యూరువిడిచి పోవునుపాయం బెద్దియేని బన్నినచో నాకు నాహారము దొరకును. లేనిచో బ్రతుకు లేదని నిశ్చయించి యొక యుపాయమూహించి నాఁటి రాత్రిఁ దలగట్టుకొని పరుండి యేడ్చుచుండెను.

అదియంతయుఁ జూచి దానిదాదులు పరుగునబోయి రాజుగారితో నావృత్తాంతము జెప్పిరి. యతివేగముగా దానియంతః

పురమునకరిగి యందు జెందముపగుల నేడ్చుచున్న యాచిన్నదానిం జూచి రాజు దీనస్వరముతో మోహనాంగీ ! నీవింత శోకింపనేటికి ? నీకెవరేని యవమానము సేసిరేమో నుడువుము ? వారికిప్పుడు తగిన దండన విధింతుననుటయు నది యతనికిట్లనియె.

నాథా ! నాదుఃఖకారణము మీతో నేమని చెప్పుదును. నాకు భ్రమరవేణియను చెల్లెలుగలదు. దాని నాపంచప్రాణములలో నొకదానిగాఁ దెలిసికొమ్ము. ఆచక్కెరబొమ్మ యిప్పుడు రోగపీడి తయై బాధపడుచున్నట్లు స్వప్నమువచ్చినది నాకలయెన్నడును వట్టిది కాదు. నాకేమియుం దోచకున్నది. పోయిచూతమన్నను సమీప మున లేదు. ద్వీపాంతరమందున్నది. అచ్చటికిఁబోయి దానిక్షేమ మరసి వచ్చువారిచ్చట నెవ్వరుగలరు ? ఏమిచేయుదును ? ఇందు లకే చింతించుచుంటిననిన నతఁడిట్లనియె.

తరుణీ ! కలగన్నందులకే చింతింపవలయునా? స్వప్నమెన్నఁ డేని యదార్థమగునా? అయినను, మనయొద్దనున్న వీకుని నంపినచో నెంతదూరమైనను దేవతాతురగముమీఁద బోయి శీఘ్రముగా రాఁ గలఁడు. మీచెల్లెలు క్షేమమరయ నతని నంపెదను. నీవు చింతింప కుము అని యోదార్చినవిని, యదిసంతసించుచు నాథా ! యతని వేగముగాఁ బంపవలయును. వానితో నేనుగొన్ని మాటలు చెప్ప వలసియున్నవి. నాయొద్దకనుపు మనిన నతండందులకు సమ్మతించి యప్పుడే సింహాదమనునకు వార్తనంపి యాప్రయాణ మెఱింగించెను.

ఆబల్లిమం డందుల కియ్యకొని నయ్యన నయ్యాతివయున్న యంతఃపురమున కరిగి అదిబ్రహ్మరాక్షసియని యెఱుఁగక సాపత్ని మాతయే యనుకొని యామెతో అమ్మా, నేను సింహాదమనుండ నీవుపొమ్మన్నచోటునకుఁ బోవసిద్ధముగ నుంటి. ఆతావద్దియో మెఱింగింపుమనిన సంతసించి యాన క్కంచరి యిట్లనియె.

మహావీరా ! నీపరాక్రమము మిదివరకే వినియుంటిని నీవెగాక మరియొకఁడచ్చటి కరుగనోపఁడు. వినుము, ఇచ్చటనుండి దక్షిణ దిక్కుగాఁబోయిన మళయాళదేశము మీఁద లవణసముద్రము గనం బడు. ఆసముద్రంబు నూఱుయోజనములు దాఁటినంతనొకలంక బొడ సూపును. అందుఁగనబడిన రాజమార్గంబునంబడి బోవఁబోవ నూఱు యోజనంబులపైన మూఁడుపర్వతంబులు జూడనగును. వానిలో నడిమిదాని శిఖరమెక్కిన విశాలంబగు పాషాణమొకటి పొడకట్టు. ఆరాతిమీఁద నగ్నివేల్చి నాయిచ్చినపొడి యగ్నిలో వైచినంత నారాయి పగిలి దారియిచ్చును. ఆదారింబోయిన మాచెల్లెలు నివ సించు మందిరము గనంబడును. దానింజూచి యీయుత్తరంబిచ్చి దానియొద్దనుండి మరల నుత్తరము తీసికొనిరమ్ము, పొమ్మని సెల విచ్చిన నావీరుఁడా యువతియిచ్చిన చూర్ణంబును నుత్తరమునుగొ కొని నమస్కరించి యటనుండి వెడలి తనయింటికి వచ్చెను.

తల్లులకు నమస్కరించి నేనిప్పుడు రాజుపంపున ద్వీపాంతర మున కరుగుచుంటిని. నేనువచ్చువరకు భద్రముగ నుండుఁడు. మీకు పచారములు చేయఁదగినపరిచారికుల నియమించితిని. నాకుఁబోవ సెలవియ్యుఁడని వేడిన వారు సమ్మతింపక కొంతసేపు చిక్కులబెట్టిరి. కాని యెట్టకేల కతని యనునయవాక్యంబులచే నొప్పుకొనిరి. అంత నాసింహదమనుండు, జట్టివేషముబూని చంద్రహాసము చేతఁబట్టు కొని యాదేవతా తురంగమెక్కి జగత్పరమేశ్వరా యని శుభ మూహూర్తంబున నిల్లువెడలి దక్షిణాభిముఖుఁడై యాకాశమార్గం బున నరుగుచుండ సాయంకాలమున నొకపురము గనంబడినది.



# మణిమంజరికథ.



అన్నగరము మీఁదుగా నరుగునప్పుడు నన్నగరాధీశ్వరుని కూతుఁరు మణిమంజరి యనునది సఖులతో సౌధోపరిభాగమున జల్లగాలి సేవింపుచుఁగూర్చుండి యాకాశమార్గంబున నరుగుచున్న యారాజకుమారునింగని తదీయరూపవిభ్రమ విలాసంబులు మనంబున కుల్లాసంబు గలుగఁజేయఁ దనయొద్దకురమ్మని చేయి వీచినది. సింహదమనుఁడా సంజ్ఞనుగ్రహించి యామేడకు దాపుగా నరుగుచుంట నల్లన నందు దిగెను.

అప్పుడు దరిపడి యాచేడియ చెలికత్తెలతోఁగూడ తటాలున లేచి సుందరుఁడా? నీవు కంతుఁడవా? జయంతుఁడవా? వసంతుఁడవా? వీరిలో నొక్కరుఁడవు కానిచో నిట్టిసోయగముండునా? ఆకాశగమనమున నీవు మనుష్యుఁడవు కావని యల్లన తెలియఁబడుచున్నది. నీవృత్తాంత మెఱింగించి నన్నుఁగృతార్థురాలిం గావింపుమని యడిగిన నతండు దాని కిట్లనియె.

అబలా! నాపేరు సింహదమనుండు, నేను నీవన్నవారిలో నొక్కరుఁడను గాను. నేనొక రాజకుమారుఁడ, తండ్రిపంపున ద్వీపాంతరమున కరుగుచుంటిని నాకు మిగుల దాహమగుచున్నది తియ్యని పానకంబు ద్రావనిత్తువేని త్రావిపోయెద ననుటయు నచ్చతుర వ్యాము నిట్లనయె.

రాజపుత్రా! ఇచ్చట సులభముగాఁ బానకము దొరకదు. అదియున్న తావు చెప్పెదవినుము. శ్రీకూర్మముమీఁదుగానరిగిన మకరాకరంబుజూడనగును. దానిందాటినఁగదళీవనంబుబొడకట్టును. దానిందాటిన కాంచీస్థానము, దానిపైననొకహ్రదమున్నది, దానిపల్లమునుండిదాపుననున్న పైడిమెట్లవెంబడిపైకెక్కినచో రెండుబంగారుకొండలు

గనంబడు, వానిమీఁదఁ గొంచెము సేపు విశ్రమించి పైకిఁజనకొంత చూడునీడు జూడనగును. దానిఁ దాటినఁ జంద్రలోకం బాలోకోత్స వము జేయును. అందు వెదకినచో నమృతంపుబావి యున్నది. నీకు సమర్థత గలిగియున్నచో నాబావిలో నమృతంబు ద్రావి దప్పి దీర్చుకొనుము. అని పలికిన విని యయ్యాతివ చతురంబులగు వచనం బులకు మెచ్చుకొనుచు నాసుందరుండు మందహాసము సేసి యిట్లనియె.

చేడియా! నీవు చెప్పినబావి పెక్కు చిక్కులు పడినంగాని లభింపదు. అచ్చటికి మేము స్వతంత్రముగాఁ బోవచ్చునా? అందుల కంకిలి లేదంటివేనిఁ బోయి త్రావెదను అని పలుకుటయు నజ్జాణ యించుక సిగ్గుతో మఱియు నతనికిట్లనియె

రాజహంసమా! అదిమానసంబంటిన వారికిఁగాని యంట రాదు నీవట్టివాఁడవైనచోఁ ద్రావుమనియె. ఇట్లాండోరులు సంభా షించుకొనుచుండ వారి యభిప్రాయములు దెలిసికొని చెంతనున్న చెలికత్తియలు ఎద్దియో మిషపన్ని మాటున కరిగిరి.

అప్పు డప్పురుషపుంగవుండు ప్రాంతమందున్న హంస తూలికాతల్పంబు జేరి ముదితా! ఇదిగో యమృతంబు గ్రోలు చుంటిని యెంత ద్రావినను దప్పి దీరకున్నది. దీనిరుచి యేమని చెప్పుదునని పలుకుచు నధరరసం బానియాని కేళీరతుండై నంత నక్కాంత గంఠంబున నద్భుతకూజితంబు వెలయ నతని చేతులు బెనంగి పట్టు కొనినది. వారట్లు తబ్బిబ్బగుచుఁ బెక్కు తెరంగుల మన్మథక్రీడలఁ దేలుచు ననేకవిశేషములఁ దమపాటవంబు తేటపడ నానందించిరి.

అయ్యవసరంబున సింహాదమనుండు సొమ్మసిల్లి నిద్రాయత్తుం డయ్యె. మణిమంజరియు నతనికి నిద్రాభంగము గలుగునని కదలక పాదంబు లొత్తుచుండెను. అప్పుడు ఆయలజడిలో నతని (యంగీజేబు) నుండి యొక యుత్తరము జారిపడినది. అది యేమిరోయని యామణి

మంజరి యందిపుచ్చుకొని పై విలాసము చూచి యాలిపి పై శాచభాష లోనుండుటం జూచి యాభాష తానుజదివినదగుట నాపత్రిక విప్పి చూచిన నిట్లున్నది.

అనేక జీవహింసా నిరతాత్మురాలగు మా చెల్లెలు లంబోదరిని మీయక్క కంకాళి యనేకాశీర్వచనములు. నేనిక్కడ శత్రుంజయుండను రాజును వంచనజేసి, యతని భార్యల నడవికిం దోసి కన్నులం బెరికి వారి గ్రుడ్డుల నీయొద్దకిదివరకే పంపితినిగదా ఇంత వఱకును జరిగినకథ నీవెఱింగినదే మరియు నే నే మాటంకమును లేక రాత్రుల నిష్టము వచ్చినట్లు లేనుఁగులు మొదలగు జంతువులం జంపి తినుచుంటిని. గుడ్డిరాజు ఆసంగతి యేమియు గుఱుతెఱుంగక యా హింసను గుఱించి నన్నే యుపాయమడుగుచుండ నేను వానిని మోసము చేయుచుంటిని.

నాలుగు నెలలక్రిందట నీవీరుఁ డీయూరు చేరి యీరాజునొద్ద నుద్యోగమునకుఁ గుదిరెను. వీఁడు రాత్రుల నద్భుతమైన గుఱ్ఱముపై నెక్కి గస్తుదిరుగుచు నాజంతువులఁ గాపాడుచున్నాడు. వీనిఁ బరిభవించుటకు నాకు సామర్థ్యము లేదు. వీఁడు సాధారణుఁడుగాడు సురాసురులైన వీని జయింపజాలరు, వీనికి మనభాష రాదు. ఈ యుత్తరమిచ్చి నీయొద్ద కనిపితిని. వీనిం బరిమార్చి నాకుఁ దెలియఁ జేయుము. నీయుత్తరమున కెదురుచూచుచున్నదాన.

కంకాళివ్రాలు.

అనియున్న యుత్తరము జదువుకొని మణిమంజరి గుండెమీఁదఁ జేయువైచుకొని అయ్యో! యీయుత్తరములో నేమివ్రాసినదియు దెలియక యీసుందరుఁడు రాక్షసియొద్ద కరుగుచున్నవాఁడు. పాప మీతని కీభాష రానియట్లు స్పష్టమైనది. వీఁడు నాయొద్దకు రానిచో నిష్కారణము చచ్చునుగదా! దైవమే వీని కీయుపకారము చేసెను. కానిమ్మని యాయుత్తరముదాచి మఱియు నిట్లు వ్రాసెదనని యాలో చించి నాచెల్లెలను దీవించి కంకాళివ్రాయునది యేమనంటే. ఇదివఱకు

నేను నీయొద్దకంపిన కంటిగ్రుడ్డులయుత్తరము మూలముగ నన్ని సంగతులు బోధపడినవికదా !

ఇప్పుడు నాకత్యంత ప్రాణమిత్రుడును పుత్రతుల్యుఁడగు రాజపుత్రుని నీయొద్దకనిపితిని. వీనికి మనయింటనున్న వింతలన్నియుఁ జూపించి మనగుట్టంతయు నెరుఁగఁజెప్పుము. వీఁడు నిత్యము నాకుఁ జాలసహాయము చేయుచున్నాఁడు. వీని సంతసించునటుల విందులు చేసి యుంపవలయును. వీని నీక్షేమమరయుటకే నీయొద్దకనిపితిని. విశేషములు లేవు కంకాళి వ్రాలు అని యాజాణ దానిలిపి పోలికగానే వ్రాసినది.

అట్లువ్రాసి యాయుత్తరము మునుపటి సంచిలోనే యమర్చి తెలియనట్లు అంటించి మరల నతని జేబులో వైచినది.

మునుపటి యుత్తరము తనయొద్దనే దాచి యుంచెను. ఇంతలో నతనికి మెలఁకువవచ్చినది. కన్నులు నులిమికొనుచు లేచి యతండామెతో తరుణీ! నేనుబండుకొని చాలసేపైనది. లేపకపోతి వేమి? పోవలసిన యగత్యమున్నదని నీతోఁజెప్పలేదా, బాగు బాగని పలికిన యాకలికి నవ్వుచునిట్లనియె. నాథా! యీవేళనే యరుగవలయునా! రేపు పోవచ్చును మీకార్యము తొందరయెట్టిదో నేను గూడ వినియెదఁ గొంచెము దెలుపుఁడనవుఁడు సింహాదమనుం డిట్లనియె.

ప్రేయసీ! నాకథయంతయుం జెప్పుటకుఁ బెద్దతడవు పట్టును. క్రమ్మర వచ్చినతరువాత నంతయుంజెప్పెద. నేను ద్వీపాంతరమున కరుగుచుంటిని. నాకు నేడుగురు తల్లులున్నారు. వారు సవతితల్లి మూలముగా నడవిలోఁ గన్నులుపోయి నిడుములుబడుచున్నారు. మాతండ్రిపంపున నేనరుగుచుంటిని. నాకిచ్చట నిలువరాదని సంక్షేపముగా దనకథ చెప్పి యప్పడతికి నానవాలుగా నుంగరమొకటి యిచ్చి యెట్టకేలకు నామెచే ననిపించుకొని మరల నాగుఱ్ఱమెక్కి దక్షిణాభిముఖుండై యరిగెను. అట్లుచని చని, క్రమంబున నాకంకాళి

చెప్పిన యానవాలుచొప్పున లవణసముద్రంబుదాటి శీఘ్రకాలము లోనే యాపర్వత శిఖరముచేరెను. అందున్న యాయి గురుతుపట్టి దానిపై నిలువఁబడి యగ్నిపేల్చి చూర్ణము పొగవైచినతోడనే యారాయి పగిలి దారియిచ్చినది. ఆద్వారముగుండ లోనికరిగిన విచిత్రభవన మొకటి కన్నులఁబడినది. అందనేక చిత్రవస్తువులలంక రింపఁ బడియున్నవి మరియు ననేకమహారాజుల తలపుఱ్ఱెల మాల యొకటి గోడప్రక్కను వ్రేలఁగట్టబడి యున్నది. కంకాళి యారీతినే పెక్కండ్రరాజుల మోసముజేసి నలుబదిసంవత్సరములు కాగానే యతనిం జంపి యాపుఱ్ఱెఁ నామాలికలోఁ జేర్చుచుండును.

అతఁడు ఇంటిలోఁ బ్రవేశించినతోడనే మనుష్యవాననగొట్టు టచేఁ బసికట్టి యారక్కసిమేల్కాని బ్రహ్మాండకరండంబు వగుల నార్చుచు నతని మిగ్రంగ రా నవ్వీరుండు జడియక కత్తిఝళిపించుచు ముందుగ చేతనున్న యుత్తరమందిచ్చినంత బుచ్చుకొని యారక్కసి యదివిప్పి చదువుకొని తటాలున నతనిం గౌఁగలించుకొని యిట్లనియె.

వట్టీ! నీవెవ్వరవో తెలియక నిన్నుఁజంపఁ గమకించితిని. నిన్ను మాయక్క పెంచుకొని యెన్నిదినములైనది. నీవు మా యక్కకుఁ జాల యుపకారములు జేసినట్లు వ్రాసినది నీవాయుత్త రము నాకందియ్యనిచోఁ జంపుదునుసుమీ, క్షమింపవేడెదను. ఈమాట నాయక్కకుఁ దెలియ వలచకుము. నాయందుఁ గోపము జేయును. నీవు తనకు బెంపుడు పుత్రుఁడవనియుఁ మిగుల సహాయము చేయుచున్నావనియును, చాలమర్యాద చేయుమనియు, వ్రాసినది. ఇటురమ్ము, యిందున్న వింతలన్నియుం జూపించెదఁజూడుము. మన యింటిలోనున్న వింత లేలోకమునను లేవు అనేక మహారాజులంజంపి తెచ్చిన పుఱ్ఱెలమాలిక. ఇదేచూడుము ఇప్పుడు మాయమ్మ మాయలోఁబడిన శత్రుంజయుని తలయు నిందులోనే చేరును అచ్చట మాయక్క సుఖముగానున్నదియా! ఆమధ్య నెవ్వఁడో సింహాదమ

నుండను పేరుని యవరోధము కొంచెము తనకుఁ గలిగెనని వ్రాసినది. వానిసంగతి యేమైనదో యెఱుంగుదువా; మీయమ్మగుట్టు తెలిసికొనలేక రాజు భార్యయే యని నమ్మియుండెనుగద. అని యనేక ప్రకారముల గుట్టువదలి మాట్లాడుచున్న దానిమాటల చేతనే యథార్థమంతయు సింహాదమునకుఁ బోధపడినది.

అతండు దానిమాటల కనుకూలముగా నుత్తరము చెప్పుచు నంతరంగంబున నిట్లు వితర్కించెను. అన్నన్నా! నాతండ్రి యెంత మూఢుఁడో కంకాళియను పేరుగల రాక్షసిని సుందరియనుకొని యంతఃపురంబునఁ బెట్టుకొనియె. అదియే కాఁబోలును మాయజేసి నాతల్లులగ్రుడ్లు పీకించి యడవికిఁ ద్రోయించినది రాత్రుల బయలుదేరి యేనుఁగులఁ దినుచున్నదియు నదియే. ఈమాట నాకప్పుడే తెలిసినచో నాకత్తికి బలిఁగా జేయకపోవుదునా, నాబాధ కాగలేకయే యుత్తరమిచ్చి దీనియొద్దకంపినది. ఉత్తరములో నన్ను జంపమనే వ్రాసియుండునుగాని, మణిమంజరిచూచి యీయుపకారముచేసినది. ఔనౌను, జ్ఞాపకమువచ్చినది, నిద్దురపరాకునఁ బరామర్శింపలేకపోతిని గాని యప్పుడెద్దియో యుత్తరము జదివినట్లు వ్రాసినట్లు కొంచము కొంచము జ్ఞాపకము వచ్చుచున్నది.

ఆహా! ఆచిన్నది చేసినమేలునకుఁ బరిమాణమున్నదా? దీని గుట్టంతయుఁ దెలిసికొని దీనిం బరిమార్చి వేగబోయి మణిమంజరిని గాఢాలింగనము జేసికొని దానిఋణంబు తీర్చుకొనియెద నని పెక్కు తెరంగుల దలపోయుచు దానివెంటఁ దిరుగుచు నాయింటనున్న వింతలన్నియుఁ జూచుచు నిట్లనియె.

అమ్మా! నిన్న మాయమ్మ చాలచాల నడుగమని చెప్పినది. దానికేమియు లోపము లేదు, రాజు దానికి లోఁబడియే యుండెను సింహాదమనుండను వాఁడు ఆనడుమ రెండుదినములు గస్తుదిరిగెను గాని వాఁడు వానిదేశమునకుఁ బోయెను. ఇప్పుడు వానిబాధ యేమి

యును లేదు. నాతో నీపాతాళగృహము తెరగు దరుచు చెప్పుచుండ నేను వేడుకపడినంత యిచ్చటికంపినది. మనయిల్లు చూచినది మొదలు నాకు మిగుల సంతసముగా నున్నది. మరియు నాకుఁ దినుటకు మనుష్య భోజనపదార్థము లేమైనంగలవా! యని యడిగిన నదినంత సించుచు నొక మనుష్యుల భోజనపదార్థము లననేల దేవతల భోజన పదార్థములు కూడనున్నవి. చూడుమని అనేక శాకములు, పచ్చడులు, పిండివంటలు మొదలగు రుచిగల పదార్థములు వండిపెట్టిన తృప్తిగా భుజించెను.

భుజించిన వెనుక దాని గుట్టంతయుఁ దెలిసికొనఁ దలంచి, అమ్మా! మనయింటిలోనున్న వింతలన్నియు నాకుఁజూపవా? లేనిచో మాయమ్మ నన్నేమి చూచివచ్చితివని యడిగిన నేనేమి చెప్పుదును? వేగ లెమ్మని తొందరపెట్టిన నది యతని మీఁదిమేడలోనికి దీసికొని పోయి వత్సా! చూడు మివిగో రత్నరాసులు, ఇది కాంచనము, ఇవి నాణెములు, ఇవి నవధాన్యములు, ఇది చిత్రశాల, ఇందులో నున్నవింతలు త్రిలోకములలో లేవు. రమ్ము చూడుమని యాశాల యందొక మూలనున్న పెట్టెలోనుండి తళుక్కున మెరయు కన్నుగ్రుడ్లెత్తి యతనికిఁ జూపించుచు నివి యేమియో చెప్పుకొనుమని యడిగిన నతండవి యానవాలు పట్టలేక నీవే చెప్పుమని పలికెను.

అప్పుడది, అయ్యో! యివియే చెప్పుకొనలేక పోయితివేమి. ఇవి రాజు భార్యల కంటిగ్రుడ్లుకావా! యిచ్చట నొకపాడిచల్లి దాచియుంచుటచే నింకను పచ్చిగాయున్నవని చెప్పిన నతండు వెఱఁగుపడుచు పిన్నమ్మా, యొకవేళ నీగ్రుడ్లు ఆరాజుభార్య నేత్రముల కమర్చినచోఁ జక్కఁబడునా; యని యడిగిన నది నవ్వుచు నాయనా యట్టియవసరమేటికివచ్చును ఒకవేళ వచ్చినచోఁ దులసియాకు పసరుతోఁగన్నులనంటించినచో యథాప్రకారముగా నుండునని చెప్పెను. ఆమాటలచే గొంతసంతసించుచు నాగుడ్లున్న

పెట్టెగురుతుపట్టుకొని మరియున్న వింతలం జూచుచుండ రెండు పంజరములు గనంబడినవి. వాటిలోనున్న చిలుకను గోరింకను జూచి అమ్మా! ఇవి యెందుల కిట్లున్నవని యడిగెను.

నాయనా! వీని పూర్వోత్తరము వినుము ఈచిలుకలో మీ యమ్మప్రాణములును, ఈగోరింకలో నాప్రాణంబులు నున్నవి? వీనికి భంగము వచ్చినప్పుడేగాని మఱియొకప్పుడు మాకు భయములేదు. ఈరహస్యము నీవు మాకాప్తుఁడవుగావునఁ జెప్పితిని. మరియెవ్వరికినిఁ దెలియదు. అని చెప్పుచు వేరొక్కగదిలోనికిఁ దీసికొనిపోయినది. అందునొక శయ్యయందు పదియారేఁడులప్రాయముగల చిన్నది యొక తెయున్నది. దాని యాకారవిలాసంబులకు నాశ్చర్యమందుచు నతండు పిన్నమ్మా! ఇందొకబంగారుబొమ్మయున్నది దీని నెందులకై యుంచితివి. ఇది నిజముగా జిన్నదిలాగేయున్నదిసుమీ! యని యడిగిన విని యది నవ్వుచు కుర్రా! యది బొమ్మయనుకొంటివా; కాదు; నిజమైన చిన్నదియే ఇదిమిగుల చక్కదనముగలది కావుననట్లు కానంబడుచున్నది.

పూర్వమొకప్పుడు మీయమ్మ దేశసంచారముచేయుచు నొక సంస్థానముమీఁదఁబడి దానినంతయు జనశూన్యముగాఁ జేయుచు నందుఁ దనకన్నులకు మిగుల ముద్దుగాఁగనంబడిన యారేండ్లప్రాయముగల యీచిన్నదానిం జంపక తన చిత్రశాలలో నుంకొన వచ్చునుగదా యని యూహించి తెచ్చి యింటఁ బెట్టినది ఈచిన్నది యిప్పుడు ప్రాయము గలిగియున్నది; దీనిసంరక్షణమంతయు నేనేకను గొనుచుంటిని, దీనికి లోకవ్యవహారములును విద్యయు నేనే కొంత నేర్పితిని; ఇది మిగుల తెలివిగలది అని దానికథ చెప్పినది అతండు దాని నిజమైన వెలఁదిగా నెఱింగి సాభిప్రాయముగాఁ జూచి మూర్ఛమునింగి యెట్టకేలకు లేచి అయ్యారే యిట్టిమోహనాంగి నెందును గనివిని యెఱుఁగ దీని మేనికాంతికిఁ గుందనపు తళుక్కుగూడ చాలదని

చెప్పనచ్చును దీనియవయవములన్నియు మొలచినట్లున్నవి అని పెక్కుతెరంగుల వర్ణించుచు పిన్నమ్మా దీనిమాట మాయమ్మయొకసారి నాతోఁ జెప్పినది, జ్ఞాపకమువచ్చినది. నాకుఁ బెండ్లిచేయుమని యడిగితిని. అప్పుడామె అబ్బాయీ నీకొఱకు చక్కని కన్యను బెంచుచుంటిని. దానిబెండ్లియాడవచ్చునని సమాధానము చెప్పినది. నేఁడు నాకన్నులు ధన్యత్వమొందఁజూచితినని పలికిన నది వత్సా! అలాగునా! అట్లయిన యుక్తముగానే యుండును నీకిష్టమున్న చెప్పుము. ఇప్పుడే మీయిద్దరకుఁ బెండ్లిచేయుదుననిన, సింహదమనుండు సంతసించుచు పిన్నమ్మా! యింతులకు మాయమ్మ యొప్పుకొనినదిగదా; నీవును సెలవిచ్చినచో నట్లే పెండ్లియాడెదనని పలికెను.

అప్పుడది యాచిన్నదానితోఁ బట్టీ! యీకుమారుని మాయక్క పెంచుకొనినది. వీనికి నిన్నుఁ బెండ్లిజేయ నిష్టపడినది. నీయదృష్టము మంచిది యిట్టివిజన ప్రదేశమందున్నను దగిన మగనిఁబడసితివి ఇందు మీయిరువురు యథేష్టసుఖంబులనుభవింపుఁడని పలికి యా రాక్షసిభోజనము చేయుటకై మొదటఁజూచిన యింటికిఁబోయినది.

పిమ్మట నమ్మగువయు, వానిఁజూచినది మొదలు సజాతీయ వస్తుదర్శన సంతోషముజెంది యతనిం గామించినది. సింహదమనుని హృదయంబునను రాగ సూచకములగు విలోకములను త్రాళ్ళచే నాకర్షించెను అప్పుడు సింహదమనుఁడు పైకొనిన తమకముతో దాని కయ్యూ జే గాఢాలింగనముఁ జేసికొని నారీ! నీపేరేమి? యీ పాతాళగేహంబున నొంటిగా వసించి నీజవ్వనమంతయు నీఁటగలుపుచుంటి వేమనియడిగిన నప్పడఁతి వానికిట్లనియె.

ఆర్యా! నాతల్లిదండ్రు లెవ్వరోనేనెఱుంగను నన్ను బాల్యమందే యిచ్చటికిఁ దీసికొనివచ్చినఁదట నాకు మోహినియనుపేరుపెట్టినదియు నిదియే. నేనింతకుమున్ను నిన్నుఁగాక మరియొవ్వరిని వఁగనా

రిని జూచియుండలేదు. లోకవ్యవహారములన్నియు వినుటయేకాని యీజన్మమం దొక్కటియుఁ జూడలేదు. కూపకూర్మమువలె నీగుహాగేహంబున వసించియుంటి. నాపూర్వజన్మమం దెచ్చటనో కొంచెము సుకృతము చేసియుంటిని. లేనిచో నీయట్టిమనోహరుఁడు మనోహరుఁడుగా దొరకునా యని పలుకుచు నతనికి సంతోషము గలుగఁ జేసినది.

సింహాదమనుండును నచ్చెలి కనుకూలమగు కేళీవిలాసంబులు వెలయింపుచు నింపుపుట్టించెను. ఇట్లయ్యిరువురు దమకంబుదీరఁ గొంతతడవు గ్రీడించి యలసి సొలసియున్న సమయంబున నమ్మోహిని వానికిట్లనియె.

ఆర్యపుత్రా! నీవు రాజకుమారుండవు. కంకాళిరాక్షసస్త్రీ. అట్టిదానికి నీవుపుత్రుఁడవగుట యట్లో తెలియకున్నది. నీ వృత్తాంతము విన వేడుకయగుచున్నది. చెప్పుమనియడిగిన నతండు తన్వీ! నావృత్తాంతమంతయు నీకుఁ బిమ్మటఁ జెప్పెదంగాని యొకటివినుము. ఇది రాక్షసి. రాక్షసులకు మనుష్యులు ఆహారవస్తువులుగదా. అట్టి వారికి మనయెడ మక్కువ స్థిరముగానుండదు. యెప్పుడో యాకలి యైనతరి నిది మనలను భక్షించును కావున ముందు దీనిం బరిమార్చిన మేలగును. దీనియాయు విందులోనున్న గోరింకపిట్టలో నున్నది. దానిఁజంపిన నిది చచ్చునఁట. అట్లుసేయుట నీకిష్టమేనా యని యడిగిన నదియును బెంచిన మోహమునఁ గొంచెము సంశయించుచు మగనిబోధచే నెట్టకేలకు సమ్మతించినది.

తర్వాత నారాజకుమారుండు దానిజాడఁ జూచి మెల్లన నా పంజరమున్నచోటికరిగి యాపంజరములోఁ జేయిపెట్టి యాపిట్టను పైకిఁదీసి యొక్కపెట్టున దానిగొంతునుపట్టి నులిమిచంపెను. ఆపిట్ట చచ్చినతోడనే వంటశాలయం దారాక్షసియు గిజగిజతన్నుకొనుచుఁ బ్రాణములు విడచెను. అప్పుడు రాజకుమారుఁడు మిగుల వేడుకఁజెం

దుచు నాసుందరితోఁ దనవృత్తాంతమంతయుఁ దెలియఁజెప్పి బోఁటీ! ఇంకొక నిశాటినియున్నది. అది మాతండ్రిని మోసముచేయుచున్నది. దానిపనిఁగూడఁ బట్టవలయును. అది నన్నే చంపఁదలఁచి యిచ్చటికిఁ బంపినుగాని మణిమంజరియను చిన్నదానివలన నాకా యాపద దాటి నది. దానితో వేగము గలిసికొనవలయును. మరియు నా తల్లులు నాకై వేచియుందురని పలికి యక్కలికితో నాగృహవిశేషంబు లన్నియుఁ బరిశీలించి యందుఁ గొన్నిదినంబులు యథేష్టకామంబు లందుచుండెను.

సింహాదమనుండు మోహినితో నాపాతాళగృహంబునఁ బూర్వ వృత్తాంతము మరచి కొన్నియేఁడులు రాత్రియుఁబగలను వివక్షత లేక కేళీసౌఖ్యము లనుభవించెను. అక్కాలమంతయు నతనికొక సంవత్స రములాగైనను తోఁచలేదు. తల్లులను దండ్రిని మణిమంజరినిఁ దన దేశంబును మరచి యిష్టసుఖంబు లనుభవింపుచుండ నొక్కనాడతఁ డెద్దియో కార్యంబునకుఁ దల్లుల కంటిగ్రుడ్డులున్న పెట్టె తెరచెను. వానింజూచినంత పూర్వవృత్తాంతమంతయు నతనికి జ్ఞాపకమువచ్చి నది. అప్పుడతఁడు మిగులఁ దన్ను నిందించుకొనుచు భార్యతో రమణీ! నావంటిమూర్ఖుం డెందును లేడు. తల్లులును దండ్రియు నచ్చట శత్రుబాధితులై చిక్కులుపడుచుండ నిచ్చటసుఖం బనుభ వింపుచుంటి. ఆరక్కసి మాతండ్రి నెన్నిచిక్కులుపెట్టుచున్నదియో! వేగఁ బోవలయునని చెప్పి యప్పుడ చిలుకపంజరమును, కనుగ్రుడ్డు లున్న పెట్టెనుమాత్రము గైకొని మోహినితోఁగూడ గుహాముఖం బునకువచ్చి యచ్చట పూర్వము దానెట్లువిడిచెనో యట్లేయున్న యాయద్భుతతురంగముపై భార్య నెక్కించి పంజరము పెట్టెయుఁ గూడ దానిమూపుమీఁద నమర్చి మునుపటిపొడి నిప్పులో వైచెను. అప్పుడచ్చటి రాయిపగిలి దారియిచ్చినది.

పిమ్మట సింహాదమనుండు తానుగూడ గుఱ్ఱమెక్కి జయపర మేశ్వరా! యనునంతలో నాగుఱ్ఱమాదారింబడి వెడలి యతివేగ

ముగా మున్నువచ్చినట్లు నడుచుచుఁ దృటికాలములో లవణసము ద్రంబు దాటి యవ్వలియొద్దు చేరెను. మోహిని భూలోక మెన్నఁడును జూడలేదుకావున నంగుఁ జూచినదియెల్ల నాబిడకు వింతగానే దోఁచుచున్నది.

ఆమె వింతలుచూచుట కై గుఱ్ఱమును వేగముగానడువనీయక మెల్లగా నడిపించుచుఁ జిన్నచిన్నమజిలీలు చేయుచుండెను. ఇట్లు నడుచుచు నొకనాఁడు సాయంకాలమున నొకయడవిలో బసఁజేసిరి. రాత్రి యొకచెట్టుక్రిందఁ బరుండి సింహదమనుండు భార్యతో నిష్టాలాపములాడుకొనుచుండఁ బ్రాంతమున నొకసింహధ్వని వినంబడినది. దానికి దద్దరిల్లి యప్పల్లవాధరి వరునిఁ గౌఁగలించుకొనినను భయము తీరక మేనెల్ల వణకఁజొచ్చెను. అప్పుడు సింహదమనుండు భార్యకు ధైర్యముజెప్పుచు నామెను చెట్టుమోఁదల నిలఁబెట్టి కత్తి చేతఁబూని గుఱ్ఱమెక్కి సింహధ్వనివినఁబడినదిక్కు పరిశీలింపుచుండ నాదండనుండి యొకసింహము మొగంబుదెరచికొని తోఁకయాడించుచు నాచెట్టుమోఁదల కేతెంచి నంతలో సింహదమనుండు వెరువక యతిసాహసముతో గుఱ్ఱమును దానిమీఁదికి ద్రోలెను. అప్పుడా సింగము బెదరి వెన్నిచ్చి పరవఁజొచ్చెను. విడువక సింహదమనుండు దానివెంటఁబడి తరుముచుండెను. ఈరీతి నతిరయముగా సింహమును, సింహమువెనుక సింహదమనుండును పరుగిడుచుండ నడుమ ననేకవృక్షలతాగుల్మాదులు నుగ్గయిపోయినవి

అట్లొకవిధముగాఁ దెల్లవారువరకుఁ బరుగెత్తెను. ఎంతదూరము వచ్చెనో చెప్పుటకువీలులేదు. తెల్లవారినంత నాసింహము సింహదమనునికిఁ గనంబడినదికాదు. దానికతండు వెరఁగుపడుచు నయ్యో! యీసింగమెందేగెనోకదా? నావచ్చినపయనంబంతయు వృధయైనదే. దీనింజంపక మగుడనని ప్రతిజ్ఞజేసితిని, యూరక మరలిపోయినచో మోహిని పరిహాసముచేయునేమో? ఇదియునుంగాక నా

వాల్గంటి నొంటిగా నట్టడవిలో విడిచివచ్చితిని. అది నాకై యెంత పరితపించుచుండునోగదా! యేమిమోసమువచ్చునో! యేమృగమైన నను భక్షించునేమో! యెంత తెలివితక్కువవాఁడనైతిని. అప్పటి తొందరచే దానిమాట నిదానించనైతినేయని పరిపరిగతులఁ జింతించుచుఁ గడువేగముగా నాబిడయున్నతావు జేరఁదలఁచి రెండు మూఁడు క్రోశములు నడిపించిన నంతలో ప్రాంతమున నొకపట్టణము గనంబడినది.

అప్పుడు సూర్యోదయసమయమైనది. దారిస్పష్టముగాఁ గనంబడుచున్నది. తానున్నదారి యాపట్టణమునడుమనుండియే పోవును. దానింబడి వేగముగాఁబోవుచుండ నాయూరిబయట పెద్ద కాలువ యడ్డమువచ్చినది. యతనిగుఱ్ఱమున కాకాలువ యొకలెక్కా! సులభముగా దానిందాటిన అతనిగుఱ్ఱము గమనవిశేషమునకు వెరఁగందుచు నచ్చటఁగావున్న రాజభటులు వేగమేవచ్చి యాగుఱ్ఱమున కడ్డము నిలిచి యతనితో గుఱ్ఱముదిగుమని పలికిరి. అంతమాత్రమున కతండు జడియక నాకుగుఱ్ఱము దిగవలసిన యగత్యమేమో చెప్పుఁడని యడిగిన వారతని కిట్లనిరి.

అయ్యా! మారాజశాసనమును జిత్తగింపుఁడు. ఈకాలువ దిగక యెవఁడు దాటునో వాని నాయొద్దకుఁ దీసికొనిరండని నియమించెను. అట్లు నియమించుట యేటికో మాకుఁ దెలియదు. మీరు దీనిం దిగక గుఱ్ఱముతోడనే దాటిరి. రాజదర్శనమునకుఁ బోదమని రాజాజ్ఞను జూపించిన నతండేమియుననలేక యెన్నరికైనను రాజశాసన మనతిక్రమణీయముగదా యని తలంచి వారితోఁగూడ రాజుగారి దివాణమునకరిగెను.

ఆవార్త వినినతోడనే యారాజు సింహదమనుని కెదురువచ్చి యుచితమర్యాదలతోఁ దీసికొనిపోయి యర్ధసింహాసనమునఁ గూర్చుండఁబెట్టుకొని యెల్లబంధువులను బౌరులను మంత్రులను రప్పించి వారెల్లరు విన నతని కులదేశనామంబులడిగి తెలిసికొని మిగుల సంతసించుచు నిట్లనియె.

ఆర్యా! నాపేరు ప్రతాపరుద్రుఁడు. నాకుఁ బుత్రసంతానము లేదు. చిరకాలమునకుఁ గాంచనమాలయను పుత్రిక జనించినది. అది రూపంబునను గుణంబులను కళావిశేషంబులను మిగులఁ బొగడఁదగియున్నది. వెదకివెదకి దానికిఁ దగినమగనిఁ గూర్పలేక విసిగి సాధారణునికీయ నిష్టపడక యిట్టిశపథముచేసితి. ఎవ్వఁడు మాయూరిబయటనున్న కాలువనుదిగక దాటునో వానికి గాంచన మాలను రాజ్యముతోఁగూడ నిత్తునని మనంబున నియమించుకొం టిని. నాఁడుమొదలు నేఁటిదాక దీనిం దాటినవాఁడెవండులేఁడు. తుదకిట్టిశపథంబేటికిఁ బట్టితినని పశ్చాత్తాపముందుచుంటిని నేఁడు నాభాగ్యవశంబున నీవు నాప్రతిజ్ఞాభంగముగాకుండఁ గాలువందాఁ టితివి. నీకు నాపట్టిని రాజ్యంబుతో నిచ్చివేసెదను గైకొనుమను టయు నతండు సంతసించి యంగీకరించెను. సిరిరా మోకాలొడ్డు వాఁడుఁగలడా? పిమ్మట నారాజు శుభముహూర్తంబున నధికవిభవ ముతోఁ గాంచనమాలను సింహదమనునకిచ్చి పెండ్లిచేసి వెంటనే రాజ్యమునకుఁ గూడ నధీశ్వరునిగాఁ జేసెను.

సింహదమనుఁడా దేశమునకధీశ్వరుండై న్యాయంబునఁ బ్రజలఁ బాలింపుచుఁ గాంచనమాలతోఁగూడ యథేష్టకామసుఖంబు లనుభ వించుచు నతనికిఁ బూర్వస్మృతియేమియులేక మోహినింగాని మణి మంజరింగాని తల్లిదండ్రులఁగాని యొకనాఁడైన స్మరింపఁడయ్యె. ధనమదులకు వెనుకటి చింతయుండదను నార్యోక్తితప్పునా ?

## మో హి ని క థ.

గోపా! యాకథ యట్లుండనిమ్ము! అచటఁ జెట్టుక్రిందఁ దన మగండట్లు సింహమును తరుముకొని పోయినవెనుక మోహిని తెల్ల వాఱువఱకు మరల నతండువచ్చునేమోయనునాసచే నొంటిపాన్ర

ముతో నిలచి నలుదెసలు పరికించి చూచుచుండెను. తెల్లవారినను నతని జాడయేమియు లేదు. అప్పుడప్పుడది గుండెపగుల నిటునటు తిరుగుచు నతఁడుపోయిన త్రోవంబట్టి కొంతదూరముపోయియు నతండొకవేళ నా చెట్టుక్రిందకువచ్చి తన్నువెదకుచుండు నేమో యని మరల నా చెట్టుమొదలు చేరి యతనిం గానక పెద్ద యెలుంగున నో సింహదమనా? యోమనోహరా! యని యరచియు నెందును బ్రతిధ్వనిఁగానక గుండెలు బాదుకొనుచు దైవమును దూరుచుఁ దన్నుదాన నిందించుకొనుచు నరచేతఁ బ్రాణంబులు పెట్టుకొని యమ్మహారణ్యములోఁ గొంతతడవు దిరుగఁజొచ్చినది.

అప్పుడొకమూలనుండి యాయెలుంగు విని కొందరుదొంగలు వచ్చి యమ్మోహినింబట్టుకొని యొడలినున్న వస్తువులన్నియుఁదోచి కొనియు విడువక కట్టివైచి తమ రారాధించు నొకయమ్మవారికి బలి యియ్యఁదలచి చయ్యన నచ్చటికిఁ దీసికొనిపోయిరి. అప్పుడామె గుండెరాయిచేసికొని యట్టిమగఁడేపోయినప్పుడు మరణంబెక్కుడా యని తెగించి నిర్భయముగా వారివెంట కటికిచీకటిలో నమ్మవారి యాలయమున కరిగెను. ఆదొంగలాయంగననట్లు అమ్మవారిగుడికిఁ దీసికొనిపోయి ముందు కానుకలిచ్చి యావెలఁదిని బలియియ్యఁబోవు సమయమున వారిలో నొకఁడు తక్కినవారి కిట్లనియె.

ఓరీ! తమ్ములారా! ఈనారీమణి మిగుల నందకత్తెలాగున నగపడుచున్నది. దీని నిష్కారణమేల చంపెదరు. నావంతు వచ్చిన సొమ్ము మీకువదలివేసెదను. దీని నాకుభార్యగానీయుఁడనియడిగెను. ఆమాటవిని మరియొకండు అన్నా! నీవేనా? కాముకుఁడవు. నాకుమాత్రము మంచియందముగలదానియందు వలపు గలుగదనుకొంటివా? హాయిగా దీనిం గౌఁగిటఁజేర్చువానికి దేవేంద్రపదవినుసాటివచ్చునా! నీవు నీవంతుధనం బిత్తువుగాని దీనినాకుభార్యఁగాఁ జేసితి రేని

నాపాలుకువచ్చిన ధనమున కిబ్బడిగానిత్తుననిపలికెను. ఆయిరువురి మాటలనువిని వేరొకఁడు ఓహోహో! మీరేనా భాగ్యవంతులు! మీపాటి వలపును సొమ్మునుగలవారు వీరిలోనెవ్వరుగలరు. అమ్మవారికి బలియియ్య పేరుపెట్టిరిగాన నూరుకొంటినిగాని యీయూహ నాకు మొదటనే పుట్టినది. దీనినే నాకుభార్యగాఁ జేసినచో మీరు వంతునకువచ్చినధనము నిత్తుమని పలికిరిగాని నేను మీయందరకు నెలకు నూరుమాడలవడువున యావజ్జీవము వేతనము నిత్తుననిపలికెను.

ఈరీతి నందరకును క్రమంబుగఁగామవృత్తులు మనంబులనంకురించినవి. అమ్మించుఁబోణి తమకేకావలయునని యెల్లరును గోరి కలహము పెంచుకొని కత్తులందీసికోపముతోఁ బెద్దతడవుపోరి తుదకు నొకరిచేతనొకరు చంపబడిరి. ఆహా! పూర్వము విష్ణుండు జగన్మోహినియై రాక్షసులనెల్లఁబరిమార్చినట్లు ఆమోహినియు దొంగలభగ పెట్టెను. ముచ్చులందరు నట్లుచచ్చినవెనుక యచ్చేడియ విధిచేష్టకు నాశ్చర్యపడుచునయ్యయ్యో! దైవము నన్నింక నెన్నిబాధలు పెట్టుటకొగదా చావనియ్యలేదని శిరఃకంపము చేయుచు నాగుడిలో నమ్మవారిని ధ్యానింపుచుండ నింతలో నామొహృదయాంధకారముతోఁగూడ దిక్కులు చీఁకటివాసి తెల్లవారెను. అప్పుడు ప్రాంతమందుఁ బ్రజల కోలాహలధ్వనివినంబడిన నది యొకపట్టణప్రాంతమనియు నూరిలోనికిఁ బోవచ్చుననియుఁ గొంతధైర్యముగానుండెను. ఇంతలో నాయమ్మవారిపూజారి గుడికివచ్చి యందు రతీదేవియుంబోలెఁ బ్రకాశించుచున్న యాచిన్నదానింజూచి యద్భుతపడుచు అమ్మా! నీవెవ్వరిదాన వీగుడిలోనికేమిటికి వచ్చితివని యడిగిన నప్పుడతి యిట్లనియె.

అయ్యా! నాకెవ్వరును దిక్కులేరు. నాభర్త యీయరణ్యములో నన్నువిడచి మృగమును హింసింపనరిగి తిరుగా రాలేదు. మృగముచేత హింసింపఁబడెనేమో తెలియదు. నన్ను దొంగలు

పట్టుకొని యాభరణములన్నియుఁ దీసికొనిపోయి తుదకు నామూల
ముగనే యొకరినొకరు కొట్టుకొని మృతిఁజెందిరి. అదిగోవారి కళే
బరములందున్నవి. చూడుము. నీమొగముచూడ మంచివాఁడవువలె
నుంటివి. మీయింటఁ గొన్నిదినములుంచెదఁ గాపాడెదవే యని
యడిగిన నతండు తల్లీ! నీకేమియు భయములేదు. మాయింటఁ బెట్టు
కొని పుత్త్రికవలె జూచుకొనియెద. రమ్ము. నీభర్తను బొందఁగలవని
యోదార్చుచు నప్పుడ తన యింటికిఁ దీసికొనిపోయెను. అతనిభార్య
మిగులగయ్యాళి. ఆయిల్లాలింజూచి కోపముతో నీపడుచు నెచ్చటి
నుంచి తెచ్చితివి? యిది యెవ్వతెయని యడిగిన దానికతండిట్లనియె.
ఓసీ! యిదియొక రాజకుమార్తె. పాపము కారణాంతరమున బంధు
వులతో విడిపోయినదఁట, అమ్మవారిగుడిలో చేరినది. కొన్నిదినములు
మనయింటనుండును. దీనిమర్యాదగాఁ జూడుమనుటయు నక్కులట
పండ్లుపటపటగొఱుకుచు నీయాశయము నే నెఱుంగుదును. ఇది
చక్కనిదిగదాయని జేర్చి నేనేమైన నందునని యిట్లనుచుంటివి.
నాకన్న యిదియందముగలదియా? అదియునుఁగాక చెడిపోయినట్లు
కనుపించుచున్నది. ఇంతకు పూర్వమెందర నుంచుకొనివిడిచినదో
యిట్టిది మనయింటనుండినచో మనకుఁగూడ నల్లరివచ్చును. చాలు
చాలు మరియొక యింటికిఁ దీసికొనిపొమ్ము. ఊరిలో విటపురుషులు
పెక్కండ్రుగలరని పలికిన నామాటలాలించి యమ్మోహిని చెవులు
మూసికొని శివశివా! ఏమయ్యా! యీమె యిట్లనుచున్నది? నీవు
నన్నట్టి యుద్దేశముతో దెచ్చితివా యని యడిగిన నతం డిట్లనియె.
తల్లీ! నీయుల్లంబున నట్లెన్నఁడును తలంపకుము. నీవు నాకుఁ
గూఁతురవు. ఈనిర్భాగ్యురాలి కేమి తెలియును. అది యెప్పుడును
మర్యాద తెలియక యట్లేకూయుచుండును. దానిసంబంధము నీకే
మియు లేదు. నీయిష్టమువచ్చినట్లు సంచరింపుమని పలికి పెండ్లాముతో
తిట్టి యమ్మోహినిని సగౌరవముగాఁ దన యింటబెట్టుకొని కాపాడు

చుండెను. మోహిని యర్చకునియింట నున్నప్పుడు తనకుఁ దగిన కృత్యంబులు చేయుచు సంతతము తన భర్తనుగురించి చింతించుచు, నితర ధ్యానములేక కాలక్షేపము చేయుచుండెను.

ఆపూజారిభార్యకు నొక కంసాలితోను కోమటితోను సాంగత్యము గలిగియున్నది. నిత్యము రాత్రులయందు వారిరువురు నొకరు విడిచి యొకరు వచ్చుచుందురు. ఈరీతిఁ బెక్కుదినములనుండి జరుగుచున్నను నాపూజారి గుర్తెఱుఁగడు. ఒక్కనాఁడురాత్రి మోహిని యొద్దియోపనికి వాకిటికివచ్చెను. అప్పుడు కంసాలి గోడప్రక్కను పొంచియుండెను. అది చూచి మోహిని భయపడి దొంగ దొంగ యని యరచెను. ఆ ధ్వని విని పూజారి దీపము తీసికొనివచ్చెను. వానికిఁ దప్పించుకొనిపోవ వేరదారి లేమింజేసి యాపూజారిముందర నుండియే పారిపోయెను. ఆపూజారి దీపము వెలుఁగున వాని నానవాలుపట్టి వాఁడు దొంగతనము చేయువాఁడు కాఁడనియు జారత్వమునకే వచ్చెననియు ననుమానముపడి నాఁటినుండియు భార్య నితర మిషలచే దండింపఁదొడంగెను. ఆయదలింపా కులట గ్రహించి మోహిని మూలముగాఁ దనగుట్టు బయులయ్యెనని యామెం జంపఁ బ్రయత్నించుచుండెను. ఆపూజారి భార్య యొకనాఁ డెట్లో విష చూర్ణము సంపాదించి కొంత మిఠాయిచేసికొని, యుండలలో నా విషచూర్ణమును కలిపెను. మంచియుండలను విషము గలిపినయుండలను గురుతుగా నొక పెట్టెమీఁదఁ బెట్టెను.

ఆరాత్రి పూర్వమువలె గంసాలివచ్చి దాని మంచముక్రింద డాగియుండెను. నాఁటిరాత్రి ప్రొద్దుపోవువరకు పూజారి నిద్దుర పోలేదు. ఆజారిణి తన విటుని యునికి బయలుపడునని దీప మార్పినది. అపుడు అర్చకుఁడు నిద్రబట్టక భార్యతో దీప మారిపోయినది. లేచి వెలిగింపుము నాకు నీ విందాక చేసిన మిఠాయి కొంచెము పెట్టుము అని యడిగెను. ఆమాటలు విని యది యిటునటు దిరిగి దీపము వెలుగించుసాధన మెక్కడ నున్నదో తెలియ లేదని చెప్పుచు

మందసముమీఁదనున్న మిఠాయి యుండలఁ గొన్ని తెచ్చి మగని కిచ్చినది.

అందులో రెండు మిఠాయియుండలను మంచముక్రింద దాఁగి యున్న యుపపతికి నందిచ్చినది. అది పెట్టిమీఁదనుండి మిఠాయి తీసి కొనివచ్చునపుడు చీకటిలో నానవాలుపట్టలేక విషముగలిపినయుండ యొకటి వానితో దీసికొనివచ్చెను. ఆయుండయే యెఱుంగక యుప పతి కిచ్చుటచే నది తినిన కొంచెము సేపులోనే వాఁడుమృతినొందెను. తానొకటితలఁప దైవ మొకటి తలంచునను సామెత తప్పునా? ఆ లంజ మగనికి నిద్రపట్టిన వెనుక మంచము క్రింద జేయిపెట్టి యతని పైకి రమ్మని సంజ్ఞ చేసెను. అతండు దానికి మరల నుత్తరము చెప్పలేదు. అప్పుడు వానికి నిద్రపట్టినదనుకొని గట్టిగా లేపినది కాదు. తెల్లవారుజామున నర్చకుఁడు యథాప్రకారము గుడియొద్దకుఁ బోయెను. తర్వాత నారంకులాడి దీపము వెలిగించి యాకంసాలిని లేపెనుగాని యేమియుఁ బ్రయోజనము లేకపోయెను. వాఁడు చచ్చె నని గ్రహించి చీకటిలో విషముంచిన మిఠాయియుండ యతని కిడితిఁగాఁబోలునని పశ్చాత్తాపతప్తచిత్తయై గుండెలు బాదుకొనుచు వాఁడు చచ్చినశోక మొకటియేగాక యుదయంబున రాజభటులు జూచిఁ దన్ను శిక్షింతురను వెరపు మనంబునఁ బాధింపుచుండఁ బెక్కు తెరంగులఁ జింతించుచుండెను. ఇంతలో దెల్లవారునప్పుడు వచ్చు వైశ్యకుమారుఁడు గోడ దుమికి లోపలకు వచ్చెను. వానిం జూచి యా రహస్యము వానితోఁజెప్పి యెట్లయిన నీముప్పు దాటింపు మని వేడుకొనెను. ఆకోమటి యట్టిమాట వినినతోడనే గడగడ వడకుఁచు అయ్యో బాబు! నాకు గుండెలు కొట్టుకొనుచున్నవి. ఏమియుం దోచకున్నది. రాజభటులు జూచినచో నిన్నును నన్నును గూడఁ దీసికొనిపోయి చెరసాలఁ బెట్టుదురు. నీపాదములకు మ్రొక్కె దను. నన్నేలాగునైనను మాయిల్లు చేర్చుము. సామ్మైన గావల

సినచో నిచ్చెదను. ఇందునిలువ నాకు భయమగుచున్నదని పిరికితన ముగాఁ బలికిన నది వాని కిట్లనియె.

ఓయీ ! నీవు వెరవకుము. దీని గురించి నీకేమియు మాట రానియ్యను. మాయింటనున్న మోహినిమీదఁ నీనేరమంతయుఁ దోసివేసి దానిని శిక్షింపఁజేసెదను. ఈశవమును మనము మోచు కొనిపోయి దానియింటఁ బెట్టుదము రమ్మని పలికి యతండు కాలి వైపు నేను తలయుంపినిబట్టి యాశవమును మోచుకొనిపోయి మోహిని పరుండియున్న గదిలో మంచముక్రింద మెల్లగావైచి యామె లేవకుండునట్లు తలుపులుమూచి యరిగిరి. ఆకోమటి యింటి కరిగియు నుదయంబునఁ దనమీఁద నేమిపడునోయని వెరపుతో నుండెను. అంతట నాచెడిపె యుదయంబున లేచి పాఁచిచేయుచు మోహినీ ! లెమ్ము లెమ్ము తెల్లవారినమాటయే యెరుఁగకుంటివి. ఇంతయలపునకు రాత్రి యేమిచేసితివని లేపిన నులకిపడి యక్కలికి లేచినది లేచినతోడనే మెత్తగా నామె కాలికి శవము తగిలినది దానికి బెదరి యమ్మదవతి అయ్యో ! యిచ్చట నెవ్వరో యుండిరని యరచెను.

అప్పుడా పూజారి భార్య తలుపు తెరచి జూచి మోహినీ ! కంసాలి యిచ్చటఁ బరుండి యున్నాడేమి ? యని యడిగెను. అమ్మో హిని దానితో అమ్మా ! యీతం డిచ్చట కెట్లు వచ్చెనో నేనెరుఁగ నని చెప్పెను. అప్పుడా టక్కులాడి ముక్కుమీఁద వ్రేలువైచుకొని భళిభళి ! యెంతదానవె ఇదియా నీగుణము తెలిసినది వీనిఁబెట్టుకొని యుంటివా ? తెల్లవారినది లేపివాని నింటి కనుపుము. అనిపలుకుచు బిమ్మట వాఁడు చచ్చి యుండెనని యప్పుడే దెలిసినట్లభినయించుచు గుండెమీఁదఁ జేయివైచుకొని అమ్మయ్యో ! యేమి జరిగినదో జూచితివా ? వీ డిప్పుడు చచ్చియున్నాడు ఏమియు నెరుంగనిదాని వలె నట్లు తెల్లబోయెద వేటికి ? యథార్థము చెప్పుము నీకతంబున

మాకుగూడ మాట రాగలదు. నీ కులగోత్రములు తెలిసికొనక నింట బెట్టికొనినందులకు నామగని కీపాటిశాస్తి కావలసినదేయని యనేక ప్రకారములుగా నాపతివ్రతను నిందించుచు వీథిబడి యో పెద్దమనుష్యులారా! యో రాజభటులారా! యిటురండు మా యింటనున్న తొత్తు నరహత్య చేసినదని యరచిన విని రాజభటులా యిల్లు చొరబడి కంసాలిశవమును, రెండవ శవమువలెఁ గదలక ధ్యానించుచున్న మోహినినిం జూచిరి.

అప్పుడా రాజభటులు పూజారి భార్యం జూచి యీచిన్నది యెవ్వతె? మీయింటి కెట్లు వచ్చినదో చెప్పుమని యడిగిరి. అది పేరెలుంగనవారితో నిట్లని చెప్పదొడంగెను. అయ్యా! కొన్ని నెలలక్రిందట నామగఁడు ఈ లంజను దెచ్చి యింటఁ బెట్టెను. దీని వైఖరి యంతయుం జూచి యప్పుడే వలదని చెప్పితిని. నామాట పాటిసేయకుండుటచేతనే యీరొష్టు తగిలినది. ఇదివచ్చినది మొదలు దీని యందమును వలచికాఁబోలు విటపురుషులు మాయింటిచుట్టు తిరుగుచుండిరి. ఈకంసాలియుఁ దరుచు వచ్చుచుండెడువాఁడు. నాకేలయని యుపేక్షగా నూరకుంటిని. నిన్నరాత్రి యేమి హేతువు చేతనో వీనిం జంపినది. ఆరహస్యము నాకుఁ దెలియక పూర్వము వలెఁ దెల్లవారుజామునలేవమి సందియమందుచుఁ దలుపు చెంతకుఁ బోయి లేపితిని. అప్పుడును లేచినదికాదు. పిమ్మటఁ దలుపు దెరచి చూడ నిందీ శవము గనంబడినది. నేను భయపడి యిత డెవ్వాఁడు యిట్లేల చచ్చియున్నాఁడని యెంత యడిగినను బెల్లముగొట్టినరాయి వలె మాట్లాడినదికాదు. అప్పుడు యీనేరము మాయింట జరిగినది కావున వెరపుజెంది వీథిఁబడి మిమ్మును బిలిచితిని ఇదియే నే నెఱిఁగిన కథ యని యా బొంకరి వారితోఁ జెప్పినది.

పిమ్మట వారు మోహినింజూచి దీనికి నీవేమిచెప్పెదవనియడిగిరి. అప్పుడా సాధ్వి మనంబున నదిచేసిన కల్పనకు వెరగుజెందుచు

దైవము తనకు మరలఁ దెచ్చిన చిక్కులగురించి చింతించుచు నెట్లు యునను జావఁదెంచియున్నది గావున వారికేమియు నుత్తరమియ్యక నేరముచేసినట్లే యొప్పుకొనుదానివాలెఁ దలవంచి యూరకుండెను. అప్పుడా రాజభటులు ఆమెను నేరముచేసినదానిగా నిశ్చయించి సంకెళ్ళువైచి బందీగృహంబునకుఁ దీసికొనిపోయిరి. వైద్యులాశవమును గోసి పరీక్షించి విషప్రయోగము మూలముగాఁజచ్చినట్లు తెలియఁజేసిరి. అప్పుడు రక్షకపురుషులు పూజారిభార్యను సాక్ష్యము చెప్పుటకు నిశ్చయించి యానేరము న్యాయాధిపతియొద్దఁ బెట్టిరి. ఆన్యాయాధిపతి యంత బుద్ధిమంతుఁడు కాడు ఆసాక్ష్యమంతయు విచారించి ఆమె మాట్లాడకపోవుటయే నేరముచేయుటకు నిదర్శనమని నిశ్చయించి యాచిన్నదానికి నురిశిక్షకు నుత్తరమిమ్మని యప్పుడు రాజుగానున్న యజ్ఞదత్తునికి వ్రాసికొనెను.

గోపా! పూర్వము సింహాదమునుండు ద్వీపాంతరమునకరుగుచు మేడమీఁద గొలువున్న మణిమంజరియను రాజపుత్రికతో నొకరాత్రి గ్రీడించి యేగినవార్త నీవు వినియేయుంటివి. ఆమణిమంజరి గర్భము ధరించినది. ఆరహస్యమామెతండ్రి దాసీ ముఖంబుగాఁ దెలిసికొని కూఁతురుపై గోపముసేయక పండితులఁబిలిపించి యావృత్తాంతము వారికిఁజెప్పి మణిమంజరి దోషురాలా? యని యడిగెను.

అప్పుడు పండితులు విమర్శించి శకుంతల మొదలగు రాజస్త్రీలఁ గొందరఁదృష్టాంతముఁజూపి గాంధర్వవివాహంబున స్వతంత్రముగాఁ బతిని స్వీకరించుట రాజపుత్రికలకు ధర్మమేయగుట నిర్దోషురాలేయని చెప్పిరి. పిమ్మట రాజు సంతసించుచు నుత్సవములు పెక్కు చేయించెను. ఆమణిమంజరికి శుభలగ్నంబునఁ బుత్రుండు జనించెను వానికి యజ్ఞదత్తుఁడను పేరుపెట్టిరి. ఆకుమారుండు ఆకారంబునను గుణంబులను బరాక్రమంబునను బుద్ధికౌశల్యంబునను, సింహాదమునుని బోలియుండెను. పదియారేఁడులు వచ్చినతోడనే యారాజు దౌహి

తుండైన యజ్ఞదత్తునికిఁ బట్టాభిషేకము జేసి తపోవనంబునకరిగెను. యజ్ఞదత్తుండును తల్లివలన దనతండ్రివృత్తాంతమంతయు విని యా లోపమునకై పెక్కుతెరంగులఁ జింతింపుచుండెను.

అందు రాజ్యముసేయుచున్న యాయజ్ఞదత్తుఁడు న్యాయాధిపతి వ్రాసిన జాబునుజూచి తాను సింహాసనమెక్కి కొలఁదికాలమె యయ్యెను. మొదటనేరయొక మూఁడుదానికి నురిదీయనాజ్ఞయిచ్చుటకు శంకించి యానేరమును గుఱించి జరిగిన గ్రంథమంతయుఁ దన యొద్దకుఁ బంపుమనియుఁ దానేవిచారించి శిక్ష విధింతుననియు న్యాయాధిపతికి వ్రాసి యాగ్రంథమంతయుఁ దనచెంతకుఁ దెప్పించుకొనెను. విచారణ దినసంబున యజ్ఞదత్తుఁడు విద్వాంసులును, మంత్రులును, సామంతులును, పౌరులును, బెక్కండ్రు సభనలంకరింపఁ బెద్దకొలువుదీర్చి యచ్చటికి మోహినిం బిలిపించి పూజారిభార్యవలన మరల సాక్ష్యమును బుచ్చుకొని యాసాక్ష్యము మూలముదానే మోహినినేరము చేయనట్లుదృఢపరచెను. సాధారణముగా జారిణికి నుపపతియందున్న మక్కువ యెవ్వరియందును నుండదనియు, నట్టి ప్రేమాస్పదుని విషముపెట్టి యేటికి జంపుననియును, మౌనమవలంబించియుండుటయే నేరముస్థాపించుటకు నాధారమగుచున్నదని వ్రాసిన న్యాయాధిపతి యభిప్రాయము తప్పని స్థిరపరచి సూక్ష్మబుద్ధియైన యజ్ఞదత్తుఁడు మోహిని నిరపరాధిని యని నిశ్చయించి యామెతో నిట్లనియె.

అమ్మా! నీవిట్లు మౌనమవలంబించి యుండుటచే నీమీఁదను నేరము స్థాపింపఁబడుచున్నది. నీమొగంబుజూడ నపరాధము జేసినట్లు గనంబడదు. నీవెద్దియో యాపదజెంద ప్రాణత్యాగమునకై తెగించి మాట్లాడకుంటివి నీవిరాగ మల్పమతులు తెలిసికొనలేక నీవీనేరము చేసినదానవేయని నిందింపుచున్నారు, లోకాపవాదముబాపకారణమ్మే

యని పెద్దలు జెప్పుదురు. ఊరక నీవట్టి యపవాదము బొందనేటికి? యథార్థముచెప్పి యీనింద బాపికొనుమని పలికిన నామోహిని యతని చల్లనిమాటలచేఁ దన హృదయసంతాపము కొంత తొలంగ నొక్కింత తలయెత్తి యతని కిట్లనియె.

దేవా! అష్టదిక్పతుల యంశములవలనఁగదా రాజు జనించును. అట్టి దేవతాంశసంభూతులగు మీరు యెఱుఁగనిదిగలదా? నేనీనేరము చేయలేదని చెప్పిన లాభమేమి? నన్ను నాపత్సముద్రంబున ముంపఁదలంచిన దైవసంకల్పమును నేను మార్పఁగలనా? ప్రియాసపడి యపరాధము తప్పించుకొని బ్రతికినను సార్థక మేమున్నది? కావున నా వృత్తాంతముతో మీకేమియు నిమిత్తము లేదు. నాకు వేగమ యురికి యాజ్ఞ యిప్పింపుఁడని వేడుకొనెను.

ఆమాటలచే యజ్ఞదత్తునికి నామెయందు మరియు నక్కటికము బొడమినది. తదీయ వేతృత్వమున కచ్చెరువందుచు మరల నిట్లనియె. అమ్మా! యథార్థము చెప్పినచో నీకేమి లోపమున్నది. అన్యాయముగ నిన్ను నురిదీయ నాజ్ఞాపించుటకు నేనంత దురాత్ముఁడ ననుకొంటివా? నన్నుఁ బుత్రునిగాఁ దలంచి నీవృత్తాంత మెఱింగింపుమని వినయపూర్వకముగాఁ బ్రార్థించిన నతని మాటలఁ ద్రోసివేయలేక మెల్లన నిట్లనియె.

అయ్యా! మీరిట్లు సారెకు నన్నడుగుచుండ జెప్పకునికి మూర్ఖతగా నుండును. వినుండు. నాపేరు మోహిని, నన్ను బాల్యంబుననే యొక బ్రహ్మరాక్షసి యెత్తుకొనిపోయి ద్వీపాంతరమందున్న పాతాళగృహములోఁ బెట్టి పోషింపుచుండెను. అచ్చటికిఁ గొంత కాలముకిందట సింహాదమనుండను రాజకుమారుఁ డొక కార్యము మీఁద వచ్చెను. అతండును మణిమంజరియను రాజపుత్రిక మార్చిన యుత్తరము మూలముగా నాగక్కసి గుట్టంతయు గ్రహించి దాని జంపి యందున్న నన్ను గాంధర్వవివాహంబున స్వీకరించి కొంత కాల

మాగుహాయందు గ్రీడావిశేషము లనుభవింపుచుండెను. అంత నొక్కనాఁడు తల్లుల కన్నుగ్రుడ్డులమూలముగాఁ బూర్వస్మృతిగలిగి యప్పుడే కదలి యద్భుతవేగముగలిగిన తన గుఱ్ఱముమీఁద నెక్కించుకొని యాగుహావెడలి సముద్రంబు దాటి యీవలి యొడ్డు చేరెను.

నాకు నరణ్యములోఁగల వింతలన్నిటిని జూపుచు నొకనాఁడు రాత్రియొక చెట్టుక్రింద బస జేసి మాట్లాడుకొనుచుండ నొక సింహము మమ్ముఁ జంపవచ్చినది. అప్పు డతండు గుఱ్ఱమెక్కి కత్తి దీసికొని దానిపై బడెను. అదియుఁ బారిపోయిన దానివెంట నతండు తరుముకొనిపోయెను. ఆసింహమును సింహదమనుండును నెచ్చటికిఁ బోయెనో కాని యారాత్రియు మరునాఁడుగూడ రాలేదు. నేను జింతించుచు నడవిలో దిరుగుచుండఁ గొందరుదొంగలువచ్చి నన్నుఁ బట్టుకొని వస్తువులు దోచికొనియు విడువక అమ్మవారికి బలినియ్య గుడియొద్దకుఁ దీసికొనివచ్చిరి గాని పాపము నామూలముగనే వాం డ్రెల్లరు మృతినొందిరి పిమ్మటఁ దెల్లవారుసమయంబున నీయూరి వాఁడు యాగుడి యర్చకుఁడు వచ్చి నన్నాదరించి తనయింటికిఁ దీసికొనిపోయెను.

వారియింట నేను కాలము గడపుకొనుచుండ నొకనాఁ డుదయమున నేను లేచునంత నామంచముక్రింద నీశవము పడియున్నది. కారణము నాఁకు దెలియదు. దీని గుఱించి పూజారిభార్య నామీఁద నెంతయో కల్పనజేసినది. ఎట్లయినఁ జచ్చుటయే మేలని యిన్నటికి నొడంబడి యూరకుంటిని ఇదియే నాకథ మీకుఁ దోచి నట్లుచేయుఁడని యూరకున్నంత యజ్ఞదత్తు డంతకు మున్నె తన తల్లి వలన సింహదమనునికథ వినియుండుట నతండే తన తండ్రియనియు మోహిని తల్లి యనియు నెఱింగి గుండె ఝల్లుమన నెల్లరు చూచి వెఱగందుచుండఁ దటాలున నాసింహాసనమువనుండి లేచి యామోహిని పాదంబులంబడి యిట్లనియె.

తల్లీ! నేను నీపుత్రుండను, నీపతి సింహాదమనుండు మాతండ్రియే, నీవు చెప్పినమణిమంజరియందు జనించి మాతాతానుపార్జితమగు నీ రాజ్యంబు బాలింపుచుంటిని. అన్నన్నా! నీ వెట్టియిడుమలుబడుచుంటివి. కానిమ్ము. నీవిఁక జింతింపకుము. మాతండ్రి బ్రతికియున్నాఁడు గదా! యెచ్చటనున్న వెదకిరప్పించెదను. నీవు పూర్వజన్మకర్మమూలముగా నిట్టిబాధలు పడుచుంటివి. కర్మపరిపక్వమైనట్లు తోచుచున్నది. ఈమిషగా నాయొద్ద జేరితివి. లేసిచో నెట్లు తెలియునగు నంతఃపురమునకుఁబోదము రమ్ము మణిమంజరి నీకు శోకోపశమనము చేసెడుగాక యని పలికి ఆమె నిందబాపుటకై యాపూజారి భార్య వలననే నిజము వెల్లడిసేయఁదలచి యొక యినుపకడ్డీ నెఱ్ఱగాఁ గాల్పించి యథార్థము చెప్పనిచో నర్చకునిభార్యను కాల్చుమని యాజ్ఞాపించెను. అయ్యాజ్ఞానుసారముగా, రాజకింకరులు గాల్చినలోహపు గజము నంటించఁబోవునమయంబున భయపడి ఆచెడిపె గడగడవడకుచు అయ్యయ్యో! నాకంటింపకుఁడు అంటింపకుఁడు నిజము చెప్పెదనని మొఱపెట్టుచు దాను మిఠాయిలో విషముంచి యానవాలు తెలియక యుపపతికిఁ బెట్టుటయు నతండు చచ్చినవెనుక తాను కోఁటియు మోసికొనిపోయి మోహినిగదిలో నుంచుటయు నాబిడమీఁదనే నేరముంచుటయు లోనగువృత్తాంతమంతయుఁ జరిగినట్లు చెప్పెను. అపుడు సభ్యులెల్లరు తెల్లపోయి దాని నిందించు వాక్యములతోనే మోహిని యోర్పునుగురించియు యజ్ఞదత్తుని బుద్ధిసూక్ష్మతను గురించియు మిగుల స్తుతించిరి.

అంత ననంతకోపముతో యజ్ఞదత్తుండు అర్చకుని పెండ్లామునకు నురిదీయు నాజ్ఞాపించుటయు, మోహినిసమ్మతింపక యర్చకుఁడు ఆపత్కాలములోఁ దనకుఁ జేసిన యుపకారమునకు మారుగా దానిఁ గాపాడవలయునని యజ్ఞదత్తుని బ్రతిమాలుకొనియెను. తల్లిమాట ద్రోసివేయక యజ్ఞదత్తుఁడు దాని క్షమించి సామాన్యశిక్షతో విడిచిపెట్టెను.

పిమ్మట యజ్ఞదత్తుఁడు సగౌరవముగా మోహినిని మణిమంజరియున్న యంతఃపురమునకుఁ దీసికొనిపోయి యామె వృత్తాంతమంతయు దల్లికిఁ జెప్పెను. మణిమంజరియు మోహిని సంతోషము జెందఁ బెక్కు తెరంగుల గారవింపుచు దుఃఖోపశమనములైన మాటలచే నోదార్చెను. మోహినియు మణిమంజరికి నమస్కరించి యామె చేసిన యుపకారముగురించి సంతసించుచు సింహదమనుఁడు తనతోఁ జెప్పిన మాటలన్నియుఁ జెప్పుచు నాబిడను అక్కగానే భావించి క్రమంబునఁ దానుబడిన యిడుమల గొంచెము మరువఁజొచ్చెను.

మణిమంజరియు మోహినియు నిరంతరము సింహదమనుని గుఱించియే చెప్పుకొనుచుఁ దన్నాధీనచిత్తలై విరాగమతులతోఁ గాలక్షేపము చేయుచుండిరి.

యజ్ఞదత్తుఁడును తల్లుల సంతాపము జూడలేక తండ్రినరయు నుపాయములు పెక్కుచింతించి యొక్కనాఁడు తనతల్లులరూపములు చిత్రఫలకంబుల వ్రాయించి పరిచారకుల చేతికిచ్చి యాఫలక రూపంబుల సాభిప్రాయముగాఁ జూచినవారి నాయొద్దకుఁ దీసికొని రండని యాజ్ఞాపించి యంపెను. రాజభటులు రాజశాసనప్రకారమాచిత్రఫలకంబులం గొని యనేక దేశములు దిరుగఁజొచ్చిరి.

అచ్చట సింహదమనుఁడు కాంచనమాలతో యథేష్టసుఖంబులనుభవించుచు రాజ్యతంత్రరతుండై పూర్వస్మృతిలేక తిరుగుచు నొకనాడు విహారార్థ ముద్యానవనంబునకరుగుచు నంగడిలో నొకచోట బదుగురు గుంపుగూడియుండుటఁజూచి యది యేదియో కనుంగొనిరండని కింకరులనంపిన వారు తెలిసికొనివచ్చి యిట్లుచెప్పిరి. అయ్యా! అడవినుండి చెంచులొక చిలుకను బెట్టెతో నమ్మఁదెచ్చిరి. పెట్టెలోఁ దళుక్కురని నేమిమో మెఱయుచున్నవి. వానినెవ్వరు నిరూపింపలేకుండిరి. ఆపెట్టెయుఁ బంజరము నడవిలో వారికొక చెట్టుక్రిందఁ

దొరకినవఁట. ఆవిచిత్రమును జూచుటకై యనేకులు గుంపులుగూడిరి. సెలవైనచో దేవరవారియొద్దకుఁదీసికొనివత్తుమనిపలికిరి. ఆమాటలువిని యతఁడు ధ్యానించుచు నావస్తువులతో వారినిటకుఁ దీసికొనిరండని యాజ్ఞాపించెను.

పిమ్మట నాచెంచులావస్తువులు తెచ్చి రాజుముందర బెట్టిరి. తా నిం జూచినతోడనే సింహాదయను పెకిఁ గలిగిన దుఃఖమింతింతని చెప్ప టకు నలవికాదు. గుఱ్ఱముపై నుండి నేలఁబడి మూర్ఛిల్లి కొంతసేపటికిఁ బరిచారకులు చేసిన యుపచారములచేఁ దెప్పరిల్లి అయ్యయ్యో! యెం తమరుపు జెందితిని. మోహిని యడవిలో నేమైనదో గదా! ఏమేమి? ఇదిస్వప్నమా? లేక నిజముగా రాజ్యమేచేయుచుంటినా? నాకు రా జ్యమెట్లువచ్చినది? మోహినియు నేనును పాతాళ భవనములోనేకదా యుంటిమి. లేదు. లేదు అటుబయలు వెడలి యడవిలోఁ జెట్టుక్రిందను న్నప్పుడు సింహముమూలముగ విడిపోతినా? జ్ఞాపకమువచ్చినది. ఈ చిలుక నేనుతెచ్చినదే కదా? ఈగుడ్డ మూతల్లులవికావా? అన్నన్నా! ఎన్నాళ్ళైనది. రాజ్యమదమునన్నింతమరుపుజెందించునే యని యనేక ప్రకారముల వెర్రివాడుంబోలె బలవరించుచు నాచెంచులఁజీరి యోరీ? మీకివి యెచ్చటదొరికినవో చెప్పుఁడని యడిగెను.

వాండ్రు ఫాలంబులఁ జేతులుచేర్చి మ్రొక్కుచుసామీ! మేము వీనిని దొంగతనముచేసి తీసికొనిరాలేదు. అడవిలోఁదిరుగుచుండ నొక చెట్టుక్రింద దొరకినవి. ఇవిమాకుదొరికి చాలాదినములైనవిగాని యి న్నాళ్లవరకుఁ గ్రామాలకుగా లేదు గానఁదీసికొనిరాలేదు మాగుడిసెల లోనే దాచియుంచితిమి. పెట్టెలోనివేమియో మాకుఁ దెలియకున్నవి. ఏలినవారికిఁ గావలసినచోఁ దీసికొనుఁడని చెప్పిరి ఆమాటలు విని యతండు గన్నులనీరు గార్చుచు నోరీ! ఆచెట్టుక్రింద నొక చిన్నదాని జూడలేదా యని యడిగెను. వాండ్రు అయ్యో! ఆచెట్టుదగ్గర మా

కెవ్వరును గనంబడ లేదు. ఈపెట్టెయుఁ బంజరముమాత్రమే యున్నవి. మనుష్యుల యడుగుల జాడలున్నవని చెప్పిరి.

అంత నాసింహాదమనుం డపారమగు శోకముతో నాపంజరము ను బెట్టెయుదీసికొని యప్పుడసభాంతరమున కరిగి ముఖ్యామాత్యుని రప్పించి ఆర్యా! నాకు గార్యావసరములు గొన్నియున్నవి. దేశాంతర మున కేగుచుంటిని. నేను దిరుగవచ్చుదనుక నీవీ రాజ్యంబు పాలిం చుచుండుమని చెప్పి తనముద్రికలిచ్చి వేసెను. తర్వాత నతఁడుఅంతః పురమునకరిగి కాంచనమాలతో నేదియో మిషచెప్పి యెట్టకేలకు నాబిడ నొడఁబరచి యాచిలుక పంజరమును పెట్టెనుమాత్రము గై కొని యొకఁడే యేకాంతముగాఁ బురమువెడలి యడవిమార్గంబు నం బడి మున్నుతాను మోహినిని విడిచిన తావునరయుచు దిరిగెను. ఎందును నామెజాడ యగుపడినదికాదు——

అతండెనలేని విచారముతో నొడలెల్ల భస్మము బూసికొని బైరాగియై యారెండువస్తువులను విడువక యనేకపురములు నదులు దీర్థంబులు దిరుగుచుండెను. అట్లుతిరుగుచు నొకనాడు ఒకగ్రామం బున వీథివెంబడి వేణుదండంబులకుఁ గట్టినపటములఁ ద్రిప్పుచున్న రా జభటులఁ గొందరంగాంచి సింహాదమనుఁడావటములలో నేమియున్న దని యడిగినవారు అయ్యా? చూడుఁడు అని యాపటముల వంచి చూపించిరి. సింహాదమనుఁడు అందున్నవిగ్రహములలో మణిమంజరిని గురుతు పట్టలేదు. మోహినిని గురుతుపట్టెను.

సింహాదమనుండట్లు మోహినిపటమును జూచి కొంతసేపుతా నుగూడచిత్తరుబొమ్మవలెఁగదలక యట్టెనిదానించిచూచి మోహినీ! నీవు మనుష్యరూపము విడచి దివ్యరూపముధరించితివా? నన్నుమరచి తివే. మాట్లాడవేమి, నన్నుఁగృతఘ్నునిగాఁదలంచితివా? నీపాదంబు లంబడియెదను. నాయపరాధముసైపుము రాజ్యమదాంధుఁడనై నిన్ను

మరచితిని. తప్పుమన్నింపుమని వలుకుచుఁ జిత్తరువునందున్న యామో హినినిఁ గౌగలించుకొనఁబోవుచుఁ జెక్కుల ముద్దుపెట్టుకొనుచు విర హతాపంబంతకంతకు నతిశయించుచుండ నాపటమును విడువక నలి బిలి చేయఁదొడంగెను.

అప్పుడు రాజకింకరులు అతనివిరాళియంతయుఁజూచి పెక్కు తెరంగులఁ జింతించుచు సన్యాసీ! నీకేమైనం బిచ్చిపట్టినదా? యూర క మాపటమును నలుపుచుంటివేమి? మారాజునొద్దకు రమ్ము పోద మని నిర్బంధించిరి.

అప్పుడతఁడు కొంచెము మోహముమరలించుకొని అయ్యో! నేనేమి తప్పుచేసితిని. మీ రాజునన్నూరకశిక్షించునా! యొక కారణం బునం దొందరపడి యీపటమునునలిపితిని. ఈమాత్రముతప్పునైచుకొని నన్ను మీరాజునొద్దకుఁ గొనిపోకుఁడని బ్రతిమాలఁదొడంగెను.

కింకరు లామాటఁబాటింపక ఇదిగో రాజశాసనము పరిశీలిం పుము. ఈపటమును నలియఁజేసినందులకు నిన్నుఁగొనిపోవుట కాదు. సాభిప్రాయముగాఁ జూచుటయే నేరమనిపలికి యతండెన్ని చెప్పినను వినక బలాత్కారముగా నతని యజ్ఞదత్తుని వీటికిఁ దీసికొనిపోయిరి. సింహాదమునుండు వారినెదిరింప సమర్థత గలిగియు నప్పటి స్థితినిబట్టి యిట్టట్టనక వారివెంటనరిగెను. యజ్ఞదత్తుఁడు సభ జేసియున్నసమయం బున రాజభటులా బైరాగినితీసికొనిపోయి రాజు ముందర బెట్టి, అయ్యా! మేముతమయాజ్ఞానుసారముగా నే పటములతో ననేక దేశ ములు తిరిగితిమి. ఎందునుయెవ్వరును శంకింపలేదు. యీబైరాగిదీనిని జూచినది మొదలు మోహినీ! మోహినీ! యని పరితపించుచు నీపట మును గౌఁగలించుకొనిపెద్దతడవు విడువక గడబిడ జేసెను. దానంజేసి యీతనిం దీసికొనివచ్చితిమని చెప్పిరి. యజ్ఞదత్తుఁడు తండ్రినెఱుఁగమి నానవాలుపట్టలేదు. సన్యాసిగానున్నను నాజానుబాహుత్వాది రూప శ్రేష్టవమునుబట్టి సందియమందుచు నతనితో నిట్లనియె.

అయ్యా! తమదేశమేది? ఈపటమునుజూచి యేమిటికి శోకించితిరి? యథార్థము చెప్పుడు మీ కేమియు భయము లేదని సగౌరవముగా నడిగిన వినియతండిట్లనియె. అయ్యా! బైరాగిగానున్న నాకుభయ మనునది యొకటిగలదా! నేనొకకారణమున నాపటమునుజూచి శోకించితి. నాశోకమున మీ కేమినష్టము వచ్చినది. నావృత్తాంతము మీతో నేమనిచెప్పుదును? సిగ్గు సిగ్గు నాయిడుములన్నియు జెప్పుకొనుటకు పదిదినములుబట్టును నన్నుఁబోనిండు పొమ్మనుటయు యజ్ఞదత్తుఁడు ఆతనిమాటలచేత నే తనతండ్రియని బాగుగానిశ్చయించి యిట్లనియె. అయ్యా! మీవంటిమహాత్ముల యిడుముల గనుంగొని తీర్చుట రాజునకుము ఖ్యమైన పనియైయున్నది నాకుఁజెప్పిన నేమి లోపమున్నది. నన్ను మీపుత్రునిగాఁ దలంచి మీరీపటమునుజూచి శోకించిన కారణం బెఱిగింపుఁడని వేడుకొనెను.

అప్పుడాబైరాగి యజ్ఞదత్తునితో అయ్యా! వినుండు నాప్రాణప్రియురాలగు మోహినియను దానిని నిష్కారణముగ నడవిలోవిడిచి పోయితిని నేనుదుర్మార్గుఁడను. ఆనేరమునకై నన్నుశిక్షింపుఁడనిన నతండయ్యా! తమరు మోహినినడవిలో నేటికివిడిచితిరి. ఆమె యెచ్చటికిఁబోయినది. మీయుదంతంబు విన ముచ్చటయగుచున్నది. యెఱింగింపుఁడనిన నతండు దాచక తనవృత్తాంతమూలాల చూడముగా వక్కాణించెను. కన్నులనీరుగార్చుచు నామోహినియొక్క రూపమీపటములోనున్నది. దానిఁజూచినఖేదయున్నది. అందులకు శోకించితిని. ఇదియే నావృత్తాంతమని పలుకుచున్న సమయంబున యజ్ఞదత్తుఁడు సింహాసనముడిగ్గ నురికి యత్యంతసంతోషముతో నతని పాదంబులబడి, తండ్రీ! నేనునీపుత్రుండ నాపేరు యజ్ఞదత్తుఁడు మణిమంజరియందు జనించితిని. మోహినియుఁగొలదిదినములైనది ఇచ్చటికే వచ్చినది అని తనవృత్తాంతమంతయుఁ జెప్పిన సింహదమనుఁడు ఆ! యేమీ!

ఇదంతయు స్వప్నముకాదుగద! కాదు. నిజమేయని సంతోషంబును సముద్రింబున మునుంగుచుఁ బుత్రిని గౌఁగలించుకొని కన్నుల నానందబాష్పములుగారఁ బెద్దయుం బ్రొద్దు నోడలెఱుంగ కుండెను.

పిమ్మట సింహదమనుఁడు అ త్యాతురముతోఁ బుత్రినివెంట నంతఃపురమునకరిగి సంతతము తన్నే ధ్యానించుచున్న మణిమంజరిని మోహినినింజూచి పెద్దతడవు గాఢాలింగనములుచేసికొని, యొక్కింత సేపు ఒకరినొకరుపలుకరింప మాటలురాక కంఠములు డగ్గుత్తికజెంద జిత్తరువుప్రతిమలవలె నిలబడిరి. అప్పుడు వారికిఁగలిగిన సంతోషమిం తింతయని చెప్పుటకు నలవికాదు. అట్టి సంతోషముతోఁ గొంతసేపు ఒకరినొకరు తమపడిన యిడుములఁ జెప్పుకొనుచు నిష్టాలాపములచేఁ గాలక్షేపము చేసిరి.

పిమ్మట మణిమంజరి తానుదాచిన యుత్తరముదెచ్చి సింహ దమనునికిఁ జదివి వినిపించి దానికి నూరుగా వ్రాసిన యుత్తరము వృత్తాంతముజెప్పినది. అప్పుడు సింహదమనుఁడు మణిమంజరినిఁ బెక్కు గతులఁగొనియాడి తనయున్నత దశకంతకు నీవేకారణమని ప్రస్తుతిజేసె ను. తర్వాత సింహదమనుఁడు తనతల్లులను తండ్రిని దలచుకొనివారి చిక్కులఁ బాపుటకై మిక్కిలితొందరపడి పయనంబగుటయు మణి మంజరియు మోహినియుఁ యజ్ఞదత్తుఁడుగూడ ప్రయాణమున కుత్స హించిరి చతురంగబలములతోఁ గూడుకొని శుభముహూర్తంబున సిం హదమనుఁడు వెడలి మార్గంబున నెడనెడఁ గుటీరంబులనిర్మింపించి విడియుచుఁ గొన్నిపయనంబులకు విజయపురంబు జేరెను.

అందు బాహ్యోద్యానవనంబున బసజేసి రహస్యముగాఁ దల్లు లకు వార్తనంపి వారిరప్పించి మున్ను విన్నపనముతోఁదాఁదెచ్చినగుడ్లు వారినేత్రములకంటించెను. అప్పుడా రాజభార్యలు తేజోవంతము లైన నేత్రములతోఁ బ్రకాశించిరి. చతురంగబలములతోనూరి బైట

ప్ర్యూహాముపన్నియున్న సింహాదమనుని యాథార్థ్యమంతయుం విని శత్రుంజయుఁడు భయపడి యూరు విడిచి పారిపోవఁదలచి తన్ను మాయ చేయుచున్న రక్కసియున్న యింటికరిగి దానితోఁ జెప్పెను.

అప్పుడది బెదరక రాజేంద్రా! వెరవకుము నేనుగలుగనీకేమిఁ కొంత నాకుయుద్ధముచేయు పాటవముగలిగియున్నది నిజముగా వారు మనమీఁదకు యుద్ధమునకేవచ్చినచో నన్నుఁబంపుము ఆసంగతి రాయబారము మూలముగాఁ దెలిసికొనుమని పలికిన నతండు వెరగుపడుచు నప్పుడే యొకబుద్ధిమంతుని వారివార్త దెలిసికొనుటకై యంపెను. వాఁడును రాజశాసనంబున సింహాదమనుండున్న శిబిరమునకరిగి సగౌరవముగాఁ దమయేలిక సందేశమును విన్నవించెను.

సింహాదమనుఁడు నవ్వుచు దూతా! మీరాజుతోఁ గొన్నిరహస్యములుమాట్లాడవలసియున్నవి. ఇచ్చటికిఁదీసికొనిరమ్మనిచెప్పెను. వాఁడును వేగంబునంబోయి సింహాదమనుని యాజ్ఞను శత్రుంజయునితోఁ జెప్పిన నతండిట్లనియె. ఓరీ! నేనిప్పుడు శత్రుమధ్యమునకు నొంటిగాఁబోవచ్చునా? వారునన్నుఁబట్టి బద్ధునిచేసినచో నేమిసేయనగు వారిబలాబలము లెట్లున్నవి శాంతముగా నుండిరా? యుగ్రముగా నుండిరా? తెలుపుమని యడిగినఁ వాఁడిట్లనియె.

దేవా! వారిని మనమెన్నఁడును గెలువలేము. వారిముఖవిలాసములనుజూడ శాంతముగానుండిరి. వారియెడఁ గ్రౌర్యముఁజూపట్టదు. మిమ్ము రప్పించి నమ్మించి మోసముచేయ వారికంత యవసరమేమి? యుద్ధముచేసి జయింపలేరా? వారియుద్దేశము మీతో సంధిమాటలు మాట్లాడుకొనుటకే యని తోఁచుచున్నది. వారిమాటలన్నియు బహిరాభిముఖములుగానే యున్నవి. నిజముగా వారుతలంచుకొనిన మీకుఁ బారిపోవుటకు శక్యమగునా? కావునమీరుగొన్ని కానుకలు దీసికొనిపోయి వారికి బహిరన్నులఁ జేసికొనుటయే యుత్తమమని పలికిన

వానిమాటలు పాటించి శత్రుంజయుఁడు తగుపరిచారకులతోఁ జెక్కు-
కానుకలు తీసికొని సింహాదమనునియొద్ద కరిగెను.

సింహాదమనుండు తండ్రికెదురేగి మంచిమర్యాదలతోఁ దోడి
తెచ్చి యుచితపీఠంబునం గూరుచుండంబెట్టి తానును యజ్ఞదత్తుఁడు
లోనుగాఁగల సామంతులతనిచుట్టును పీఠంబులఁగూర్చుండి లోకవరి
పాటిగాఁ గుశలప్రశ్నలఁ జేసికొనదొడంగిరి. అట్లుకొంతసేపు మాట
లచేఁ గాలము గడపినవెనుక సింహాదమనుండు శత్రుంజయునితో
నార్యా! నీకు సంతానముగలదా యని యడిగెను.

దాని కతఁడు తలవాల్చుకొని అయ్యా! నాచరిత్ర మేమని
చెప్పుదును. నేను సంతానము బడయఁ నెక్కుడు ప్రయత్నముజేసి
యొకవనితమాట విని గర్భవతులైయున్న యిద్దురుభార్యల నడవి
పాలు సేసికొంటిని. ఆదుర్మార్గురాలి మూలముగానే నాకీముప్పు వచ్చి
నది. దానిని దెచ్చినదిమొదలు నాగ్రామంబున నరిష్టములే సంభ
వింపుచున్నవి. అదియు గొడ్రాలైయున్నది. దానంజేసి నాకు సం
తానము లేదని సంతాపముతోఁ జెప్పెను.

సింహాదమనుండు మొదటఁ దండ్రిని బెద్దతడవు చిక్కులు
బెట్టదలంచుకొనెను. గాని యతనిఁజూచినతోడనే దుఃఖమునహింప
నేరక వెంటనే యతని నంతఃపురమునకుఁ దీసికొనిపోయి తల్లుల
నేద్వురను జూపి వీరెవ్వరో యెఱుంగుదువా యని యడిగెను.

శత్రుంజయుఁడు చిరకాలమైనను వారిని గురుతుపట్టెను.
కన్నులు కలిగియుండుట శంకించుకొనుచు నతనితో నేనెఱుఁగనని
యనుమానముగాఁ జెప్పెను. అప్పుడు సింహాదమనుఁడు తండ్రికి నమ
స్కరించి తన్నెరింగించి తనకుఁ జ్ఞానమువచ్చినదిమొద లతనింజూచిన
దాక నడుమజరిగిన కథయంతయుఁ జెప్పెను. అప్పుడు శత్రుంజయుఁ
డదియొక కలగాఁ భావించి కొంతవరకు నమ్మలేదు. భార్యలును

గొడుకును కోడండ్రు పౌత్రుఁడు మొదలగువారు తనకుఁ జేయు మన్ననలం జూచి నిజమేయని నమ్మెను.

శత్రుంజయుఁడు దైనఘటనము గుఱించి యాశ్చర్యపడుచుఁ దా నెఱుఁగకుండ నిక్షేపంబు గృహంబునం గనంబడిన సంతసించు నిరుపేదయుంబోలె నానందపారావార కల్లోలమాలికలం దేలియాడుచు భార్యలం గారవించి పుత్రుని మన్నించి పౌత్రుని ముద్దుగొని కోడండ్ర నాదరించి వారివారికిఁ దగినట్లు మన్ననలం గావించెను.

పిమ్మటఁ దండ్రి యనుమతిచే సింహాదమనుండు చిలుకయున్న పంజరమును దెచ్చి చిలుకను వైకిఁదీసి ముందుకాళ్లు విఱుగఁదీసి వెనుక రెక్కలు ముక్కలుచేసి తర్వాత కంఠము నులిమి దూరముగా విసరి పారవైచెను.

హా! యేమిచెప్పుదును! అంతలోనే శత్రుంజయుని యింటను మాయవనితవేషముతోనున్న రక్కసి నిజరూపము ధరించి బ్రహ్మాండకరండము పగులనార్చుచు నెగసి సింహాదమనుని దాపునకు రాఁబోయెను. మొదటనే కాళ్లువిరచెనుగాన నొకచోట కాళ్లును నొకచోటఁ జేతులును విరిగి పడిపోవ నతఁడు విరిచినయట్లొకచోట శిరము శరీరముతో వేరుజెందినంత నక్కాంకాళి మృతినొందెను. దాని పాదములక్రిందను జేతులక్రిందను మొండెముక్రిందను తలక్రిందనుబడి యనేకజీవులు మృతినొందినవి. దానిదేహ మెంతయుండునో విచారింపుము. ఆయుత్పాతమునుజూచి పౌరులందరు వెరగందుచుఁ జట్టచివర దానికథయంతయు విని సింహాదమనుని మిగులవినుతించిరి.

యజ్ఞదత్తుఁడు మొదలగువీరులు పిక్కండ్రువచ్చి దానియంగంబులన్నియు పెద్దకతారులచే ముక్కలక్రింద నరికి దహనము చేయించిరి. తలమాత్రము నరుకుటకు లొంగినదికాదు. దానిబెక్కండ్రు గొప్పసాధనముచే నూరిబైటనున్న యడవిలోనికిఁ బెద్దకాలమునకు దొర్లించిరి. శత్రుంజయుఁడు సకలపరివారసహితముగాఁ గోట

తోనికిఁ దీసికొనిపోయి శుభముహూర్తమునఁ బుత్రునకుఁ బట్టాభి షేకము చేసి తాను తపోవనమునకరిగెను. యజ్ఞదత్తుఁడు కొన్నిదినము లుండి మరల మాతామహుని రాజ్యము సేయ నరిగెను. సింహాదమ నుండు కాంచనమాలనుగూడ రప్పించి ముగ్గురభార్యలతో యథే ష్టకామంబుల ననుభవించుచుఁ బెద్దకాలము రాజ్యము సేసెను.

గోపా! నీవుచూచిన పుఱ్ఱె యారెక్కసిది. చిరకాలమైనది. కావున మేదో మాంసములు హరించినవి. దానిగొప్ప యిప్పుడేమి యున్నది. దాని మెదో మాంసములున్నప్పుడు చూచితీరవలయును, మార్గస్థులు దానిఁజూచి పర్వతమేయని పెక్కుదినములవరకు భ్రాంతి పడుచుండిరి. ఇదియే దానివృత్తాంతము. నిస్సంశయముగాఁ దెలిసినది కదా? యని యడిగిన వాఁడు స్వామీ! మీకటాక్షమున నంతయుఁ దేటగాఁ దెలిసినది. కథ నాకు మిగుల సంతసము గలుగఁజేసినది. ఇట్లు చెప్ప మీకుగాక యన్యులకు శక్యమా? యని యయ్యతీశ్వ రునిఁ బెక్కుగతులఁ గొనియాడెను.

అంతలో ప్రయాణసమయమైన గొల్లవాఁడును యతీశ్వ రుఁడును నప్పురంబు వెడలి మార్గంబునంబడి నడుచుచు గ్రమంబున పదియవ మజిలీ చేరిరి—

## ప ది య వ మ జి లీ.

# సో మ శ ర్మ క థ.

పదియవమజిలీ, యొక రాజధానిగానున్నది. వారిరువురు నతి విశాలంబగు నాపట్టణపువీధింబడి బోవుచుండ నొకచోట నడివీధిలో నినుపకంబమున నొకబ్రాహ్మణుఁడు నిలబడియున్నట్లు కనబడినది. వానింజూచి యాగోపాలుఁడు మణిసిద్ధునిఁ బైకెనడువనీయక యడ్డము

వచ్చి సామీ! దీని మీరు చూచితిరా! మిక్కిలి పొడవుగానున్న యీయుక్కుకంబముపై నిలఁబడిన బ్రాహ్మణుఁ డెవ్వఁడు? కదలక యీపట్టణపువింతలఁ జూచుచున్నాఁడా యేమి? ఈతనివృత్తాంత మెఱింగింపుఁ డనిన నమ్మణిసిద్ధుఁడును పైకిఁదలయెత్తి నిరూపించి చూచి ఔరా! దీనిపైనున్న వాఁడు నిజమయిన బ్రాహ్మణుఁడు గాడుసుమీ? అదియొక పోతవిగ్రహము. దానికథ భోజనంబైనవెనుకఁ జెప్పెదను లే యనిపలికి నడువఁబోయిన వాఁడు మణిసిద్ధుని పాదంబులంబడి అయ్యా! గమనాయాసము వాయువశము మీచరణంబు లొత్తెదను. ఇచ్చటఁగూర్చుండి నాకు దీనివృత్తాంతము జెప్పుఁడు. విన మిగుల వేడుకగానున్నది. అని నిర్బంధించిన నయ్యతిపతి వాని యానతికి మెచ్చుకొని యచ్చటనే యొకచోటఁగూర్చుండి తనయొద్దనున్న మణిప్రభావమున దాని వృత్తాంతమంతయుఁ దెలిసికొని వానికిట్లని చెప్పఁదొడంగెను.

కొండపల్లి యనునగ్రహారంబున సోమశర్మయను బ్రాహ్మణుఁడుగలఁడు. అతఁడు మిగులదరిద్రుఁడు. ఎన్నిప్రయాసములు చేసినను నొకకాసైనను లభించినదికాదు. అతండొకనాఁడు భార్యతో నిట్లనియె బోటీ! మన యిరుగుపొరుగుననున్న భాగ్యవంతులఁజూడ జూడ నాకెంతయు విచారముగానున్నది. వారు భార్యలతోఁగూడి హంసతూలికాతల్పంబుల గాజుదీపపు కాంతులు ధవళకుడ్యకాంతులతో మేలమాడఁ గ్రీడింపుచుందురు.

నీవు చూడ నెప్పుడును మాసినగుడ్డలే కట్టుకొనుచుఁ దల దువ్వుకొనక యసహ్యముగానుందువు. మనయిల్లుజూడ పేడతో దుక్కుతో నిండియుండును. ప్రొద్దుగ్రుంకినంత కొంచెమునేనైన దీపముంచవు. చీకటిలోఁ గన్నులుగానక నల్లులుగుట్టుచుండ నులక మంచములఁ బరుండుము మనకును వారికిని మిగుల దారతమ్యము గలదు. వారు భగవంతునికి బంధువులును మనము విరోధులమా? మనకుమాత్రమట్టియైశ్వర్యము లుండరాదా? ఇట్టి దరిద్రపుబ్రదుకు

బ్రతుకుటకంటె జచ్చుటయే మేలు. ఇంతకును కారణురాలవు నీవువమ నిన, బురుషునికి భార్యమూలముగా నైశ్వర్యము పట్టును. దరిద్రము గూడ దానిమూలమున నేవచ్చును. దీనికి దృష్టాంతరముగా నొకకథ చెప్పెదవినుము.

పూర్వము విక్రమార్కుండును భట్టియు దేశసంచారము చేయు చుండ నొకయడవిలో నిసుకమీఁద సాముద్రికశాస్త్ర లక్షితములైన రేఖలతో నొప్పుచున్న పాదచిహ్నములు గనంబడినవి. వానింజూచి విక్రమార్కుఁడు భట్టితో నీపాదచిహ్నములం చూచితివా! వీనిఁచూడ నీమార్గంబున మనకన్న నధికుఁడగు మహారాజు నడచినట్లుతోఁచు చున్నది. వేగనడువుము మనకుదాపుననే యుండవచ్చును అతండెవ్వఁడో చూతమనిపలికిన భట్టియిట్లనియె.

రాజా! యీయడుగుల ప్రక్కను పడతియడుగులుగూడఁగనం బడుచున్నవి. చూచితివా? వీనిచిహ్నములు చూడ నైశ్వర్యము గల వారి పాదచిహ్నములవలెఁ గనంబడవు. శ్రమపడి నడిచినట్లుతోఁచుచున్నది. అయిననుపోయిచూతము పదుఁడని పలికి యిద్దరును వేగముగా నడిచిరి. ఆయడుగులజాడంబట్టి పోవఁబోవ నొకపల్లెటూరు గనంబడినది. ఆయూరిలో నొకయరుగుమీఁద నాయడుగులుగలవారు పండుకొనియుండిరి. వారొకబ్రాహ్మణదంపతులు మిగులదరిద్రులు. వారింజూచి విక్రమార్కుండును భట్టియు మిక్కిలి వెరగుపడుచు నాబ్రాహ్మణుని లేపి అయ్యా! తమకాపురమేయూరు? ఇచ్చటికేమిటికి వచ్చితిరి? మీస్థితిగతులెట్టివని యడిగిరి.

ఆబ్రాహ్మణుఁడు లేచి వారితోనిట్లనియె. అయ్యా! మాది రాయవరము. నేనుబ్రాహ్మణుఁడను. ఈచిన్నదినాభార్య. బాల్యంబుననేదీనినాఁకు బెండ్లిజేసిరి. నాకుజ్ఞానమువచ్చినది మొదలు దరిద్రమే బాధించుచున్నది. ఎన్నియుపాయములచేతనైనను నింటియొద్ద జీవనోపాధి కుదిరినదికాదుఎందైన నుదరపోషణమగునేమోయని భార్యతో

నిల్లువిడిచి యిట్లువచ్చితిని. మీరుమిగుల మంచివారుగఁ గనిపించు చున్నారు. మాకుమిగుల నాకలిగానున్నది. ఈపూటకింతభోజన సదుపాయముచేయుదురా? యనియడిగెను. అప్పుడు భట్టియు విక్రమార్కుండును నతనిదరిద్రమునకును భార్యయేగదా! హేతువని యూహించియామె యవలక్షణము లన్నియుఁ బరీక్షించి యందలి యథార్థము దెలియఁగోరి యతనికిట్లనిరి.

బ్రాహ్మణుఁడా! యెంతదరిద్రమువచ్చినను నాఁడుదాని నిల్లు గదుపుదురా? పాపము ఈచిన్నదినాతో మార్గక్లేశమనుభవింపుచుఁ దిరుగుచుండెనే! కటకటా? ఆమెమొగమెట్లు వాడిపోయినదోచూడుడు. ఇప్పుడైనను మేముచెప్పునట్లు చేయుము. ఆమెభోజనము నిమిత్తము కొంతసొమ్మిత్తుము. దానితో నీబిడనింటికిఁబంపుము. నీవుమాతో రమ్ము. నీకు నెద్దియేని వ్యాపారమున ధనముదొరుకు నుపాయముచూపింతుమనుటయు నతండందులకు సంతసించుచు వారికిట్లనియె. అయ్యలారా! మీరుపుణ్యాత్ములు ఇంటియొద్దనెట్లును గడవమి దీనివెంటఁ బెట్టికొని త్రిప్పుచుంటిని. ఇంటియొద్ద దిక్కెవ్వరునులేరు. దీనికెద్దియేని యాధారముచూపించిన చో నింటికనిపెదను. నేనుమీతోవచ్చి మీరుచెప్పినపనిని జేయుదు. అట్లనుగ్రహింపుఁడని వేఁడుకొనుటయు వారు అందులకు మీభార్యకిష్టమున్నదియో లేదో యడుగుమనిన నతండామాటజెప్పిన నాబిడసంతోషముతోనే యొప్పుకొనెను. విక్రమార్కుండు భట్టియు నాబ్రాహ్మణునిభార్యకుఁ గోరినంత ధనమిచ్చి యిచ్చవచ్చిన చోటునకుఁ బొమ్మనిచెప్పి యతనిఁ దనవెంటఁదీసికొని యుజ్జయినీ పురమునకరిగిరి.

అందు వారాబ్రాహ్మణునికి వేరొక్క చక్కనికన్యకం బెండ్లి చేసి యాచిన్నదికాపురమునకు వచ్చినతోడనే మున్ను తానుంచిన నగలన్నియు మరలబుచ్చుకొని కట్టుగుడ్డలతో నాదంపతులనెక్కడికేని

బాండని విడిచివేసిరి. ఆదంపతులు ఉజ్జయనీపురమువిడిచి మధ్యాహ్నమున నొకయగ్రహారముజేరిరి. విక్రమార్కుండు భట్టియు నతని యదృష్టమును బరీక్షింపఁ బ్రచ్ఛన్నముగా వారివెంట నరుగుచుండిరి.

అట్లామిథున మాయగ్రహారమున నెవ్వరి యింటికిఁబోక యొక గృహస్థుని వీథియరుగుమీఁద నిలువంబడెను. వారుచేరిన యొక నిమిషమునకె నాలుగుదినములనుండి ప్రసవముకానేరక నొప్పులు పడుచున్న యాగృహస్థునిభార్య సులభముగా నీళ్ళాడెను. అదిచూచి యాయజమానుఁడు మిగుల సంతసించుచు నాదంపతులు వచ్చుటచేతనే తనకాశుభముగలిగినదని నిశ్చయించి వారికి మిగుల మర్యాదజేసి పిండివంటలతో భోజనము పెట్టి చీనాంబరములుగట్ట నిచ్చుటయేగాక వారిరాక శుభప్రదమని యూరంతయుఁ జాటించెను.

ఆవార్తవిని యాయూరనే వేరొకగృహస్థుని భార్యయు నట్టిచిక్కునే పొందియుండ నాయజమానుఁడు నాదంపతులను పల్లకీమీఁద నూరేగింపుచుఁ దనయింటికిఁ దీసికొనిపోయెను. వారి పాద మెట్టిదోకాని వారిల్లుచేరిన వెంటనే ఆయిల్లాలును సుపుత్రునింగని నది. అప్పుడాయజమానుఁడు పట్టరాని వేడుకతో నాదంపతులను పార్వతీపరమేశ్వరులని భావింప చిత్రభూషాంబరములతో నలంకరించి పూజింపుచుఁ గొన్నిదినములు తనయింట నుంచుకొనెను.

క్రమంబున వారిఖ్యాతి జగద్విఖ్యాతమైనది. ఎవరికే చిక్కులు తటస్థించినను వారిందీసికొనిపోయిన తత్క్షణమేనివారణమగుచుండెను. వారి నొక్కపూటకన్న నెక్కడను నిలువనీయక పల్లకీలఁబంపి యుత్సవములు చేయుచుఁదీసికొనిపోవుచుండును. వారికిచ్చు ధనమునకు నగలకును బట్టలకును మితిచెప్పుటకు వీలులేదు. వారిస్థితి నిత్యకళ్యాణము పచ్చతోరణముగానున్నది. వారి దర్శనమునకై యనేక గ్రామములనుండి జనులువచ్చి వేచియుందురు. ఈరీతి గొన్నిదినములు దేవతావైభవములు జరిగినంత నొక్కనాడు పల్లకీయెక్కి

యూరేగుచు నొక యూరనుండి యొక పట్టణమునకుఁ బోవుచుండ నొకయేనుఁగువచ్చి యావిప్రుని మెడయందుఁ బూవులదండ వైచి బంగారుకలశముతో నుదక మభిషేకము చేసినది.

పుత్రహీనుండగు రాజు చనిపోయినప్పుడు ఏనుఁగచే వరింపఁబడినవానినే రాజుగాఁ జేసికొనుట యాదేశ సాంప్రదాయకము గాన నచ్చటి ప్రజలెల్ల నాబ్రాహ్మణునినే రాజుఁగా భావించి శుభముహూర్తమున బట్టాభిషేకము జేసిరి. అదియంతయుఁ బ్రచ్ఛన్నముగానుండి చూచుచున్న భట్టివిక్రమార్కులు పురుషునిభాగ్యము స్త్రీమూలముగనే కలుగునని నిశ్చయించిరి. అతండు తమకన్న గొప్పరాజు గావున వినయముతో నతనియొద్దకుఁబోయి చేసిన విధానమంతయుఁ దెలియఁ జేయుటయు నాబ్రాహ్మణుఁడు మిగుల నంతసించుచు గృతజ్ఞతసూచింపుచు వారిఁ బెక్కుగతులఁ బూజించెను.

భట్టివిక్రమార్కులును తమరుచేసిన కృత్యము ఫలించెనని సంతసించి తమదేశమున కరిగిరి. కావున నాతీ! నీతోఁ గొన్ని దినములు విడిపోయి నేను దేశాంతరమరిగి ధనము సంపాదించుకొని వచ్చెదను. నాకు దారిభత్యమేమైన నిమ్మని సోమశర్మ భార్య నడిగెను.

అప్పుడామె యేమియు లేక తెల్లఁబోయి చూచుచునామాట మెల్లన జెప్పినది సోమశర్మభార్య నాక్షేపించుచు నీమెడనున్న మంగళసూత్రమమ్మి యటిసెలు వండియిమ్ము. నేను ధనము సంపాదించుకొని వచ్చి నీమేనంతయు బంగారముజేసెదనని చెప్పెను. ఆపతివ్రత మగనిమాట దాటక యప్పుడే తనమెడనున్న మంగళసూత్రమమ్మి బెల్లము పిండియు నూనెయుఁదెచ్చి యాలకులు, జాజికాయ, జాపత్రి మొదలగు వస్తువులు కొన్న తెచ్చుటమరచి వానిదెచ్చుటకు గ్రమ్మరనంగడి కరిగి యావస్తువు లిమ్మని యడిగెను. అప్పుడు కొంచెము చీకటిసమయము గాన నాకోమటి సందడిలో నందు జాజికాయకుఁ బదులుగా వననాభిదుంప నిచ్చెను.

ఆయిల్లాలు తెలియక దానిం గొనిపోయి నూరి పిండితోఁ గలిపి పెద్దవిగా నిరువదినాలుగటిసెలను వండినది. వానిలో నొకటియైనను దానుదినక మూటఁగట్టి తెల్లవారుజామున నరుగునప్పుడు మగని కందించెను. అతం డామూటను దీసికొని యూరు వెడలి యడవిమార్గంబునంబడి జాముప్రొద్దెక్కువరకు నడిచెను. అం దొక చెరువు గనంబడినంత నందు స్నానముచేసి యాయటిసెలం దినఁదలంచి యామూట చెట్టుకొమ్మకుఁదగిల్చి గుంటలో స్నానముచేయుచుండెను. ఇంతలో నిరువదినలుగురు దొంగలు విచ్చుకత్తులతో ఘారాలిచ్చుచు గాడిదెలమీఁదఁ బెక్కుధనమును తీసికొనివచ్చి యాచెఱువుగట్టుననున్న మఱ్ఱిచెట్టుక్రింద ధనమంతయు రాశిగాఁబోసి మిగులనాకలిగానుండుటచే నీరైనం ద్రాగి యాకలి నడగించుకొనఁదలంచి గుంటలోనికిఁ బోయిరి.

సోమశర్మ యంతకుమున్నే వారిఁజూచి దొంగలని నిశ్చయించియు ధైర్యమువిడువక వారి సంఖ్య దెలిసికొని ముక్కుబట్టుకొని కన్నులుమూసికొని జపముచేయుచుండెను. ఆదొంగలతనింజూచి యరచుచుఁ గత్తులందెచ్చి నరకబోయిరి. అందులకతండు కొంచెమైనను జడియక యోబాబులారా! యూరక నన్నేలచంపెదరు? నేను జ్యోతిష్కుఁడను మీరిచ్చటికి వత్తురనియు నాకలిగలిగియుందురనియుఁ దెలిసికొని లెక్కబెట్టి మీరుఁ దిన సరిపడిన యరిసెలం దెచ్చితిని. మీరాక కెదురుచూచుచుంటిని. అదిగో అటిసిలమూట నా చెట్టుకొమ్మందగిలించితి జూచుకొనుఁడని పలికిన నందొకఁడు ఆమూటను విప్పిచూచిన నందిరువదినాలుగే అటిసెలున్నవి. వానింజూచి యతని దైవజ్ఞత్వమున కాదొంగలు ఆశ్చర్యపడుచు నతనిజంపక బహుమానముఁ జేయఁదలఁచి యతని దమగురువుగానుండుమని చెప్పిరి. పిమ్మట నాదొంగలందరు నా చెఱువులో స్నానముచేసి కత్తులన్నియుఁ బ్రోగుగాఁ బెట్టి యాబ్రాహ్మణుఁడు తెచ్చిన యటిసెల నిరువదినలుగురు వంతుప్రకారము దిని నీరుత్రాగి యా

బ్రాహ్మణునే కాపుంచి యాచెట్టుక్రిందఁ పండుకొని నిద్రపోయిరి. అంత నాయటిసెలలోనున్న విషము తలకెక్క. యాదొంగలందరు నిద్రలోనే ప్రాణములువిడిచిరి. వారిచావుసోమశర్మ కొంతసేపటికిఁ దెలిసికొని మితిలేని సంతోషముతో మనంబున నిట్లుపోసెను.

ఆహా! వీరందరు నేను బెట్టిన యటిసెలమూలమును గానే మృతిఁబొందిరి. ఈయటిసెలలో రాత్రి నాభార్య ప్రమాదమున నాభికూడ గలిపినది కాఁబోలు. దైవము నాకీతీరున ద్రవ్యము గూర్చెను? లోకంబంతయు ధనముచేతిలోనున్నది. పురుషకారం బేమియుఁబనికిరాదు. ఒకప్పుడెంతప్రయత్నముచేసినను గాసైనలభింపదు. వేరొకప్పుడూరకయే పెక్కుద్రవ్యలాభము కలుగును. నాకు దైవాయత్తముగా నిప్పుడు గొప్పద్రవ్యము దొరికినది. దీని నెట్లుమోసికొని పోవుదును? పోనీ, మోసినంత దీసికొని పోదమనిన నిందున్నదానికై చింతగానుండును. ఎవ్వరినైనను సహాయముతీసికొనివత్తమన్న భాగముసు గోరుదురు. ఏమిచేయుటకును దోచకున్నది. ఇదియునుంగాక యీధనమంతయుం జూడ నొకమహారాజుగారిదిగానున్నది. ఇందుఁ బెక్కురత్నమండనములు గలిగియున్నవి. వారికిఁదెలిసినచో నాపనిపట్టకమానరు అని పెక్కుతెరంగులఁ జింతించుచు నొకకత్తిచే నాదొంగల యంగంబులన్నియు ముక్కలుగా నరికి రాశిగాఁజేసి యాధనరాశిచుట్టును దిరుగుచు నేమిచేయుటకుఁ దోచక చింతించుచుండెను.

ఇంతలోఁగొందఱు రాజభటులు లాదొంగలవెదకుచునాచెఱువునొద్దకువచ్చిరి. వారిఁజూచి సోమశర్మ కొంచెముభయముజెంది యంతలోఁ దనకు భగవంతుఁడిచ్చిన బుద్ధిబలముచేత ధైర్యము తెచ్చుకొని కత్తిచేతఁబూనిపహారాయిచ్చువానివలె నాధనరాశిచుట్టును దిరుగుచుండెను. రాజకింకరులు రాజుగారిధనమును చెట్టుక్రిందఁజూచి యానవాలుపట్టి సంతోషముజెందుచు సోమశర్మకు సమీపముగాఁ

బోయి నీవెవ్వఁడవు? ఈధనం బేటికి దెచ్చితివనియడిగిన సోమశర్మయు మరల మీ రెవ్వరు? మీ రిచ్చటి కేల వచ్చితిరి? అని యడిగెను.

ఆమాటలువిని రాజభటులు సోమశర్మతో మేము భూరి శ్రీపుఁడను రాజుకింకరులము ఈధనము మా రాజుగారిది. మొన్నఁ గోటలో దొంగలుపడి దోచుకొనివచ్చిరి. వారిం బట్టుకొనుటకై వచ్చితిమి దొంగ లేమైరి. నీవీధనము నేటికిఁ గాచుచుంటివి? నిజము చెప్పుమని యడిగిన నతం డిట్లనియె.

నేను సోమశర్మయను బ్రాహ్మణుండను నాకు దైవబలము గలిగియున్నది. భూతభవిష్యద్వర్తమానములయందు జరుగు చర్యల జెప్పఁగలను భూరిశ్రీపునికోట దొంగలు దోచికొనెదరని తెలిసియే నిచ్చటికి వచ్చితిని. నేను వచ్చునప్పటికి నీధనము దొంగలు పంచు కొనుచున్నారు. వారితో యుద్ధము చేసి కత్తులచే వాండ్రమేనులు తుత్తునుములు గావించి చంపితిని అవిగో వారి శరీరఖండములు చూడుఁడు మీ రందరు నశ్రద్ధగా నుండఁబట్టిగదా, దొంగలు కోటలో బడిరి? నేను రక్షింపనిచో నీపాటికి దొంగ లీధనమును బంచుకొని పోవుదురు. దీని మిమ్మును దీసికొని పోనియ్యను. పోపొండు ఈసంగతి మీరాజుగారితోఁ జెప్పి యిచ్చటికిఁ దీసికొనిరండు అని గద్దరించి పలికిన దూతలు భీతిజెంది యతని తిరస్కరింపనేరక యతి వేగముగాఁ బోయి యీ వర్త యంతయు భూరిశ్రీపున కెఱింగించిరి.

అతండు మిగుల సంతసించుచుఁ బెక్కుసైన్యముతో నప్పుడే యయ్యరణ్యములోనికరిగి యాధనరాశిచుట్టును పహారాయిచ్చుచున్న సోమశర్మనుజూచి నమస్కరించి యిట్లనియె. అయ్యా, తమ రెవ్వరు? యిచ్చటి కెట్లు వచ్చితిరి? యిరువదినలుగురుదొంగల నెట్లు జంపితిరి? నాయందు మీకీయనుగ్రహ మెట్లు గలిగినది? చెప్పుడని యడిగిన నతండు ధైర్యముతో నిట్లనియె.

దేవా! నామహిమ నేనే చెప్పుకొననేటికి? క్రియచేఁ దెలియదా? అదిగో నరకఁబడిన దొంగలయవయవములఁజూఁడుఁడు. ఇవిగో వారికత్తులు. యిరువదినలుగురను వధించితిని మీకు వర్తమానము చేయుదమని యూహించునంతలో మీభటు లిచ్చటికే వచ్చిరి. ఇంతపనికిఁజాలినపరిచారకులఁ గూర్చుకొంటివేటికి? క్షణముదాటినచో నింత ద్రవ్యము వృధాగాఁ బోవుఁగదా? యిప్పు డొకనల్లపూస యేని పోయినదేమో చూచుకొమ్మని పలికిన నాభూరిశ్రవుఁడు సంతోషము జెంది యాబ్రాహ్మణునిఁ గౌఁగలించుకొని మిత్రుఁడా! నీకతంబున నాపరువు నిలిచినది నీవు చేసిన మేలెన్నటికిని మరువను నీవు నాయొద్దనుండుము నీకిద్దియేని వర మిచ్చెదఁ గోరికొమ్మని పలికిన నా సోమశర్మయు రాజా! నీయొద్దనున్న సేన ఆరులక్షలని తెలిసినది ఇంతమందియుండి నను నీకోటదోపుడు మానినదికాదు. వాండ్రకు వృధాగా జీతములియ్యనేటికి? వారిలో రెండులక్షల జనమును దగ్గించి వారిజీతములు నాకిమ్మిదే నాకోరికయని చెప్పిన నతం డప్పుడే యట్టిసైన్యమును తగ్గించి యావేతనము సోమశర్మకు నిచ్చునట్లాజ్ఞ జేసెను.

పిమ్మట నారాజు నాధనమంతయు బండ్లమీఁద నెక్కించుకొని సోమశర్మతోఁ గోటలోని కరిగెను. సోమశర్మయుఁ బురికరిగిన వెనుక రాజుగారిచే నియ్యబడిన సౌధంబున బసజేసి యచ్చటికి భార్యను రప్పించి తాను మొదట జెప్పినప్రకారము ఆమె మేనంతయు బంగారుమయము గావించెను.

రాజుగారి దివాణములోనున్న యుద్యోగస్థుల కందరికి సోమశర్మయం దసూయగలిగియున్నను నేమియుఁ జేయలేకపోయిరి. రాజుచేఁ దగ్గించబడిన రెండులక్షలసైన్యము అతనికి శత్రువుగానున్న వేరొకరాజు నాశ్రయించినది ఇట్లుండ నంత నొకనాఁడు ఆ గ్రామమునకు రాత్రులయం దొకసింహమువచ్చుచు మనుష్యులను

పక్షులనుమృగములను భక్షింపఁదొడంగెను. దానికిభయపడి గ్రామస్థులెల్లరువచ్చి రాజుతో మొరబెట్టుకొనిరి.

అప్పుడు రాజుమంత్రితో నాసింహమును వధించు యోధుల నియమింపుమని చెప్పెను. మంత్రియు సోమశర్మయందుఁగల క్రౌర్యమును దీర్చుకొన సమయము వచ్చినదిగదా; యనియూహించి యత నితోనిట్లనియె. మనయొద్ద సేనతక్కువగా నున్నది. బలము గలిగిన యోధులను తగ్గించితిరి. సాధారణులుండినను నేమి ప్రయోజనము. ఇంతకు మన వైదికబ్రాహ్మణుఁడే సమర్థుఁడు బలశాలి ఆతనినే నియోగింపుఁడని చెప్పిన నామాటలు విని రాజు అప్పుడేసోమశర్మను బిలిపించి పంచాననమును వధింపుమని యాజ్ఞాపించెను.

సోమశర్మయు నతనియాజ్ఞ శిరంబునంబూని వీరాలాపములు పలుకుచు గొంచెమైనను జంకులేక తన్నుదైవమే రక్షించుననుధైర్యముతో నింటికరిగి పెందలకడ భోజనముచేసి పూర్వము దొంగలకత్తులు తనయింటనే దాచియుంచెను గావున నాకత్తులిరువదినాలుగును కట్టకట్టి యూరిబైటికిఁ దీసికొనిపోయి క్రమంబున నవియన్నియు నాప్రాంతమందున్న యొక్క పెద్ద తాళవృక్షముపైకి జేర్చెను. అతఁడు ఆతాటిచెట్టు చిట్టచివరఁ గూర్చుండి సింహము రాకకెదురు చూచుచున్నంత రాత్రి నాహర్యక్షు మక్షీణజవంబుతో వచ్చి బొబ్బలిడుచు నోరు తెరచుచుఁ దోకయాడించుచుఁ గనఁబడిన జీవములెల్ల భక్షింపుచు గంతులువైచుచుండ జెట్టుమీఁదనుండి సోమశర్మ ధాసిముండా యిటురమ్మని పెద్దకేకలువైచెను.

ఆధ్వని జాడఁబట్టివచ్చి యాకేసరి తాటిచెట్టు నిట్టట్టు కదల రాయుచు నోరుదెరచుకొని యహంకారముతోఁ బైకెగఁర జొచ్చెను. అప్పుడు సోమశర్మ యది నోరుదెరచి యెగిరినప్పుడెల్ల నొక్కకత్తి దాని నోటిలోనికి జారవిడుచుచుండెను. అదియుఁ గోపముతో నాతఁడు విడిచిన కత్తులన్నియుఁ గ్రమంబున మ్రింగివైచెను. దానంజేసి కడుపు

లోనున్న పేగులన్నియు దెగి సెలవుల రక్తంబుగార యూపిరివిడువ దెరపిలేక కొంచెముసేపులోనే తన్నుకొనుచు నేలంబడి చచ్చెను. దానిచావు చాలసేపునిదానించి చూచి బాగుగ నమ్మకము దోచిన వెనుక సోమశర్మ చెట్టుదిగి యొకకత్తిచేత దాని యవయవము లన్నియు ముక్కలుక్రింద నరికి రాసిగాజేసి దాని రక్తమంతయు మొగమునకు శరీరమునకుఁ బూసికొని భయంకరాకారముతో నా రాశిచుట్టును గత్తిబూని దిరుగుచుండెను.

ఇంతలో దెల్లవారుటచే జనులందరువచ్చి చచ్చిన సింగను సంగములుజూచి సోమశర్మ పరాక్రమమునుఁ వేతెఱంగుల వినుతిం చుచుఁ గొందఱుపోయి రాజుగారితోఁ జెప్పగా నాతఁడుసకలసామం త మంత్రిపౌరవార సహితముగా సోమశర్మయున్న తావునకు వచ్చి చచ్చియున్న సింహమునుజూచి మిగుల నాశ్చర్యమందుచు సంభ్రమ మెంది యతనిం గౌఁగలించుకొని యత్యాదరముతో నిట్లనియె.

ఆర్యా! నీభుజపరాక్రమ మమానుషమైయున్నది. అనహాయ శూరుండనిన నిన్నే యనవలయును. నీవుచేసినపని నాకెంతయు సంతసము గూర్చుచున్నది. నీయభీష్టమెద్దియో తెలుపుము. ఇప్పుడే యిచ్చెదనని పలికిన సంతసించి సోమశర్మ యిట్లనియె. రాజా నీకు నష్టమైనకోరికలు నేనేమియును గోరను. ఇప్పుడు మనసమస్థానములో నూరక జీతములుతినుచుఁ బనిబాటలులేక తెగబలిసి నాలుగులక్షల సైన్యమున్నది వానిలో రెండులక్షలపౌజును తగ్గించి యాజీతములు నాకే యియ్యవలయును. ఇదియే నాకోరిక అని యడిగిన నారాజు మంత్రియెన్నివిధముల వలదనిచెప్పినను వినక యప్పుడే యాసేనను తగ్గించి యాజీతములు సోమశర్మకు నిచ్చునట్లు నియమించెను.

సోమశర్మయు, నాసింహపుచర్మమును కత్తులను నొకపెట్టెలోఁ బెట్టి రహస్యముగాఁ దనయింటఁ దాఁచియుంచెను. సోమశర్మపైమును పటికంటె రాజుగారికెక్కువ ప్రీతిగలిగియుండెను. సర్వకార్యములతని

మీఁదుగనే నడుపుచుండెను. మంత్రిమొదలగు నుద్యోగస్థులకు నతనియందు మఱియు నీర్ష్య బలియుచుండెను.

భూరిశ్రవునిచేఁ దగ్గింపఁబడిన రెండులక్షల సేనయు నీరాజునం దసూయజెంది యతనికి శత్రుఁడైన రాజునాశ్రయించెను. దానంజేసి యారాజుతనకు మునుపున్న యారులక్షలసైన్యము నిప్పుడు రెండు సారులు చేరి నాలుగులక్షల సైన్యముగలిసి పదిలక్షల సేనగలవాఁడై యుండెను. అప్పుడు భూరిశ్రవునొద్దనుండి వచ్చిన నాలుగులక్షల సేనలోనున్న సేనానాయకు లారాజుంజేరి యిట్లనిరి.

అయ్యా! యిప్పుడు భూరిశ్రవుఁడు మిగుల బలహీనుఁడై యున్నవాఁడు ఒకవైదిక బ్రాహ్మణుని యాలోచనమువిని సేననంతయుఁ దగ్గించినాడు. ఇప్పుడు తమయొద్దపదిలక్షలసేనయున్నది. అతనికి రెండులక్షలసైన్యముమాత్రమేయున్నది. మనమిప్పుడతనితో యుద్ధము జేసి సులభముగా జయింపవచ్చును. అని యతనిగుట్టంతయుం జెప్పి యతనిమీఁద యుద్ధమునకుఁ బోవుటకై యారాజును ప్రోత్సాహపరచిరి.

ఆరాజు వారియుపదేశము యుక్తముగా నున్నదని తలంచి మంత్రులతో విమర్శించి యప్పుడే యుద్ధయాత్రకు నాజ్ఞచేసెను. సకలసైన్యములకు నుత్సాహము కలుగునట్లు రణభేరీ మ్రోగించిరి. తర్వాత గుర్రములు, నేనుఁగులు, రథములు, కాల్బలము, సారథులు మొదలగు చతురంగబలములు వారివారియాయుధములనలంకారములతో సిద్ధమై కోటముంగిటవచ్చి నిలిచినవి. సేనానాయకుఁడును సైన్యముల చిత్రముగా నడిపింపఁదొడంగెను. ఆహారపదార్థములు మందుగుండుసామానులను బండ్లమీఁదను లొట్టిలమీఁద నెక్కించి నడిపింపసాగిరి. అంత శుభముహూర్తమున నారాజు భద్రగజముపై నెక్కి యుద్ధయాత్రకు వెడలెను.

అట్లు మంగళధ్వనులు జయ జయ ధ్వనులు భేరీమృదంగాది ధ్వనులు భూనభోంతరాళంబునిండ భండనమునకు వెడలినయారాజు నకనేకాపశకునములైనవిగాని బలాధిక్యముగల యశని కవి లెక్కకు వచ్చినవి కావు. నడుమనడుమ మజిలీలు చేసికొనుచుఁ బదిదినములకు భూరిశ్రవుని పురబాహ్యప్రదేశముఁజేరి యందు బలముల విడియించి చక్రవ్యూహమును పన్నిరి. నడుమ ప్రభువులుండు శిబిరములునువాని చుట్టును కాల్బలము వారిపైన రథికులు వారిచుట్టును గుఱ్ఱములు వారిపైన నేనుఁగులను విధియుక్తముగా నిలఁబెట్టిరి. అట్టి వ్యూహాంతరమందుండి యారాజు భూరిశ్రవునికి యుద్ధాహ్వానపత్రికల వ్రాయించి చారులచే నంపెను.

అంతకుమున్నే రణభేరీధ్వనులవిని సంశయాకులమతియైయున్న యాభూపతి యట్టిపత్రికంజూచికొని నిశ్చేష్టితుఁడై కొండొకవడికిఁ దెప్పిరిలి యంపుమలకొకదినము మితికోరి మరల నుత్తరమునుపంపెను. పిమ్మట భూరిశ్రవుఁడు మంత్రిని బిలిచి యాయుత్తరము జూపి కర్తవ్యమెద్దియో చింతింపుమని పలికెను.

## మంగలమంత్రికథ.



అప్పుడయ్యమాత్యుఁడు పండ్లు పటపట గొరుకుచు రాజుతో నిట్లనియె రాజా! యుక్తాయుక్తములుదెలియక నుద్యోగము లిచ్చు రాజు ఆపదలఁ బొందకుండునా? పూర్వము నీవంటిరాజే యొకఁడు తనకుబాగుగా క్షౌరముజేసిన మంగలివాని మెచ్చుకొని, యేమి కావలయుననియడిగిన వాఁడు తనకుఁదగినదానినిగోరక మంత్రిత్వమిమ్మని వేడుకొనెను. అతం డంతమాత్రమునకు సత్యలోపము గలుగున

తలంచి బుద్ధిమంతుఁడగు పూర్వపుమంత్రిని తగ్గించి వానిని బ్రధా
నిగా జేసికొనియెను.

ఆవార్త శత్రురాజునకుఁ దెలిసినది. పెక్కుదినములనుండి
యతనిఁ గెలువఁదలఁచియు మంత్రి బుద్ధిబలముచేతచే చేరలేక
పోయిరి. అప్పుడదియే సమయముగ దాయని యూహించి పెక్కండ్రు
ఏకముగాఁ గూడివచ్చి యారాజుకోట ముట్టడివైచిరి.

అప్పుడారాజు మంగలమంత్రిని బిలిచి శత్రురాజులు మన
కోట ముట్టడించిరి. ఇప్పు డేమిచేయవలయునో చెప్పుమనిన
వాడిట్లనియె.

అయ్యా! బాబు! నాతల్లికి నేనొక్కండనే యుంటిని మీరును
అట్టివారేకదా? బ్రతికియుండిన బలుసుకూరైనం దినవచ్చును.
ఈశత్రురాజులనెవ్వడు గెలువఁగలఁడు. నాయొద్ద మాతాత సంపా
దించినవి రెండుపాదులున్నవి. ఒకటి మీకిచ్చెదను రెండవది నేను
దాల్చెదను. అట్టి వేషములతోఁ బారిపోయినచో మనలను శత్రు
రాజులు చంపకవిడిచిపెట్టెదరు. పిమ్మట నేయూరికైనను బోయి
దినమున కిద్దరికి క్షౌరము చేసినచో పొట్టగడువకపోదు. దీనికై
యింతవిచారింపవలయునా? యని యుపాయముచెప్పెను. ఆమాటలు
విని యారాజు ఛీ! నిర్భాగ్యుఁడా! నీకు మంత్రిత్వమిచ్చినందులకు
నాకుమంచిబుద్ధిజెప్పితివి. నీసాంగత్యము చాలుపొమ్మనివానిఁదిట్టుచుఁ
బూర్వపుమంత్రి యాగ్రామమందేయున్నవాఁడు గావున నతని
యొద్దకుబోయి తనకాపద దాటింపుమని పాదంబులంబడి ప్రార్థించెను.

కృతజ్ఞుడైన యామంత్రి యాపత్కాలమందువచ్చిన రాజును
దిరస్కరింపక భయపడవద్దని పలుకుచు నంతకుపూర్వమే తాను
రాజునకు వ్యతిరేకుఁడని తెలిసికొని కోటబట్టుకొనుటకై సహాయము
చేయుమని కోరిన శత్రురాజుల కిట్లు జాబువ్రాసెను.

ఇప్పుడు మీయిష్టప్రకారము గోటఁబట్టియిచ్చెదను. కోట
స్వాధీనమైనపిమ్మట దీనికి మీలో రాజెవ్వఁడుకాబోవునోఁ తెలియఁ

జేయుడని వ్రాసెను. అట్టిచీటిం జదువుకొని యారాజులందరును తమకేకావలయుననికోరి కలహమును పెంచుకొని దారుణమైన యుద్ధముచేసి తుదకొకరిజేత నొకరు హతులైరి.

ఆలాగుననే నీవును వైదికునికిభోజనముగాని బట్టగాని అగ్రహారములుగాని యియ్యక సేననుదగ్గించి సేనాధిపత్యమిచ్చితివి. నేను జెప్పినను వినకపోతిరి .ఇప్పుడనుభవింపుఁడు. రెండు లక్షల పౌజుతో మనమేమి యుద్ధము జేయఁగలము. వారికి బదిలక్షల సేనయున్నది. దీనికంతకును గారకుఁడైన సోమశర్మనే యుపాయమడుగుము నాకుఁ దెలియదు అతఁడు యుద్ధములో మృతిజెందినవెనుక నేను యుద్ధము చేయుదును అని మొగమాటములేక యుత్తరమిచ్చిన మంత్రి నేమియు ననలేక భూరిశ్రవుఁడు సోమశర్మనుబిలిచి యావృత్తాంత మంతయు నెరిగించెను. వానిమొండిధైర్యమెట్టిదోచూడుము. అప్పుడు కూడ నించుకేని భయమందక దైవబలము తనకు బాగుగానున్నదను నమ్మకముతో రాజుతో నిట్లనియె.

దేవా ! నావంటిబంటు మీకుగలిగియుండ మీరుచింతింప వలయునా? మీరు వినోదముగా నింటఁగ్రీడింపుచుండుఁడు. నేనొక దినమున నాశత్రువులమదంబడగించి వచ్చెదనవిన నద్భుతమంది సోమశర్మా ? నీకు గావలసిన సహాయమును దీసికొనిపొమ్మని చెప్పెను. ఆమాటలు విని యతండయ్యా! నాకు దొంగలఁజంపునప్పుడును, సింహమును బరిమార్చినప్పుడును, ఏవారుసహాయముచేసిరో యిప్పుడు మాత్రము వారు సహాయము చేయరా ? నాకుసహాయము చేయు వాఁడు గూడనేయుండును. యీసైన్యముతో నిమిత్తము లేదని జెప్పి యారాజున కుత్సాహము గలుగ జేసెను.

అంత సోమశర్మ యారాత్రియే యాచక్రవ్యూహంబునకుఁ బ్రాంతమందొక గోయి త్రవ్వించి సింహచర్మము కత్తులుమాత్రము తీసికొని రహస్యముగా నాగోతిలోఁ బ్రవేశించెను. అంతనర్ధరాత్రంబున

చతురంగబలంబులు నిద్రాణములై మేనులు తెలియక సోలియున్న యవసరంబున నాసోమశర్మ గోతినుండి పైకివచ్చి పోదు,పోదు,పోదు, మని పెద్దకేకలువైచుచు నాసింహము చర్మము నేనుఁగులమీఁదకు నెగరవైచెను. ఆచర్మముపచ్చి వదలలేదుగాన దానివాసనగొట్టినంత నేనుఁ గులన్నియు బెదరి గొలుసులు ద్రెంచుకొని సేనమీఁదబడి కలియత్రొక్కినవి.

అప్పుడు చతురంగబలమువారును మేల్కని యేమియుఁదెలియక శత్రుసేనవచ్చి తమమీఁదబడినదనుకొని వీరాలాపములు పలుకుచు కొట్టుమనియుఁ, బొడువుమనియు, నరుకుమనియుఁ బట్టుమనియు జీఁకటిలోఁ దెలియక యొకరినొకరు చంపుకొనఁ దొడఁగిరి. ఈరీతినల్లకల్లోలమై యాసేనయంతయు బోరాడియొకజాములోఁ బేరుమాసెను. ఆహా! సోమశర్మ దైవబలమెంతబలవంతమైనదో చూడుము. పిమ్మట సోమశర్మయామొండెములనడుమనుండి శిబిరమునకరిగి నిశ్చేష్టితుఁడై చూచుచున్న యాశత్రురాజుపైఁబడి కత్తిచే శిరమునరికెను. మరియు నతఁడు తెల్లవారువరకునచ్చట చచ్చి యున్న శవముల యవయవములన్నియు నరికి నరికి రాసులక్రింద పెట్టెను. మేనంతయు రక్తముబూసికొని యుద్ధభూమిలో రుద్రునివలె శవములనడుమ దిరుగ జొచ్చెను. అంతనుదయమున భూరిశ్రవుఁడావిజయంబు బ్రజల వలన విని యత్యంతసంతోషముతో నచ్చటికరుదెంచి భైరవునివలెఁ గ్రుమ్మరుచున్న సోమశర్మంగని కౌఁగలించుకొని యిట్లనియె. మహాత్మా! నీవు మనుష్యమాత్రుఁడవుకావు. ఒకమానవునికింత పనిచేయ శక్యమా? నాయాపదలబాపుటకై వచ్చిన భగవంతుండవనినమ్మెదను.నీవు చేసినమేలునకెద్దియును ప్రతికృతిసేయలేను ఇదిగో! నమస్కరించుచుంటినని పాదంబులంబడిన సోమశర్మ సగౌరవముగా నతనిలేవనెత్తి యోహో రాజా! నీహాస్త్రప్రాయుండనగు నన్నింతస్తుతిచేయవలయునా? ఇదియంతయు నీకటాక్షమే. ఈరాజు బలమననెంత? మూడు లోకంబులు వచ్చినను గోడు చెడసేయఁగలనని దర్పముగాఁ బలికెను.

అంతనారాజు సోమశర్మను బల్లకిపై నెక్కించి మేళములతోఁ దాళములతో నూరేగింపుచు నింటికిఁదీసికొనిపోయి విందులుచేయించి యెద్దియేని యభీష్టమున్నఁ గోరుమని యడిగెను. అప్పుడు సోమశర్మ యేమియుఁగోరక మంత్రితోఁగూడ మిగిలియున్న రెండులక్షల సైన్యమునుగూడ నుద్యోగములనుండి తప్పించి యాజీతములును దనకే యిప్పింపుమని వేడుకొనెను.

ఆరాజు సోమశర్మకోరినప్రకారము అప్పుడే యాజ్ఞచేసియంతటితోఁ దృప్తిఁబొందక యతనిరూపము లోహముతో బోతపోయించి యానడివీధిలోఁ జిరకాలముండునట్లు నినుపకంబంబుపై నమర్చెను.

గోపాలా! ఆకనుపించు విగ్రహము ఆ సోమశర్మయొక్కయాకారము అది శిల్పవైచిత్ర్యమునుబట్టి నిజముగా బ్రాహ్మణుఁడు నిలువఁబడినట్లు గనంబడుచున్నది. కాని వేరుకాదు.

ఈపట్టణ మాభూరిశ్రవునిదే. పెద్దకాలమైనది కాననాసంతతి వారందరు నశించిరిగాని యాలోహస్తంభముమాత్రము రూపుచెడక యట్లెయున్నది. దానికేగాదా మనపెద్దలు తనపేరు భూమిలో స్థిరముగానుండుటకై సప్తసంతానముల నిలుపుదురు. ఇదియే దీనివృత్తాంతము. ఇక లెమ్ము వేళయతిక్రమించినది. బసలోనికిబోయి వంటఁజేసికొని భుజింతము అనిచెప్పి వానితోఁగూడ సత్రములోనికి బోయి వంటజేసికొని భుజించి కొంతసేపు విశ్రమించి మరల బయనముచేసి క్రమంబున బదునొకండవ మజిలీచేరిరి.

పదునొకండవ మజిలీ.

# బుద్ధిసాగర కామపాలురకథ.

పదునొకండవ మజిలీయందడవిలో నొకచోట దలపెండ్రుకలు గలిగియున్న శిలావిగ్రహమునుజూచి యాగొల్లవాఁడు వింతపడి

పోయి మణిసిద్ధుని తద్విగ్రహవృత్తాంతము చెప్పుమనియడిగిన నశ్వ్యా తిపతి మణివిశేషముచే దాని తెరగంతయు గ్రహించి వెరగందుచు నాకథ యిట్లని చెప్పఁ దొడంగెను.

కాంచీపురంబున విష్ణుచిత్తుఁడను రాజుగలఁడు. అతండు దీర్ఘ దర్శియను మంత్రితో న్యాయంబుగఁ బ్రజలఁ బాలించుచు భూలోకములోఁ దనకుదగిన కన్యక లేదని పలుకుచు నెట్టిసుందరులం దీసి కొనివచ్చినను యొప్పుకొనక పెద్దకాలము వివాహము లేకయే యుండెను.

ఇట్లుండునంత నొక్కనాఁడు దీర్ఘదర్శి రాజుతో నిట్లనియె దేవా దేవర వారిట్లు వివాహమాడకున్కి రాష్ట్రంబాతయు జింతించుచు యువరాజు నభిలషించు చున్నది. చక్కఁదనంబులెక్కడికి! ఎట్లు సరి పెట్టుకొన్న నట్లేసరిపడును. నేనుమీకు బుద్ధులుగఱపు వాఁడనుకాను మీరే నిదానించి యొకకుకవాణిం బెండ్లియాడి కులముద్ధరింపుఁడు అనిపలికిన విని యారాజు మంత్రికిట్లనియె.

దీర్ఘదర్శీ! నీవు బుద్ధిమంతుడవుకదా! నీకు నేనెక్కుడుగాఁ జెప్పనక్కర లేదు. మనము లోకంబున స్త్రీలం జూచు చుంటిమి. చక్కనిదానియందు శీలముండదు. శీలమున్న బీతియుండదు. ప్రీతి యున్న చక్కదనముండదు. అన్ని లక్షణంబులుంగలిగి తనయందు ప్రేమగల కలకంఠి దొరకుట దుర్ఘటము.

నాకు బెండ్లిజేయదలఁచితివేని నిప్పుడు నేను చెప్పిన లక్షణము లన్నియుం గలిగిన చిన్నదానినిదెచ్చి పెండ్లిజేయుము. లేనిచో నిట్లే యుండెదనని పలికిన విని యామంత్రివల్లెయని యప్పుడే యట్టికన్య కల నరయుటకై యారాజురూపము పటంబులవ్రాయించి దూతల కిచ్చి నాలుగు దేశంబుల కనిపెను.

పాండ్యదేశ మహారాజు సుశీలయను తనకూఁతురు రూపము పటంబులవ్రాయించి దానికిఁదగిన పురుషుని వెదకి, తీసికొని రండని దూతలకాజ్ఞాపించెను. తద్భృత్యులు రాజశాసన ప్రకారమా పటం

బులంగొని యనేక దేశంబులందిరిగి వీరును వారును నొకనాఁడొక సత్రంబునం గలిసికొని యొండొరులు పలకరించుకొని యాచిత్రఫలకంబులఁదులగాఁ నిలబెట్టి యిట్టటుపరిశీలించి మేనులుపులకింపఁ దల కంపించుచు నోహో! ఇదివఱకింత దేశముదిరిగితిమి గాని యెందును ఇట్టిపోందుగుదిరిన ఫలకంబులం జూడలేదు. ఈరాజునకు నీరాజపుత్రి సరిపడినది. దాంపత్యమనుకూలముగా నుండునని తలంచుచు నొకరిపటంబు లొకరు గైకొని తమ తమ మేలికలకడ కరిగిరి.

విష్ణుచిత్తుఁడాచిత్రరుపు నందున్న మత్తకాశిని రూపంబు పరికించి చూచి తలయూచుచుఁ బ్రతిగాత్రమును వేరువేర వర్ణించుచు మంత్రితో నిట్లనియె. ఆర్యా! నాకీపర్యేందు ముఖియందు డెందము దగులుకొనినది దీనిపేరు సుశీలయట ఆపేరుసార్థకమై నిజముగా నిట్టి రూపము గలిగియున్నచో నాచిన్నదానిని నాకుఁ బెండ్లిజేయుమని మిగులవిరాళితోఁ బలికెను. ఆమాటవిని మంత్రిమిగుల సంతసించి యారాచపట్టి యట్టిదేయని యతనితోఁ బలుకుచు నప్పుడే పాండ్య దేశరాజునకు సుశీలను మారాజు వివాహమాడ నొడంబడిన వాఁడని శుభలేఖ వ్రాసెను.

పాండ్యదేశపురాజు విష్ణుచిత్తుని చిత్రపటము చూచినది మొదలు సుశీల కతఁడే తగినవరుడని నిశ్చయించెను. అతని మంత్రి వ్రాసిన శుభలేఖచూచి సంతోషముతో నందుల కియ్యకొనినట్లు తెలియపరచుచు శుభముహూర్తముగూడ నిశ్చయించి యప్పటికి దరలిరావలయునని శుభలేఖలు వ్రాసెను. అట్టిశుభలేఖ జదువుకొని విష్ణుచిత్తుఁడు తన కులాచారప్రకారము సకలవైభవములతోడ నా శుభముహూర్తమునకు దనకత్తినిచ్చి మంత్రినంపెను. అచ్చటసుశీల తనకువివాహప్రయత్నము జరుగుచుండ నంతకుమున్నుతానుజదువు కొన్న గురువుగారికి దక్షిణ నియ్యఁదలఁచి సాయంకాలమునఁ జక్కగా నలంకరించుకొని పసిఁడి పళ్లెరమునిండ బంగారునాణెము లుంచుకొని యాయుపాధ్యాయుని యింటికరిగి యాయన పాదంబులకు నమస్కరించి యిట్లనియె.

ఆర్యా! నేను మీయొద్ద విద్యాభ్యాసముచేసితిని మీయాశీ ర్వచన ప్రభావమున నాకీరాత్రి వివాహము జరుగఁబోవుచున్నది. వివాహమైనవెనుక నేను మీయింటికి రాఁగూడదు. తమరీ దక్షిణను స్వీకరించి నాకు వివాహమాడ ననుజ్ఞయియ్యుండని వేడుకొనెను అప్పు డయ్యాచార్యుఁడు తదీయరూపవిలాస విభ్రమంబులంజూచి కామ శరపీడితుండై యొడలెఱుంగక వివేకము మొద్దువోవ నాముద్దుల గుమ్మ కిట్లనియె. తరుణీ నాకీధనమేమియు నవసరము లేదు. నీధనము నీవేతీసికొనిపొమ్ము. నీయనుగ్రహముండినం జాలును అని పలికిన నక్కలికి యతండు గోపముతో నట్లనుచున్నవాఁడని నిశ్చయించి అయ్యా! మీకీధనమక్కర లేనిచో మఱియేమి కావలయును? నేనోపు దేని నిచ్చెదను సెలవియ్యుఁడని పలికిననావైదికుఁడు వెల్లనవ్వునవ్వి యిట్లనియె.

తెలివా! యూరక నోరుతెరచి యడుగుటయేకానితుదకియ్య నందువేమో? నిక్కముగా నిచ్చెదనని వాగ్దానముజేసినచో నడిగెద ననుటయు నాముగ్ధ యామూర్ఖునితలంపు తెలిసికొనలేక అయ్యో అయ్యవారూ? మీరుకోరుటయు నేనియ్యననుటయుం గలుగునా? నేనంతలోభిదానను గాను. మీకామితమేదియో తెలియఁజేయుఁడు. నాకు మీకామిత మీడేర్చుటకంటె నెక్కుడుగలదా? అని పలికిన నతం డయ్యతివకిట్లనియె.

కామినీ! నీవంటివారాడితప్పరుగదా! వినుము నీరూపము త్రిలోకజనమోహాకరము. నిన్నుఁజూచినప్పుడెల్ల నాయుల్లము రతివల్ల భుఁడు విరితూపుల నేపుమాపుచున్నవాఁడు. ఇంతదనుక నీవు నమూ రూఢయౌవనవుకావు గావునఁ గోరకుంటి ఇప్పుడు నామనంబు నీసంగ మంబభిలషించుచున్నది. ఇదియకాఁగోరిక దీనిఁదీర్చెదవేని గురుభక్తి గలదానవని నిన్ను మెచ్చుకొనియెదనని పలికిన నులికిపడి యక్కలికి శివశివా! యని చెవులు మూసికొని అయ్యో! నీవు నాకుఁ దండ్రివి కావా? ఇట్టికోరిక నన్నుఁ గోరవచ్చునా? నీకునన్నిట్లన నోరెట్లాడినది

వేరెద్దియో కోరెద వనుకొంటిని యిట్టి నీచవుబుద్ధిగలవాఁడవని తెలిసికొననైతిని. చాలు చాలు వైదికుఁడా! నీగుణము తెలిసినది. ఇష్టమైన నీసొమ్ము పుచ్చుకొనుము లేనిచో బారవేసికొనుమని యా పత్త్రికము నేలపారవైచి గిరుక్కున మరలి మొగంబున విన్నఁదనము దోప నతఃపురమున కరిగినది.

పిమ్మట నాబ్రాహ్మణుఁడు తెల్లబోయి యేమియుఁ బలుక లేక ఔరా! నేను గురువునని కొంచమేనియుసంశయింపక యీవగ లాడి యెట్లుతిరస్కరించిపోయినది? కానిమ్ము నాబుద్ధినైపుణ్య మంతయు వినియోగపరచి దీనికిని మగనికిని సంబంధము లేకుండఁ జేసెదనని యీసు వహించియుండెను. అంతశుభముహూర్తమున దీర్ఘదర్శిచేఁ దీసికొని రాఁబడిన విష్ణుచిత్తుని కత్తికిని సుశీలకును గొప్ప వైభవముతో బెండ్లిజేసిరి. తండ్రివివాహ పరిసమాపక దివసంబున సుశీలను మితిలేని సారెతో నత్తవారింటి కంపెను.

ఈలోపలనే సుశీలకుఁ జదువుచెప్పినగురువు కాంచీపురమున కరిగి పండితవేషముతో విష్ణుచిత్తుని దర్శనముజేసెను. విష్ణుచిత్తుండు ఆపండితుని మిగులగౌరవించి కులదేశనామంబులు తెలిసికొని తన యత్తవారియూరేయగుటచేమఱియు సంతసించుచునతనితోనిట్లనియె.

అయ్యా! మీరాజుకూఁతురు సుశీల వృత్తాంతము మీకే మైనఁ దెలియునా? ఆచిన్నదాని రూపంబును గుణంబులు శీలంబును నట్టివని చెప్పుఁడని యడిగిన నాబ్రాహ్మణుఁడు సంతసించుచు నిట్లనియె.

అయ్యా! నేనారాజుగారి సంస్థానములో ముఖ్యపండితుండను. ఇదియునుంగాక యీసుశీలకుఁ జదువుచెప్పినవాఁడను నేనే ఆమె శీలం బును గుణంబులు రూపంబును నాకుఁ దెలిసినట్లు తలిదండ్రులకైనఁ దెలియవు. మీరడుగుచున్నప్పుడు నిజము చెప్పవలయును. దానిశీల మున కేమిగాని రూపముపైఁజూడ వేడుకగానే గనుపించును. దాని

కప్పుడప్పుడు మూర్ఛరోగము గనంబడు చుండును. ఈరహస్యము నాకుఁగాక మఱియొకరికిఁ దెలియదు. ఈగుట్టంతయుఁ గప్పిపుచ్చి రంగులు బాగుగావైచి పటము వ్రాసి పంపిరి. మీరాపటమునుజూచి తిరా? యేమి? ఆపటముజూచినవారికి నిజముగా నాచిన్నది యట్లే యున్నదని భ్రాంతిగలుగక మానదు. మీవంటివారి కాచిన్నది తగ దని యెరుగనట్లుగాఁ జెప్పెను.

ఆమాటలువిని యావిష్ణుచిత్తుఁడు మనసు చివుక్కుమన నేమి! మీదానికట్టిరోగము గలిగియున్నదా? శీలమునంగతికూడ ననుమా నముగానే చెప్పిరి. అయ్యయ్యో? యెరుగక మోసపోయితినేఅన్నన్నా పాండ్యదేశపురాజు నన్నింత మోసముచేసెను. ఇన్నిదినములు పెండ్లి చేసికొనక చివరకు రోగభూయిష్ఠురాలినిఁ బెండ్లియాడితినే కానిమ్ము. ఆరాజునన్నిట్లు మోసముచేసినందులకుఁ దగినప్రాయశ్చిత్తము చేసె దను. అతనికూతుఁరు మొగమెన్నఁడును జూడను. అట్లుచూచితినేని మాతృద్రోహము చేసినంత పాపమునకుఁ బాత్రుఁడ నయ్యెదనని దారుణముగా శపథము చేసెను. ఆప్రతిజ్ఞను విని యాపాటలుఁడు తన ప్రయత్నము కొనసాగినదికదా యని సంతసించుచు నతనివలన ననుజ్ఞవడసి తన దేశమునకుఁబోయెను. తమకేమియు లాభము లేకు న్నను నసూయయే ప్రధానముగాఁగల యాబ్రాహ్మణుఁడు సుశీలకెట్టి యపకారము చేసెనో చూడుము. ఖలస్వభావ మిట్టిదియే కదా? పిమ్మట నాసుశీలయు గొప్పసారెతో నత్తవారిల్లుచేరినది.

ఆమె వచ్చినవార్త విని యాభూభర్త గౌరవింపక దీర్ఘక్రో ధుఁడై పరిచారికలవలన నామెకొక మేడ నివసింపఁ జూపించెను. ఆసాధ్వియు నందుఁబ్రవేశించి తనమగనింజూడ నత్యాతురము గల దియై ఆదిత్యునిరాక కెదురుచూచు పద్మినియుంబోలె వేచియుండెను. అట్లుండ నయ్యుండజయానకు దినవార పక్షమాసఋత్వయనంబులు గడచినవి కాని మనోహరుని దర్శనము లభించినదికాదు. అందులకు

జింతించి గడియ యుగముగా గడుపుచున్న యాచిన్నది విన్నబోయి యొక్కనాఁడు దీర్ఘదర్శికి వార్తనంపి యతనితో నిట్లనియె.

ఆర్యా! నాకువివాహమై సంవత్సరమైనది. ఇంతదనుక నామనోహరుని మొగమెట్టిదో నేనెఱుంగను. ఆయనకు నాయందెద్దియేని గోపముండఁబోలు. కారణమేమియు నాకుఁ దెలియదు. దేహమాత్రభిన్నులగు మీయిరువురిలో నొకరిరహస్య మొకరికిఁ దెలియక మానదు. నాకు నీయందు జనువు గలిగియున్నది గావున నిట్లడుగుచుంటిని. యథార్థ మెద్దియేని గలిగియున్న వక్కాణింపుమని పలికిన నాకలికి పలుకుల కులికిపడి యాపరిధాని యామెతో నిట్లనియె.

తల్లీ! నీవల్లభుఁడు నీయందనురక్తుఁడై యున్నవాఁడేయనియను కొంటిని. ఇట్లుచేయుచున్న వార్త నాకేమియుం దెలియదు. పరమసాధ్వివగు నీయందేమి తప్పున్నది. అతనియభిప్రాయమెద్దియో కనుంగొని వక్కాణించెదనని యామెతోఁ జెప్పి యొక్కనాఁడతఁడెద్దియో ప్రస్తావముమీఁద నామెమాట రాజుతో ముచ్చటించెను. అప్పుడతండు ఆజ్యాహుతివలనఁ బ్రజ్వరిల్లు నగ్నియుంబోలె మండిపడి మంత్రి! యిట్టి యనవసరప్రశ్నము లెన్నఁడును నాయొద్దఁ దీసికొని రాకుమాయని మందలించి పలికెను.

అప్పుడా ప్రెగ్గడ భయపడి మరల నోరెత్తక మెత్తనిమాటలచే నతనిచిత్తమును ప్రసన్నముగఁ జేసికొని యంతటితో నాప్రస్తావము ముగించెను. తర్వాత మంత్రి సుశీలచెంతకరిగి సాధ్వీ నీపతి నీయందేదియో యీర్ష్యబొందియున్నట్లు కనంబడుచున్నది. నీప్రస్తావమే విననొల్లఁడాయెను. కారణము ముందర గనుంగొనియెద నీవు చింతింపకుము. కాలక్రమంబున నతనిమతి మఱలించి నీయందనురాగము పుట్టునట్లు చేసెదనని యవ్వనిత నోదార్చి సమయము గనిపెట్టుచుండెను.

సుశీలకుఁ జదువుచెప్పిన గురువు అంతటితోఁ దృప్తిఁబొందక మరల నొకనాఁడు విష్ణుచిత్తునొద్దకువచ్చి యతనితో నిష్టగోష్ఠిం గాలక్షేపముఁ జేయుచుఁ బ్రశంసగాఁ బాంచాలదేశంబున విక్రమసేనుండను రాజుకూఁతురు దేవయానయనునది మిక్కిలి చక్కనిదని చెప్పుచు దానిగుఱించి పెక్కుగతుల నుతియించెను. విష్ణుచిత్తుఁడతని మాటలచే మోసపడి యప్పుఁడతని దనకుఁ బెండ్లిచేయుమని వేడుకొనియెను. అందుల కతండు సమ్మతించి యాదేశమునకఱిగి విక్రమసేనునికడ విష్ణుచిత్తుని యౌన్నత్యమంతయుఁ బొగడి యతని కూఁతునతని కిచ్చునట్లొడంబరపించెను.

పిమ్మట నతఁడు విష్ణుచిత్తునొద్దకువచ్చి అయ్యా! దేవయానను విక్రమసేనుఁడు మీకియ్యనిశ్చయించెను మీకిదివరకుఁ బెండ్లియే కాలేదని చెప్పితిని. లేనిచో మీకతండు కూఁతునియ్యఁడు. కావున నిప్పుడున్న భార్యనడవిలో విడిపింప నియోగింపుఁడని బోధించినవిని యారాజు సమ్మతించి యట్లుచేయ నప్పుడే మంత్రికాజ్ఞయిచ్చెను.

దీర్ఘదర్శి సుశీల నడవిలోనుంచుట తనకిష్టములేకున్నను రాజశాసనము నతిక్రమింప నశక్యమైనదగుట నందొక విశాలమగు మేడ కట్టించి పెక్కండ్రు పరిచారకులతో సుశీల నాసౌధంబునఁ బ్రవేశపెట్టి క్షేమమరయుచుండెను. అందులకు సుశీల మిగుల జింతించుచుఁ జచ్చుటకుఁ యత్నించుటయు మంత్రియోదార్చి యాయుద్యమము మరలించెను.

అంత శుభముహూర్తమున విష్ణుచిత్తుఁడు దేవయానం బెండ్లియాడి యాచేడియరూపము తనకంత యపురూపముగాఁ దోచమి యథోచితానురాగంబుతో నాబిడంగూడి యుండెను.

ఇట్లుండునంత నొక్కనాఁడు విష్ణుచిత్తుఁడు తనకు వేటయందభిలాషజనించుటయుఁ దనకోరిక మంత్రితోఁజెప్పెను. మంత్రియు సమ్మతించి యప్పుడేతగిన సంభారములన్నియు సిద్ధపరచి సుశీల

యున్న యడవిలోఁ జాలమృగములున్నవని రాజుతోఁజెప్పి యాయడవికిఁ దీసికొనిపోయెను. రాజు పెక్కండ్రు మృగములతో నయ్యడవి కరిగి యథేష్టముగా నందు మృగముల నేటాడుచుండ దైవయత్నమున జాముపొద్దుండ నద్భుతమైన గాలివానపట్టినది. అప్పుడు సేనలన్నియుఁ బికాపికలై పారిపోయినవి. రాజును మంత్రియు నొక చెట్టుక్రింద నిలువంబడిరి. యాచెట్టు కొమ్మలనియు విరుగుచుండుటం బట్టి యందునిలువవెరచి యావానలో బట్టబయలనే తిరుగఁజొచ్చిరి. అప్పుడు వారికిఁ బ్రాణములందాశవదలినది. ఇంతలో గొంచెము గాలివాన యణఁగినందున తడిగుడ్డలబిందుకొని గజగజవణఁకుచు నయ్యడవిలో నిలువయోగుడిసెయేనిం గలదేమోయని యిటునటు దిరుగజొచ్చిరి.

అప్పుడు దీర్ఘదర్శి తానుదలచికొనిన కార్యము దీర్చుటకిదియే సమయమని నిశ్చయించి దైవానుకూలమును గుఱించి సంతసించుచు రాజుతో నిట్లనియె.

దేవా! యీప్రాంతమందొక సౌధముండుట నాకు జ్ఞాపకము వచ్చినది. అందొక రాచకుమార్తె నివసించియున్నది. ఆమె మార్గస్థులకు సదుపాయము చేయునని వినియుంటిని. అచ్చటికి బోవుదమే యనుటయు రాజు అంతకన్న మేలున్నదా? యీరాత్రి యన్నమును బొడిగుడ్డలు నిచ్చువారెవ్వరైననున్న వారినేదైవముగాఁ జూతుముగదా! యని పలికి యతనితోఁగూడ నామేడ వెదకికొనుచు నడిచెను. ఆస్థలము మంత్రి యెఱిగియున్నదే కావున గొంతసేపు త్రిప్పి తుదకు సాయంకాలమున కచ్చటికిఁ దీసికొని పోయెను.

సుశీలకు మంత్రి యంతకుపూర్వమే వార్త నంపియుంచెను. ఆరాత్రి సుశీల యామేడనంతయుఁ జక్కగా నలంకరించి దీపములు పెక్కు వెలిగించి యుంచెను. ఆమేడఁజూచి రాజు మిగుల వెరగందుచు మంత్రీ! యింతవింత సౌధమెవ్వరిది? ఇందున్న చిన్నది యెవ్వతె?

యెవ్వనికూఁతురు యెవ్వనిభార్య? మగనితోనే యిందున్నదా? యని యడిగిన నతనిమంత్రి యిట్లనియె.

దేవా! యీచిన్నది మళయాళదేశపు చక్రవర్తి కూఁతుర నియు విహారార్థమై యిచ్చటికివచ్చి యిందుమంచిగాలి తగులునని మేడగట్టుకొనెననియు వినియుంటిని. ఈమె యిప్పుడిందుండెనో లేదో నాకు దెలియదు. మార్గస్థులకు మిగుల సదుపాయములు చేయునట. ఇందు గొన్నిదినములుండి మరలస్వదేశమున కరుగగలదనికూడ విని యుంటిని. ఆకథయంతయు మన కేటికి? ఈరాత్రి భోజనమిచ్చి పొడి పుట్టములిచ్చినం జాలదా? యనిపలుకుచు ద్వారముచెంతకు పోయి ద్వారపాలకులతో మంత్రి యిట్లనియె.

ప్రతీహారులారా! మేము మార్గస్థులము. వానతాకుటచే మిక్కిలి యలసితిమి. మీయేలికసాని యీరాత్రి యిచ్చట మాకు నన్నవస్త్రములిచ్చి యాదరించునేమో యడిగిరండు. అనిచెప్పిన వారు సత్వరముగాఁబోయి యావర్తమానము సుశీలతోఁ జెప్పిరి. ఆమాటవిని సుశీల మిగులసంతసించుచు వారిని సత్కరించి తీసికొని రాఁబెక్కండ్ర దూతికల నియమించెను. పరిచారకులు తదానతి బోయి అర్ఘ్యపాద్యాదివిధులం దీర్చి తోడ్కొనివచ్చి యొక్కవిచిత్ర భవనాంతరమందుఁ బ్రవేశపెట్టిరి. సుశీల మరికొందరచేతఁ బీతాంబ రములు వారికిఁ గట్టఁబంపించెను ఆపుట్టంబులఁ గట్టుకొని రాజు తదీయ వైభవంబునకు నాదరణంబునకుఁ బెక్కుతెరంగుల సంత సించుచుఁ దనయానందమంతయు మంత్రితోఁ జెప్పుచుండెను.

శ్లో॥ యద్దైవోపనతం దుఃఖం సుఖం తద్ధిరసాంతరం
నిర్వాణాయతరుచ్ఛాయా తప్తస్యహివిశేషతః॥

దుఃఖము పూర్వముగాగల సౌఖ్యమే హాయిచేయును. ఎండ చేఁదపింపఁబడిన వానికేగదా చెట్టునీడ విశేష సుఖతరముగా

నుండును. అలాగుననే యడవిలో గాలివానచే మిగుల నలసట జెందిన యారాజునకు సుశీలచేసిన యుపచారము మిగుల నానందకరముగా నుండెను.

అంత కొంతసేపున కాకాంత యత్యంతరుచి గలుగునట్లు పాకముజేసి పైడిపీటలనమర్చి వారిం బిలిపించినది. వారును మిగుల నాకలిగొనియున్న వారగుట నాబంగారు పీటలపైం గూర్చుండిరి. పిమ్మట నాసుందరి జల్తారు పట్టుచీరం గట్టి మేల్కట్టు జరీపువ్వుల మువ్వంచు కంచుకిందొడిగి వెలలేని పెక్కుతొడవులధరించి పదకటకంబులు ఘల్లుఘల్లుమన మ్రోయ గొలుసులు మెఱుంగు తీగె లాగునం దళుక్కుమని మెఱయుచు, జక్కనకంవబోలె బైటలో గిక్కిరిసియున్న చన్నుదోయి సలదినకస్తూరితావులు ఘుమ్మని దెసలావరింప నల్లనల్లన జనుదెంచి యోరచూపుల నాభూపాలుంజూచుచు బంగరు పాత్రిలలో బంచభక్ష్య పరమాన్నములు వడ్డించినది.

అంత నాభూకాంతుండును మంత్రియు నాపదార్థముల రుచి మెచ్చుకొనుచు దృప్తిగా భుజించిరి. భుజించునప్పుడా రాజు అమ్మానిని మేసితావి నాసాపర్వంబు గావించుటయు రెండుమూడు సారులు తలపైకెత్తి చూచెను.

అప్పుడయ్యతివ తనపై నెరపుచున్న వన్నెచూపుల చిన్నెలు కొన్ని పరిశీలించి తదీయరూపవిభ్రమవిలాసము లుల్లాసము గలుగం జేయం గందర్పుడు తనడెందము నాసుందరి విభ్రమభ్రమితభ్రూయుగంబ కార్ముకంబుగాం జేసి తదీయకటాక్ష వీక్షణమార్గణంబులం బరితాపంబు నొందింపం బెంపుచెడి యాపొలంతి వలపుచూపుల నట్టిచూపులంజూచి మరల్చుచు నంతకంతకు కంతుసంతాపము వింతచేష్టలం బుట్టింప నతండు స్మరాపస్మారంబున నుత్తలమందుచుండెను.

అట్టి వికారచేష్టలతోడనే భుజించిన విష్ణుచిత్తుని చిత్తవృత్తి యంతయు గ్రహించి మంత్రి సంతసించుచు నతని నొక భవనాంతర

మునకుఁదీసికొనిపోయి యందమర్చబడియున్న హంసతూలికా తల్పం బునం గూర్చుండబెట్టెను. అప్పుడుసుశీల పరిచారికలు దెచ్చిన విడియపు చుట్టలు తనకందించుచున్న దీర్ఘదర్శికి రాజిట్లనియె. ఆర్యా? మనము భుజించునప్పుడు నీకుబోధకాని చర్యలు కొన్నిప్రవర్తిల్లినవి. పాణితుల్యుఁడవగు నీకెఱింగింపక దీరదు? తలంచుకొనినంత నా స్వాంతమున వింతయగు నంతసము జనించుచున్నది. అమ్మగువ చిఱునగవు మొగమునకు నగవై మెఱయ దట్టమగు చూపులునాపై బరగించి నాచిత్తముత్తల మందించినది.

మిత్రమా! నీవూరక తలవాల్చికొని భుజించితివిగాని, యేమియు నెఱుంగవు. మోహినీ దేవతయుంబోలె నున్న యాచిన్నదాని చిన్నలేమని వక్కాణింతు. నేను మరలఁ జూపునప్పుడు తనచూపు వేరొకలాగున మార్చుచుఁ దలవాల్చుకొని భుజియించుతఱి తన వాలుచూపు తళుక్కులు నాపై నెరయఁజేసినది. పెక్కేల. అక్కలికి నాయందు మక్కువకలిగినది. ఇది యనిష్కపటంబు వేరొక్కటికాదు. నేనక్కడకు మరలనరుగవలయు నొక్కమిష చెప్పుము. అయ్యో! ఇంక కొంతసేపచ్చట నిలువనీయక యిచ్చటికిఁ దీసికొనివచ్చితి వేటికి? వచ్చుట నేనెఱుఁగను సుమీ! నేనీవిరాళినిపనోప నాబోపల పురుషులెవ్వరులేరు. మరల నచటికరిగెద నేమిచేసినను మంచిదే. దీనికి నీవేమి సెప్పెదవనుటయుఁ దనప్రయత్నము కొనసాగుచున్నదని సంతసించుచు మంత్రి రాజునకిట్లనియె.

దేవా! దేవరవారి సౌందర్యంబుజూచినంత యొకమనుష్య కాంత కామించుటయేమి యాశ్చర్యము? దేవతావనితలైనను విరాళింగుందుచుందురని చెప్పఁగలను. ఈమె సుశీలయైనను నీరూపుఁజూచియే మోహించినది. ఇప్పుడు పరిచారికలందరు తమతమ స్థానంబులకుఁబోయిరి. ఆమెయొంటిగానే యున్నను. దానాము నెపంబునఁ గ్రమ్మర నచ్చటికరిగి యత్తరుణి చిత్తవృత్తిగనిపెట్టి పైనఁగాలోచి

తముగా నడిపింపుఁడు. నేను వెనుకఁ గాచియుండెదనని పలికిన నంత
సించి యారాజు మెల్లన లేచి యంతకుపూర్వమే పరిచారికలందరు తమ
తమ నెలవుల నడఁగి యుండిరిగాన నిశ్శబ్దముగానున్న యాలోగిటలో
నాలుగుమూలలు తొంగితొంగి చూచుచు మరలభోజనశాలకరిగెను.

అంతకుమున్నే యాకాంతయు మంత్రిచే బోధింపఁబడి
యున్నది. నిదురింపక నావంటశాలయందే తిరుగుచుండెను. ఇంతలో
నారాజు లోనికింజని యవ్వనితంజూచి గద్గదస్వరముతో మించుఁ
బోఁడీ కొంచెము దాహమిచ్చెదవాయని యడిగెను.

అప్పుడప్పఁడతి యడుగులు తడఁబడ నొయ్యారముగా నిలఁ
బడి లేనవ్వుతో మీకుతియ్యని దాహము కావలయునా? పుల్లని
దాహముకావలయునా! యనియడిగెను. ఆమాటకతండు సంతసిం
చుచు తియ్యని దాహమే యిమ్మనిన నమ్మగువయు దియ్యనిదియ్యనా!
యనిపలుకుచు శర్కరామిళితములైన దుగ్ధంబులుదాహమిచ్చి యింత
కన్న రుచికినాయొద్దనున్నది యధరమేకాని యధికములేదు చవి
చూడుఁడని పలికెను.

అప్పుడాచతురుండా ప్రౌఢవచనంబులకు వెరగందుచునోహో
యీబోఁటిమాటలుమిగుల పాటవముగానున్నవి. అధరమనగాదక్కు
వయనియు నధరోష్ఠమనియుగూడ నర్థముగదా! అధరోష్ఠము చవి
చూడుమనికూడ సూచించుచున్నది. కానిమ్ము. ఎట్లయినను మంచి
దియె. యిచ్చటనన్యులెవ్వరును లేరుగదా! వట్టిమాటలతోఁ గాలక్షేప
ము సేయనేల! తగినట్లుచెప్పెదననితలంచుచు నారీమణీ ! నాకాయ
ధరమే కావలయును.మరొండువలదు. అనిపలుకుచు తటుక్కుననక్కు
టిలాలక యధరంబానబోయెను. అమ్మించుఁబోఁడియు నించుక విద
లించుకొనుచు నోహో! ఇదియేమిసాహసము దాహమునకై వచ్చి
వెలిపనులు చేయఁబూనితి రేటికి! నేనువారాంగన ననుకొంటిరా.
చాలుచాలుపోపొండు అనిపలుకుచు దదీయహస్తవిన్యాసంబులు ద్రో
సివేయక యనుకూలసూచకముగా మెలంగిన నతండది మొఱంగి
యాబోఁటి మాటలు పాటిసేయక అతివా? మొదట

నధరము చవిచూడుమని చెప్పి పిమ్మటఁ ద్రోసివేయఁదప్పునే? అంత యొఱుంగని వాఁడననుకొంటివా! శ్లేషలు నాకునువచ్చును. అని పలుకుచు జిట్టకంబులు గావించెను.

అప్పుడాసుశీల యతనిచేఁయి తనచేఁతం బట్టుకొని చాలుఁ జాలు! మగవారి వలపులును జలములవ్రాతయు సమానములైనవి. మొదటనిట్లుచేసి యవసరముతీరినవెనుక మరలఁ బలుకరింపరు. ఎల్లప్పుడు నిట్లున్న నమ్మతింపవచ్చును. "వ్రతము చెడినసుఖముదక్క వలయు" ననుసామెత వినియుందురుగదా. అనిన నశండౌనౌను నన్నట్టివానిఁగా దలఁపకుము. నీయిష్టము వచ్చినట్లు మెలంగెదనని చేతిలోఁ జేఁయివైచెను. పిమ్మట నాకొమ్మ నమ్మతించు నట్లభినయించుచు నతని నంతకుమున్నే యలంకరించియున్న మేడఁమీఁదకు దీసికొనిపోయి హంసతూలికా తల్పమునఁ జేర్చినది.

మరియు నందు నయ్యిందువదన కొంతసేపు కంఠనాదంబు దంత్రీనాదంబుతో నైక్యమునొంద వీణధరించి సంగీతంబు పాడుచు నతనిమతిఁ గరుగఁజేసినది. ఆభూపాలుండును కాలయాపన సైపక యాపడఁతిచేఁతనున్నవి వంచియూడఁబెరికి మోహముతో గందర్ప క్రీడారతుండై యవ్వేదండ గమనను సంతోషపారావార వీచికల నుయ్యెల లూగించెను.

ఈరీతిఁ గ్రీడించుచుండ వారికారాత్రి యొకగడియలాగైనను వెళ్లలేదు. వారివలపు లేమనిచెప్పుదును. విష్ణుచిత్తున కమత్తకాశిని పరకీయయని యూహించుటచే నంతవలపు గలిగినది. స్వీయ యని తెలిసినచో నట్లుండదుసుమీ? అదియంతయుఁ బ్రచ్ఛన్నముగాఁ జూచుచున్న మంత్రిమిగుల సంతసించెను. తెల్లవారినంత రాజు మంత్రియొద్దకువచ్చి రాత్రిజరిగిన చర్యయంతయుఁజెప్పి యప్పడంతి చక్కఁదనమును గుణించియు మక్కువనుగుణించియుఁ బెక్కుతెరం

గుల స్తుతిఁజేయదొడంగెను. అంతనావిష్ణుచిత్తుఁడు మంత్రియనుమతిఁ గొన్నిదినములందుండి యాచేడియతో రాత్రింబవళ్ళేకరీతిఁ గామక్రీడలం దేలుచుండెను. ఒక్కనాడతని రెండవభార్య పతిజాడ తెలియక యతనివెదకుటకై పరిచారకుల నంపెను. వారు నెట్టకేలకు రాజున్న తావుదెలిసికొని యతనితో దేవిగారి విజ్ఞాపనము దెలియంజేసిరి.

రాజు సుశీలతో నావార్తఁజెప్పి తనకుఁ బురంబునకరుగ ననుజ్ఞయిమ్మని వేడుకొనెను. సుశీలయు నతనిమరల శీఘ్రముగా వచ్చునట్లొడంబడఁజేసి యానవాలుగా నతని యుంగరము గైకొని యతని పయనంబున కనుమతించినది.

విష్ణుచిత్తుఁడు నెట్టకేల కారాచపట్టిని విడచి పురంబునకరిగి యుందు నిజదర్శనాయత్తచిత్తయైయున్న దేవయానకు సంతోషము గలుగజేసెను.

అచ్చట సుశీలయు గర్భవతియై పదియవమాసంబున నధిక రూపసంపన్నుఁడును పరాక్రమశాలియును నత్యంతబుద్ధిమంతుండును నగు పుత్రునింగనియె. ఆవర్తమానము గూఢచారులవలన విని దీర్ఘ దర్శి రహస్యముగా నాబాలునకు జాతకర్మాది విధుల నిర్వర్తించి కామపాలుండని పేరుపెట్టెను. ఆబాలుండును శుక్లపక్షక్షపాకరుండు బోలె దినదిన ప్రవర్ధమానుండై యధిక తేజస్సమంచితుండై యొప్పుచుండె. వానికైదేఁడులు వచ్చినంత మంత్రియు నంతియ ప్రాయమునకున్న బుద్ధిసాగరుడనుసార్థకనామంబునుగల తనకుమారునిఁగామపాలునితో జోడుజేసి యొక గురువునొద్దఁ జదువనేసె.

సుశీల రూపప్రాయ తేజోమనీషా విశేషంబుల నొండొరుల కించుకయేని వాసిలేని యాబాలురిరువురు సకలలోక మనోహరులై పదియారేఁడులు ప్రాయములోపుననే సకలవిద్యలు నభ్యసించి విలువిద్యయందును నసమానపాండిత్యము గలవారైరి. వారి విద్యా

భ్యాసము చేయునప్పుడు గొన్నిదినములు మంత్రియింటను కొన్నిదిన ములు సుశీలయింటను నివసించి క్రీడగాగడిపిరి. ఇంచుకయేని శ్రమ ముగాఁ దలంపలేదు.

ఆకుమారు లిరువురు నాకారమాత్ర భిన్నులై మనః ప్రాణం బుల నొక్కటియే యనునంత మైత్రిగలిగి వర్తించుచుండిరి.

విద్యలన్నియుఁ బరిపూర్తియైనంత నొక్కనాఁడు వారిరువురు నొండొరు లాలోచించుకొని యెవ్వరికినిఁ దెలియకుండునట్లు లడవి మార్గంబునంబడి దేశాటనంబుసేయు తలంపుతో నరిగిరి. దేశాట నంబు పండితధర్మమేకదా! మంత్రియింటనుండిరని సుశీలయు, సుశీల యింటనుండిరని మంత్రియుఁ దలంచుటచేఁ గొన్నిదినముల వఱకు వారి ప్రయాణవార్త యిరువురకునుఁ దెలిసినది కాదు.

ఒకనాఁడుమంత్రి సుశీలయింటికివచ్చి కుమారులెచ్చట నున్నా రనియడిగిన నప్పుడతియుఁ దడఁబడుచు నయ్యో! కొమరులచ్చట లేరా? యనియడిగెను. అప్పుడతండు గుండెఝల్లుమన నక్కటా అచ్చటనుండి వచ్చి పెక్కుదినములైనదే యిచ్చటనున్నా రనుకొం టిని. వారు మనలను మోసముచేసియెచ్చటికోపోయిరి. అయ్యయ్యో! విదేశములో వీండ్రెట్లు మెలంగఁగలరు. అతిసుకుమార వంతులే! అన్నన్నా! జాడైనఁ దెలిసినదికాదు. ఏమిచేయుదము అని యనేక ప్రకారములఁ జింతింపఁ దొడంగెను.

ఆమాటలు వినినతోడనే యాచేడియ కత్తిచే నరకబడిన కద ళియుంబోలె నేలంబడి మూర్ఛిల్లి యెట్టకేలకుఁ దెప్పరిలి పెక్కుతెరం గులఁ జింతింపం దొడంగినది.

అప్పుడు మంత్రి ధైర్యము తెచ్చుకొని యామెతో నమ్మా! నీవుచింతింపకుము. వారు పండితులై దేశాటనము సేయఁదలంచిరి. చక్రవర్తికన్నఁ బాండిత్యము గలవారికి విదేశములో గౌరవముగా నుండును. వారును శీఘ్రకాలములో రాగలరు. నీవు ధైర్యముగా

నుండుమనియామెనోదార్చి తనయింటికిఁబోయి వారిజాత తెలిసికొని వచ్చుటకు రహస్యముగాఁ బెక్కండ్ర దూతలబంపెను.

సుశీలయుఁ బుత్రవియోగ శోకంబున గుందుచుండ నొక్కనాఁడు విష్ణుచిత్తుఁడత్తలోదరుని స్మరించుకొని స్మరసంతాపము జెందిరొక్కండే గుఱ్ఱమెక్కి యయ్యడవిలోనున్న సుశీలమేడకువచ్చి పరిచారకులవలనఁ దనరాక నామెకుఁదెలియఁ జేసెను. అప్పుడాసుశీల మొగమున విన్నఁదనముదోపనీయక యతనిరాకయుఁ దనకొకరీతి ప్రీతిగలుఁగఁజేయ నెదురేగి యతని పాదంబులు గడిగి తడియొత్తి చిత్తముగరుగ మెత్తనిమాటల స్వాగతమడుగుచు లోనికి దీఁసికొని యొకతల్పమునఁ గూర్చుండబెట్టెను.

రాజు ఆమెంచుఁబోఁణిని మన్నించుచుఁ గుశలప్రశ్న జేసెను. సుశీలయు నతనిచిత్తము జాలిపడమునట్లు దేవా! దేవరవారికి నేటికి నాకుశలప్రశ్న గావలసివచ్చినది. పోనిందు ఇదియు నాయదృష్టమే. పదియాఱేడులైనది. మీరిచ్చటినుండియరిగి యొకయుత్తరమైన బంపకపోతిరికదా? ఇంతకు నాదినములమహిమ యట్లుండ మిమ్మ్ నన వలసిన పనియేమున్నదని నిష్ఠురముగాఁ బలికినవిని యారాజు నామెవచనంబుల కద్దియో మిమఁబన్ని తగినట్టుత్తరములు చెప్పెను.

చిరకాలసందర్శన సంభ్రమంబున నతండత్తలోదరితోఁగూడి యుష్టగోష్టిమాటలాడుచు వేడుకతోనుండెను. ఆమెచిత్తము పూర్వమువలె ననురాగయుత్తమై యుండలేదు. దానికతం డంతరంగమున శంకించుకొనియు నప్పుడేమియుఁ బ్రశ్నచేయలేదు. తర్వాత నానాతిచే నమర్చఁబడిన పదార్థములు భుజించి యమ్మింంచుఁ బోఁణితోఁ బంచశర క్రీడలఁదేలెను.

అట్లు కొన్నిదినములున్న వెనుక నతండాచిన్నదాని సంభోగ సంభావణ క్రీడావిశేషంబులు బూర్వముకన్న నెక్కుడు వైపరీత్యముగా నుండుటఁజింతించి యొక్కనాడామెతో నిట్లనియె.

నాతీ! నీతీరుచూడఁ బూర్వమునకు మిగుల వైషమ్యముగా నున్నది నాయందు మక్కువతగ్గెనా? లేక యెద్దియేని కారణ మున్నదియా? యెప్పుడును విచారముఖముతో నుందువేమి? ఇది యునుఁగాక నీకును నాకును నిన్నిదినములనుండి స్నేహమున్నను నీయుదంతమే నాకుఁ దెలిసినదికాదు. నీమగండెవ్వఁడు? తలిదండ్రు లెవ్వరు? ఒంటిగా నీయడవిలోనుండుటకుఁ గారణమేమియో తెలియఁ జేయుమని యడిగిన నచ్చేడియ సంతసించుచు నతని కిట్లనియె.

నాథా! ఈవిషయ మన్యోన్యము దెలియఁదగినదే. ముందు మీవృత్తాంతము చెప్పుఁడు. మీకు భార్యలెందరు? సంతాన మున్నదా? భార్యలయందిష్టముగా నుందురా? అని యడిగిన నతండిట్లనియె.

తన్వీ! నాకు భార్యలిద్దరుగలరు. పెద్దదానిఁ దలఁపనవసరము లేదు. రెండవదానిపేరు దేవయాన. దానికి నాయందు మక్కువ యెక్కువగనే యున్నదిగాని యంతచక్కనిదికాదు. నాకింకను సంతానముగలుగలేదు. ఎందరైనను నీకు సాటివత్తురాయని పలికిన నక్కలికి మరల నిట్లనియె.

దేవా! మీపెద్దభార్యవిషయము దలప నవసరము లేదంటిరి. ఆమె యేమితప్పుజేసినది? కారణమేమో తెలుపుఁడని యడిగెను. అప్పుడతండు కొంతసేపు ఇతరప్రసంగములతో నాసంగతి గప్పఁ దలంచెను గాని యమ్మానిని మరియేమియు వినిపించుకొనక యా ప్రశ్నమే పలుమారుచేయఁ దొడంగెను. దానంజేసి తుదకతనికిఁ జెప్పక తీరినదికాదు.

బోఁటీ! యాపాటలగంధిపేరు సుశీల. దానితండ్రి కపట ముగాఁ బటము వ్రాయించి నాయొద్దకంపెను. నేను బటములో నున్న ప్రకారమాసుశీల యందముగా నున్నదనుకొని దాని పెండ్లి గూడితిని. అది మాయింటికి రాకమున్ను దానికిఁజదువుఁజెప్పిన

గురువు నాయొద్దకు వచ్చి దానికి మూర్ఛరోగమున్నదనియుఁ బట ములో వ్రాసినదంతయుఁ గపటమనియు జెప్పెను. అప్పుడు నాకుఁ గోపమురాకుండునా? దానికి బదులు నేను దాని మొగము జూడనని ప్రతిజ్ఞజేసి యట్లనడచుచుకొంటిని. పిమ్మట రెండవభార్యను బెండ్లి యాడుటంజేసి మొదటిదానిని నడవిలోనికిఁ బంపవలసివచ్చినది. అది యిప్పుడెక్కడున్నదో తెలియదు. ఇదియే నావృత్తాంతము. ఇఁక నీవృత్తాంతము చెప్పుమనుటయు నాసుశీల గురువుచేసిన కపటమునకు ముక్కుమీఁద వ్రేలువైచుకొని తలకంపించుచు నోహో ఇదియా తెలిసినది అన్నన్నా బ్రాహ్మణుఁడెంత దుర్మార్గుడని పలుదెరంగులఁ జింతించుచుండెను.

అంత నతండు తరుణీ! యూరకుంటివేమి? నీకథ చెప్పుమను టయు సుశీల మరల నిట్లనియె. దేవా! నాకు మీరు చెప్పినమాటలో గొంచము సందియముండుటచే విచారించుచుంటిని. మీభార్యను గురువు రోగిష్ఠురాలని చెప్పినంతనే నిజానిజములు పరిశీలింపక విడువ వచ్చునా? అతని కెద్దియేని యాముద్దియయందుఁ గోపముండి యట్లు చెప్పెనేమో? మీరు జేసినపని యేమియు నాకు సరిపడినది కాదను టయు నతండు అబలా! అప్పుడు నాకంత యూహ తోచినదికాదు. ఇప్పుడేమిసేయుదును ఔను? కొన్ని కపటకృత్యములవలన నట్లు జరుగును. నిజముగా నట్టి దోషములేక యాసుశీల పటములో వ్రాసి నట్లే యున్నచో నీతోసమానముగా నుండును పాపమూరకయే విడిచితినేమో యని పలికిన మరల సుశీల యిట్లనియె.

దేవా! మగవారిచర్య లెప్పుడు నిట్లేయుండును. వారెంత పరిశీలింపక చేసినను స్వతంత్రులుగావున సాగుచుండును. నాకథ యట్లుండనిమ్ము. నీపెద్దభార్య సుశీల నాకుఁ జెలికత్తియే. దాని పూర్వోత్తరమంతయు నేనెఱుంగుదును. దానివంటి చక్కనిదియు గుణవంతురాలు నీభూలోకములో లేదు. దాని గురువట్లు చెప్పుటకుఁ

గారణము వినుఁడు సుశీల వివాహదినంబున నలంకరించుకొని గురు దక్షిణనిచ్చుటకై గురువుగారింటికిఁబోయెను. అప్పుడా బ్రాహ్మణుఁడు అదియిచ్చు గురుదక్షిణ నందుకొనక దానిరూపమునకు వలచి తనతోఁ గ్రీడింపుమని యడిగెను. ఆసాధ్వి యందులకు సమ్మతింపక యాపల్లెరమచటఁ బారవైచి యహంకారముఖముతో నింటికిఁ బోయినది.

ఆయిల్లాలు లోపల నుంచుకొని యాదుర్మార్గుఁడు మీతోనట్లు చెప్పెనుగాని యథార్థముగాదు. పోనీ యొకటి విచారింపుఁడు. అతండూరకవచ్చి యడుగకముందే దాని చెడుగుణంబులు మీతోఁ జెప్పుటకు నవసరమేమియున్నది. బుద్ధిమంతులకు దీనిఁబట్టిచూచిన నందలి యథార్థము తేటపడదా? పాపమా సుశీల గురువుచేసిన యవమానము నాతోఁ జెప్పి చింతించినది. దానిగుణ మెవ్వరికైన వచ్చునా యని పలికిన నతండు తెల్లబోయి యుల్లంబు దల్లడిల్ల నయ్యో! తొయ్యలీ! ఆగురువు నన్ను మోసముచేసెనే తెలిసికొనలేకపోతిని కటాకటా! యూరక నాసుగాత్రి నాత్రము నొందించితిని యని యనేకప్రకారములఁ జింతించుచుండెను.

అతని పశ్చాత్తాపంబు పరిశీలించి యమ్మించుఁబోణి దేవా కానిండు మించినదానికి జింతింపనేటికి? ఇప్పుడప్పూఁబోఁణి నాస్వాధీనములోనే యున్నది. సెలవైనచోఁ బిలిపించెద ననుటయు నతండు సంతసించుచు నయ్యింతి కిట్లనియె. తరుణీ! యయ్యింతియింత వరకు నిర్దుష్టురాలై యుండినచో వేగఁబిలిపింపుము దానిపాదంబులంబడి తిరస్కారదోషంబు బాపుకొనియెదను. లేలెమ్మని తొందరపెట్టిన నమ్మత్తకాశినియతనిచిత్తవృత్తి యంతయు బరిశీలించి పశ్చాత్తాపతప్తమయ్యెనుగదా యని సంతసించుచు నిట్లనియె.

ప్రాణనాథా! ఆసుశీల నెచ్చటనుండియో తీసికొని రానక్కరలేదు. ఇక్కడనేయున్నది. వెక్కేల నేనే యాసుశీలను పూర్వజన్మ

మందెద్దియో పాతకముజేసి యింతకాలము నీవంటిపతికి ననిష్టురాల నైతిని. మనదీర్ఘదర్శి తనపేరు సార్థకమునొంద నింతకాలమువరకు నాకుధైర్యము గరపుచుఁ తుదకు మిమ్ము నాచెంతకుఁ దీసికొని వచ్చెను. ఇంతకును దైవానుకూలము వచ్చినది మీరు చనినపిమ్మట మీ తేజంబున నాకొకకుమారుండుదయించెను. వానిరూపము, పరాక్రమము, గుణములు దేవతలకైనను లేవు. వాఁడు మంత్రి కొడుకుతోఁ గూడఁ గొన్నిదినముల క్రిందట నెచ్చటికో పోయెను. దానంజేసి చింతించుచుంటినని తన కథయంతయు దాచక చెప్పి కన్నులనీరు విడువజొచ్చినది.

అప్పుడతండామెను గౌఁగలించుకొని యోహో! ఆసుశీలవు నీవేనా! తెలిసికొనలేకపోతినే. సాధ్వీ! చింతింపకుము. దైవప్రతికూలముననే నాకట్టి బుద్ధిపుట్టినది. నీవిట్టి కష్టము లనుభవించుట దైవయుక్తిసుమీ? అన్నన్నా! ఇంతచక్కనిదానిని బ్రాహ్మణుఁడెంతమాయచేసి మొగముజూడకుండ జేసెను? ఒకసారిచూచిన విడుతునా? అయ్యారే! కాలమంతయు వృథాపోగొట్టుకొంటినే? నీప్రాయమంతయు నడవిపాలైనదేయని యడలుచుఁ గుమారసందర్శనమునకుఁ జింతించుచు నప్పుడే యప్పడఁతి నచ్చటనుండి తన పట్టణమునకుఁ దీసికొనిపోయి మంత్రికి వర్తమానముబంపి యతఁడుచేసిన యుపకారము గుఱించి పెక్కుగతుల స్తుతించి యాసుశీల నొకచక్కని యంతఃపురములోఁ బ్రవేశపెట్టి కుమారాన్వేషణార్థంబు దేశదేశంబులకు దూతలంబంపెను.

## భేరుండపక్షికథ.

—✻✻✻✻—

గోపా! అచ్చట బుద్ధిసాగరుండును గామపాలుండును నిల్లు వదలి యడవిమార్గంబునం బడి నడిచినడిచి యొకనాఁటిరాత్రికిమధ్యార్జునమను రాజధాని జేరిరి. అందు విత్తముగైకొని యన్నమిడుచున్న

యొక పెద్దమ్మ యింటికిఁబోయి పెందలకడ భోజనముజేసి పెద్దమ్మా! మేమీవీధి వేదికపై బండుకొనియెదము. ఆస్తరణ మెద్దియేని యిత్తువా? యని యడిగిరి. అప్పుడామె గుండెమీఁదఁ జేయివైచు కొని అమ్మో, బాలులారా! మీరెఱుఁగరుకాఁబోలు. ఈయూరనడి వీధిలో బరుండరాదు. పరుండిరేని రాత్రి భేరుండ మనుపక్షివచ్చి చంపును. లోపలనే చోటుచూపించెద రండనుటయు వారు నవ్వుచు నోహో! పెద్దమ్మా మమ్మా భేరుండమేమియుఁ జేయలేదు. మా యొద్దకు దానియాయువుమూడియే వచ్చును మేము వీధిలోనేపరుం డెదమని యామెవలదని యెంత చెప్పినను వినక వీధితిన్నెపైఁ బండు కొనిరి.

ఆమె చెప్పినమాటలచే వారికి నిద్దుర పట్టినదికాదు. అర్ధ రాత్రమైనతోడనే పక్షవిక్షేపవాతంబుల బ్రాంతవృక్షంబులు పెళ పెళమని కొమ్మలువిరిగి క్షీణదశనొంద నాభేరుండతివేగంబునవచ్చి యిచ్చవచ్చినట్లయ్యూరంతయుఁ గుమ్మరి దొరకిన జీవకోటిం బంచత్వంబు నొందించుచుఁ గ్రమంబున వీధితిన్నెపయిం బరుండి యున్న యాకుమారులనిర్వురంజూచి యత్యాగ్రహముతో జంప మీఁదకురికినది.

అప్పుడు బుద్ధిసాగరుండు తటాలునలేచి కటారిఁ బెరికి దాని రెక్కలు రెండును నరికి పిమ్మటఁ దల తెగవైచెను. అర్పులు చెలంగ నది నేలంబడి గిలగిలఁ గొట్టుకొనుచుఁ గొంతసేపటికిఁ బ్రాణము వదలినది. పిమ్మట వారు తెల్లవారుజామున కేకవైచి లేపి పెద్దమ్మా! మేము పోవుచున్నామని చెప్పి యాయూరువిడిచి పైకిఁబోయిరి.

అంత నాయూరిలో నొకచాకలి గొడ్డలి భుజముమీఁదవైచి కొని యడవికిఁబోవుచు వీధిలోఁజచ్చిబడియున్న యాపక్షింజూచి దానిగుఱించి రాజుచేసియున్న ప్రతిజ్ఞవినియున్న వాఁడగుట మిగుల సంతసించుచు నలుదెసలు పరికించి యెవ్వరును రాకుండుటంజూచి యప్పుడా గొడ్డలిచే దాని యవయవములన్నియు ముక్కలుక్రింద

నరికి పోగుగా బెట్టెను అంతలోఁ దెల్లవారుటయు జనులందఱు వచ్చి చూచి యదిచచ్చినందులకు మిగుల సంతసించుచు జాకలి వానిని మిగుల శ్లాఘించిరి. చాకలివాఁడు పక్షిని జంపెనను వార్త గ్రామమంతయు వ్యాపించుటయేగాక రాజుగారికిఁ గూడఁ దెలిసినది.

అప్పుడు సింహకేతుఁడను పేరుగల యారాజు ఆపక్షియొద్దకు వచ్చి చచ్చిపడియున్న దానియవయవములన్నియుంజూచి వెరగం దుచు జాకలివానితో నీదియేయూరు? ఎవ్వఁడవు? ఇన్నిదినముల నుండి చంపలేనిపక్షిని నీదివసంబున నెట్లుచంపితివని యడిగెను. అప్పుడువాఁడు ధైర్యముతెచ్చుకొని దేవరా! నాది యీగ్రామమే కాపురము నేను జాకలివాఁడను ఈదినమునఁ దెల్లవారకమున్న లేచి పొలమునకుఁబోవుచుండ నాకాపక్షి యెదురుపడి చంపుటకు మీఁదకివచ్చినది. అప్పుడీగొడ్డలితోఁ బ్రాణమునకుఁదెగించి యొక దెబ్బగొట్టితిని. ఆదెబ్బ దానితలమీఁదఁదగిలి నేలంబడినది పిమ్మట రెండవదెబ్బ మరలఁ దలమీఁదనే కొట్టితిని. దానితోఁదలచితికి లేవ లేక నేలంబడినది పెక్కుదెబ్బలు గొట్టినతోడనే యదిచచ్చెను. ఇదియే నేనుజేసిన పనియని చెప్పెను. ఆరాజు చింతాక్రాంతుఁడై అయ్యో! నేనీపక్షిని సామాన్యుఁడు చంపలేడుగదా యని తలఁచి యట్టివానికి నాకూఁతునిచ్చి వివాహముచేసెదనని ప్రతిజ్ఞ చేసి యుంటిని. తుదకంతబలవంతమైనపక్షి యీరజకునిచేతులో జచ్చెను. అయ్యో! నాచక్కని కూఁతును జూచిచూచి యీచాకలికెట్లుపెండ్లి చేయుదును? కటకటా యిటువంటి ప్రతిజ్ఞ యేమిటికిఁ జేసితిని? ప్రతిజ్ఞాభంగము గావించినచో సరిరాజులందరు పరిహాసముచేయు దురు పోనీ? యీపక్షిని వీఁడుచంపలేదేమోయనుకున్నను చంపిన బలశాలియెవ్వఁడు బయలుపడకున్నాఁడు. యిప్పుడేమిచేయుదును? యీయాపదదొలఁగించు వాఁడెవ్వఁడైనలేఁడేయని యనేకవిధముల సంతాపించుచులోపల నిష్టములేకున్నను వివాహప్రయత్నము చేయు మని యాజ్ఞాపించి దానికిఁ బ్రతికూలమైన చర్యల నాలోచించు చుండెను.

రాజుగారికుమార్తెనుఁ బక్షిని జంపినందులకు గాను చాకలి వాని కిత్తురను ప్రతీతి గ్రామమంతయు వ్యాపించినది.

ఆవార్త కుమారుని చేఁబూటికూటి పెద్దమ్మ విని యేమేమీ! రాత్రిఁబక్షిని చాకలిచంపెనా? యెవ్వరుచెప్పిరి. ఛీ! ఛీ! యిన్నిదిన ములనుండి యీచాకలి యెచ్చటికిఁబోయెను ఆపక్షిని జంపిన వారిని నేనుచెప్పెదను. వినుండు. నిన్నరాత్రి మాయింటికి నిద్దరు రాజపుత్రు లు వచ్చిరి. వారువీధిలోఁ బరుండఁబోవు నప్పుడు నేను పక్షి సంగతి చెప్పితిని. దానికివారు భయపడక నిర్లక్ష్యముచేసి వీధిలోఁ బరుండిరి. వారేయీపక్షిని జంపియుందురు. వారు తెల్లవారుజామున నాకుఁజెప్పి పోయిరి. నిద్రచే నేను బరిశీలింపకపోయితిని. వీధిలోఁబరుండి బ్రతుకు వారు మరియొకరు గలరా? తప్పక వారేచంపిరని చెప్పఁగలను అని పలికిన తల్లిమాటలువిని కుమారుఁడత్యంత సంతోషముతో రాజు గారియొద్దకుఁ బరుగెత్తుకొనిపోయి తనతల్లిజెప్పినవర్తమానమంతయుం జెప్పెను.

అప్పుడారాజు మిగులనానందమంది యాబ్రాహ్మణ కుమారు నకు బహుమతినిచ్చి యారాజకుమారుల వెదకితీసికొని వచ్చుటకు నలుదెసలకుఁ బెక్కండ్రు దూతలనంపెను.

వారిలోఁగొందఱా రాజపుత్రులనొక సత్రంబునం గాంచి యానవాలుపట్టి వారితోనిట్లనిరి. అయ్యా! తమరీమధ్యను మధ్యార్జున పట్టణమునకువచ్చి రాత్రియందుఁ దిరుగుచున్న భేరుండపక్షిని జంపితిరా? యని యడిగెను. ఆమాటలువిని బుద్ధిసాగరుండు ఔను మేమే యీపక్షినిజంపితిమి. చంపుట నేరమా? యనిపలికెను.

అప్పుడాదూతలు వారికి దండములుపెట్టి అయ్యో! నేరము కాదు. దానింజంపిన వారికిఁదనకూఁతు నిత్తునని మారాజు ప్రతిజ్ఞ చేసియున్నవాఁడు. మీరుదానింజంపి యిటువచ్చిన వెనుక రొక చా కలి యీపక్షిని నేనేచంపితినని చెప్పి యారాజపుత్రికనుఁ దనకు బెండ్లి

చేయుమని యడుగుచున్నవాఁడు. దానికతండేమియుఁ జెప్పలేక చింతించుచుండ దైవయోగమునఁ బెద్దమ్మమూలముగా మీరు చంపి నట్లు తెలిసినది. కావున మిమ్ము వెదకికొనుచువచ్చి యిచ్చటమిమ్ముఁ బొడగంటిమి. మారాజపుత్రిక మంచి యదృష్టవంతురాలు. ఆమె యందము దేవతాస్త్రీలకైనను లేదని చెప్పఁగలము. గుణములకరుం ధతియే సాటి. ఆరాజపుత్రికను మీలోనెవ్వరు పక్షినిజంపిరో వారి కిత్తురు. వడిగాఁబోదమురండనిన సంతసించి యాకుమారులిరువురును నాదూతలవెంట మధ్యార్జునము కరిగిరి.

ఆసింహకేతుఁడు వారిరాకవిని మిగులసంతసించుచు నెదురేగి యర్ఘ్యపాద్యాతి విధులతోఁ దోడ్తెచ్చి స్వాగతంబడిగి యద్భుతమైన వారియాకారగౌరవమునకు వెరగందుచు సవినయముగా నయ్యా! మీయిరువురిలోఁ బక్షినెవ్వరు జంపిరనియడిగెను.

అప్పుడు కామపాలుఁడు తనమంత్రి బుద్ధిసాగరుఁడే యాపక్షిం జంపెనని యావృత్తాంతమంతయుం జెప్పెను. అప్పుడు సింహకేతుఁడు చాకలివానిరప్పించి వారియెదుటంబెట్టి యడిగిన గడగడ వడంకు చున్న వానినురితీయుఁడని యాజ్ఞచేసెను. కామపాలుండును బుద్ధిసా గరుండును వాఁడుచేసిన కృత్యమునకు నవ్వుచు దయాహృదయులు గాన వాని నాదండనమునుండి తప్పించి పంపివేసిరి.

పిమ్మట సింహకేతుఁడు బుద్ధిసాగరుని యాకారము సోయగము తనకూఁతురు సుగుణావతి కనుకూలముగా నున్నదని సంతసించుచు శుభముహూర్తమున మిగులవైభవముతో బుద్ధిసాగరునికిఁదనకూతు నిచ్చి వివాహముచేసెను. బుద్ధిసాగరుండాతరుణితోఁ గొన్నిదినంబు లందు గామోపభోగంబు లనుభవించెను. కామపాలుఁడును మిత్రు నితోఁగూడ నందేయుండెను. ఇట్లుండి బుద్ధిసాగరుండును కామపా లుండును దేశాటనమందింకను దృష్టివహింపక సుగుణావతితోఁజెప్పి

యెట్టకేలకామె నొడంబరచి యొకనాఁడురాత్రి నాయూరు విడిచి యొకమార్గంబునంబడి నడువసాగిరి. ఆదారినట్లు పోవంబోవ నెందును బురంబు గనంబడినదికాదు. చీఁకటిపడువరకు నడిచిరిగాని యందుఁ బయికిబోవదారి తెలియక యెందైన నివాసయోగ్యమైన ప్రదేశ ముండునేమోయని నలుదెసలఁ గలయజూడ దొడంగిరి.

## శరభసాళ్వముకథ.



అందొకదెస విశాలశాఖాచ్ఛాదితంబైన మఱ్ఱివృక్షమొకటి జూడనయ్యెను. దానిక్రింద భూమియంతయు జక్కఁగా బాగుచేయఁ బడియున్నది. వారాశ్చర్యపడుచు నాయడవినడుమ మనుష్య సంచారములేదు, ఈచెట్టుక్రింది ప్రదేశముజూడ రాయిగాని తృణముగాని లేక చక్కఁగా బాగుచేయఁబడియున్నది. దీనిక్రింద రాత్రులెవ్వరేని వచ్చి ప్రచ్ఛన్నముగా నివసింతురా? ఏమియని యనేకప్రకారముల జింతించుచు నందు గ్రిందుండరాదని నిశ్చయముచేసుకొని కొంచెము వెల్తురుండగనే యాచెట్టెక్కి దట్టముగానల్లుకొనియున్న యొకకొమ్మ మీఁద గూర్చుండిరి.

ఇంతలో సాయంకాలమగుటయు మొదటనాచెట్టుక్రింది నద్భుతమైన కోతులును ఎలుగులును గొన్నివచ్చి యానేలంతయు వీఁగుల జక్కఁగాబాగుచేసినవి. అంతజంబుకంబొకటివచ్చి యాయున్న మృగములతో ముచ్చటింపఁదొడంగెను పదంబడి వ్యాఘ్రంబు వచ్చినది దానివెనుక.తోడేళ్ళగుంపు దానివెనుక వరాహములును వానివెనుక మహిషములు వచ్చినవి. ఈరీతి జాతికొక్కటిచొప్పున నన్యోన్య విరోధముగల జంతువులు సైతము నిర్భయముగావచ్చి యాచెట్టుక్రింద

నుచితస్థలములఁగూర్చుండి వచ్చినవానిని, గుశలప్రశ్నలు చేయుచు రాఁబోవు వానికెదురేగు చుండును.

ఆరాత్రి జాముప్రొద్దుపోవు నప్పటికి మృగములతో నాచెట్టు క్రిందిభూమియంతయు నిండినది. నడుమ రెండుమృగములకు మాత్ర ము చోటుంచినవి. అంత నద్భుతమైన యాకారముతో శరభసాళ్వ మను మృగమువచ్చినది. అప్పుడచ్చటనున్న మృగములన్నియు లేచి దానికి దండములుపెట్టినట్లు ముట్టిగాళ్లువేయఁ దొడంగినవి. అది వానినన్నిటిని నాదరించుచు నడుమ దిగవిడిచిన ప్రదేశమున నామృ గములన్నిటికి నభిముఖముగా గూర్చుండెను.

అంతఁ గొంతసేపు పరిశీలించి శరభసాళ్వము తక్కిన మృగ ములనెల్ల స్వాగతమడిగి యిట్లనియె.

మృగములారా! అన్నిమృగములు వచ్చినవిగదా నామంత్రి యైన భేరుండమనుపక్షి యేమిటికిరాకపోయెను. అదివచ్చు కాలము దాటిపోయినది. దానికెద్దియో చిక్కుతటస్థించినట్లు తోచుచున్నది. లేనిచో నది యన్నిటికంటెను ముందేవచ్చును. దానివార్త మీలో నొకదానికేనిం దెలియునా? అనియడిగెను. అప్పుడు మృగము లన్నియుఁ దెల్లబోయి చూడఁదొడంగినవి. అప్పుడు నక్కలిట్లనియె.

దేవా! మీమంత్రియైన భేరుండము రాత్రులయందు మధ్యా ర్జునమను పురంబునకరిగి కనంబడిన జీవకోటిని భక్షింపఁదొడంగినది. ఈరీతి నెనిమిదిమాసములు జరిగినదిగాని మాసముక్రిందట నాయూరి రువురు రాజపుత్రులువచ్చి వీధిలోఁబరుండిరి. అప్పుడది వారిని సామా న్యులనుకొని మహాభీకరముతోఁజంపఁబోయినది. అందులో నొకఁడు శూరకత్తిచే దానింజంపెను. ఈవార్తమాకు చుట్టములైన జంబుక ములు చెప్పినవి. ఇందులోఁ గొంచమైన నసత్యములేదని దేవర వారితో మనవిచేసికొనుచున్నామని పలికి నక్కలూరకుండెను.

అప్పుడు శరభసాళ్వము ముట్టె నేలరాయుచు నే మేమీ! భేరుండమునుజంపిరా? అయ్యయ్యో అంత బలవంతమైనపక్షియుం జంపఁబడినదియా? అన్నన్నా? మనుష్యులు అసాధ్యులుగదా! అటువంటి సచివుఁడు నాకుదొరకునా! ఔను అది మధ్యార్జునము నకును నేను శ్రీరంగపురంబునకు రాత్రులఁబోయి జీవహింస జేయుచుంటిమి. ఇది మేమిరువురము ఏర్పరచుకొనినపద్ధతియే. దాని జంపునంత బలముగలవాఁడు లేడనుకొంటింజుఁడీ? అని పెక్కుగతుల దానిగుఱించి చింతింపఁ దొడంగినది. అప్పుడు మృగములన్నియుఁ గన్నులనీరు విడువదొడంగినవి. ఈరీతిఁగొంతతడవు భేరుండపక్షిని గుఱించి చింతించి యేదియోయాలోచించుచున్న శరభసాళ్వమునకు జంబుకంబులిట్లనియె.

దేవా! మీరిప్పుడు చెప్పినమాటలలో మాకొకభయము గలుగుచున్నది. మనమందరము సంవత్సరమున కొకసారిగదా యీచెట్టుక్రింద జేరుదుము. అప్పటికిఁగాని మరల మనక్షేమసమా చారములు తెలియవు. నిరుడీసభకువచ్చిన భేరుండము ఈయేఁడు రాకమడిసినది. ఈయేఁడు వచ్చినమృగములలో మీఁదటి కెన్ని పరలోకమున కేగునో తెలియదు. సామాన్యమృగముల పాటియేయు నేటికి? దేవరవారుగూడ రాత్రులయందు భేరుండమువలె శ్రీరంగ పురమునకరుగుచు జీవకోటిని మడియించుచుంటిరని సెలవిచ్చిరి. ఈహింస మనుష్యకోటికెల్ల నసహ్యమైనదేకదా! మొన్న భేరుండ మును జంపిన శూరులు దేవరవారికిఁగూడ నేదియేనికీడు సంభవింపఁ జేయుదురేమో యని వెరచుచుంటిమి. దేవరకెద్దియేని ముప్పు వచ్చినచో మాబ్రతు కేమికావలయును? ఏలికలేక యెవ్వరికైన నిలువవచ్చునా? యిప్పుడిచ్చటనున్న జంతువు లన్యోన్యవిరోధములు గలిగియున్నను మీ శాసనంబునం జేసి యేమియు నోరుమెదపక శాంతములై యున్నవి. మృగజాతిలోఁ గట్టుండినచో మనుష్యులనఁగా

నెంత? అదిలేమింకేసియేగదా వారు గొన్నిటిచే భృత్యులవలె పనులు చేయించుకొనుచు లొంగనివాని మాయోపాయములచేఁ జంపుచున్నారు. కానిమ్ము దానిమాట కేమి? ఇప్పుడు మీరు శ్రీరంగ పురమునకరుగుట మానివేయుఁడు లేనిచో మూకెద్దియేని ధైర్యము జెప్పెఁడని పలికినవిని మృగములన్నియుఁ దలలూపి సంతసించినవి.

శరభసాళ్వము వానిమాటలువిని చిఱునవ్వు నవ్వి యిట్లనియె జంబుకములారా! నాబలపరాక్రమములు భేరుండము బలపరాక్రమములవంటివిగావు దానికిని నాకును జాల తారతమ్యము గలదు. మీరు నాప్రాణతుల్యులు గావునఁ జెప్పెద వినుండు. భేరుండము ఆయువు భేరుండము కూడనేయున్నది. కావున దానింజంపిరి. నాది అట్లులేదు ఈమఱ్ఱిచెట్టు తొఱ్ఱలోనొక యెలుకయున్నది. నాయా యువు దానిలోనున్నది దానిం జంపినప్పుడుగాని నేను చావను. ఈయడవిలోనికి మనుష్యులురానేలేరు. ఒకవేళవచ్చిరో యాచెట్టు తొఱ్ఱలోనున్న యెలుకయునికి యెట్లుతెలుసుకొనగలరు?

తెలిసికొనినను నీచెట్టంతయు నరికినను నది కనబడదు. ఆ తొఱ్ఱలో నాహారపదార్థము జారవిడిచినచో దానివాసనంబట్టి పైకి వచ్చును అదివేరొకలాగున దొరకదు. ఈరహస్యము వారికేమి తెలియును? మీరందరు నాకుఁ బ్రాణసమానమైన భృత్యులు గనుక చెప్పితిని. మీరు నిర్భయముగా నుండుఁడు. నాకేమియు భయములేదని చెప్పిన యామృగములన్నియు మనంబులంగల యా నందమంతయుఁ జేష్టలచేఁ దెలియఁజేసినవి.

ఈరీతి నిష్టగోష్ఠి మాటలాడుకొనుచు నామృగములన్నియుఁ దెల్లవారుజామున నే లేచి దేనిజాడ నదిపోయినది. తెల్లవారునప్పటి కచ్చట నొక్కటియు లేదు. మృగపక్షిభాషావేదులైన యాకుమారు లిరువురు నాచెట్టుకొమ్మలసందునుండి మృగముల సంభాషణమంతయు

విని యడలుచు సూర్యోదయమైనంతఁజూచి యప్పుడు తమ్ముఁ బున ర్జీవితులుగాఁ దలంచుకొనిరి.

ఎంతబలవంతులకైనను వింత క్రూరమృగములనడుమ రాత్రి జిక్కువడి నప్పుడుధైర్యమాగునా? పిమ్మట వారిరువురు మృగముల జాడ నాచెట్టుచిట్టచివరకెక్కి చూచి యెందునుం గనంబడమి సంత సించుచు ముందు శరభసాళ్వముచెప్పిన కోటరము వెదకి కనుంగొని యందులో దమరాహారమునకై తెచ్చుకొనిన మిఠాయియుండ నొక టి జారవిడిచిరి. అయుండదొర్లి యాయెలుకయున్న చోటికిఁ బోయి నది. దానిందిని యామూషికము దానినవంబట్టి యాతొఱ్ఱపైకివచ్చి నది. అందుఁగాచియున్న యాకుమారులా యెలుకంబట్టుకొని చెట్టు దిగి దానిందాళ్ళతోఁబిగియఁగట్టి శ్రీరంగపురంబునంగల జనుల యా పద బాపుటకై క్రమంబున జాడగనుంగొనుచు రెండుదినముల కా పురము జేరిరి.

అందొక శ్రోత్రియ బ్రాహ్మణునియింటఁ బసజేసి రాత్రి భోజనముచేసిన వెనుక యావిప్రునితో నయ్యా! ఈయూరి వింతలే మని యడిగిరి. అప్పుడాతండు కుమారులారా! యీపురంబున మఱే యేమియు విశేషములులేవు. నిత్యము రాత్రుల శరభ సాళ్వమను మృగమువచ్చి కనంబడిన జీవమును భక్షించుచున్నది. దానికీరాజు ఎందరినో మహాశూరులఁ గాపుంచెను కాని యేమియు లాభము లేక పోయినది.

అప్పుడీరాజు జనక్షయమునకువెరచి యామృగమును జంపిన వానికిఁ దనకూఁతు బద్మావతియను దాని నిత్తునని ప్రకటించెను. ఆ వార్తవిని యాచిన్నదానిసౌందర్యమునకు వలచి పెక్కండ్రు రాజ కుమారులువచ్చి రాత్రివీధిలోఁబండుకొని శరభసాళ్వముచేతఁ బక్షిం పబడిరి. ఇప్పుడెవ్వరును దానింజంపెదనని వచ్చుటలేదు. దానిమూల ముగా మిగులనందకత్తెయగు పద్మావతి జవ్వనముగూడ వృథాపోవ

పోవుచున్నది. రాత్రుల వీధిలోనికిఁబోవక పెక్కుచిక్కులుపడుచున్న మేము జన్మభూమియైన యీయూరువిడవలేకుంటిమి. ఈయూరి విశేషము మఱియేమియులేదు మీరువీధిలోనికిఁబోకుడు లోననే పండుకొనుఁడని చెప్పినవిని యాకుమారులు మోమునఁ జిరునగవుమెఱయ నాగృహస్థునితో నిట్లనిరి. అయ్యా! మీరు భయపడకుఁడు, మేమా మృగమును జంపుదుము. అది రాత్రి యెంతప్రొద్దుపోయినతరువాత వచ్చును? ఏవీధికి ముందువచ్చును? ఎందెందు సంచరించునో చెప్పు డనియడిగిన నతండమ్మయ్యో! ఆమృగవృత్తాంతము మీరెరుంగరు. మీకంటె బలాధికులు దానిచేత భక్షింపఁబడిరి. మీప్రాయమును రూపమును మనోహరములై యున్నవి. ఇట్టి పిచ్చియూహలువిడిచి యింటిలో బండుకొనుఁడు మీతలిదండ్రులను భార్యలను బిడ్డలను నూరక దుఃఖసముద్రమున మునుఁగఁజేయకుఁడని పలికిన వారు నవ్వుచు అయ్యా? మేమూరక యామృగముచేతఁ జచ్చుటకంత వెఱ్ఱివారమనుకొంటిరా. పద్మావతియందు మాకాసలేదు. ఈయూరిజనుల యాపద దప్పించుటయే మాయభిప్రాయమని చెప్పి యాబ్రాహ్మణుం డడ్డుపడి యెన్నివిధములఁ జెప్పినను లక్ష్యముసేయక యారాత్రి వీధులందు గస్తుదిరుగఁజొచ్చిరి.

అంతట నాశరభసాళ్వము కల్పాంతజీమూతగర్జాసదృశముగా నార్చుచు బేర్చినక్రోధంబున నాయూరుమీఁదబడి కనంబడినదాని నెల్ల భక్షించుచు నొకవీధిలోఁగరవాలహస్తులైఁ ధైర్యముగా గుమ్మరుచున్న యావీరులం జూచి నోరుదెరచికొని మీఁదకువచ్చెను.

అప్పుడు కామపాలుఁడు కుడిచేతిలోనున్న యెలుక గొంతువు గట్టిగా నొక్కి చంపివేసెను. అప్పుడా సాళ్వము కంఠము వెంబడి యూపిరిరాక నేలంబడి తన్నుకొని తన్నుకొని చచ్చినది.

పిమ్మటఁ గరవాలమున దానిమెడనరికి పారవైచి యాకుమారులిరువురు బసయున్న విప్రునింటికివచ్చి యాయనతో అయ్యా!

మేము శరభసాళ్వమును జంపితిమి. చూచితిరా యనిచెప్పిరి. ఆమాటలకతండు వెరగందుచుఁ గొంతసేపునమ్మలేదు. చచ్చి పడియున్న దానింజూచినంత మితములేని యానందముతో వారిఁ గౌగలించుకొని కుమారులారా! మీపాయముజూడ మిగులచిన్నదిగానున్నది. మీప్రజ్ఞ మిగులపెద్దది. మాయూరికి గొప్పయుపకారము చేసితిరని వారిఁబెద్దయుం బ్రొద్దుస్తుతిచేసి యప్పుడే రాజుగారికోటలోనికిఁబోయి యావర్తమానము తెలియఁజేసెను.

శ్రీరంగరాజు ఆవృత్తాంతము వినినంత ననంత భూమండలాధిపత్యము సంప్రాప్తించిన సంతసించుచు నిసుపేదయుంబోలెఁ జెలంగుచు నతిరయంబున లేచి ఆమహాత్ములెచ్చటనున్నారో చెప్పుమని యతని నడిగెను.

ఆరాజాగేస్తువలన వారికథవిని యతనివెంట నరిగి యాకుమారులంగాంచి వారియాకార గౌరవమునకచ్చెరువంది తప్పక వీరిద్దరు దేవతలేయగుదురు. లేనిచో నింత సొగసును గవగా నుండుటయెట్లుండునాయని శంకించుకొనుచు వారిం గౌఁగలించుకొని యాభూపాలుండు గన్నుల నానందబాష్పములు గ్రిమ్మనిట్లనియె.

ఆర్యులారా! మీరుచేసిన కార్యము మనుష్యులకు శక్యమైనది గాదు. ఎంతలేసి బలవంతులువచ్చినను నుదయంబున మాకు మరలఁ గనంబడుటలేదు. మీరు దేవతాంశవలన జనించినవారని తోచుచున్నది. మీనామంబుల వర్ణంబులం దెలిపి కర్ణానందంబు సేయుఁడు మఱియు మీయిరువురిలో శరభసాళ్వమును బరిమార్చిన బలశాలి యెవ్వఁడు? వానిం బేర్కొనినచో వానినే నేనల్లునిగాఁ జేసికొనియెద నని పలుకుటయు నన్నరపతికి బుద్ధిసాగరుం డిట్లనియె.

రాజా! మేముక్షత్రియులము. నాపేరు బుద్ధిసాగరుండు. ఇతని పేరు కామపాలుఁడు వీనికి నేనుసచివుడ. దేశాటనంబునకై వచ్చి

నారము. దీనింబరిమార్చిన ధైర్యశాలి యీతండేయని నిరూపించినర త నాభూకాంతుండతని గౌఁగలించుకొని వత్సా! నాప్రతిజ్ఞ నెరవేర్చితివి. గ్రామక్షోభంబుడిపితివి. నీకేమిచ్చినను ఋణముతీరదు. నాకూఁతురు పద్మావతిమిగుల రూపవతి దాని నీకుఁ బరిణయంబు గావించెద సమ్మతమేనా? యనియడిగిన నతండు బుద్ధిసాగరుని మొగము జూచెను. అప్పుడా బుద్ధిశాలి రాజుతోనిట్లనియె.

దేవా! మీకూఁతురు మిగుల చక్కనిదేగదా? అట్టిదానిం బెండ్లిజేయుదునని చెప్పిన నప్పుడొప్పుకొనకుండుట లెస్సగాదు. నామిత్రుడందుల కంగీకరించెను. అని పలికిన సంతసించి యాశ్రీరంగరాజు దైవజ్ఞనిర్దిష్టమైన శుభముహూర్తమున నాకామపాలునికిఁబద్మావతినిచ్చి కడువేడుకతో వివాహంబు గావించెను.

కామపాలుండు బుద్ధిసాగరుని యనుమతిఁ గొన్నిదినంబులందు బద్మావతింగూడి కామసౌఖ్యంబు లనుభవించుచుండెను. అంత నొక్కనాఁడయ్యిరువురు క్రమ్మరనాలోచించుకొని విదేశదర్శనోత్సాహంబునఁ దృప్తివహింపక పద్మావతికిమాత్రము జెప్పి యేకాంతముగా నాయూరువిడిచి యన్యదేశమున కరిగిరి.

## చిత్రసేనకథ.



ఇట్లు తిరిగ్మ్మరుచు వారొక్కనాఁడు చంద్రగుప్తమను రాజధానింజేరి యందొక విప్రగృహంబునబసచేసి యందుఁగొన్నిదినంబులుండిరి. ఒకనాఁడు సాయంకాలమునవారు పురవిశేషంబు లరయు తలంపుతో సొంపుగానలంకరించుకొని యాపట్టణపు వీధుల నరుగుచు

నచ్చటచ్చటఁ గల వింతలఁ బరిశీలించుచుఁ గ్రమ్మరబసలోనికి రాఁదలంచి కోటప్రాంతముగా నరుగుచుండిరి.

అప్పుడు కామపాలుని మేనిమీఁద శుభవాచికసూచికముగా నొక తలవెండ్రుక పడినది. దానిఁజూచి యతండు జేఁతులతో గొలిచి నంత బారకన్న నెక్కుడుగానున్నది. నైల్యాదిగుణంబులు వర్ణించుచు నోహో! యింతవింత తలవెండ్రుక యేసుందరిదోగదా యని యూహించుచుఁ దల పైకెత్తి చూచెను అప్పుడా కోట పైనున్న యుప్పరిగెమీఁద సఖులతోఁ గొలువుదీర్చి జలకమాడి తల యార్చుకొనుచున్న యాపట్టణము రాజకూఁతురు చిత్రసేన యను నది యెద్దియోపనిమీఁద క్రిందుగాఁ దొంగిచూచినది. అప్పుడా యిరువురదృష్టులును పురోహితులవలె నాయిరువురమనంబులకు బ్రహ్మగ్రంధి వైచినవి. వారిసోయగంబు లొండొరులకు వింత సంతసము గలుగఁజేసినవి. అంతటితోఁ దమదృష్టుల మరల్చుకొనిరి.

అప్పుడు కామపాలుండు బుద్ధిసాగరునితో మిత్రుడా! ఇట నిలువుము. నేనొకవింత జూపించెదను. ఆహా, యిప్పుడే యుప్పరిగ నుండి యొకవాల్గంటి తొంగిచూచినది. దాని మొగము మొదట నేను జంద్రబింబమే యనుకొంటిని సుమీ! అంతలో నాచిన్నది నన్నుఁజూచి చిఱునగవుతో శిరఃకంపము జేసినట్లు కనంబడినది.

అన్నా! దానిమందహాసము నాడెందంబునకు మరులుకొలుపు చున్నది. ఔరా! అంత చక్కనిమొగము మనమింతకుముందెక్కడను జూచియుండలేదు. అయ్యంగన వంగి చూచునప్పుడు చంద్రబింబమును మబ్బుగ్రమ్మినట్లు నెమలిపింఛమువలెనున్న కేశపాశము మోము తమ్మిఁగ్రమ్మినది. ఆవింత చెలువు నామదిం దగిలియున్నది. ఇప్పుడు నాకుఁ బైకినడువఁ బాదంబులాడకున్నవి. దాని మోము క్రమ్మరఁజూచినదాక నిచ్చటనే యుండెదనని పలుకుచు విరాళిం దూలుచున్న కామపాలునితో బుద్ధిసాగరుం డిట్లనియె.

అన్నా! నేనాచిన్నదానిం జూడలేదు. యీవెంటు్రకం బట్టి యూహింప మిగులరూపవంతు రాలగుట కేమియు సందియములేదు. మఱియుఁ దొంగిచూచినప్పుడు నిన్నుఁజూచి చిఱునవ్వు వెలయుంచిన దని చెప్పితివి. ఆలక్షణము బరిశీలింప నాచిన్నది నిన్ను వలచినట్లు తోచుచున్నది. నీవూరక తొందరపడకుము. నీవువలెనె నాచిన్న దియు విరహమందుచునే యుండును నీకు దృష్టాంతము చూపించెదఁ జూడుము. మనము గొంత సేపిచ్చటనే యుందము. అక్కలికి నిక్కముగాఁ నిన్నువరించినచో గ్రమ్మరఁ దొంగిచూడక మానదు. ఇదియేతార్కాణమని పలికెను. కొంత తడవు వారక్కడనే నిలువఁ బడి యెద్దియో నిమిత్తము గల్పించుకొని నడుమనడుమ తలలు పైకెత్తిచూచుచుఁ గాలయాపన జేసిరి.

చిత్రసేనయు రాజకుమారుని మోముజూచినంత స్వాంతమున వింతసంతసము వొడమఁ గొంతసంతాపంబుజెంది యందున్న సుంద రులందఱు తనకుఁ బ్రాణసఖులగుట వారితోనిట్లనియె. చెలులారా! మన కోటప్రక్కగా నిరువురు కుమారు లఱుగుచున్నారు. చూచి తిరా! వారిలోనొక సుందరుఁడు నాడెందమునకు విందు గావించెను. వాని మొగము తొగలరాయనిగేరుచున్నది. నేను దైవప్రేరణముచేఁ గ్రిందుగఁదొంగి చూచినప్పుడే వాఁడును మీఁదకు జూచెను. మాయిరువురచూపులు మనంబులకు ముడివెట్టినవి. వానికి నాయం దనురాగము గలిగినట్లు తన్ముఖవిలాసమే చెప్పినది. అడుగుదాటక యిప్పటికి నచ్చటనేయుండును. చూతువుగాక యనిన నాసఖులందఱు సంతసించుచు నాసుందరితోఁగూడ నేలకు దొంగిచూచిరి. ఆసమ యములో బుద్ధిసాగరుండును గామపాలుండును తలలు పైకెత్తి చూచిరి. అప్పుడు కామపాలునికిఁ జిత్రసేనకు నంతరంగములంగల సంశయములు వదలిపోయినవి.

అయ్యండజయాన యట్లియుండి కామపాలునంగుళితోఁజూపించుచుఁ జెలికత్తెలతో నిట్లనియె.

చెలులారా! వారిలో మొదటఁనన్నుజూచిన చెల్వుఁడాతఁడే సుఁడీ! ఆయిద్దరును రూపంబున సమానులై యున్నను నామనంబు వానియందేలగ్నమైనది. ఆహా! ఆమోహనాంగుఁడు నన్నుస్వీకరించినచో బచ్చవిల్తుని కాలిబంటుగాఁ జేసికొననే? వానిసోయగంబంతయు బరిశీలింపుఁడు. సుందరులారా? ఇట్టివేళ సిగ్గువడియూరకున్న పిమ్మటఁ గమ్మవిల్తుని రాయిడికోర్వఁతె తాళఁగలదు? వాని యభిప్రాయము దెలిసినదిగద! తెలియకున్నను భయమేమి? ఇప్పుడే యొక యుత్తరము వ్రాసి మీఁదబారవైచెద. ఒకకాగితమిటు తెండని పలికినతత్క్షణమే సఖులచే నందింపఁబడినది దానియందు గొన్నిమాటలు తొందరగా వ్రాసి పూవులదండలోఁగట్టి యాబంతి సంతోషముతోఁ దన్నే పలుమారుచూచుచున్న కామపాలుని యుదరమునకుఁ దగులునట్లు విసరివైచినది.

అంతకుమున్ను బుద్ధిసాగరునితో నాచిన్నదాని రూపువర్ణించుచు స్మరసంతాపమందుచున్న కామపాలుఁడాచీటిని బంతిలోనుండి తీసి యిట్లుచదివెను. ఆర్యా! నామనంబు నీయందు లగ్నమైనది. నీ రూపంబును ప్రాయంబును నాచిత్తవిత్తంబులు హరించినవి. ఆయువ రాధమునకు నీపాదములకు సంకిలి వేయవలెను. నిన్నుఁజూచినది మొదలంతకంతకు గంతుఁడు లతాంతకుంతముల నాస్వాంతమును సంతాపపెట్టుచున్నవాఁడు. కాలవ్యవధి లేదుతప్పు స్థిరింపవలెను. మా తండ్రిమిగులకఠినాత్ముఁడు. పోటుటేఁగ నేనిఁ బరీక్షసేయక యంతఃపురము జొరనీయఁడు.

నీవు బలవంతుడవై తేని నన్ను రాక్షస వివాహంబున గొనిపొమ్ము లేనిచో గోడమీఁదుగా గొలుసు వ్రేలవైచుకొని నేనే

నీయున్న తావునకు వచ్చుచున్నదాన, ఎట్లుచేయవలయునో సత్వరం బుత్తరంబీయ గోరుచున్నదాన. వ్యవధిలేదుకావున నింతటితో ము గించితిని. తప్పులున్న క్షమింపుఁడు. అనియున్నయుత్తరమును బుద్ధిసా గరుఁడువినఁ గామపాలుఁడు పలుమారుచదువుకొని మిత్రుఁడా దీని యనురాగంబంతయు నీయుత్తరమే వెల్లడిచేయుచున్నది. కాలవ్యవధి లేమింజేసి యింతకన్న వ్రాయలేదట. దానికింకను నెన్నియూహాలు న్నవో? తప్పులుక్షమించవలయునఁట దీనిలోనేమితప్పులున్నవి.మా యిరువురనడుమఁ దప్పులుగూడ కలవా! మంత్రీ! నాకీ పుత్రికయందు బీతిగానున్నదేమి? దానిపేరువింటివా! చిత్రసేనయఁట. దాసురాలు చిత్రసేనయని వ్రాలుచేసినది చూడుము. మా యిరువురకు ననురాగ మొండొరులపై సమముగానేయున్నది. వెంటనేయుత్తర మంపనిచో స్త్రీహత్యగూడవచ్చునని వ్రాసినది కావున నదివ్రాసిన రెండుతెరఁ గుల నేదియుచితమోయాలోచించి తిరుగా జాబువ్రాయ వలయును. ఊరక జాగుచేసెదవేల? అనితొందరపెట్టుటయు బుద్ధిసాగరుఁడు చ క్కగానిదానించి కామపాలునితో నిట్లనియె.

కామపాలా! ఆచిన్నదివ్రాసిన రెండుతెరఁగులు కరణీయము లుకావు. ఏమనిన, ఈరాజుకన్న మనము బలవంతులమైనను యుద్ధ మున జయాపజయము లెవ్వరుజూచినవికావు? దానంజేసి రాక్షస వి వాహమున మోసమున్నది. ఇఁక రెండవరీతి, నీనాతిగోలుసు మీఁద గోటదిగివచ్చునప్పుడు చేయిజారినచో ప్రమాదము వచ్చును. ఇది యునుంగాక యప్పుడెవ్వరేనింజూచిన మొదటికేహానియగును. మన కంత యుపసరమేలవచ్చినది. నీవుకొంచెము తాళుము. నాబుద్ధిబలము చేత నానాతితో నాయంతఃపురమునందే నిర్భయముగాఁ గ్రీడింప సంఘటింతునని యతనికిధైర్యముగ అభిప్రాయత్తరమిట్లువ్రాయించెను.

మదవతీ! నీహృదయసంతాపమువిననంత నాకెంతయుఁ జింత గానున్నది. మదనుండు నిర్దయుఁడై నిన్నేములుకుల నేయుచుండెనో

నన్ను గూడ నాశరంబుల నే బాధించు చున్నాడు. నాడెండ మునీయందము లాగికొనితిరుగ సీయకున్నది. మఱియుఁజూపు గొలుసులనాపాదంబులకు సంకిలివైచియు నప్పని సేయనట్లు వ్రాసెదవేల? మనసంతాపములఁగలిసి కొనిననాఁడు తెలియఁగలవు. ఇప్పుడు నీవు వ్రాసిన రెండు తెరంగులు నాయంతరంగమున కనకూలింపలేదు. నీవుజలింపక యించుక కాలము సైరింపుము, నీయంతఃపురమునకే వచ్చెద. అప్పుడు నిర్భయముగాఁ గ్రీడింపవచ్చును. తక్కిన విషయము లెఱింగింతునని వ్రాసి యాయుత్తరము కమ్మరఁబూవుబంతిలోఁగుక్కి యామేడ మీఁదకెగరవైచెను. చిత్రసేనయు దానినందుకొని కన్నులనద్దుకొనుచు నందలివిషయము చదువుకొని వ్రాసిన సాధకబాధకముల గురించి సంతసించుచు నతనిరాక కెదురుచూచుచు దినమొకయేడు లాగున గడుపుచుండెను.

అంత బుద్ధిసాగరుఁడు చంద్రగుప్తమహారాజు నధికార విశేషము లన్నియుఁదెలిసికొని యతఁడు సూర్యప్రతాపుఁడను రాజునకు గప్పముగట్టుటవిని కతిపయప్రయాణంబులఁ గామపాలునితోఁ గూడ సూర్యప్రతాపుని పట్టణమునకరిగెను. అందాకుమారులిరువురు గొన్ని దినంబులుండి తమవిద్యాపాటవంబున సూర్యప్రతాపుని మంత్రిని మెప్పించి యొకనాఁడతనిచే నేమికావలయునో కోరుకొనుఁడని యనిపించుకొనిరి. అప్పుడాయమాత్యుని సూర్యప్రతాపుని మూలబలము బిరుదములు శిబిరములు గొన్నిదినములు మాతో నుండునట్లాజ్ఞాపింపుఁడని వేడుకొనిరి.

ఆసచివుఁ డప్పుడా సేనాధిపతుల రప్పించి వారివెంట నరుగ నాజ్ఞాపించెను. అంత నొకనాఁడు బుద్ధిసాగరుఁడు సూర్యప్రతాపుని వేషమును కామపాలుఁడతనిభార్య వేషముఁ వైచికొని యాసేనతోఁ గూడ నడుమనడుమ విడెదలు చేసికొనుచు నొకనాఁటి సాయంకాలమునకు జంద్రగుప్తనగరము జేరిరి.

అంతకుమున్నే సూర్యప్రతాపుఁడు తమక్రింది దేశముల క్షేమ సమాచారములు చూచుటకై వచ్చుచున్న వాఁడనియు నాయా

రాజులు సిద్ధముగా నుండవలయుననియు యాజ్ఞాపత్రికలఁ బంపిరి. చంద్రగుప్తుఁడు నా రాజు రాకకెదురుచూచుచు వచ్చినవార్త వినిన తోడనే యెదురేగి తనకిరీటమణు లతనిపాదపీఠంబుల వెలుగఁజేయ మ్రొక్కిన నక్కపట సూర్యప్రతాపుఁడును నతని మన్నించి లేవ నెత్తి గారవించి క్షేమముఁ దెలిసికొనెను.

పిమ్మట చంద్రగుప్తుఁడు అపూర్వమైన యతని మర్యాదకు మిగులసంతసించుచుఁ దగినవిడిదెల నియమించి యందు బ్రవేశపెట్టి యెన్నియేని యుపచారములు చేయుచుండెను. ఇట్లు రెండుమూఁడు దినములుండి కపటసూర్యప్రతాపుఁ డొకనాఁడు చంద్రగుప్తునితో రాజా! నీవు మాకేమైన గప్పమీయవలసి యుంటివా? యని యడిగెను. అప్పుడా చంద్రగుప్తుఁడు నమస్కరించి దేవా! నేనేమియు నీయనక్కర లేదు. కావలసిన దేవరవారికి లెక్కలు చూపింతు ననుటయు సంతసించువానివలె నభినయించుచుఁ జంద్రగుప్తా! నీవెప్పుడును గొదవపెట్టవు. ఈప్రె రాజులు సరిగాఁ గప్పములు చెల్లించుట లేదు. నేనచ్చటికిఁ బోవలసియున్నది. అది యరణ్యప్రాంతమగుటచే స్త్రీలు వచ్చుటకుఁగష్టముగానుండును. ఇచ్చట నేయుండిన బాగుండునేమో యని తలపైకెత్తి యర్ధస్వరముతోఁబలికి శిరఃకంపము చేయుచు పోనీ యేమిటికని యంతలో నక్కరలేనట్లు సూచించుటయు నతని యభిప్రాయమెఱిఁగి చంద్రగుప్తుఁడు చేతులుజోడించి వినయముగాఁ గపటసూర్యప్రతాపున కిట్లనియె.

దేవా! దేవరవారి కేనుభృత్యుండ. ఇప్పుడు నాతో నెద్దియో చెప్పఁదలంచి సంశయించి యూరకుంటిరి. అట్టి సందియమందనక్కర లేదు. దేవరపని యేదియైననుఁ బూనుకొనిచేసెద సెలవిండు. ఆకార్యముజేసి దేవరకిదివఱకు నాపైఁగల యక్కటికము వృద్ధిజేసికొనఁదలంచి నాఁడనని ప్రార్థించుటయుఁ జంద్రగుప్తుని వచనంబులకు మిక్కిలిసంతసించువానివలె నభినయించుచుఁ జిఱునగవుతో నతని కిట్లనియె.

చంద్రగుప్తా! నీవట్టివాఁడవేయనియిదివఱకే నేనెఱుంగుదును. మా కార్యము మఱేమియు లేదు. మేము ఇచ్చటికి దేవితోఁ గూడ వచ్చితిమి ఇటమీఁద నామెను దీసికొనిపోవ నిష్టములేను. మేము దిరిగివచ్చునంతదనుక మీయింట నుంచుదమని తలంచుచుంటిని. ఆన లతుకయుఁ బ్రాయమునయున్నది. మీయింట నీకుఁగల వారెవ్వరేనిం గలరా యనియడిగిన నతండు సంతసించుచుఁ గపటసూర్యప్రతాపుని తో నిట్లనియె.

దేవా! ఇంతమాత్రమునకే యింత సంశయింప వలయునా? నాకుఁ జిత్రసేనయను కూఁతురుగలదు. అదిపదియారేండ్ల ప్రాయము గలది. దానియంతఃపురము మిగుల రక్షకముగానుండును. అచ్చటనే దేవిగారుగూడ నివసింపవచ్చును. ఆమెను నేను మాతృభావముగాఁ జూచెదను. ఏకొరంతయు రానీయను. మీరుపోయిరండు పూవులం బెట్టినట్లు మీభార్యను మీకప్పగించెదను. ఇప్పుడూరక చెప్ప నేల? అప్పుడామెనేయడిగి తెలిసికొనుఁడని పలికిన సంతసించుచు నప్పుడే మంచిముహూర్తమని యాకపటసూర్యప్రతాపుఁడు స్త్రీవేషముతో నున్న కామపాలుని యారాజువెంటఁ బల్లకీనెక్కించి కడు జాగ్రత సుమీ యని పలుమారు చెప్పుచుఁ జిత్రసేనయున్న యంతఃపుర మునకుఁ బంపించెను.

ఆహా! పోతుటీఁగ నేని బరీక్షసేయక లోనికిఁజొరనీయని చంద్ర గుప్తుఁడు స్వయముగానే కామపాలునిఁ జిత్రసేన యంతఃపురమున కనిచెను. ఎట్టిబుద్ధిమంతునికైనను స్త్రీలనుఁ గాపాడుట గష్టము. అం తకుఁబూర్వమే యావార్తవినియున్న చిత్రసేన యతనిరాక కెదురు చూచుచు వచ్చినంత నెదురేగి తన యనురాగంబంతయు వెల్లడిగాఁ బల్లకిలోనుండి లేవనెత్తి కౌఁగలించుకొని సగౌరవముగాఁ దోడ్కొనిపోయి యుచితాసనముమీఁద గూర్చుండబెట్టెను.

అప్పుడు చంద్రగుప్తుఁడును సూర్యప్రతాపుని యనుమతిప్రకారము ఆరాణి మిగులసిగ్గుగలది యాయంతఃపురములోఁ దఱచు స్త్రీలుగూడ నివసింపఁగూడదనియుఁ జిత్రసేనయొక్కయు రాణియొక్కయు నాజ్ఞలేక లోనికెవ్వరును బోఁగూడదనియు నంతఃపురచారిణుల కందఱకుఁ దెలియఁజేసెను. దానంజేసి చిత్రసేన కాప్తులైన వారు తప్ప మఱియేస్త్రీయు నాయంతఃపురమునకుఁ బోవుటలేదు.

అప్పుడు వారికెంత స్వేచ్ఛగానుండునో చింతింపుము. ఇతర జనరహితమగునయ్యంతఃపురములో వారిరువురు గద్దియలంగూర్చుండి ప్రియాలాపంబు లాడుకొనునప్పుడు చిత్రసేన యతని స్త్రీరూపము జూచి నవ్వుచు నోహో ప్రియుడా! స్వాభిఖ్యాతిరస్కారంబు సైపక కాముండు నిన్ను స్త్రీనిగాఁ జేసెఁగాబోలు? మేలు మేలు! మీబుద్ధి చాతుర్యము మిగులఁగొనియాడఁదగియున్నది. క్రూరశిక్షాదక్షుండైన మాతండ్రిని మీరొక్కరే వంచించితిరి. భళిభళి! యని కొనియాడుచున్న యాచిన్నదానికా కామపాలుండు ప్రేయసీ! కాముండునన్నాడుదానిగాఁజేయుట యేమిలెక్క. సకల జగత్ప్రభువైన శంకరునంత వానినగము మగువగాఁ జేసెను. అదియంతయు మీమహిమయే గదా మీవిలాసములకుఁ జిక్కనివాఁడెవ్వఁడునాయని పలుకుచు నాచిలుకలకొలికింగూడి యాకామపాలుఁడు మనంబునంగల కోరికలు దీర రతిక్రీడలం దేలెను.

ఈరీతిఁ గామపాలుండా ప్రోయాలుమిన్నంగూడి రాత్రియుఁ బగలను భేదములేక నేకరీతి మూడుమాసములు క్రీడించెను. బుద్ధిసాగరుండు జంద్రగుప్తునిచేత ననిపించుకొని యవ్వలఁ గొంత దూరము బోయి యాసేనలను దిరుగఁ దానుబిలిచినప్పుడు వచ్చునట్లాడంబడఁ జేసి యథాస్థానమున కనిపెను. పిమ్మట నతఁడు చంద్రగుప్తముశేరియందు బ్రహ్మవేషము వేసికొని వింతవింతయగు పఱువులు గుట్టుబట్టి వచ్చినాఁడనియు దూదియిచ్చినచో సులభమగు వెలకే యింతకు

మున్నవ్వారు చూడని వరుపులు గుట్టుననియుఁ గోటప్రక్కను నివసించియున్నవాఁడనియు నాపట్టణమంతయు జాటింపించెను.

ఆచాటింపువిని యాయూరిలోని ప్రజలందఱు పాతపగుపులే కాక క్రొత్తవరుపులుగూడఁ జించుకొని యాదూదియంతయుఁ దీసికొని వచ్చి యాకోటగోడప్రక్కను రాశిగాఁ వేయఁదొడంగిరి. బుద్ధిసాగరుండు నాదాపున నివసించి వరుపులుగుట్టుటకై మంచి ముహూర్తము వలయువానివలెఁ గాలయాపన జేయుచుండెను. ఆకోట ప్రక్కను పర్వతమువలె దూదిరాసి పోగైనది.

ఇట్లుండునంత నొక్కనాఁడు చంద్రగుప్తునికుమారుఁడు సత్యవంతుఁడనువాఁడు దాసీముఖముగాఁ దనచెల్లెలు స్త్రీరూపముతో నున్న పురుషునితో నంతఃపురములోఁ గ్రీడించుచున్నదని విని పరితప్తుఁడై యర్ధరాత్రంబున నొక్కఁడే యచ్చటికిఁబోయి తలుపులు బిగించి యుండుట నాకవాటముల యడ్డములు పగులఁగొట్టి యాదారిని లోపలకుఁబోయెను. ఆసమయంబున నాతనికి హంసతూలికాతల్పంబునఁ జిత్రసేనతోడయుండుఁ దలజేర్చిపండుకొని యాచేడియ పాడుచున్న వీణాగానంబునకు సొక్కుచు నడుమనడుమ గుడిచేయి నానాతివాతెర నివురుచు నించుక మోమెత్తి చెక్కిలి ముద్దుగొనుచుండెడు వారి చిన్నెలన్నియుఁ గనంబడినవి.

అప్పుడు పట్టరానికోపముతో నాభూపాలకసూనుండు కేలవాలుబూని యుగ్రముగా నతనింజంప మీఁదకుఱికెను. ఆసడినంతకుఁ బూర్వమే గ్రహించి కామపాలుఁడు తటాలునలేచి యతనింగెలువగల బలముగలిగియున్నను నిలువక వేరొకయడ్డము పగులఁగొట్టి యాయంతఃపురము దాటి కోటప్రక్క బుద్ధిసాగరుండు ప్రోగుజేసియున్న దూదిమీఁదికి దుమికెను.

ఎంత బలవంతులైనను జారత్వకృత్యమున మెలంగుచున్నప్పుడు సామాన్యులకుఁగూడ భయపడుచుందురు. సత్యవంతుఁడు

వానిపోకఁజూచి వెంటఁదగిలి పోకుము పోకుము యని కేకలువైచుచు నాతండరిగిన రీతిగానేపోయి యతనితోఁడఁ గూఁగోటగోడ దుమికెను. దుమికిన వెంటనే యాదూదిలోఁబడి లేవలేకున్న సత్యవంతునిఁ దిరుగఁబడి పట్టుకొని కాపాలుఁడతని చేతనున్న కత్తినేబూని చిత్రవధ జేసెను. అంత కామపాలుఁడందున్న బుద్ధిసాగరుని లేపి జరిగిన కథయంతయు నతనితోఁజెప్పిన సంతసించుచు నప్పుడే యాదూది రాశిలో నగ్నియంటించి యతఁడు కామపాలునితోఁగూడ మరల సూర్యప్రతాపునిపట్టణమునకుఁబోయెను. ఉదయంబున భస్మమై యున్న దూదిరాశింజూచి పౌరులందరు బల్లీనింగానక చింతించుచుఁ బ్రమాదముననగ్నిపడి భస్మమై దూదిచెడిపోయినంత మాటవచ్చునను భయముచే బల్లిపారిపోయెనని యూహించి యెరుగనివాని కిచ్చినందుల కీశాస్తి మనకుఁ గావలసినదేయని నిందించుకొనుచు బౌరులు చింతించిరి.

మఱునాఁడుదయంబునఁ జిత్రసేన దనయున్న సత్యవంతుఁడు కామపాలునిం దఱుము కొనిపోయి మృతినొందుట వెనుకనే యఱిగి చూచి చింతించి యంతలో మరలించుకొని యారహస్య మెవ్వరికిఁ దెలియనీయక తండ్రికిట్లు కమ్మవ్రాసినది.

తండ్రీ! నిన్నరాత్రి మాయన్న సత్యవంతుఁడద్దిరోయావసికి నాయంతఃపురమునకువచ్చి యందు నివసించియున్న సూర్యప్రతాపు భార్యంజూచి మోహించెను. అతని యభిలాష నేను దెలిసికొని యితరులు రాఁగూడదని యీయంతఃపురమున కేటికి వచ్చితి వన్నా యని యడుగుచుండగనే యంతలో నతఁడు నిలువలేక నానాళీకవదనపైఁ బడఁబోయెను. అప్పుడాసాధ్వి వెరచి యట నుండి పరుగునబోయి కోటదుమికి పారిపోయినది. సత్యవంతుఁడు గూడనేపోయెను. ఇరువురుపోయిన పోకయేగాక యింతదనుక రాలేదు. ఇప్పటికప్పడఁతి సమ్మతిజెందియుండఁబోలు. ఎందుబోయిరో తెలియదు. ఈరహస్యము మీకుఁ దెలియఁ జేసితినని తండ్రి కెఱింగించినది.

అట్టివార్త విని చంద్రగుప్తుఁడు నఱకఁబడిన యరఁటి కంబము వలె నేలంబడి కొంతసేపటికిఁ దెప్పిరిల్లి అక్కటా! నాకుమారుం డెంత ఖలుఁడయ్యెను. అంతఃపురమున కేటికిఁబోవలెను? ఆచిన్నది సామాన్యపురాణి యనుకొనెనా? అయ్యయ్యో! నేనిప్పుడేమి చేయుదును? సూర్యప్రతాపుఁడు వచ్చి నాభార్యను దీసికొనిరమ్మని యడిగిన నేమి చెప్పుదును? ఈమాట యతనికిఁ దెలిసినచో నారాజ్యము దక్కనిచ్చునా? ప్రాణములతో నుండనిచ్చునా? మొదట నాయొద్దనుంచుటకే సంశయించెను. దుర్మార్గులగు కొడుకులు గలుగుట పూర్వజన్మపాతక మూలముననేగదా! అన్నన్నా! తలఁచుకొనిన గుండెలు పగులు చున్నవి. తప్పక నాకుమరణమే తటస్థించును. ఏమియున్నది. ఏమి చేసినను మేలేయని పలుతెరంగుల నంతరంగమునం దలఁచుచు జావునకు దెగించి యధికదైన్యముతో నుండెను.

చిత్రసేన యదియంతయుఁ జూచుచుఁ గపటముగా బుడి బుడి దుఃఖములు పెట్టుచు గుట్టుదెలియ నీయక తనకోరిక తీరఁగలదను సంతోషముతో. గామపాలునిరాక కెదురుచూచుచుండెను. ఇట్లుండు నంత నొకనాఁడు ప్రాతఃకాలమున భేరీధ్వనులు వినంబడినవి. ఆనినదముతోఁగూడఁ జంద్రగుప్తునిగుండెలు పగిలిపోయినవి. ఇంతలో చారులువచ్చి చంద్రగుప్త మహారాజా! సూర్యప్రతాపమహారాజు మీయూరిబయటఁ దోటలో విడిసియున్నవాఁడు. మిమ్ముఁదీసికొని రమ్మనిరి. వేగముగారండనుటయు నామాటకతఁడు గడగడవణంకుచు నెట్టకేలకాదూతలవెంబడి మొగమున చిన్నఁదనము దోప సూర్యప్రతాపుని యొద్దకుఁబోయెను.

అప్పుడాకపట సూర్యప్రతాపుఁడు కామపాలునికి మంత్రివేషము వైచి యిష్టగోష్ఠివిశేషముల మాటలాడుకొనుచుండఁగా వచ్చిన చంద్రగుప్తునిజూచి గౌరవించి యతండుచితాసనమునఁ గూర్చుండి యున్నవెంటనే యతనితో నత్యాతురముగా నిట్లనియె.

చంద్రగుప్తా! మేము దేశాటనము జేసివచ్చితిమి. ఇంత గాలము నాప్రియసిం గాపాడినందులకుఁ జాలనంతసించితిమి. ఆచేడియం జూడ మిగులఁదొందరగానున్నది. వడిగాఁబోయి తీసికొని రమ్మనుటయు, నతండామాటవిని గడగడ వణంకుచు మేనెల్లం జెమ్మటలు గ్రమ్మ నేమియుంబలుకక పెదవులు దడఁబడఁ జేతులు నలిపికొనుచు చిత్తము చిత్తము అని యెద్దియో చెప్పఁబోయి భయపడి యూరకుండెను అంత సూర్యప్రతాపుఁడు మండిపడి యేమియూరక నిలుచుంటివి? నామాటనీకు వినంబడ లేదా? నాకు భార్యను జూచుటకు మిగులదొందరగా నున్నదనినను దెలియదా? వేగముపోయి తీసికొనిరాయని మరల బిగ్గరగా బలికెను.

అప్పుడు చంద్రగుప్తుఁడు చావునకుఁ దెగించి యలంతియెలుఁగున దేవా! యొకమనవియున్నది చిత్తగింపుఁ డనుటయు సూర్యప్రతాపుఁడు పెద్దకేక పెట్టి యోహో నీకు మంచిచెడ్డలు తెలియవా? నేనింతయాతురముగాఁ జెప్పుచుండ మధ్యను మనవులను చెప్పెదవేమిటికి? నీమనవులు పిమ్మటఁజిత్తగింతును. వేగము పొమ్మనుటయు నతండేమియుఁ బలుకలేక గద్గదస్వరముతో అయ్యా! మీభార్యను జాగ్రతగానంతఃపురములోనుంచి కాపాడుచుండగా సత్యవంతుఁడనువాఁడు నాకొడుకామెను వరించి యెచ్చటికోఁ దీసికొని పోయెను. ఈమాట దేవరవారితో మనవిచేసికొనఁ జాలకున్నాను. దేవర వారికింత చింతగలుగ చేసినందులకుఁ దగిన దండనకుఁ బాత్రుడనైయుంటి. ఇంతకన్న నేనేమియుఁ జేయునది లేదనిపలికి కన్నులనీరు నించుచునాతని పాదంబులంబడియెను. అప్పుడతండు ప్రళయకాలభైరవుండు ప్రోలెనుగ్రుఁడై సంవర్తవలాహక గర్జారవ భైరవంబుగా నోరీ మూర్ఖా! యెంతద్రోహివి. నీయింటనుంచినందులకుఁ జక్కగా జేసితివి. ఇప్పుడె నిన్ను యమలోకంబున కనిపెదనని కత్తారింబెరికి యతనిం జంపనుంకించెను.

అప్పుడు మంత్రిగానున్న కామపాలుఁడు అతనిచేయి పట్టుకొని దేవా! శాంతింపుము. శాంతింపుము. ఊరక నీనృపాలునిం జంపిన లాభమేమియున్నది. అతండు మనకు వ్యతిరేకముగా నడుచుటలేదు. ప్రమాదమెవ్వరికైనం గలుగునుగదా! కొంచెము నిదానింపుఁడని పలుకుచుఁ గ్రమ్మర సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టెను.

అప్పుడహంకారముఖముతోఁ జంద్రగుప్తుని చూచుచు సూర్యప్రతాపుఁడు చంద్రగుప్తా! నాభార్యను నీకుమారుని యధీనముజేసి తెలియనట్లు చెప్పినచో నూరకుందుననుకొంటివా? ప్రాణతుల్యయగు భార్యనువిడిచి యెట్లు బ్రతుకఁగలను? అది నీయింటనే యున్నది. ఎచ్చటనోదాచి ఇంటలేదని చెప్పుచుంటివి. వేగబోయి తీసుకొని రమ్మనుటయు జంద్రగుప్తుండు అయ్యో! నే నావాల్గంటి నింటం దాచి యిచ్చట మీచే నవమానమును బొందనేటికి? మీరువచ్చి నానగరమంతయుఁ బరిశోధింపుఁడు. దైవసత్యముగా నట్టి కపటము చేయలేదు. మీరంగీకరించినచో మీరాణికన్న మిగుల చక్కనిదియగు తొలిప్రాయములో నున్న నాకూఁతురు చిత్రసేనయనుదానిని మీకు వివాహము చేయుదును దానికై యనేక రాజకుమారులు వేచియున్నారు. తగినపతి దొరకమి నింతదనుక దానికిఁ బెండ్లిచేయలేదు. ఈరూపమున నానేరము బాపుకొనఁదలంచితి. నన్ను క్షమించి యట్లనుగ్రహింపుఁడు. నాకూఁతురు సౌందర్యాది గుణంబుల తెరంగు లోకులనడిగి తెలిసికొనుఁడని యనేకప్రకారంబులఁ బాదంబులంబడి వేడుకొనుచున్న చంద్రగుప్తునిపైఁ గొంత కనికరించువానివలె నభినయించుచు మంచిది లెమ్ము నేటికి బ్రతికితివి. నిజముగా నీకూతురు చక్కనిదేయైనచో మేము పెండ్లియాడెదము. ఆచిన్నదాని మాతుముగాక యిక్కడికిఁ రప్పింపుమని పలికెను.

అప్పుడు చంద్రగుప్తుఁడు తానుజచ్చి బ్రతికినట్లు సంతసించుచు దనకూఁతు బంగారుపల్లకినెక్కించి తీసికొనిరండని యంతఃపురవాసుల

కాజ్ఞాపించెను. అంత నంతఃపురపరిచారిణులు తమయేలిక యాజ్ఞ ప్రకారమాచిత్రసేనను దీసికొనివచ్చి యొకశిబిరములో నిలిపిరి. ఆవార్త చంద్రగుప్తుడు సూర్యప్రతాపుని కెఱింగించినంత నతండు తదీయరూపాతిశయంబు బరీక్షించి రమ్మని మంత్రిగానున్న కామపాలుని నియమించెను. ఆకామపాలుఁ డతిసంతోషముతోఁబోయి యందితరులుండఁగూడదని యాజ్ఞాపించి యాచిత్రసేనంగాంచి పులకాంకితశరీరుండై ముద్దుబెట్టుకొనుచు బోఁటీ! నేఁటికిగదా మనము గలిసికొంటిమి. ఇది యంతయు నామంత్రి బుద్ధిసాగరుని బుద్ధి నైపుణ్యమేసుమీ! నిన్ను మీతండ్రి మాకిచ్చివేసెను. నీవు మా యధీనవైతివని యత్యంత ప్రీతిపూర్వకముగాఁ బలుకుచున్న యతని కా చిన్నది యిట్లనియె.

నాథా! నే నిప్పుడు మీయధీనను గాలేదు. పూర్వమేయైతిని మాతండ్రి యిప్పుడు మీయధీనముచేసెను. నాపూర్వపుణ్యము మంచిది. మీయట్టిపతి యూరక లభించునా! నిష్కారణముగా నాసోదరుం బరిమార్చితిరిగదా యాకోపము లేశమైన మీయెడ నాకు లేదేమి? ఆహా కామప్రభావంబు అని యద్భుతమందుచున్న చిత్రసేనకు మరలఁ గామపాలుం డిట్లనియె. బోఁటీ నేను నీసోదరునిఁ బగచేఁ బరిమార్చితినా? లేనిచో మనగుట్టుబట్టబయలగును. ఈకోపము మనంబున నుంచుకొనకుము. మఱియు నిప్పుడు నీవు మాతో వత్తువా? యింక గొన్నిదినము లిందుండెదవా? యని యడిగిన నమ్మగువ యిట్లనియె. నాథా! దీనికి నన్నేమియు నడుగనక్కఱ లేదు. మీసెలవెట్లో యట్లే నడుచుకొందునని పలికెను. అట్లా ముద్దియతోఁ గొంతసేపు ముచ్చటించి కామపాలుఁడు మరల సూర్యప్రతాపు నొద్దకువచ్చెను. అప్పుడు సూర్యప్రతాపుడు కామపాలుడు తనతో నేమియుమాట్లాడకమునుపే యెదుట నిలువంబడియున్న చంద్రగుప్తునితో నిట్లనియె.

చంద్రగుప్తా! నేను భార్యావియోగ శోకవ్యగ్రతచే నొకతప్పు పనికి నియమించితిని. నీకూఁతురు చక్కఁదనము పరీక్షించుటకై

నామంత్రిం బంపితిని. ఇతండెంత నాకాప్తుండైనను బరపురుషుఁడు గదా! పరపురుషుని కన్నులం బడినదానిం బెండ్లియాడుట నాకిష్టములేదు. మఱియు నొకటివినుము నాకీ కామపాలుండు కేవలము మంత్రియేకాడు. ప్రాణసఖుండు రూపంబున నాకన్న నధికుండు అతండు స్వయముగాఁబోయి నీకూతుంజూచుకొని వచ్చెంగావున నతనికే పెండ్లిచేయుము. నేను నాకిచ్చినదానికన్న నెక్కుడుగా సంతోషింతు ననుటయుఁ జంద్రగుప్తుఁడు ఎట్లయినను సూర్యప్రతాపుఁడు సంతోషించినం జాలునని తలంచుచు నతనికిట్లనియె.

దేవా! నేను మీసెలవుప్రకారము నడుచుకొనువాఁడ మీ యిష్టమెట్లట్లే చిత్రసేనను గామపాలునికిచ్చి వివాహము చేయుదునని యొడంబడెను. పిమ్మట సూర్యప్రతాపుఁడు చంద్రగుప్తునితో రాజా! నేను పెద్దకాలమిచ్చటనుండను. శీఘ్రముగా వివాహముగావింపుము వివాహమైన వెనుక వధూవరులంజూచి సంతసించి పోయెదనను టయు నాచంద్రగుప్తుఁడు మహాప్రసాదమని పలికి దైజ్ఞులచే మంచి ముహూర్తము పెట్టించి యందుఁ జిత్రసేనకును గామపాలునకు నధిక మహోత్సవముగా బెండ్లి గావింపఁజేసెను.

ఆహా! బుద్ధిసాగరుని యభిఖ్యసార్థకమైనదిగాదే. అంతఁ బది దినములందుండి సూర్యప్రతాపుఁడు చంద్రగుప్తునితో వయస్యా! మీయల్లుని మాపురికిఁ దీసికొనిపోయి తిరుగానంపెద నానతియ్యుఁ డనుటయు నతండందులకియ్యకొని చయ్యన వచ్చునట్లల్లునిచే నని పించుకొని యారాజుతో సగౌరవముగా ననిపెను.

ఆసేనలతోఁ గొంతదూరము పోయి వారిద్దరు నాలోచించు కొని సేనలకుఁ బోవుటకుఁ సెలవిచ్చి వేషములు యథాప్రకారముగా మార్చికొని యప్పటియట్ల దేశాటనము చేయఁదొడంగిరి.

వీరట్లు కొంతకాలము దేశాటనముజేసి యొకనాడు శ్రీరంగ పురసమీపమునకుఁ బోయి యొకతోటలో విశ్రమించియున్న సమ యంబునఁ జల్లగాలి వీచుచుండెను. కామపాలునికి నిద్రపట్టినది. బుద్ధి సాగరుఁడు నిద్రరాక యెద్దియో ధ్యానించుచుండెను. ఆసమయంబున వారున్న చెట్టుమీఁద రెండుపక్షులు వాలినవి. అందాఁడు పక్షి మగ పక్షి కిట్లనియె.

నాథా! వింతలేమైనం గలిగినచో వక్కాణింపుము. ఊబుసు బోకున్నది. అనియడిగిన దానికి మగపక్షి యిట్లనియె.

కాంతా! వింతలేమియు లేవు ఇప్పుడు మనమున్నచెట్టు క్రింద బండుకొనియున్న కుమారులిరువురలో రాజకుమారుఁ డత్తవారింటి కరిగినతోడనే పాపము! కోటబురుజు విరిగి మీఁదబడి చచ్చును. ఇదియే విశేషమని చెప్పెను. అప్పుడాఁడుపక్షి రేఁడా! అదితప్పినచో నేమిజరుగునని యడిగెను.

దైవికముగా నాగండము గడిచినేని యతండు రాత్రిభుజించు సమయంబునఁ దొలిముద్దలోఁ జావముల్లుగొంతుక కడ్డపడి చచ్చునని మరల మగపక్షి చెప్పెను. ఆమాటవిని యాఁడుపక్షి ప్రాణేశా! యొక వేళ నదియుఁదప్పినచో నేమిజరుగునని యడిగెను. అదితప్పిన పిమ్మట నతండంతఃపురంబునఁ భార్యతోఁ దాంబూలము వైచుకొనుచుండఁ దొలియాకులోఁ బురుగుదిని చచ్చునని చెప్పెను. ఆఁడుపక్షి దైవసం కల్పమువలన నదియుదాటినచో నేమగునని పతినడిగెను. బోఁటీ! అదియునుఁదప్పినచో నారాత్రియే యతండు భార్యచేతిలో మృతు డగునని మగపక్షి చెప్పెను. అదియుదాటినచో నేమియగునని యడి గిన భార్యకు మగపక్షి, తన్వీ! అదిదాటదు తప్పక యతఁడు భార్య చేఁతిలోనే చచ్చును. చచ్చును, చచ్చును, అని ముమ్మారుపలికి, త రుణీ! మనమాటలు వినినవాఁడు ఈరహస్యమువానితోఁ జెప్పినచో

జాయియగును సుమీ యని పలుకుచు నాపక్షి యాఁడుపక్షితోఁ గూడ నెగిరి యెక్కడకేనిం బోయినది.

పక్షిభాష గుర్తెరింగిన బుద్ధిసాగరుండా సంవాదమంతయు నాలించి పిడుగుపడినవానివలె నిశ్చేష్టితుండై అయ్యో! యిదియేమి పాపము నాకిట్టి ఘోరవార్త వినంబడినదేమి? ఇదివరకు మాదినము లనుకూలముగా వెళ్ళినవి. మేము ముట్టినదెల్ల బంగారమే యగు చున్నది. ఇప్పుడు చెడుదినములు వచ్చినవి కాఁబోలు అక్కటా! ఈయాపద నాకురాక నామిత్రునకు వచ్చినదేమి? మిత్రవియోగ శోకము నేను భరింపఁగలనా? పక్షిమాట దప్పదు. మాకుఁ దిరుగా సంతోషముతో నిండ్లకుఁ జేరుయోగము లేదు గాఁబోలు! కానిమ్ము. దైవసంకల్ప మెవ్వఁడు మరలింపఁగలడు? ఏమిజరుగునో చూచెదం గాక యని ఖిన్నవదనుఁడై విచారించుచుండ నింతలోఁ గామపాలుఁడు మేలుకొని వయస్యా! నేను బరుండి చాలసేపైనది. నన్ను లేపక పోయితివేమి? నాకొక దుస్స్వప్నమైనది. మనయింటియొద్ద నెవ్వరి కైనఁ గీడురాలేదుగదా? నీవెద్దియో విచారించుచుంటి వేమని పలు కుచుఁ దనకువచ్చిన కలయంతయు నతనితోఁ జెప్పి దీనికి ఫలమేమని యడిగిన నతండు మనంబున విచారించుచు నతనితో నిట్లనియె.

కామపాలా! పగలువచ్చిన కలకు ఫలమేమియు లేదని పెద్దలు చెప్పుదురు. దీనికై నాలోచింపవలసిన పనిలేదు. సాయం కాలమగుచున్నది పోదములెమ్ము శ్రీరంగపురము పాంతమునందే యున్నది. మఱియు నేనాలోచించునది యేమియులేదు నూగ మార్గగమన ఖేదంబునంజేసి నామొగము నీకట్లు కనంబడుచున్నది. ఇంతకన్న వేరులేదని లోపలఁజింతించుచున్నను నతనికి ధైర్యము గఱపుచు నాతోటవిడిచి సాయంకాలమునకా కామపాలునితోఁ గూడ శ్రీరంగపురము జేరెను. బుద్ధిసాగరుఁడు కామపాలునితోఁ

బ్రస్తుతము శ్రీరంగిపురము పోవలదని యెన్నియోవిధముల బోధిం చెనుగాని కారణము జెప్పమి నామాట పాటిసేయక పద్మావతి యందలి మోహంబునంజేసి యతండు పోవలయునని గట్టిపట్టు పట్టెను. దానంజేసి వారి కచ్చటికిఁబోక తీరినదికాదు బుద్ధిసాగరుఁడు కామపాలునితోఁ గనిపెట్టి కోటప్రాంతముగా నడచుచు బురుజుదగ్గ రకుఁ బోవునంత నొక్కతోరపు ముందరకుఁ దోసెను. అప్పుడే యాబురుజు పెళపెళ విరిగినదిగాని బుద్ధిసాగరుని త్రోపుచేఁ గామ పాలునికిఁ జింతాకంతదప్పినది. అచ్చట నున్నవారది చూచి కామ పాలుని బునర్జీవితునిగాఁ దలంచిరి.

పిమ్మట శ్రీరంగరాజు అల్లుని రాకవిని సంతోషముతో నెదు రేగి యుచిత సత్కారములతోఁ దోడ్కొనిపోయి యప్పుడే యా వార్త పద్మావతికిఁ దెలియజేసెను. ఆరాత్రి మంచిపిండివంటకములు ఫలోపహారములు మొదలగువానితో వారికి విందుజేసిరి. అప్పుడు బుద్ధిసాగరుఁడు మొగమునందు దైన్యము దోపనీయక యతనిదాపు ననే భోజనంబునకుఁ గూర్చుండి కామపాలుండు మొదట ముద్దఁజేసి కొని తినఁబోవుసమయంబున నతని చేయిబట్టుకొని అన్నా! నాకీ ముద్దబెట్టుము. దీనిం దిన వేడుకయగుచున్నది. నీకును నాకును నెంగిలిలేదు. అని వినయముగాఁ బ్రార్థించిన నతండు నవ్వుచు మిత్రుఁడా! దీనికై నన్నింత బ్రతిమాలవలయునా? యిదిగో పుచ్చు కొమ్మని యిచ్చుటయు దాని నతండు దినక పిమ్మట బ్రచ్ఛన్నముగా దాచెను.

అట్లు ఇష్టగోష్ఠి మాటలాడుకొనుచు భుజించినవెనుక బుద్ధి సాగరుఁడు కామపాలునితో రహస్యముగా నిట్లనియె. అన్నా! నీవును నేనును నిల్లువిడిచినది మొదలు విడువకుండ నొక్కశయ్యఁ బండుకొనుచుంటిమి. నాకు నేఁడు గాలి సోకినదేమోగాని శరీరములో భారముగా నుండుటయేగాక మనమున నేద్దియో భయము గలుగు చున్నది. రాత్రి నీవు నీభార్యతోఁ బరుండవలసినదేగదా? నేనొక్కరుండ నెక్కడ బండుకొందును.అనుటయు నతండు తొందర

పడి అయ్యో మిత్రుఁడా! నాకు నీకంటె పద్మావతి యెక్కువదియా? నీవు వెరవకుము. నేను తోటలోఁ బరుండి లేచినది మొదలు నీ మొగము బరీక్షించుచునే యుంటిని. విపరీతముగానే యున్నది. దారిలో గాలిసోకి యుండవచ్చును. విభూతిబెట్టించి యీరాత్రి నీయొద్దనే పండుకొనియెదనని పలికెను.

అప్పుడా బుద్ధిసాగరుఁడన్నా! అట్లనకుము చిరకాలమున కిచ్చటికివచ్చి భార్యంజూడక వేరుశయ్యం బండుకొనిన బంధువులు సమ్మతింతురా? పోనీ! యొకటిచేయుము. నీవు నాకతంబున భార్య యొద్దఁ బవ్వళింపమానవలదు. నీగదిదగ్గరనే నాకుఁగూడ మంచము వేయించుము. నాకు ధైర్యముగానుండును అనిన అతండు నెచ్చెలీ దీనికి సంశయమేల! నాగదిలోనే పరుండవచ్చును. నీకును నాకును భేదమున్నదా! యని పలికెను.

బుద్ధిసాగరుం డతనితో నన్నా! మనయిరువురకు నెంత మైత్రి యున్నను నొక్కగదిలోఁ బవ్వళింపరాదు. నీకిష్టమైనచో నీభార్య పద్మావతి సమ్మతించునా! ఇతరులు వినినఁ బరిహాసాస్పదముగా నుండును. నీగదికిదాపుగ నాకుమంచము వేయించుటయే లెస్స యని పలికి యతని నొప్పించెను.

కామపాలుండు అంతఃపురచారిణులకామాట దెలియజేసి తన గదిని చేరియున్న గదిలోనే యతనికిఁ గూడ మంచము వేయించెను.

అంత నంతఃపురకాంతలచే బిలువంబడి కామపాలుఁడు బుద్ధి సాగరునితోఁ గూడ నధికాలంకారశోభితంబగు శుద్ధాంతమున కరిగినఁ పద్మావతి యెదురువచ్చి మగని చెట్టబట్టుకొనియున్న బుద్ధి సాగరుంజూచి కొంచెము తొలఁగెను. కామపాలుండట్టి సందియము ముందుగానే పోగొట్టెను. ఆముద్దియయుఁ వద్దయుంబీత్రిఁ బతి పాదంబులం గడిగి నెత్తిపైఁజల్లుకొని కైదండయిచ్చి చిరకాలదర్శ

నానురాగంబుమోముఁ దేటబఱ నల్లనగదిలోనికిఁ దీసికొనిపోయి హంసతూలికాతల్పమునఁ గూర్చుండఁబెట్టినది.

ఎరమరిక లేక బుద్ధిసాగరుండును వానితోఁ గూడఁబోయి యాశయ్యాతలంబు దాపునం గూర్చుండెను. అట్లువారిరువురు తల్పంబుజేరి నంత పద్మావతియు దాపున శయ్యంజేరియున్న గద్దియం గూర్చుండి వారికి విడియమిచ్చెను. అత్తరి బుద్ధిసాగరుఁడు కనిపెట్టి చూచుచు నెద్దియో నెపంబున మొదటి యాకందిపుచ్చుకొని దాచి యుంచెను. పిమ్మట నాకొమ్మయుఁ బతియనుమతి బుద్ధిసాగరుని రంజింప వీణెంబూని మనోహర రాగంబులతో సంగీతంబు బాడినది గాని యదియేమియు నతనికి వేడుక గలుగజేసినదికాదు. అట్లు కొంతసేపు వినోదముగాఁ బ్రొద్దుగడిపినంత బద్ధిసాగరుండు మిత్రు నికి మరణసమయము సమీపించుచున్నదని మనంబున బెక్కుతెరం గుల నడలుచు నెట్టకేలకతని విడిచి దాపుననున్న గదిలోనికిఁ బోయెను. మంచముమీఁదఁ గూర్చుండి మనంబున శోకంబాపలేక గన్నులనీరు గాల్వలుగాఁ బ్రవహింపఁ దనమిత్రునితో జరమ సంభాషణంబదియే యని పెద్దయెలుంగున గామపాలా! అనిపిలిచెను.

అప్పుడు కామపాలుండతని గద్గదస్వరం బాలించి యోహో యీతఁడీదినమున వెరచి యున్నవాఁడు. ఒంటిగాఁ బరుండుటకు వెరచుచున్నవాఁడని నిశ్చయించి తమ్ముఁడా యిటురా యని చీరెను.

అప్పుడు మరల నొక్కసారి యతనిచూచు తాత్పర్యముతో బుద్ధిసాగరుండాగదిలోకరిగి కామపాలునిం గౌగలించుకొని మోము వేరొకలాగునఁ ద్రిప్పి వెక్కి వెక్కి యేడువఁదొడంగెను.

కామపాలుండు వానికి భూతము సోకియే యట్లు భయపడు చున్నవాఁడనుకొని బుద్ధిసాగరా! యింత పిరికివాఁడవైతివేమి? బుద్ధిచాతుర్యమంతయు నెచ్చటికిఁబోయినది? మనలభూతము లేమి

నేయగలవు? ధైర్యమవలంబింపుము. అంత భయముగా నుండిననిచ్చ టనే పరుండుము. అని వీపు చరచుచు బిగ్గరగా గౌఁగలించుకొనెను. బుద్ధిసాగరుండెంత యూపుకొనినను తనమిత్రునికి మృతి సమీపించిన దనియు నిదియే తుది కౌఁగిలింతయనియు దుఃఖమాగినదికాదు. కొం తసేపట్లు మిత్రునివిడువలేక బలాత్కారమున కౌఁగిలివదలి ధైర్యము దెచ్చుకొని మరలఁబోయి గదిలోఁబండుకొనియెను. అంత దైవసంక ల్పమువలనఁ గామపాలునికి రతిక్రీడాసౌఖ్యము లనుభవింపక పూర్వ మే దారినడిచియున్న నలసటచే వెంటనే గాఢముగా నిద్రపట్టినది.

బుద్ధిసాగరుఁడు నిద్రఁబోక పక్షివాక్యము స్మరించు కొనుచు గామపాలుండు భార్యచేఁతిలో నెట్లు చచ్చునోయని యొకగవాక్షము వెంబడి లోనికిఁదొంగిచూచుచుండెను. అప్పుడు పద్మావతి మెల్లగ లేచి తనమగఁడు గురుపెట్టి నిద్రబోవుట పరిశీలించి నలుదెసలు కల యఁజూచి బుద్ధిసాగరుఁడు తన్నుఁ జూచుచున్న విఱియమెఱుఁగక నాగదిలోనొక మూలనున్న తలుపు తెరచి యాదారిని నేలసొరంగ ములోని కరిగినది.

అప్పుడు బుద్ధిసాగరుఁడు మెల్లనలేచి యాగదిలోనికిఁ బోయి దానికిఁ దెలియకుండ వెంబడించి యాసొరంగముదాటినే పోవుచుం డెను. అట్లు పోవఁబోవ నాదారియొక మేదరియింటియొద్దకు వెళ్లినది. పద్మావతియు వానియింటికరిగి యరుగుపై గురుపెట్టి నిద్రించుచున్న నామేదరిని లేపెను. దానివెంటనేవచ్చి యదియంతయుఁ జూచుచు బుద్ధిసాగరుండా యింట నొకమూలదాగియుండెను. ఆనీచుఁడు కోప ముతోలేచి ఛీ నిర్భాగ్యురాలా! యింత యాలస్యము చేసితివేల? యింతసేపు తిండితినక మేలుకొనియుండఁగల ననుకొంటివా? యని చెంపమీఁద నొకదెబ్బకొట్టెను. అప్పుడు పద్మావతి దవడ రాచుకొ నుచు బిడ్డఁడా! కోపముసేయకుము. నేనెన్నఁడేని యింత యాల

స్యముచేసితినా? కారణమున్న దివినుము. నామగఁడైన కామపాలుఁడు బుద్ధిసాగరునితోఁగూడ వచ్చినాఁడు. ఏకశయ్యానిరువురము బండుకొంటిమి ఎంతయిష్టములేకున్నను మగఁడుగదా! నిద్రపట్టువరకైన నుండవలయునా? మనపుణ్యమువలన నతఁడు రతిక్రీడకు దొరకొనకమునుపే బడలికచే నిద్రించెను. లేనిచో నాకీరాత్రియే వచ్చుటకు వీలులేకపోవును వానిస్నేహితుఁడు బుద్ధిసాగరునికి గాలిసోకినది. అతనిమూలముగాఁ గొంతయాలస్యమైనది. లేనిచోఁ బెందలకడ రానా? యివిగో భక్ష్యములు భుజింపుము నేఁడు అల్లుడు వచ్చెనని వింతగా చేసిరి. నాబుద్ధియంతయు నీమీఁద నేయుండుటచే నింతవరకు జవియైన జూడలేదు. అని పసిడి పళ్లెరము వానిముందర నుంచినది.

అప్పుడా మేదరవాఁడా భక్ష్యములను మెక్కుచుఁ దరుణీ! ఆలాగునా! తెలియక నిన్నునిష్కారణముగా గొట్టితినిగదా! యీతప్పుసైరింపుమని పలుకుచుండెను. అంతనాకాంత ప్రియుడా! నాకు నీదెబ్బయేమియు నొప్పిపెట్టలేదుగాని యొకటివినుము. ఒకవేళ నా మగఁడు నన్నుఁ దనయూరికిఁ దీసికొనిపోవునేమో యని భయమగుచున్నది. దీనికి నేనేమిచేయవలయునో తోచకున్నది. నీవేమనియెదవనియడిగిన వాఁడిట్లనియె.

మేలుమేలు మగనితో నరిగిన నేనేమి చేయుదును? దీనికెద్దియేని ప్రతిరోధముచెప్పుము. ఇంతయేల ఇప్పుడతండు నీయంతఃపురములోనే నిద్రించుచున్నవాడుకదా! యీకత్తితీసికొనిపోయి వానిని వధింపుము మనకేయాటంకముకుండదు. అనిచెప్పిన విని యువ్వానిత సంతసించుచు ఔనుసుమీ! యీపని యెంతయు నుచితముగా నున్నది. బుద్ధిసాగరుఁడుగూడ నంతఃపురమున బరుండుట మనకొక యుపకారమైనది. నేను తరువాతఁ జెప్పెదనులే! యీకత్తినూరినదేగదా! యిటుతెమ్ము వేగఁబోయెదనని యాకత్తి నందిపుచ్చుకొని రివ్వున మరలి సౌరంగములోఁ బ్రవేశించినది.

అదియంతయుఁ జూచుచున్న బుద్ధిసాగరుఁడు దానిచివరమాట విని తానేమియుందరబోయి కామపాలుని లేపఁదలచెనుగాని దైవసంకల్పమున నాసారంగములో దానియడుగుకుందు వానియడుగు వెనుకయగుటచే వడివడిపోయి యేమియుఁదెలియక గాఢనిద్రావశంవదుఁడై యున్న కామపాలుని మెడమీఁద నాకత్తివైచి చంపెను. స్త్రీసాహసము ఎంతఘోరమైనదో.

శ్లో॥ సుఖదుఃఖ జయపరాజయ జీవిత మరణానియే విజానంతి ।
ముహ్యాంతి తేపినూనం తత్వవిదశ్చాపి చేష్టితైస్త్రీణాం॥
శ్లో॥ స్మరోపమమపిప్రాప్య వాంఛంతి పురుషాంతరం ।
నార్యస్సర్వాస్స్వభావేన నోహంతే హితదాశయాః॥

సుఖదుఃఖ జయపరాజయ జననమరణముల మహిమ దెలిసికొనిన మహానుభావులు సైతము స్త్రీచేష్టలచే మోహమును బొందుదురు. మఱియు మన్మథుండు మగడైనను పురుషాంతరునిఁ గోరుచుందురు. వారిచిత్తవృత్తి దెలిసికొన నెవ్వ నితరంబు.

అట్లు తాను వెళ్లువఱకే యతనిఁ గడతేర్చినది. కాననేమియు జేయలేక హా, మిత్రుఁడా! నన్నొంటివిడిచి పోయితివేయని ఘోరముగా నేడువదొడంగెను. పద్మావతి యప్పుడు అతడు గదిలోనుండియే వచ్చెననుకొనెను. తనవెంటవచ్చి తనగుట్టంతయుఁ జూచిపోయెనని యింతయేనిమెరుంగదు. గోపా! పిమ్మట నాచిన్నదిచేసిన కృత్యము వింటివా? మేనంతయుఁ జీరికొని నగలన్నియు పిరజిమ్ముచు అయ్యో! చెలులారా! రండురండు. యీబుద్ధిసాగరుండు నామగనిం జంపి నన్ను బలాత్కారముగాఁ బట్టుచున్నాఁడు. వేగము రండో యని యరచినది.

ఆకేకవిని ప్రాంతగేహములోనున్న సఖులు సఖి! వెరవకుము వెరవకుము. మేమువచ్చుచున్నామని మరల గేకలుపెట్టి యతి వేగ

ముగానచ్చటికివచ్చి చచ్చిపడియున్న కామపాలునిపైబడి యేడ్చెదుంగక దుఃఖావేశముతో నేడ్చుచున్న బుద్ధిసాగరుని నాగదిలోనే నేడ్చుచు వికారముగానున్న పద్మావతింజూచి యిదియేమి పాపమిట్లు చచ్చెనేమి? యనియడిగిరి. అప్పుడు పద్మావతి వారితో అక్కలారా! నేనేమిచెప్పుదును? ఈదుర్మార్గుం డంతఃపురములోఁ దనకుఁగూడ మంచము వేయుమనిన నేను మైత్రిచే విడువలేక యట్లనుచున్నాడనుకుంటిని గాని యింత జేయునని యెఱుఁగనైతిని.

నాభర్తకు గొంచెము నిద్రపట్టగానే వచ్చి యతనిం గడతేర్చి నన్నుఁ దనతో సంభోగింపుమని బలాత్కారము చేయుచున్నాఁడు. ఇప్పుడు మీరువచ్చినంత నేమియునెఱుఁగని వానివలె నతనిపైఁబడి యేడ్చుచున్న వాఁడిదియే జరిగిన కథయని గోలుగోలున నేడువ దొడంగెను. అప్పుడు కొందరుబోయి శ్రీరంగరాజుతో నావర్తమానము జెప్పిరి. అతండు గుండెలు బాదుకొనుచు సకలబంధు పరివృతుఁడై యంతిపురమునకు వచ్చి కూఁతుం గౌఁగిలించుకొని యొకపెట్టున నేకస్వరముగా నేడువఁదొడంగిరి.

అప్పుడు రాజు పద్మావతి చెప్పిన మాటలన్నియు నిజమేయని నమ్మి పట్టరానికోపముతో నొడలెరుంగక మిత్రునిపైఁ బడియున్న బుద్ధిసాగరుని లేవనెత్తించి యేమిరా? మిత్రద్రోహీ! నిన్నుఁ బ్రాణమిత్రుడని నమ్మి వెంటఁబెట్టుకొని వచ్చినందులకు వీనికి మంచియుపకారము చేసితివి. ఈదొంగయేడుపుల కేమిలే? నీమొగము చూచినంత మహాపాతకములు సంప్రాప్తించును నిన్నేమిచేసినను తప్పులేదు, మాకొంపముంచితివి. అని యనేక నిందావాక్యము లాడెను. బుద్ధిసాగరుఁడు శోకముచేఁ దెలివిదప్పియున్న కతంబున నతని మాటలేమియు వినిపించుకొనలేదు.

పిమ్మట శ్రీరంగరాజు కొంతసేపట్లు చింతించి యూరక కామ

పాలునిప్పైఁబడి యేడ్చుచున్న పద్మావతి నూరార్చి పేర్చిన క్రోధమున బుద్ధిసాగరునిం దీసికొనిపోయి యుఱిదీయుఁడని కింకరుల కాజ్ఞాపించెను. యమకింకరులం దిరస్కరించు రాజభటులు మఱునాఁడు బొబ్బిడ్డున నహంకారముతో నతని రెక్కలకుఁ దాళ్ళు బిగించి వీథులవెంబడి దిప్పుచు వీఁడే మిత్రద్రోహుఁడు ఛీ యని చూచినవారెల్ల నుమియఁగ్రమంబున నతని వధ్యభూమికిఁ గొనిపోయిరి. బుద్ధిసాగరుండా విషయమేమియు నెఱుంగక పిశాచము పట్టినవానివలె వారితో నడిచెను. అంత వధ్యభూమియందు నుఱిదీయఁబోవుసమయంబున రాజభటులు బుద్ధిసాగరుని వాడుక ప్రకారము ఓరీ! కూరాత్మా! నిన్నిప్పుడు మేముఱిదీయఁబోవుచున్నారము. బ్రతుకుదప్ప నెద్దియేని కామితమున్నఁ గోరుకొమ్ము. ఇత్తుమని గట్టిగా బలుకుటయు నప్పటికిఁ గొంచెము స్పృహవచ్చి బుద్ధిసాగరుఁడు వారితో నిట్లనియె.

అయ్యో నేనేమి యపరాధము చేసితిని! నన్నేమిటి కుఱిదీయుచున్నారు? మఱియు నేనిచ్చటికెట్లువచ్చితిని? నాప్రాణమిత్రుఁడేడీ? యని యడిగిన వారు ఓహో! నీదొంగవేషమున కేమిలే? నీవు ప్రాణమిత్రుని జంపినందులకు గాను శ్రీరంగరాజు నీకు మరణదండన విధించెను. ఇది వధ్యభూమి. నీవు నీవార్తయే యెఱుఁగకున్నావు. ఈసారి తెలిసినదా? నీకు మఱిగామితమేదేని గలిగిన వక్కాణింపుము. దానిందీర్చి శీఘ్రముగా నుఱితీయుదుము అనుటయు నామాటవిని బుద్ధిసాగరుండు ముక్కుమీఁద వ్రేలువేసికొని రాజకింకరులారా! నాప్రాణమిత్రుని నేనేచంపితినని మీరాజు నాకు మరణదండన విధించెనా? మేలుమేలు బాగుబాగు. చక్కగా నిదానించెనే! కానిమ్ము నాకు నీసమయమందు మరణమేయుచితముగానున్నది అట్లయిన వేగనుఱిదీయుఁడు నాచెలికానితోఁ గలిసికొనియెదనని తొందరపెట్టెను.

అప్పుడు వాండ్రలోఁ గొందరు బుద్ధిమంతులు వానిమాటల ధోరణిచే నేరముచేసినట్లు నమ్మక అయ్యా! నీవూరకచావనేల?

నిజముగా నీ నేరము జేయనిచో నామాట రాజుగారికి నిదర్శనము చూపుము. నిన్ను విడిచిపెట్టెదరనుటయు బుద్ధిసాగరుఁడొక్కింత చింతించి చావనిశ్చయించియు నూరకనింద మోసి మృతినొంద నేటికి? నిక్కము బయలుపరచిన పిమ్మట సమసెదంగాకయని తలంచి యా కింకరులతో నిట్లనియె

భటులారా! అట్లయిన నన్ను మీరాజునొద్దకుఁ దీసికొని పొండు పిమ్మట నతనితో నిజము జెప్పెదనని కోరెను ఆకోరిక ప్రకారమతని మరల శ్రీరంగరాజునొద్దకుఁ దీసికొనిపోయి వాని యభిప్రాయమెఱింగించిరి.

రాజు-అహంకారముఖముతో బుద్ధిసాగరునింజూచి పాపాత్మా! నీవు నాతోఁ జెప్పవలసినమాట యేదియో వేగముగా వినుపింపుము నీమొగము చూడరాదని పలికెను.

అంత బుద్ధిసాగరుఁడు దీనస్వరముతో రాజా! నాప్రాణ మిత్రుఁడు గామపాలుండు మృతిజెందియుండ నాకీయురిశిక్ష యుచిత ముగానే యున్నది. ఊరకట్టి నింద మోచి చావరాదని యూహించి యందలి నిజము మీకు వినుపించుటకై వచ్చితిని. మొదట నేను శోకావేశముతో నుండుటచే మీచర్యలేమియు గ్రహింపలేక పోయితిని. ఇప్పుడు నావెంట నంతఃపురమునకు రండు. అందలి యదార్థమంతయుఁ బ్రత్యక్షపరతుననుటయు నారాజు దెల్లఁబోయి వల్లెయనియప్పుడే యతనివెంట గూఁతునంతిపురికరిగెను. బుద్ధిసాగ రుఁడు రాజును బద్మావతిగదిలోనికి తీసికొనిపోయి యందు మూలగా నున్న కవాటము తెరచి యానేలసొరంగముజూపించి దానివెంబడి తనతోరమ్మని చేయిపీచుచుఁ గ్రమంబున నతని నామేదరి యింటికి దీసికొనిపోయి యందు తనపేరుతోనున్న బంగారు బళ్ళెరములు వెండిగిన్నెలు నగలుమొదలగు వస్తువులన్నియుం జూపించి కామ పాలుని నరికినకత్తిని రక్తమిళితమై యచ్చటనే పడియున్న దానింగ్రై

కొని పరిశీలించి యాచిహ్నములు రాజునకుఁ జూపించుచు రాత్రి జరిగిన కథయంతయు నతనితోఁ జెప్పెను.

అప్పుడా రాజు చిత్తమెట్లుండునో వర్ణింపనశక్యముగదా? శోకమును రోషమును లజ్జయు పశ్చాత్తాపము నొక్కసారి యతనిచిత్తమునం జనించి యుత్తలపెట్టదొడంగిన నేమియుంజేయఁదోచక బుద్ధిసాగరునిపాదంబులంబడి, మహాత్మా! నిన్నూరకనిందించి శిక్షఁజేయఁబూనిన నాపాతకమునకు నిర్వృత్తియెద్ది? నీవుకటాక్షింపనినాఁడు నాకు మరణమేకాని వేరులేదు. ఈదుర్మార్గురాలి నిప్పుడే యుప్పుపాతర వేయించెద. నీవుమాత్రము నాయందు ప్రసన్నుఁడవుగమ్మని యనేక విధంబుల వేడికొనియెను.

బుద్ధిసాగరుండు శ్రీరంగరాజును బాదంబులనుండి లేవనెత్తి రాజా! నీవిషయమైనాకుఁ గొంచెమేనియుఁగోపములేదుఁ ఇదంతయు మాదినముల మహిమయేకాని వేరుకాదు. ఒకరిననిన లాభమేమి యున్నది? బ్రహ్మకైనను నెల్లకాలమొక్కరీతిగా వెళ్లదుగదా? నీవేమియుఁ జింతింపవలసిన పనిలేదు. పద్మావతిని దండించినఁ గామపాలుండు బ్రతుకునా? కావున నెవ్వరినేమియుఁ జేయకుము. నాకు నా మిత్రుని కళేబరమొక పెట్టెలో నమర్చి యిప్పింపుము. అది దీసికొని నేను తీర్థయాత్రలకుఁ బోయెదనని పలికిన నారాజు అతని యిష్ట ప్రకారము కామపాలుని శరీరము చెడకుండఁ దైలమురాసి సరిపడిన పెట్టె చేయించి యందులో నామొండెములనుంచి యది బుద్ధిసాగరుని కిచ్చెను. దానిని నెత్తిమీఁద బెట్టుకొని మోచికొనిపోవుచుఁ దన భార్యచర్యలెట్లున్నవో చూచెదఁగాక యని తలంచి యటనుండి కొన్నిదినముల కత్తవారింటి కరిగెను.

పిమ్మట శ్రీరంగరాజు బంధువులెందరెన్ని చెప్పినను వినక నామేదరివానితోఁడ బద్మావతిం జంపించి యుప్పపాతరవైచి యా

యపకీర్తి భీతిచేతనే కృశించి కొలఁదికాలములోనే పరలోక మలంక రించెను.

బుద్ధిసాగరుం డత్తవారింటికిఁ బోయినతోడనే మామగారు మిగుల సంతసించుచుఁ దగినసత్కారముచేసి యతనిరాక కొమార్తెకు దెలియజేసెను.

చిరకాలమునుండి మగనిరాక కెదురుచూచుచున్న యాచిన్నది మితిలేనికుతుకముజెంది యారాత్రిఁజక్కఁగా నలంకరించుకొని తదీయదర్శనం బభిలషించుచుండెను. ఇంతలో బుద్ధిసాగరుఁడు రాత్రి భోజనముచేసి కొంతసేపు మామగారితో ముచ్చటించి పిమ్మట తన పెట్టెతోఁగూడ నంతఃపురమున కరిగెను. ఆసుగుణవతి తనపతికెదురేగి పాదంబులం గడిగి శిరమునఁ జల్లుకొని తడియొత్తి సవినయంబుగాఁ గైదండబూని శయ్యాతలము జేర్చినది.

బుద్ధిసాగరుఁడు పద్మావతి చర్యలుచూచినది మొదలు స్త్రీలందరు దుర్మతులేయనియు నమ్మనర్హులు గారనియు నిశ్చయించి యున్నకతంబునఁ దనసతిచేయు నుపచారములన్నియుఁ గపటములే యనిదలంచి పాటింపఁడయ్యెను.

పిమ్మట నాకొమ్మయుఁబతికి విడియముతో సుగంధ ద్రవ్యములిచ్చి వీణాగానంబునఁ గొంతసేపు రంజింపఁజేసి తనతొడలపై నతని పాదంబులఁజేర్చి యొత్తుచు మెత్తనిమాటలచే నతనిచిత్తము గరుగ నిట్లనియె.

ప్రాణేశా! మీరునన్నువిడిచిపోయి పెక్కుదినములైనది గదా! యిన్నిదినములదనుక రాకుండుట న్యాయమే? ఇఁక పదిదినములు జాగుచేసినచో నాకు మరణమే దిక్కగుసుఁడీ! సతులకుఁ బతిసేవకన్న మిన్నయగు వ్రతమున్నదియా? యని యత్యంత వినయ భక్తి విశ్వాసములతోఁ బలుకుచున్న యాచిన్నదాని మాటలన్నియును బూటకములేయని బుద్ధిసాగరుఁడు విశ్వసింపక యూకట్టుచు దాని

చర్యలుగూడఁ బరీక్షింపఁ దలచి యంతలో నిద్రబోవువాని వలె నభినయించుచు బిగ్గరగాఁ గుఱ్ఱుపట్టదొడంగెను.

అప్పుడాఁపడతి మెల్లన వల్లభుని చరణంబులు శయ్యాతలమున జేర్చి చప్పుడుగాకుండ మంచముదిగి పసిండిపళ్ళెరములో ఫలములు మొదలగు నుపహారములువైచుకొని యాయిల్లువెడలి వీధిఁబడి నడువసాగెను. బుద్ధిసాగరుఁడు నిద్రపోలేదు. ఆపూఁబోఁడి ప్రయాణసన్నాహమంతయుఁజూచి దానితోడ వెన్నంటియరుగుచు అన్నన్నా నాతో నిన్నినీతులుఁబలికి యీకలికికూడ నెక్కడికో పోవుచున్నది. ఆహా! స్త్రీస్వభావము.

శ్లో॥ గావోనవతృణానివ గృహ్ణంత్యేతా నవం నవం ।
శంబరస్యచయా మాయా యా మాయా నముచేరపి
బలేః కుంభీనసస్యైవ సర్వాస్తా । యోషితోవిదుః ।
స్త్రీణామగమ్యోలోకేస్మి న్నాస్తికశ్చిన్మహీతలె ॥

గోవులు క్రొత్త క్రొత్త గడ్డిమేయ గమకించినట్లు స్త్రీలు క్రొత్తవానినిమిత్తము ప్రయత్నింతురు. స్త్రీలకు బొందరానివాఁడు పుడమిలోఁ లేఁడు. ఎట్టినీచునితోనైనను గూడికొందురు. శంబరుఁడు నముచి కుంభీనసుఁడు లోనుగాఁగల దైత్యచక్రవర్తులెఱింగిన మాయ లన్నియు స్వభావముచేతనే స్త్రీలయందు సంక్రమించి యుండును.

అని మున్నుచదువుకొన్న స్త్రీచేష్టల గుఱించియున్న శ్లోకంబుల బెక్కుచదువుకొనుచు నది పోయినదారినే పోవుచుండెను. ఆచిన్నది క్రమంబున నూరిబయటనున్న చండికాదేవి యాలయంబున కరిగి తలుపులుతెరచి లోన దీపమువెలిగించి తాదెచ్చిన యుపహారవస్తువులు నివేదనజేసి చేతుఁలుజోడించి యిట్లు ప్రార్థించెను.

తల్లీ! నీవు సమస్తచరాచర ప్రపంచముల కధికారిణివి నీకతంబున జగంబులు నిలిచియున్నవి. నీమహిమ యవాఙ్మానస గోచరంబు నాకోరికప్రకారము నామనోహరుని రప్పించి యభీష్టము తీర్చి

తివి. ఇంక నీమ్రొక్కు చెల్లించుకొనుము. ఇదిగో నాతలనీకు బలి యిచ్చుచుంటిని. ముందుజన్మమందుఁగూడ నాకితండే పతియగునట్లు నుగ్రహింపుము. నాబుద్ధి నెల్లప్పుడు పాతివ్రత్యంబుననుండ నియోగింపుము. అని వేడుకొనుచు నాదుర్గపాదంబులఁ దనతలఁ గొట్టుకొని మేనువిడువఁ బ్రయత్నించినది.

అయమ్మవారా నాతి పాతివ్రత్యమున కచ్చెరువందుచుఁ బ్రత్యక్షమై యోహో సాధ్వీ! సాహసము మానుము నీసత్యమునకు మెచ్చుకొంటి నీకెద్దియేని కామ్యముండినఁ గోరుమని పలికిన విని యక్కలికి మైపులకింప నద్దేవికి మ్రొక్కి పెక్కుతెరంగుల స్తవము జేయుచు నమ్మా నేను నాపతి యనుమతిలేక యేదియుఁ గోరను. ఆయన మాయింట నిద్రపోవుచున్నారు. సెలవైనచో నింటికరిగి యడిగివచ్చెదననుటయు నాశక్తియందుల కియ్యకొని చయ్యన రమ్మని పంపెను. అప్పుడాపడఁతిమబ్బు నుండి వెడలు మెఱపుతీగయుం బోలె నాయాలయమునుండి పురలి యింటికివచ్చినది.

బుద్ధిసాగరుండు గుడివాకిటఁ బ్రచ్ఛన్నముగానిలిచి యామాటలన్నియు వినియున్న కతంబునం దనసతిగుణమునకు మిక్కిలి యానందముజెంది యాసుందరికన్న ముందే చని యెప్పటియట్ల శయ్యయందుఁబండుకొని నిద్రపోవుచున్న వానివలె గుఱ్ఱు వెట్టుచుండెను.

అంత నాచెలంతయు నంతఃపురముజేరి యందు గాఢనిద్రావశంవదుఁడై యున్న పతిని లేపుటకై సంశయింపుచు నమ్మవారు తనకై వేచియున్నదికాన నామెకుఁ గోపమువచ్చునేమోయని వెరపుతో నతనిఁమీద మెల్లగాఁజేయివైచినది. అతడు దద్దిరిల్లి లేచి కూర్చుండి యావలించి కన్నులు నులుముకొనుచు నించుఁబోఁణి నన్ను లేపితి వెందులకని యెఱుఁగనివానివలె నడిగెను.

అప్పుడా చిన్నది యతనికి మ్రొక్కి జరిగినకథయంతయుఁజెప్పి కోరఁదగిన గామ్యము సెలవియ్యుఁడని మగనివేడుకొనెను. బుద్ధిసాగ

రుఁడా ముద్దియను దద్దయుఁ బ్రీతిగాఁగలించుకొని వనితా మనకు నమ్మవారింగోరుటకు సకలైశ్వర్యములు గలిగియున్నవి కావున వా నింగోరక నీవు చేఁయివేసినంత చచ్చినవాఁడు బ్రతుకునట్లు వరమడుగుము. దాన మిగుల నుపయోగముగా నుండుననుటయు నాచెలఁత వల్లెయని క్రమ్మర సత్వరముగాఁబోయి తనకై వేచియున్న కాళిని మగఁడుజెప్పిన వరమిమ్మని యడిగినది.

ఆయమ్మవారు నవ్వుచు జవ్వనీ! నీవుకోరినవరము నాకసాధ్యమైనది. జీవులు పూర్వజన్మకర్మాను గుణ్యముగా మృతినొందు చుందురు. అట్టిదానిని మార్చుటకు నాతరంబుగాదు. అయినను నీయందు గల తాత్పర్యంబునంజేసి యిచ్చుటకు బుద్ధిపుట్టుచున్నది. నాకుఁగల శక్తియంతయు వినియోగపరచి నీవుముట్టినంత నొక్కఁడు మాత్రము బ్రతుకునట్లు వరమిచ్చితిని. ఆపిమ్మట నావరముచెల్లదు ఇంతకన్న నాకుశక్తి లేదు పోపొమ్మనిపలికి యమ్మవారు అంతర్ధానమైనది. పిమ్మట నాకొమ్మయు సమ్మోదమంది యతిరయంబునఁ బతియొద్దకువచ్చి యావర్తమానము తెలియఁజేసినది.

అతండును సంతసించుచుఁ గాంతతో ముచ్చటలాడి చేడియా! నేనీమధ్యను కాశీపురంబునకరిగితిని. అందుండి నీకై కొన్నివింతవస్తువులు తీసికొని వచ్చితిని. ఆపెట్టెలో నున్నవి తీసుకొనుమని చెప్పి తాళముచెవి నిచ్చెను.

ఆబోఁటియు నతిప్రీతితో నాబీగముతీసి పేటికలో చేయిపెట్టి తడిమెను. ఆసుందరి చేఁయితగిలినతోడనే కామపాలుడునిద్ర మేల్కాంచినవానివలె నాపెట్టెనుండి లేచెను. అదిచూచి యాచిన్నది జడిసి బాగుబాగు. ప్రాణనాథా! యిందులో నెవ్వరినో యుంచినగలనినాతోఁ జెప్పితిరా? నేనుజడిసితినిసుఁడీ? దీనిలోనివారెవ్వరని యడుగుచుండగనే యందుండిలేచి కామపాలుఁడు బుద్ధిసాగరునియొద్దకువచ్చి యాసుగుణావతియే తనభార్య పద్మావతియనియు నది తనయత్తవారిల్లే

యనుకొని యక్కలికి నతనిప్రక్కనుండుటకు మిక్కిలిశంకించు కొను చు నతనికిట్లనియె.

ఆర్యా! నీవింత పాపకృత్యమున గొడిగట్టితివేల? నేను నిద్ర వోవుచుండగా నాప్రక్కజేరి నాభార్యతో మాటాడవచ్చునా? అట్టి యభీష్టమున్నచో నాతోఁజెప్పరాదా! నేనేయొప్పింతునేయని కొన్ని నిందావాక్యములాడెను. అప్పుడు బుద్ధిసాగరుఁడు నవ్వుచు నతనితో నతఁడుపరుండి నిద్రపోయినది మొదలు పెట్టికొనుండి లేచువరకు నడుమజరిగిన చర్యలన్నియుఁ దెలియఁజేసి యాచిహ్నముల నెల్ల చూపించుచు మిత్రుని గాఢాలింగనము జేసికొని కన్నుల నానంద బాష్పములు గార్చెను.

అవృత్తాంతమంతయువిని కామపాలుఁడొక్కింతసేపు నిశ్చేష్టి తుఁడై యూరకుండి శిరఃకంపముజేయుచుఁ బుద్ధిసాగరుఁడు తన్నుగు రించిచేసిన కృత్యముల వేఁతెరంగుల స్తుతిజేయుచునిట్లనియె. తమ్ము డా మనమువచ్చి పెద్దకాలమైనది. మనతలిదండ్రులు శోకవార్థిమునిఁ గియుందురు. నాకువారింజూడ మిగుల దొందరగానున్నది. మనదేఁ శము పోవలయుననుటయు నతండుసమ్మతించి అన్నామనము ఒంటిగా బోవుటకంటె భార్యలతోఁ బోయి మనతలిదండ్రులకు వందనముజేసి నచో వారుమిగుల నానందింతురు. కావునఁ జిత్రసేననిచ్చుటికిఁ బిలి పించెదను. ఆమెవచ్చిన తక్షణమే పోవుదమనుటయుఁ గామపాలుం డయ్యోతమ్ముడా! నాకుస్త్రీజాతియందసహ్యము పుట్టినది. నేఁనిక స్త్రీలను జూడను, నాకుభార్యయక్కర లేదని విరక్తిమాటలుచెప్పెను.

బుద్ధిసాగరుఁడామాటలు విని యతనితోఁగామపాలా! నేనును నీవలెనే మొదటస్త్రీజాతియంతయు దుర్మార్గమైనదే నమ్మఁదగినది కాదని యూహించితినిగాని నాభార్య సుగుణావతిగుణసంపత్తిఁజూచి నదిమొదలు అట్టిసంకల్పము మరలినది. స్త్రీలలోఁగూడ యోగ్యులుం

యోగ్యులుందురని దృఢముగాఁ జెప్పఁగలను. దుర్మార్గురాలైన పద్మావతి తానుజేసిన పాపమునఁ దానే చెడిపోయినది. చిత్రసేన మిగుల సాధ్వియని చెప్పఁగలను. ఇప్పుడప్పుడఁతి రప్పింతునని చెప్పి యెట్టకేల కతని నొడంబరచి యప్పుడే నమ్మకముగల పరిచారకుల నత్తరుణిఁ దీసికొనివచ్చుటకుఁ బంపెను.

రాజకింకరులు తదాజ్ఞానుసారముగాఁ బోయి చంద్రగుప్తునకుఁ గామపాలుని యుత్తరమును జూపించి యెక్కుడు విభవముతో నామెందోడ్కొనివచ్చిరి. కామపాలుఁడు చిత్రసేనం గలిసికొని తమపడిన యిడుమలన్నియుఁ జెప్పుకొనుచుఁ గొన్నిదినంబు లందుండెను. ఒకనాఁడు శుభముహూర్తమున బుద్ధిసాగరుఁడు గామపాలుఁడు భార్యలతోఁ దమదేశమునకై ప్రయాణముచేసి నడుమనడుమ శిబిరములు వైచికొని విశ్రమించుచుఁ బోవఁజొచ్చిరి. ఒక్కనాఁడు మధ్యాహ్నమున నొకతోటలోఁ బసచేసిరి. అప్పుడు బుద్ధిసాగరుఁడు దేహబాధకై కొంచెము దూరముగాఁబోయి యొక చెట్టుక్రిందఁ గూర్చుండెను. అట్టిసమయంబునఁ బూర్వము వచ్చినపక్షులు రెండును ఆచెట్టుమీఁదవ్రాలి యిష్టములగు పలుకులు చెప్పుకొనఁదొడంగినవి.

అప్పు డాఁడుపక్షి మగపక్షితో రేడా! యీతోటలోఁదిగిన వారెవ్వరని యడిగెను. మగపక్షి తన్వీ! వీరొకదేశపు రాజకుమారులు. ఈరాత్రి వీరిలో గామపాలుండను వానిభార్య చిత్రసేన యను చిన్నది క్రీడాలసయై నిద్రించు సమయంబున రవిక విడియున్న యామె స్తనాంతరమందొక సర్పము విషము గ్రక్కిపోవును. అయ్యబల యొత్తిగిలినంత పాలిండ్లంగల నఖక్షతరక్తమ్మునఁగలిసి యావిషము తలకెక్కి యక్కలికి ప్రాణంబులం బాయునని చెప్పి యప్పతంగంబంగనతోఁ గూడ నెగిరి యెందేనింబోయెను.

బుద్ధిసాగరుం డాపక్షి వాక్యంబులువిని మరల చింతవహించి దానిం దప్పించు నుపాయము వెదకుచు నొరుల కెఱింగించినవారు

రాయి యగుదురను మాటవినుటచే నవ్విధ మెవ్వరికిం జెప్పక యా రాత్రి యెట్లో వారిప్రాంతముననే పండుకొని నిద్రింపక యాపాము రాక కెదురుజూచుచుండెను.

అంత నర్ధరాత్రిసమయంబున విచిత్రపటకుటీరములో రతి క్రీడావసులై చిత్రసేనా కామపాలుని గాఢనిద్ర జెందియుండ నొక కుండలి భూవివరంబునుండి పైకివచ్చి బుసకొట్టుచు నట్టిట్టి యాచిత్ర సేనా స్తనాంతరమందు విషము గ్రక్కవచ్చిన దారింబట్టిపోయినది. ఆహా! పక్షివాక్య మెంతసత్యమైనదో చూడుము? అప్పుడు బుద్ధిసాగ రుఁడు మెల్లనబోయి యాపల్లవపాణి దొర్లకుండ దననాలుకకు గుడ్డచుట్టకొని తదీయ స్తనాంతరమందున్న విషమునద్దుచుండెను.

అప్పుడు చిత్రసేన దైవయత్నమున మేల్కొని తన చన్నులు నడుమ నాలుకచే నద్దుచుండుట దెలిసికొని యదరిపడిలేచి యెవ్వడో నన్నుఁ బట్టుచున్నవాఁడని యరచెను. ఆరొదచేఁ గామపాలుండు మేల్కొని యేమియేమి యని యడిగెను. పిమ్మట నాకొమ్మ బుద్ధి సాగరుని నాసవాలుపట్టి బుద్ధిసాగరుఁడుఁ దన్నుగామించి పట్టుచుండె ననియు నింతలోఁ దనకు మెలకువచ్చినదనియుఁ జెప్పి యతనినిందింపఁ దొడగెను.

కామపాలుండు బుద్ధిసాగరుని యందుగల మైత్రిచే నేమియు ననలేదు. కోపదృష్టితో నతనింజూచి శిరఃకంపముచేసి యతనితో మాట్లాడుట మానివేసెను. "మిత్రదండమభాషణం" అనునట్లు స్నేహితునితో మాట్లాడక పోవుటయే శిక్ష కావున నట్టికోపమునఁ దనతో మాట్లాడకున్నను బుద్ధిసాగరుఁడు గోపగింపక నతనితోడనే విడువకపోవుచుండెను. అట్లు బుద్ధిసాగరుఁడు తన్ను విడువకవచ్చు చుండఁ జిత్రసేనయొక్క. బోధచేఁ గామపాలుం డొక్కనాడటుపైనఁ దనతో రాఁగూడదని భృత్యముఖంబుగాఁ దెలియజేసెను. కటకటా రాజులు దుర్మదాంధులుగదా? అందులకు జింతించి బుద్ధిసాగరుం డయ్యో! నాకీ యాపదయేటికివచ్చినది? నిజముచెప్పిన నేను శిల

యగుదును. చెప్పనిచో నామిత్రునికి నాయందుఁ గోపము విడువక పెరుగుచున్నది. ఏమిచేయుదును? యిట్టిచింతతో మిత్రునికి శత్రువునై యుండుటకంటె రాయిగా నుండుటయే మేలని తోచుచున్నది.

కామపాలునికి నాయందుఁ గినుకయుండుట తప్పుగాదు. తన భార్యను గామించిన వానియందెవ్వరికి నీర్ష్యయుండదు ? దైవాగతమైన యీసూక్ష్మ మెఱింగికొన నతనికి శక్యమా ? ఇంతకు నాపురాకృతం బిట్లున్నది యథార్థము జెప్పినచో నిప్పుడు నేనుబొందు దుఃఖమతనికిఁ రాగలదు. నాకు శిలయయ్యేకు యోగమున్నది. విధిగతి మహానుభావులైన రాజులే దాటలేకబోయిరి. ఇక మాబోటివారన నెంత.

శ్లో. రామేప్రవ్రజనం బలేర్నియమనంపాండోస్సుతానాం వనం
వృష్టీనాంనిధనం నలస్యనృపతే రాజ్యాత్పరి భ్రంశనం
కారాగారనిషేవణంచ మరణం సంచిత్యలంకేశ్వరే
సర్వఃకాలవశేన నశ్యతి నరఃకోవా పరిత్రాయతే.

అని యనేకప్రకారముల నాలోచించుకొనుచు మెల్లన నతనియొద్దకుఁబోయెను. కామపాలుండును వానిమోముచూడనొల్లక పెడమొగముపెట్టి యతనితో మాట్లాడలేదు. అట్టియవమానమునకుఁ జింతించుచు బలాత్కారముగా నతనిచేయి పట్టుకొని మిత్రుడా ! నీకు నాయందిట్టియసూయ యుండఁదగినదే కాని నాచెప్పఁబోవు మాటలు విని పిమ్మట నీయిష్టమువచ్చినట్లు చేయుము. పూర్వస్నేహమునైనను స్మరించి నావచనంబులు సాంగముగా నవధరింపుము. నావచనాంతమే మదీయ జీవితాంతములోఁగూడ నీస్నేహాంత మగుచున్నదని పలికినఁ గామపాలుం డీర్ష్యతోడనే యందలియర్థంబు గ్రహింపలేక యది యెద్దియోచెప్పుమనునట్లు శిరఃకంపముతో సూచించెను.

పిమ్మట బుద్ధిసాగరుఁడు గన్నులనీరుగ్రుంచుచుఁ గామపాలునితో శ్రీరంగపురప్రాంతమం దారామములో శయనించియుండఁ బక్షులు

చెట్టుమీఁద వాఁ్రలి సంభాషించుకొనిన తెరంగును కోటబురుజువిరిగిన రీతియు భోజనసమయంబునఁ దొలిముద్దయందు జీవముల్లు వచ్చుటయుఁ దాంబూలములోఁ బురుగులుండుటయు నవి తాను గ్రహించిన విధంబును భార్యచేతిలో మృతినొందుటయు మరల నాపత్తులే తాను దేహబాధకై గూర్చుండియుండగాఁ జెట్టుమీఁదవాఁ్రలి సంభాషించుకొనినమాటలు నంపులకై నాలుకకు గుడ్డకట్టుకొని యావిషంబద్దినవిధముఁజెప్పి మిత్రుఁడా! యీరహస్యము పక్షి శాపభీతిచేఁ జెప్పకుంటిని. ఇదియేసుమీ కారణము. నాయందనుగ్రహముంచుమీ యనుచుండ నంతకుమున్నె పాదములు మొదలుకొని వ్యాపించుచున్న పాషాణత్వము వక్త్రభాగము నాక్రమించుటచేఁ బిమ్మట మాట్లాడుటకు వీలులేకపోయినది.

అట్లు జరిగిన కథయంతయు జెప్పి పక్షిశాపంబున రాయియై యున్న బుద్ధిసాగరుని యాకారమునుఁజూచి కామపాలుఁడు గుండెలు బాదుకొనుచు అయ్యో! ప్రాణమిత్రుఁడా! నిన్నూరక నిందించితినే! కటకటా! నావంటిపాపాత్ముఁడెందయినంగలడా? అన్నన్నా? యుపకారముచేసిన నిన్నూరక రాయిగాఁజేసిన నాపాతకంబునకంతముండునా? యమకింకరులు నన్నేనరకమునఁ బడవైచి వేధింతురో? అయ్యో తెలిసికొనలేకపోతినే? యీవచనాంతమే జీవితాంతమంటివి. ఛీ! ఛీ! నాయిూర్ష నన్నంతశ్రద్ధగావిననిచ్చినదిగాదు. స్త్రీమూలముననేగదా నాకీయాపదవచ్చినది. కపటస్వభావముగల యొకస్త్రీనిమిత్తము ప్రాణమువంటి మిత్రునిజంపుకొనిన నావంటిమూర్ఖుఁ డెందేనిగలడా? నిజముగా నతనికట్టియుద్దేశ్యమున్నను నాచిన్నదానిని సమర్పింపకుండ వచ్చునా! దానినాకతండేగదా పెక్కుడుములుపడి సంఘటించెను అక్కటా! నాకై యతఁడుపడినపాట్లు తలంచుకొనినంత శరీరము వివశమగుచున్నది. సీ! ఇటువంటి మిత్రునిజంపి బ్రతికియుండుటకంటె నీచ

మున్నదా యని తలఁచుచు బుద్ధిసాగరా! యని పెద్దయెలుంగున నేడ్చుచు నతనిపాదంబుల తనతలమైచి బద్దలుగొట్టుకొనఁ బోయెను.

అప్పుడతని సాహసమునకు వెరచి చిత్రసేనవచ్చి చేతులుఁ బట్టుకొని యనేకవిధముల నోదార్చినది ఆమాటలేమియు బాటింపక బోఁటీ! దూరముగానుండుము. మిత్రఘాతకుండగు నన్ను ముట్టకుమని పలుకుచుఁ దనతల నూరక యతనిపాదంబుల మైచి రక్తంబు గారఁ గొట్టుకొనదొడంగెను.

ఆవృత్తాంతమంతయును విని సుగుణావతి గోలు గోలున నేడ్చుచు గుండెలు బాదుకొనుచు నచ్చటికివచ్చి శిలారూపముగానున్న బుద్ధిసాగరునింగాంచి హా ప్రాణనాథా! యని పెద్దకేకలుపెట్టి యావిగ్రహమును గౌఁగిలించుకొని బిట్టుగా నేడువఁదొడంగినది. ఆసుగుణావతింజూచి కామపాలుఁడు అయ్యో సాధ్వీ! నీమగని నిష్కారణము జంపితిని పాతివ్రత్యధర్మములచేత నన్ను బ్రతికించితివి. నీవు నీపతిని బ్రతికింపలేవా? నాకై కాదా? నిన్నమ్మవారి నట్టివరమువేడుకొమ్మనెను అతని జీవితాంతమువఱకు నానిమిత్తమే శ్రమపడెను. కటకటా! నేను క్షణములో మేనువిడిచి లోకాంతరమున నతనితోఁ గలిసికొందును. అతనితో నీవేమైనం జెప్పగల వార్తలుండిన వక్కాణింపుమని యనేకప్రకారముల శోకించుచుండెను.

మగఁడు పరదేశమందుండి రాకున్న దుఃఖించుచు శక్తికి నతఁడువచ్చినతోడనే తనప్రాణంబుల బలియియ్యమొక్కి యట్లుచేయఁ బూనిన సాధ్వి నిజముగా మగఁడు రాయిగానున్న సమయములో నెంతచింతించునో యూహింపఁదగినదే? ఆసుగుణావతి శోకముతో నాతాయిం గౌఁగలించుకొనుచుఁ గామపాలునికన్న ముందే ప్రాణములు విడువఁదలంచెను.

ఆసమయంబునఁ గామపాలుండయ్యో? తనకుమిత్రహత్యదే

గాక స్త్రీహత్యగూడ సంప్రాప్తించునని వెరచుచు నాతరుణిం బట్టుకొని శోకోపశమనంబు జేయుచు నిట్లనియె.

సాధ్వీ! మనమిద్దరమితనికై యూరకవచ్చిన నేమిలాభమున్నది? అతనిబుద్ధిబలముచే నన్నుబ్రతికించుకొనెను. మనము గూడ నీయడవిలోఁ దపముచేసి యతని శిలాత్వము బాపుదము. నీచిత్తశుద్ధి వలన నతండు తప్పక బ్రతుకఁగలఁడు. నీవింక నిష్టబూనియుండుము. నేనును యోగంబవలంబించి యుండెదనని చెప్పిన నప్పఁడతియునతండు చెప్పినయుపాయమునకు సంతసించుచు నప్పుడె శృంగార వేషంబు దీసిపారవైచి యోగినివేషమువైచుకొని యాప్రాంతమందే తపము జేయుచుండెను. కామపాలుండును ఆసేనతోఁ గూడ జిత్రసేనను బుట్టినింటికనిపి యోగియై యాయడవియందే సంచరించు చుండెను.

గోపాలా! నీవుచూచినరాతివిగ్రహ మాబుద్ధిసాగరుని యాకృతి సుమీ. వెంట్రుకలు శరీర భిన్నములైనవి కావున శిలకాలేదు. దానంజేసి రాతివిగ్రహమునకు జుట్టున్నది. ఇదియే దీనివృత్తాంతము అనిచెప్పిన మిగులసంతసించుచు నాగొల్లవాఁడు అయ్యో! పాపముప కారముచేయఁబూనిన బుద్ధిసాగరుఁడిట్లు ఱాయియయ్యెనే! కటకటా! యాతండీలాగున నెంతకాల ముండఁదగినది? వీనికెప్పటికేని శాపవిమోచనమగునా? త్రికాలవేదులైన మీరెఱుంగరాని యర్థంబుండ దని యడిగిన వాని దయాహృదయంబునకు సంతసించుచు నమ్మణిసిద్ధుండిట్లనియె.

గోపా! నీకుసంతసమేని వానికినిజరూపము వచ్చునట్లు నేను చేయఁగలను. చూతువుగానిరమ్మని యతనితోఁగూడ నాశిలా విగ్రహముకడకుఁబోయి దానిపై మంత్రాక్షతలు జల్లినంత బుద్ధిసాగ రుఁడు పాషాణత్వమువిడిచి నిజరూపముధరియించి యమ్మణిసిద్ధునిచే దనకు శాపవిమోచనమైనట్లు తెలిసికొని యతని పాదంబులం బడి

యనేకప్రకారముల వినుతించెను. అమ్మణిసిద్ధుఁడు బుద్ధిసాగరుని లేవనెత్తి గారవించి తనశిష్యునికిఁ దెలియుటకై యతనిచే నతని వృత్తాంతమంతయు మరలఁ జెప్పించెను.

అప్పుడు గోపాలుఁడు దమగురువుగారి యద్భుతశక్తికి మెచ్చు కొనుచు నాయడవిలో యతివేషముతో దిరుగుచున్న కామపాలుని సుగుణావతిని వెదకి యచ్చటికిఁ దీసికొనివచ్చెను. వారిగువురు నిజ రూపము ధరించియున్న బుద్ధిసాగరునింజూచి యానంద పారావారం బున దేలుచు నతనింగౌఁగలించి బెద్దయుంబొద్దు మాటలురాక కంఠంబును డగ్గుత్తికలు జెందఁ గన్నుల నానంద బాష్పములు గ్రమ్మ దుఃఖముల నిరోధింప నేమియుంబలుకక యట్లేయుండిరి.

అంతకొంతసేపునకు నాముప్పురు మణిసిద్ధుని గోపాలునిఁ బెక్కుగతుల స్తుతిజేసి వారియనుమతివడసి తమదేశంబునకుఁ బోయి తల్లిదండ్రుల కానందము గలుగఁజేసిరి.

పదిరెండవమజిలీ.

# చేపనవ్వినకథ.



మణిసిద్ధుండును గోపాలునితోఁ బదిరెండవమజిలీచేరియఁదొక తోటలో నినుపచిక్కముల వ్రేలఁగట్టబఁడి స్త్రీల యాకారముతో నున్న కొందఱఁ బురుషులంగాంచి వారివృత్తాంత మెఱింగింపుమని యడిగిన నగ్గొల్లనికి నయ్యతిపుంగవుండు దన మణిమహిమచే నంత యుఁ దెలిసికొని యక్కథనిట్లు సెప్పదొడంగెను.

గోపా! యీపురము కళింగదేశమునకు రాజధానియైన భద్రా పురమని పిలువంబడుచున్నది. దీని సింహధ్వజుఁడను రాజు పరిపాలి

యనుమంత్రితోఁగూడి పాలించుచుండెను. ఒకనాఁడు గొందఱు పల్లె వాండ్రు తమకుఁదొరకిన యద్భుతమైన చేప నొకదాని జీవముతో నుండగానే పారితోషికమందు నాసతో నారాజునొద్దకుఁ దీసికొని పోయిరి.

ఆసింహధ్వజుఁడు వింతవస్తువులనిన మిగులనంతసించును. దా నింజూచి వెఱగుపడుచు గ్రామములోనున్న పెద్దమనుష్యులకు మిత్రు లకు సామంతులకు వార్తనంపి యావింత చేపను జూపించెను. దానిం జూచినవారెల్ల దమజీవితకాలములో నిటువంటి పెద్దచేపనుఁ జూడ లే దని చెప్పదొడఁగిరి. అట్లు దానినిఁ గొంత సేపుంచి యారాజు అంతః పురంబునకు బంపి తనభార్యలకుఁగూడ నావేడుక జూపింపనిశ్చయించి యాపల్లెవాండ్రతో నోరీ! యిది యాఁడుదా? మగదా! యని యడిగెను.

ఆరాజునకు మిగులచక్కని వారును యౌవనము గలవారును భార్యలు పెక్కండ్రుగలరు. అతఁడు స్త్రీలచర్యలు కడువిచిత్రములని యెంచి వారిశుద్ధాంతమునకుఁ బోతుటీఁగ నేనియుఁ బోకుండఁ గాపు పెట్టించెను. ఆచేప మగదియైనచో లోనికిఁ బంపఁగూడదనియే యట్ల డిగెను.

ఆపల్లెవాండ్రు రాజుతో నయ్యా! చేపలలో స్త్రీపుం వివక్ష గనుపెట్టుట కష్టము. ఇది యాఁడుదో మగదో మాకుఁ దెలియదని చెప్పిరి. ఆమాటలు విని యారాజు దాని నంతఃపురమునకుఁ బంప వచ్చునా? పంపకూడదా? యని యాలోచించుచుండ నగముప్రాణ ముతోనున్న యాచేప పక్కునవ్వి గిలగిలఁగొట్టుకొని కొంత సేపటికి బ్రాణములు విడిచినది.

ఆచేప నవ్వుటచూచి సభవారెల్లరు వెరగుపడిరి. అప్పుడా రాజు సందేహమందుచు మంత్రింజూచి యార్యా! ఈచేపయేమిటికి

నవ్వెనో చెప్పఁగలవా? యని యడిగెను. ఆమాట విని ప్రభుకీర్తి, రాజా! సాధారణముగా మనుష్యులు నవ్విన కారణమే తెలిసికొనుట దుర్ఘటము మఱియు విజాతియైన చేప నవ్విన కారణ మెవ్వఁడు చెప్పఁ గలడు. తఱుచు బాలభావముగల రాజు లీలాటి ప్రశ్నములే వైచి ప్రధానుల జిన్నపుత్తు రిది తగనిపని యని యాక్షేపించెను.

ఆమాట విని కోపించి యారాజు మంత్రీ! చేప యూరక నవ్వదు. కారణమేదియో యుండకపోదు. ఆకారణముచెప్పుటకై నీకు నారుమాసములు మితి యిచ్చితిని. అప్పటికిఁ జెప్పకపోయితివేని ని న్నుఱిదీయింతు నని కఠినముగాఁ బలికి సభ చాలించి యప్పుడే యతం డంతఃపురమునకుఁ బోయెను.

అప్పు డచ్చటివారెల్ల రాజశాసనము కడు కూ్రరముగానున్న దని నిందించిరి. మంత్రియు నేమియుం బలుకక చిన్నబోయి రాజు గారి నొవ్వనాడుటచేతనే యిట్టియాజ్ఞ యిచ్చెనని పశ్చాత్తాపమొం దుచు విచారముతో నింటికిఁబోయి చింతాసదనంబునం బడుకొని పెక్కు తెరంగుల ధ్యానించుచుండెను.

కొంతసేపునకు భోజనమునకు లెమ్మని పరిచారకులు వచ్చి పిలిచిరి. అతఁడు వారికి నుత్తరమే చెప్పలేదు. దాన శంకించు కొనుచు వాండ్రు అతనిభార్యతో నామాటచెప్పిరి. అప్పుడప్పడఁతి పతియొద్దకువచ్చి భోజనమునకు లెమ్మని పిలిచినది. ఆమెమాటలు పాటింపక చింతింపుచుండెను. పిమ్మట నామంత్రికూఁతురు లవంగి యనునది మాతృబోధచే వచ్చి తండ్రిని లేపెను. దానితో నతఁడు నేను భోజనముచేయను. మీరు భుజింపుఁడు అని మాత్రమే చెప్పెను గాని యెంతయడిగినను కారణము చెప్పఁడయ్యెను.

అప్పు డాలవంగి ప్రద్యుమ్నుఁడను తన యన్న యొద్దకుఁ బోయి అన్నా! మనతండ్రి యెద్దియో విచారముతోనుండి భోజ

నమునకు లేవకున్నాఁడు. ఎవ్వరుపోయి లేపినను గారణము చెప్పక యూరక లేవననుచున్నాఁడు. నీవుకూడ వచ్చి పిలువుము. నీతో నేమైన మాట్లాడునేమో యనుటయు నాప్రద్యుమ్నుఁడు వేగముఁ దండ్రియొద్దకువచ్చి యతనిప్రక్కలోఁగూర్చుండి నాయనా! భోజనమునకుఁ లేవననుచున్నారఁట కారణ మేమి? యేదియైన మావలనఁ దీర వలసిన కార్యమున్న జెప్పుఁడు. ప్రాణంబు లిచ్చియైనఁ జేయుదుము. ఊరకిట్లు పట్టుపట్టవచ్చునా? చిన్నవారము మేము కోపగించినప్పుడు మీరు దీర్చవలసినదికాని మిమ్ముఁ దేర్చమేమెంతవారము లెండని ప్రార్థించిన విని మంత్రి పుత్రుంగౌఁగిటలోఁ జేర్చుకొని ప్రద్యుమ్నా! మీరందరు పిల్లవాండ్రగుటచే మీతోఁ జెప్పలేదు కోపగించికాదు. ఏమని చెప్పుదును? నాకాయుర్దాయ మిఁక నారుమాసములున్నది. ఈయవివేకపురాజు తానడిగిన ప్రశ్నము చెప్పుటకు నారుమాసముల మితియిచ్చి చెప్పలేకపోయినచో నన్నురిటియుటయే కాక మన యాస్తియంతయు లాగికొని మిమ్మునందరను లేవఁగొట్టునఁట! ఇట్టి దారుణ మెందైన నగలదా?

అన్ననా! చేపనవ్వుటయేమి, ఆరహస్యము చెప్పకపోయిన నన్నుఱిదీయుటయేమి? చేపనవ్విన కారణమెవ్వఁడు చెప్పఁగలఁడు. ఈలవంగికిఁ బెండ్లియైనఁ జేయలేక పోయితిని. నీవు గడు పిన్నవాఁడవు నాయనంతరము మీరేమైపోయెదరో యని విచారించుచుంటిని. ఇట్టివిచారముతో నుండ నోటికన్నము రుచించునా? యని పలికి పుత్రుం గౌఁగలించికొని యేడువసాగెను. లవంగియు ప్రభుకీర్తి భార్యయు నామాట విని విచారింపఁదొడంగిరి.

అప్పుడు ప్రద్యుమ్నుఁడు తండ్రి నూరడింపుచు మీరిప్పు డూరకచింతింపకుఁడు. ఇంకనారుమాసములుమితియున్నదిగదా! దైవ మింతలో మనకేదియైన నుపాయము తోపింపఁడా? దైవయత్నము లేక యేకార్యము జరుగదు! నేను దేశాటనముచేసి యాకారణము

తెలిసికొనివచ్చెద. లోకమున బుద్ధిమంతులుండకపోరు కావున నాకు సెలవియ్యుఁడు మీరు భోజనమునకు లెండని పలికినఁ బుత్రునిధైర్యమునకు సంతసించి పత్రిభుక్తి లేచి భుజించెను. అప్పుడే ప్రయాణము నకు సవరించుకొనుచున్న యన్నగారినిఁ జూచి లవంగి యిట్లనియె.

అన్నా! నీవెన్నఁడును ఇల్లువిడిచి యిడుములఁ బడిన వాఁడవు కావు. ఒంటిగా దేశాటనము చేయలేవు. నేనుఁగూడ నీతో వచ్చెదను తీసికొనిపొమ్మని చెప్పిన నతం డొట్టకేల కియ్యకొనెను. వారిరువుర ప్రయాణమును విని మంత్రి విచారముతో నిట్లనియె.

అయ్యో! నాపసికూనలారా! రాజు నన్నారుమాసముల పైన నుఱితీయించును. మిమ్ముఁజూడనిచో నిప్పుడె నాప్రాణములు పోఁగలవు. ఈయారుమాసములైనఁ గన్నులకుఁ గనఁబడకుండ దూరముగాఁ బోయెదరా? దైవ మెట్లుచేయఁదలఁచిన నట్లుచేయకమానఁడు మీరు పోవల దింటనే యుండుఁడని పలికినఁ దండ్రి నెట్లో సమాధానపరచి మంచి లగ్నమున వారిరువురు పరదేశమునకుఁ బోయిరి.

వారి కశ్వగమనమున మిగుల నేర్పుగలిగియున్నది. మంచి వేగముగల గుఱ్ఱములెక్కి సాయంకాలమునకే విశేషప్రయాణము చేసిరి. నడుమనడుమఁ జిన్నగ్రామములలో నివసించుచు నాలుగుదినములకు నమరావతి యనుపట్టణము చేరిరి. అందు సత్రములో బసచేసి యాయూరివింతలన్నియుఁ జూచుచు దమకు బుద్ధిమంతులని తోచినవారి నెల్లఁ జేప నవ్విన కారణమడుగుచుఁ బదిదినములందుండిరి. వారిమాట వినినవారెల్ల పరిహాసముచేయుచు నీపాటిపనికై యింత ప్రయత్నము చేయవలెనా? యని నవ్వసాగిరి.

మఱియొకనాఁడు సాయంకాలమున నూరంతయుఁ దిరిగివచ్చి పద్మ్యమ్నుఁడు లవంగి కిట్లనియె. అమ్మాణీ! మన మీయూరు వచ్చి పదిదినములైనది. మనమాట యెవ్వరినడిగినను నవ్వుచుండిరిగాని తగు

నుత్తరము చెప్పరైరి. అంత బుద్ధిమంతులీయూర లేనట్లుతోచు చున్నది. మఱియు కోటగోడమీఁదనొక శాసనమునుజూచితిని. ఈపట్ట ణపు రాజుకూఁతురు ప్రభావతియనునది సకలవిద్యలయందుఁ బ్రౌఢు రాలనియుఁ జతురంగములో నామె నోడించినవారికే పెండ్లిచేయుదు మనియు వ్రాయఁబడియున్నది. ఓడిపోయినచో నుఱిదీయుదురఁట! దానితో జతురంగమాడి యనేకు లురిదీయబడిరి. మనయిరువురకుఁ జతురంగమందు మిగుల పాటవముగలదుగదా? నేను రేపుపోయి దాని నోడించివత్తునే? యనుటయు నతని కాలవంగి యిట్లనియె.

అన్నా! మన మొకకార్యమునకై వచ్చి వేరొకకార్యమునకుఁ బ్రయత్నింపనేటికి? మనపనియైనవెనుక నెన్నికార్యములేనియుఁ జేయ వచ్చును. ఇదియునుంగాక యొకవేళ నోడిపోయినచో నేమిచేయనగు? జయాపజయము లెవ్వరుచెప్పఁగలరు? పోవలదనుగుమని పలికిన నతండు నవ్వుచు నన్నుఁ జతురంగములో నోడించువారీమూఁడు లోకములలోఁగలరా? నాచాతుర్యము నీ వెఱుంగనిదా? ఎఱింగియు నట్లనినచో నేనేమిచెప్పుదునని పలుకుచు నెట్టకేల కాపాలఁతి నియ్య కొనఁజేసెను.

అంత మరునాఁడతఁడు చక్కఁగా నలంకరించుకొని కోటయొద్ద కరిగి యచ్చటనున్న యుద్యోగస్థులతో నేనుప్రభావతితోఁ జదరంగ మాడెదననియు నచ్చటికిఁబోవ నుత్తరమీయవలయుననియుఁ జెప్పు కొనెను.

ఆమాట లాయుద్యోగస్థులు విని అయ్యో కుమారా! నీ రూపముజూడఁ గడువింతగానున్నది. నీకుబ్రతుకునందాస లేదాయేమి? యూరక యేలచావఁబ్రయత్నించెదవు? అవిగో పుఱ్ఱెలనుచూడుము. నీవంటివారేవచ్చి ప్రభావతితోఁ జదరంగమాడి యోడిపోయి యుఱి దీయఁబడిరి. పోపొమ్మనిపలికిన నతండు నవ్వుచు అయ్యా నాబ్రతుకు జోలి మీకేల! నేను ప్రభావతితోఁ జదరంగమాడవచ్చితిని. యీ వార్త రాజుతోఁ జెప్పుడు. అంతియ మీరుచేయునది లేనిచో నా

శాసనమేటికిందు వ్రాసితిరి? అని ధైర్యముగాఁబలికిన వారు, బాబూ! మాకేమి? నీకై చెప్పితిమిగాని వేరుకాదు నీయిష్టము అనిపలికి యావార్త రాజునకుఁ దెలియఁజేసిరి. జయభద్రుఁడును ఆవార్త కూఁతునకుఁ దెలియఁజేసెను.

ప్రభావతియుఁ బెక్కుదినములనుండి యెవ్వరు దనతోఁ జదరంగమాడకుండుటచే నప్పుడు మిగుల సంతసించుచుఁ బ్రవేశపెట్టవచ్చునని క్రిందియధికారుల కాజ్ఞాపత్రికలంబంపినది. వానిం జూచుకొని యాయుద్యోగస్థులు ప్రద్యుమ్నుని నొకదాదివెంట నంతఃపురమునకు బంపిరి. అతనిం జూచినవారెల్ల కాలముమూడినవానిగాఁ దలంచుచుఁ జింతింపఁదొడంగిరి.

ఆ దాది ప్రద్యుమ్నునిఁ జతురంగకేళీగృహంబునకుఁ దీసికొనిపోయి యొకపీఠంబున గూర్చుండఁబెట్టెను. అతం డాయింటియలంకారమున కచ్చెరువందుచుఁ బ్రభావతిరాక కెదురుచూచుచుండెను.

ఇంతలో నొకబంగారుబల్లపై నమర్చిన గళ్ళబల్లనుఁ బల్లవపాణులు కొందరుదెచ్చి ముందుపెట్టిరి. అంత నాకాంత యశేషపురుషమోహనవేషంబుతోఁ జెలికత్తియలచేతు లూతగాఁబూని యుచ్చోటికరుదెంచి యతనిచూపులకు మిరుమిట్లుగొలుపుచుఁ దళుక్కురని మెఱయుచు నాబల్లకవ్వలనున్న పైడిగద్దియం గూర్చుండి యూడిగంపు చేడియ లిరుగడనిలిచి వింజామరలువీవ నాప్రద్యుమ్నునితోఁ జతురంగ మాడఁదొడంగినది.

అమ్మదవతి మొదట నతని నేమియుఁ బల్కరింపక తనవాలు దళ్కుచూపులొకసారి యతనిమొగముపైఁ బరగించినది. దానంజేసి యతని హృదయము చెదరిపోయినది. వెఱ్ఱివానివలె నొడలెఱుంగక యక్కురంగనయన సోయగంబువలక్షించుచు నాటయందించుకేనియు జ్ఞానముంచలేదు. మరియు నత్తరుణి కక్షమూలకాంతి కంచులిని

జించుకొని బయల్పడఁ జేమె త్తి బలముసద్దునప్పు పతనిదృష్టియంత యుఁ నా ప్రాంతమందే నంచరించుచుండినది. గెలుపు సంతసంబున వేగిరించి యమ్మించుఁబోఁణి బలముసవరించునెడ రత్నపుటుంగర ముల రంగునకు మెఱుఁగిడునంగుళులు దన కరంబునకుం దగిలెనేని మేనెల్లం బులకలుబొడమ నతండంతటితోఁ దనమేను సార్థకమైనట్లు సంతసించును. ఈతీరున నాప్రద్యుమ్నుఁ డాపరిభావతీరూపవిలాస విభ్రమము లను వలలోఁబడి కొట్టుకొనుటం జేసి వరుస రెండాట లోడి పోయెను.

అప్పుడతఁడు తనమోసము తెలిసికొని యౌరా! దీనితో మగ వాఁడు చతురంగమాడి గెలువలేడు. ఇది యాటయందు మిగులపాట వము లేనిదైనను పురుషులకుఁ దనరూప మెరవైచి వశముచేసికొను చున్నది. అన్నన్నా! నిష్కారణము రెండాట లోడిపోయితినే? ఇదిగో మూడవయాట తెలివితో నాడి సులభముగాఁ గట్టివేయుదునని యాడి యాయాట నశ్రమముగాఁ దానిం గట్టివైచెను.

అయినను రెండాటలు వరుసఁ బ్రద్యుమ్నుండే యోడెను గావున సంపూర్ణముగా నోడినట్లు తలంచి యయ్యువతి యతని రాజ భటుల యధీనముచేసినది.

ప్రద్యుమ్నుఁడు తన్ను రాజభటులు దీసికొనిపోవ, నయ్యో! నేను బూర్తిగా నోడిపోలేదు. శాసనమున వ్రాసినట్లుగాక వేరొక లాగునఁ జేయవచ్చునా? న న్నెట్లురిదీయుదురు? యీసారి మరల నాడినచో నన్నియాటలు నేనే కట్టివేయఁగలను. ఈమాట రాజుతోఁ జెప్పుఁడని యాకింకరులను వేడుకొనుటచే వార లావర్తమానము రాజుగారికిఁ దెలియఁజేసిరి.

ధర్మాత్ముఁడైన జయభద్రుఁ డావార్త విచారింపదగినదే యని యూహించి యాసందియము దీరువఱకు బ్రద్యుమ్ను నుఱిదీయవల దని యాజ్ఞచేసెను. ఆవార్త యూరంతయు వ్యాపించుటచే వారు లందరు గుంపులుగాఁగూడి చెప్పికొనసాగిరి.

లవంగి యన్నవర్తమానము వినిమిగులవిచారించుచు నయ్యో నేనన్నట్లయైనదే! దానియందమేమో యతనిమోసపుచ్చినది. కాని నిజముగాఁ జతురంగములో నతని నోడించువారులేరు. అగ్నిచెంత బెట్టిన వెన్నవలె నెంతధైర్యశాలియైనను మగవానిమనసుఁ గాంతల చెంతఁ గరుగకమానదు. కానిమ్ము ఉరిదీయుట మూఁడు దినముల వఱకు నాపిరిగదా! నేనురేపుపోయి దానినోడించి యతనిచెర విడిపించెదనని తలంచి మఱునాఁడుదయంబున నౌరులకుఁ దెలియకుండఁ బురుషవేషమువైచికొని యాకోటయొద్దకుబోయి యాయుద్యోగస్థులతో నయ్యా! నేను రాజపుత్రికతోఁ జతురంగమాడ వచ్చితిని. లోనికిఁ దెలియఁజేయుఁడని పలికినది.

ఆమాట వినినవారు అయ్యో మూర్ఖుఁడా! నిన్నను వచ్చినవాఁడు నీకేమికావలయును. పోలిక మీయిరువురది యొక్కటిగానేయున్నదే! అతనికైన ప్రాయశ్చిత్తము నీవువినలేదు కాఁబోలు! అయ్యయ్యో! ఒకరికైనమరణమునుఁజూచియు మరల రెండవవారామెతోఁ జతురంగమాడవత్తురేమి? మాకుఁజూడ గష్టముగానున్నది. ఆమెతో మనుష్యమాత్రుఁడు చతురంగమాడి యోడింపలేడు. వట్టిభ్రాంతి యేల పొందెదవు? వచ్చినదారింబట్టి పొమ్మనిపలికిన వారిమాటలు పాటిసేయక నేను ప్రభావతితోఁ జదరంగమాడకమరలనని గట్టిగాఁ బలికినది.

అప్పుడాయుద్యోగస్థులు కాలముమూడినప్పుడు మేముచెప్పు మాటలు రుచించునా? యనిపలికి యావర్తమానము ప్రభావతికిఁ దెలియజేసి యామెసెలవుగొని యక్కపటపురుషు నంతఃపురమునకుఁ బంపిరి. అందుఁ బ్రద్యుమ్ననికిం బలె నుపచారములు చేయించి గద్దియంగూర్చుండఁబెట్టిన కొంతసేపటికి ప్రభావతి చెలికత్తెలతోఁ గూడవచ్చి యక్కలికితోఁ జదరంగమాడఁ దొడంగినది.

అప్పుడు ప్రభావతి పెక్కుచిట్టకములు చూపి తటమటింపఁ

దలంచినదిగాని యదియును ముదితయే యగుటచే దాని విలాసము లేమియు నామెమనంబునకు వికారము గలుగఁజేసినవికావు.

లవంగియు మనంబున దానియందమున కాశ్చర్యమందుచు నోహో! దీనిసోయగమునకుఁ బురుషులు వలపుజెందుట యేమియద్భుతము? నన్నుఁగూడ మరులుగొల్పుచున్నది. దీనియాట యంత విజ్ఞాణముగాలేదు. రూపముచేతనే రాజకుమారుల నోడించుచున్నయది అని యూహించుచు సులభముగాఁ బ్రభావతిని లవంగి మాఁడాటలు గట్టివైచి గెలిచితినని పెద్దకేక పెట్టినది.

అప్పుడచ్చటనున్న మచ్చెకంటులెల్ల నచ్చెరువు జెందుచు నౌరా యీతండు మిగులచతురుండు. ఇంతబుద్ధిమంతు నిదివరకు మేము చూడలేదు. అని స్తుతులుచేయుచు నావార్త రాజుగారికిఁ దెలియజేసిరి.

ఆరాజు మిగులసంతసించుచు నతనికే తనకూఁతునియ్య నిశ్చయించి దైవజ్ఞులరప్పించి యప్పుడే శుభముహూర్తము నిశ్చయింప జేసెను. ప్రభావతియు నాలవంగి మెడయందు పూవులదండ వైచి యతనినే వరించినట్లు తెలియజేసినది.

ఆమరునాఁడే జయభద్రుఁడు ప్రద్యుమ్నుని విషయమై సభ చేసెను? ఆసభకు లవంగిగూడవచ్చి కూర్చుండెను. అంతట నారాజు సభ్యులతో బ్రద్యుమ్నుఁడు చేసినపనియంతయు జెప్పి యితని నురిదీయుటచే దానువ్రాసిన శాసనమునకేమైన విరుద్ధ మగునా యని యడిగెను.

ఆధర్మసందేహ మెవ్వరును జెప్పలేక రాజుతో నిట్లనిరి అయ్యా! వీని నురిదీయుట నంతఃపుర స్త్రీదర్శన దోషంబునం గదా? అట్టియువతి యీరాజపుత్రుని యధీనమైనది కావున నితని యిష్టము చొప్పున జేయుటలెస్సయని మాకుఁదోచినదనిసభ్య లేకవాక్యముగా బలికిరి.

అందులకు జయభద్రుఁడు సంతసించి యాధర్మ సందేహము జెప్పుటకుఁ బురుషవేషముగానున్న లవంగినే నిర్ణయించెను.

అప్పుడా లవంగి లేచి వారుపూర్వము వ్రాసిన శాసనమంతయుఁ జదివి సభ్యులారా! యీశాసన పత్రికనంతయును వినియుంటిరిగదా! అప్రద్యుమ్నుఁడు మూఁడాటలు నోడిపోయినచో నుతిదీయురీతి దీనిలో వ్రాయఁబడియున్నది వైషమ్యమువచ్చినప్పుడేమిచేయవలసినదిదీనిలో వ్రాయలేదు. ఇదివ్రాయువాని తెలివిలోపముగాని మఱియొకటికాదు దానికి మనమిప్పు డేమిచేయుదుము కావున దీనిఁబట్టిచూడ నతనినుతి దీయు నవకాశము గొంచెము గాన్పించదు. ఈతండు గట్టిగా నడిగి నచో మన దేతప్పుగానున్నది. అతనిచేత మరల నాడించియప్పుడు జయాపజయములు నిశ్చయింపఁదగినది. అతండడిగినను అట్లు చేయక పోవుట మన దేతప్పు కావున నతని విడిచివేయుదగిన దేయని తీరుపు చెప్పెను.

ఆయుపన్యాసమువిని సభ్యులెల్లరు తదీయపాండిత్య విశేషము నకును వక్తృత్వమునకును సంతసించుచు నందుల కామోదించిరి. అప్పుడు జయభద్రుఁడు లవంగిచెప్పిన తీర్పుప్రకారము ప్రద్యుమ్నుని విడిచివేయ నాజ్ఞయిచ్చెను.

ప్రద్యుమ్నుని చెరవిడిచిన వెనుక లవంగి యేకాంతముగా నతనిం గలిసికొని యాప్రభావతిని నీవే పెండ్లిచేసికొమ్మని చెప్పెను. లవంగి పురుషవేషమువైచినప్పుడు ప్రద్యుమ్నుఁడు వలెనే యున్నది. కావున బ్రద్యుమ్నుఁడే పెండ్లికుమారుడై యాలోపల సంచరింప దొడంగెను. ఆభేదమెవ్వరును గ్రహింపలేక పోయిరి. లవంగియు రహస్యముగా నాయూర సత్రములోనే యుండెను.

అంతనారాజు శుభముహూర్తమునఁ బ్రద్యుమ్ననికిఁ బ్రభావతినిచ్చి పెండ్లిచేసెను. నిత్యము చూచుచున్నవారికి సైతము పురుష వేషమువైచిన లవంగికిని ప్రద్యుమ్ననికిని భేదము గనిపెట్ట శక్యము గాదనినచో నొక్కసారిచూచిన ప్రభావతిమాత్రమేమి యానవాలు పట్టఁగలదు.

ప్రద్యుమ్నుఁడు ప్రభావతితో (ప్రద్యుమ్నుఁడు ప్రభావతితో వలెనే) కొన్నిదినములందుండి యథేష్టకామంబు లనుభవించెను. అప్పుడప్పుడతఁడు రాత్రులయందు సత్రమునకుఁబోయి చెల్లెలి క్షేమ సమాచారములు గనుంగొనుచుండును.

ఇట్లు కామతంత్రుఁడై తండ్రిమాట మరచిపోయి యున్న ప్రద్యుమ్నుని నొకనాఁడు లవంగి మందలించి యిట్లనియె. అన్నా! నీవు భార్యాలోలుండవై తండ్రిమాట మరచిపోయితివి. మనమువచ్చి నెలయైనది. ఇఁకనయిదుమాసములే మితియున్నది. వచ్చిన కార్య మే మియుం గాలేదు. ఇంతదనుక నీవు క్రొత్త పెండ్లికొడుకువని యోర్చి యూరకుంటిని. ఎన్నిదినంబులున్నను నీకిచ్చటనుండి రా బుద్ధిపొడ మదు. నీవు భార్యతో నిందుసుఖంబుండుము. నేనుపోయి కార్యము సాధించుకొని వత్తునని పలికిన నులికిపడి ప్రద్యుమ్నుఁడు అమ్మాణీ! నన్ను భార్యాలోలునిగాఁ దలంచుచుంటివే? నాకుఁదండ్రికంటె భార్య యెక్కువా? ఈదినమున నేనును ప్రయాణమున కాలోచించు చుం టిని పోదమురమ్మా అనిపలికి యతఁడు ప్రభావతితో నెద్దియో మిష చెప్పి యాదివసమున నర్ధరాత్రంబున లవంగితోఁగూడ నొకయడవి మార్గంబునంబడి పోయెను. పితృభక్తియుక్తులు స్వప్రయోజనముల గణింతురా! ఆయిరువురు గుఱ్ఱములులేక కాలినడకనేపోయి తెల్ల వారుదనుక నడిచి నడిచి యాయాసముజెందుచు నుదయకాలంబున నొకతటాకము గనంబడుటయుఁ దత్తటంబున గూర్చుండి గమనా యాసము వాపికొనిరి. పిమ్మట నడువలేక సరస్సులో స్నానముచేసి యందే తాముతెచ్చుకొనిన యాహారపదార్థములు భుజించి యాకలి యడంచుకొనిరి.

అదిమిగుల నడవిగానుండుటచే రాత్రికెద్దియేని గ్రామము జేర వలసియున్నది. కావున నాయాసముగా నున్నను మరల నడువసాగిరి. అట్లు సాయంకాలమువఱకు నడచినను చిన్నపల్లెయైనఁ గనబడినది

కాదు. భయపడి పిందలకడ నొకచెట్టుక్రింద బసజేసి ప్రద్యు మ్నుఁడు ఆయుధపాణియై తెల్లవారువఱకు నిద్దురజెందక మృగబాధ రాకుండఁ గాపాడుచుండెను. ఆమఱునాఁడు సాయంకాలమువఱకు నడిచిరి. గ్రామమేదియుఁ గానంబడలేదు. అప్పుడు భయపడి ప్రద్యుమ్నుఁడు చెల్లెలితో అమ్మాణీ! మనము దారికాని దారిని వచ్చి యడవిలోఁబడితిమి. ఎంతనడిచినను పురమేదియుఁ గనంబడ కున్నది. మనము తెచ్చిన యాహారవస్తువులు కొంచెముగానున్నవి. నీకునడువ మిగుల శ్రమముగా నున్నట్లు తోచుచున్నది. నేను రావలదని చెప్పినను వినకపోతివి. ఇప్పుడేమి చేయుదును. అని విచారించుచు మరల నాదినము మధ్యాహ్నమువఱకు నడిచిరి.

అందొక గొప్ప మఱ్ఱిచెట్టు గనంబడినది. దానినీడ దట్టముగా నుండుటచే మార్గాయాసము వాయ నాచెట్టునీడజేరి యాదు విశ్రమించిరి. మార్గాయాసముచే నొడలెఱుంగక గాఢముగానిద్రపోవు చున్న లవంగిని జూచి ప్రద్యుమ్నుఁడాత్మగతంబున నిట్లని తలంచెను.

అయ్యో! యీచిన్నది మిగుల సుకుమారము గలది. అంతః పురములలో సంచరింపఁదగినది. తండ్రి యిడుములు దలంచి నాతోఁ గూడ వచ్చినది. ఆహా! దీనిపితృవాత్సల్యము మిగులఁ గొనియాడఁ దగియున్నది! కటకటా! చిగురుటాకులకన్నను మెత్తనగు దీని యడుగులెట్లుపొక్కలెక్కినవో? యిక్కుసుమకోమలి నింటియొద్ద నుంతక తోడతత్తుకన్నంత మాత్రముననే తీసికొనిరావలయునా! నేనే కఠినాత్ముండ అయ్యో! యీప్రాంతమందెచ్చటను నీరు దొరకవట్లున్నది. ఇదిలేచి దాహమని యడిగిన నేమిసేయుదును? ఈలోపలనే జలముండుతావరసిన మేలుగదా? యని నిశ్చయించి మెల్లన నామఱ్ఱిచెట్టెక్కెను. అమాత్రిను మిగుల గొప్పదగుటచే చివరకొమ్మలకెక్కి నలుదెసలు పరికించుచుండెను. ఇంతలో నా

వృక్షము కోటరమునుండి యద్భుతమైన కృష్ణసర్పమొకటి పైకొమ్మ మీఁదునకుఁ బ్రాకదొడంగినది. దానిఁజూచి ప్రద్యుమ్నుఁడు వెరవక వరలోనున్న నూరకత్తి పెరికి యొక్కవేటున నాసర్పముతల నరికి వైచెను. ఆకృష్ణసర్పము తలదెగి ప్రాణములఁబాసి మృతినొందినది.

ఆమ్రానుచివర భైరవపక్షులు రెండు గూడుకట్టుకొని కాపురము చేయుచు సంవత్సరమునకు రెండుసారులు గ్రుడ్లుబెట్టుచుండును. పెట్టినగ్రుడ్లనెల్ల నీకృష్ణసర్పము పసిగట్టివచ్చి భక్షించుచుండును. ఈరీతిపెద్దకాలము జరిగినంత నేఁటికి దానికిఁ గాలము మూడి ప్రద్యుమ్నునిచేతిలో మృతినొందినది. ఆవధజూచి యాయాఁడుపక్షి యిట్లనియె. నాథా! మనకులమభివృద్ధి నొందకుండ జేయుచున్న యాదుష్టసర్పమును నేఁడెవ్వఁడో పుణ్యాత్ముఁడు చెట్టెక్కి చంపివేసెను. మనకిటుమీఁద బిల్లలు నిలుతురు అతఁడు మనకు గొప్పయుపకారము గావించెను. వానికి బ్రతిక్రియయెద్దియేని జేయుమని బోధించిన నామగపక్షి సంతసించుచు భార్యకిట్లనియె.

బోటీ! మనము పక్షులమైయుండియు మనకన్న నధికులగు మనుష్యుల కేమియుపకారము చేయఁగలము? అయినను నీవుచెప్పితివి గాన కృతజ్ఞతయైనం జూపవలయునని పలికి మెల్లన నతనియొద్దకుఁ బోయి మొక్కి మనుష్యభాష నిట్లనియె.

ఆర్యా! నీవు మాకుఁ జేసినమేలు చిరకాలమువఱకు చెప్పఁదగియున్నది కులమునిలిపితివి. మీవంటిసాధులకుఁ బరోపకారపారీణత సహజమైనను మాకృతజ్ఞత యిట్లు ప్రేరేపించుచున్నది. మనుష్యసంచారశూన్యంబగు నీకాంతారమునకు నీవు రాఁగతంబేమి? నీయుదంతం బెరిగింపుమని యడిగిన నాపక్షిపతినీతికి మెచ్చుకొని ప్రద్యుమ్నుఁడు తనవృత్తాంతమంతయు నెఱింగించి యాచేపనవ్విన కారణము తెలిసికొనుటకే వచ్చితినని చెప్పెను.

అప్పుడాపక్షి ఆర్యా! అత్యంతపుణ్యపురుషులైన మానుష్యులకుం దెలియరాని యంశములు మాకెట్లు దెలియును? యొక విశేషము చెప్పెదనువినుము. ఈకృష్ణసర్పశిరమునం జాతిమైన మణి యొకటి గలదు. దానింగైకొని యాపుట్ట మార్గంబునం జనినం బాతాళ లోకంబు గనంబడును. అందొకసుందరి నీకు వశ్యయగును. ఎట్టిసమ యంబునను నీమణిమాత్రము విడిచియుండకుము మణివియోగంబున నాకాంతావియోగముగూడ కాంగలదు ఆ పాతాళలోకవాసులు చేప నవ్వినకారణము జెప్పగలరని యూహించెద. నట్లుచేయుమని బోధించిన సంతసించి యతండందున్న సర్పశిరస్సు వెదకి తచ్ఛిరో మణిని సంగ్రహించి మఱియు నాభైరవపక్షిని తాను దలంచుకొని నప్పుడు వచ్చునట్లొడంబడంజేసి తదుపదిష్టమార్గంబున రసాతలము నకుం బోయెను.

అంత నాచెట్టుక్రింద నిద్రబోవుచున్న లవంగి కొంతసేపునకు మేల్కాని కన్నులునులిమికొనుచు నలుదెసలంబరికించి ప్రద్యుమ్నుం గానక తొట్రుపాటుతో అన్నా! అన్నా! ప్రద్యుమ్నా యని యురవం జొచ్చెను. ఎందును వానికంఠధ్వని వినంబడక యత్యాతురముతో అయ్యో యిదియేమి పాపము! నేను నిద్రలేచినంతలో నాసోదరుం డెందుపోయెను? ఎక్కడికైనను బోయినచో నాకుం జెప్పకుండునా? ఏదియేని క్రూరమృగబాధ జెందియుండలేదుగద ? అట్టియాపద తట స్థించినప్పుడు చప్పుడుగాకుండునా? పరాక్రమశాలియగు నతని మృగ ములేమిజేయంగలవు? అతఁడు ప్రమాదమున నిచ్చటనుండి యెచ్చటి కైనం బోవలయుగాని స్వబుద్ధిచే నన్నొంటిగా నడవిలో విడిచిపోవు వాఁడుకాడు. యేమి చేయుదును? నాకుదిక్కెవ్వరు? ఔరా! దైవమెట్టి యాపద దెచ్చిపెట్టెనే? నాకీయడవిలో మరణము విధించెనుగాంబోలు. ఎంతో దిక్కుగలిగియు దిక్కులేనిదాననైతిని. అని యనేకప్రకార ములం బలవరించుచు నయ్యడవియంతయుం బ్రతిధ్వనులీయః బ్రద్యు మ్నాయని యరచుచు సాయంకాలమువఱకు క్రిమ్మరంజొచ్చెను.

అంత నానెలంత శోకాంధకారంబునకుఁ దోడుగాఁ జీఁకటి గూడ వ్యాపింపఁదొడంగినది. అప్పుడు వనదేవతయుంబోలె నిర్మనుష్యంబగు నయ్యడవిలోఁ దిరుగుచున్న యాచిన్నదాని హృదయ మెట్లుండునో విచారింపుము. ఆచీఁకటికిఁదోడుగా మబ్బుపట్టి వర్షము గురియఁదొడంగినది. ఆయుఱుములకు మెఱుపులకుఁ దాళలేక యా నాళీకవదన హృదయంబున ధైర్యమాపలేక మరణకృతనిశ్చయయై యామఱ్ఱిమాని మొదలున గొంచె మిమ్ముగానుండుటఁజూచి వర్షమునకుఁ దలదాచుకొనియెను.

గాఢాంధకారముగానున్న యారాత్రి శర్వరీనిమీలనములుఁ బోలె నొప్పుచున్న మెఱుపువెల్తురున నత్తరుణికిఁ గురంగటతురగముపై నెక్కియున్న యొకపురుషుఁడు గనంబడెను. అప్పుడప్పడఁతి యింతింతనరాని సంతసముతో అన్నా! ప్రద్యుమ్నా! యిటురా! ఇదిగో నేనిచ్చట నుంటిని. ఇంతదనుక నెందుబోయితివి? నీకై నేను పెక్కుతెరంగులఁ జింతించుచుంటినిసుమీ? యని పెద్దకేకలుపెట్టెను.

ఆమాటలు విని గుఱ్ఱముపైనున్న యాపురుషుఁడు భయపడి యేదియో పిశాచము ఆవృక్షము నాశ్రయించియున్నది. మనుష్య వాక్యములఁ బిల్చుచున్నది. ఇందుండినఁ బ్రమాదము రాకమానదు. అని యూహించి పారిపోవఁదలంచుచున్నంతలో మరలఁ దళుక్కురని మెఱసినది. ఆవెల్తురున నాపురుషుఁడు లవంగునిం జూచెను. ఆచిన్న దానిమేనికాంతి మెఱుఁపుతో దులగానుండుటచే వెరగందుచు నత్తండా! పిశాచమనుకొంటిని కాదు. కాదు. ఒకయువతివలెఁ గనంబడుచున్నది. యానెలఁతుక యొక్కరితయ యిక్కడనుండుట కేమి హేతువో! అని ధ్యానించుచు గుఱ్ఱముదిగి దానిచెంతకుఁ బోయెను.

ఇంతలో మఱియు మెఱసినది. అప్పుడొండొరులు బాగుగాఁ జూచుకొనిరి. లవంగి యతని నిజముగాఁ దనయన్న ప్రద్యుమ్నుఁడే

యునుకొని అన్నా ! యిటురా ! నేనిందుంటిని. నీకీతురగ మెక్కడిది ? అని పలుకగా నాచిలుకలకొలికి పలుకులకు వెరగందుచు నారాజ కుమారుఁడా లవంగికి మఱింతదగ్గరగాఁబోయెను.

అప్పుడా యిమ్ముల్లోనుండి బయటికివచ్చి యాచీకటిలో నాల వంగి యాపురుషునిం గౌఁగలించుకొని యన్నా ! నేను పలుమారు పల్కరించినను ననుమానముజెందుచు మాటాడకుంటివేమి ! ఎచ్చ టికిఁ బోయితివి? నీయతిఁగిన తెరగెల్ల, జెప్పుమని యడిగిన నతండు తెల్లబోవుచు లవంగి కిట్లనియె. తన్వీ! నేను మీాయన్నయగు ప్రద్యు మ్నుఁడనుగాను. మత్స్యదేశాధీశ్వరుని కుమారుఁడ. నాపేరు జయ సేనుఁడందురు. మాతండ్రి నన్నువలదని యెంత చెప్పినను వినక నేఁటి యుదయమున సేనలతో వేటకై యీాయడవికి వచ్చిన కొంతసేపటికి మాశిబిరములన్నియు నెగిరిపోవునట్లు గాలి విసరఁదొడంగినది. పిమ్మట నత్యద్భుతముగా వర్షము గురియమొదలుపెట్టినది. అందు, బిడుగులు పడి యనేకులు మృతినొందిరి. కొందఱు పారిపోయిరి. నేనును నా గాలివానకు భయపడి తురఁగమెక్కి యెక్కడనుండనింటికిఁబోవలెనని బయలుదేరితినిగాని యింతలోఁ జీఁకటిపడుటచే దారితప్పినది. ఈమా ర్గమున వచ్చితి. నిందు నీవు గనంబడితివి.

ఈమహారణ్యములో నీవేటికి వసించితివి? నీవుబిలిచిన ప్రద్యు మ్నుఁడెవ్వడు? నీపేరేమి? నీవృత్తాంతమంతయుఁ జెప్పుమని యడిగిన విని యాలవంగి తెల్లబోయి అయ్యో! నిన్ను మాయన్నయని కౌఁగ లించుకొంటినే నీవు మఱియొకండవైతివి. అయినను ఆపత్సముద్రం బున నన్నుముంచిన భగవంతుఁడు నీవను తెప్పనందించెనుకాఁబోలు! కానిమ్ము ఒక్కరితనుండుటచే గుండెలు తాళకున్నవి. నాయుదంతము నీకెఱింగించెద వినుమని యన్నయుఁ దాను నిల్లువెడలినది మొదలు చెట్టుక్రిందఁబరుండి నిద్రపోవుటకు జరిగినకథయంతయుం జెప్పి

పుణ్యాత్మా! నాయన్న యెందుఁబోయెనో యెఱుంగను. దిక్కుమాలి యున్న నన్ను రక్షింపుమని వేడుకొనినది.

ఇంతలో మఱియుఁ బట్టపగలనునట్లు మెఱసినది. ఆవెలుతురున నయ్యిరువురు చక్కఁగాఁ జూచుకొని యొండొరులు సౌందర్యవిశేషము లకచ్చెరువందుచు నొకరినొకరు వరించిరి. అప్పుడు మేనం బులకలు బొడమ భయమునెపంబునఁ దన్నుఁ గౌఁగిలించుకొనిన యమ్మించుఁ బోఁడి యంగస్పర్శనంబున నాజయసేనునికి మేనఁ బులకలు బొడమి నవి. దానం జేసియే యొండొరుల యభిప్రాయములు వారికిఁ దేటపడినవి.

కొంతసేపట్లన్యాపదేశంబున శృంగారచేష్టలఁ గప్పిపుచ్చిరిగాని చిట్టచివర కాగుట్టుపట్టలేక యారాచపట్టి మంత్రిపట్టి కిట్లనియె. బోటీ! మన మీలాటి విజనప్రదేశమందుండియు లజ్జ పెంపునం జేసి గదా? యిట్లు వలపుల వెల్లడిజేయ సందియమందుచుంటిమి. ఇంకను దాచనేల? నాడెందము నీయందములాగికొనినది. మదనుఁడు నన్ను వేపుచున్నాఁడు క్షణకాలమైన సైపలేకున్నాను. నీమనోరథమెద్దియో యెఱింగికాని యిష్టముదీర్చుకొనరాదనియుంటిని. వేగ నెఱింగింపు మని యడిగిన విని యప్పడఁతి సిగ్గువిడిచి యతని బిగ్గరగౌఁగలించు కొనుచు నేను నీయధీననైతి మరల దీనికి నన్నడుగవలయునా? మద నుఁడు నిన్నొక్కనినేకాదు. నీకన్న నెక్కుడుగా నన్ను వేపుచున్నా డని పలికిన సంతసించుచు నాజయసేనుఁడు పట్టరాని మోహముతో నమ్మగువ బిగియగౌఁగలించుకొని ముద్దుగొనుచు మిగుల సంతోష ముతోనుండెను. వారిరువురకు నారాత్రియంతయు నొకక్షణముగాఁ దోచలేదు.

అంత నుదయంబున నమ్మదవతితోఁగూడ నాజయసేనుఁడు ఆతురగమెక్కి తనగ్రామమార్గముగా నడువజొచ్చెను. దైవగతిచే దారిదప్పి యాగుఱ్ఱము మరియొకదారిని నడిచినది. ఆదారినిఁ బోవఁ బోవ నెప్పటికిని దనదేశప్రజాదవేమియుఁగనంబడినది కాదు. అప్పుడు వెరగందుచు నాజయసేనుఁడు దారితప్పినదని తెలిసికొని యేమియుం

జేయలేక దైవముమీఁద భారమువైచి యాదారింబడి మూఁడుదిన
ములు పోయెను. అంత నాలుగవదినముదయమున వారికొక
యుద్యానవనము గనంబడినది. దానింజూచినతోడనే జయసేనుని కది
యొకనగరప్రాంతమని యెంతోసంతోషము జనించినది. దానిలోఁ
బ్రవేశించినంత నందెవ్వరు జనులు గనంబడలేదు. నారాయుద్యాన
వనములోఁ బ్రవేశించినంత నందెవ్వరు జనులుగనంబడలేదు. వారా
యుద్యానవనములోఁ బ్రవేశించి యందలి వింతలం జూచుచుండ
నొకదండనస్తోకశోభాకరంబగు నొకపద్మాకరంబు గనంబడినది! వారు
తురగముదిగి యందు మార్గాయాసము వాయఁ గొండొకసేపు జల
కేళిందేలి మరల దురగమెక్కి గమ్యప్రదేశ మరయుచుండ నల్లంత
దవ్వులో నొకమేడ కన్నులకు వేడుకగలుగఁజేసినది.

మిగుల సంతసముతో నాసౌధముదాపునకుఁబోయి గుఱ్ఱము
డిగి యందెవ్వరింగానక వారు వెరగుజెందుచు లోనికి బోయిరి.
లోపల జనులెవ్వరులేరు అనేక విచిత్రవస్తువులచే నలంకరింపఁ బడి
యున్నది. అందాహార పదార్థము లనేకములు గలవు. ఆదంపతులా
మేడ నలుమూలలు తిరిగి యెవ్వరును లేరని తెలిసికొని మిగులనాకలి
గొని యున్నవారగుట నందున్న మధుర పదార్థములచే నాఁకలి
యడంచుకొనిరి. ఇంతలో సాయంకాలమగుటయు నదియేమి చిత్ర
మోకాని యందు పెక్కు.దీపము లెవ్వరును వెలిగింపకయే వెలుఁగు
చుండెను. వెరగుఁజెందుచు నవి మణిదీపములని తెలిసికొనిరి.

అందుపరిభాగమున నొకగదిలో నద్భుతమైన యలంకార
ముతో హంసతూలికాతల్ప మొకటి యమర్పఁబడియున్నది. దానిం
జూచి యాదంపతులు ఆదియంతయు భగవంతుఁడు దమనిమిత్త
మమరించియుంచెనని సంతసించుచు నాతల్పంబుజేరి మన్మథ కల్ప
ప్రతాపంబున ననేక బంధగతుల నారాత్రి రతికేళిం దేలిరి.

ఆహా! యొకప్పుడు కీడుగూడ మేలునకే కారణమగును. ఆరీతి వారు మూఁడురాత్రులు యథేష్టకామంబు లనుభవించిరి. అంత నాల్గవనాఁడుదయంబున నాలవంగికన్నులు దెరచిచూచినంత ప్రాంత భాగమంతయు మహారణ్యముగా నున్నది. ఆమేడయు నాతల్పమును జయసేనుఁడుగూడ గనంబడలేదు. అందుల కాశ్చర్యమందుచుమరల గన్నులుమూసికొని యదికలగాదలంచి యొక్కింతసేపు నిదానించి తిరుగఁ గన్నులుదెరచిచూచి యది కలగాదనియు నిజముగానే యట్ల య్యెననియుఁ దెలిసికొనినది.

అప్పుడప్పుడఁతి మనంబునంబొడమిన చింతాతరంగము లేమని చెప్పుదును? మదిలో నిట్లని తలంచినది. అయ్యో! దైవము నన్నిట్లు పైకెత్తి నేలవైచికొట్టెనే! యిదియేమిమాయ? జయసేనుఁ డెక్కడికిఁ బోయెను? పిదాఘతప్తుండగువానికి వర్షాగమనంబున సంతోషంబు జనించుచుండఁ బిడుగుమీఁదఁబడినట్లు సోదరవియోగంబునఁ జింతించు చున్న నాకీజయసేనుని యాధారముగాఁజూపించి మరల నతనింగూడ మాయజేసెనే? ఒకవేళ నిదియంతయుఁ గలకాదుగదా! నేను భ్రమసి నిజమనుకొంటిని. నిజముగా జయసేనుఁ డనువాఁడు నన్నుఁ జేపట్టలేదు. వానితో నేనుమేడలోఁ గ్రీడింపనులేదు. స్వప్నమహాత్మ్యమే నన్నిట్లుభ్రమపెట్టు చున్నది. అనియూహించి యంతలోఁ గలగాదు నిజమే నేనునిద్రయెచ్చటఁబోయితిని? ఇవిగో నాయంగంబుల వాని నఖదంతచిహ్నములు గనంబడుచున్నవి. దైవప్రతికూలముచేత నేనాకు మరల నీయాపద తటస్థించినది. నాకుఁదల్లిదండ్రులును సోదరుఁడును గనంబడని యప్పుడుసైతమీ జయసేన వియోగంబునంగల దుఃఖము గలుగలేదు. ఈవియోగతాప మెట్లుభరింతునని యనేకప్రకారములఁ బలవరించుచు నీ! లోకంబున సర్వకార్యములు దుఃఖముతోఁ గూడి కొనినవేకాని స్థిరసౌఖ్య ప్రదములుకావు.

శ్లో॥ భోగే రోగభయం కులేచ్యుతిభయం విత్తేనృపాలాద్భయం
మానే దైన్యభయం బలేరిపుభయం రూపేజరాయా భయం
శాస్త్రే వాదభయంగుణే ఖలభయంకాయేకృతాంతాద్భయం
సర్వంవస్తుభయాన్వితంభువినృణాం వైరాగ్యమేవాభయం॥

అనునట్లు వైరాగ్యమువంటిది మఱియొకటిలేదు. తండ్రి మరణము దప్పింప నిల్లువెడలితిని. దారిలో సోదరునిం గోలుపోయితిని. జయసేనుని బెండ్లియాడి వానితో వియోగమును బొందితిని. దీనిలో సుఖమెంత దుఃఖమెంత తలపోయ దుఃఖమే యధికముగా నున్నది! దైవమేమిచేయునో యట్లుపోవుదానవని తలంచుటకంటె మంచిమార్గము లేదు తండ్రిచావు దప్పింప నాతరమా? యెవ్వరేమైనను సరియే నేనేమిచేయఁగలను. ఇంక యోగంబవలంబించి ముక్తిమార్గ మందెదనని తలంచి యాయడవిలో నిర్భయముగాఁ దిఱుగుచు ఫలములను బర్ణములను భక్షింపుచుండెదను. యోగినినైయిక్రమంబున నయ్యరణ్యములో సంచరించుచుండ నయ్యండజయాన కొకనాడొక చోట గొప్పకోట యొకటి గనంబడినది.

అది యేదియోపురమనుకొని యవ్వనిత దానిచుట్టును దిరుగ నొకదెస గోపురమును ద్వారమునుఁ జూడనయ్యెను. దానింబట్టి యామంత్రిపట్టి దేవాలయముగా నిశ్చయించి తలుపులు మూసి యుండుటచే జింతించుచు నాతలుపులోనున్న చిన్నతలుపొకటి చేతితోఁ ద్రోసిచూచెను. దానికి బీగమువైచునప్పుడు గడియలు తగులుకొనమి నాత్రోపుతో నాతలుపు వచ్చినది. మిగుల నంతసించుచు నమ్మంచుఁబోణి యాద్వారము దారిని లోనికిబోయినంత నదియొకయమ్మవారి గుడివలెఁ గనంబడినది. తన మనోభీష్టము సఫలముజేయ భగవంతుఁడు తన్నచ్చటికిఁ దీసికొనివచ్చెనని సంతోషించుచు నప్పడఁతి యగ్గుడిచుట్టును దిరిగి లోనితలుపులన్నియుఁ దెఱవఁబడియుండుట నాదేవతకు నమస్కరించి పెక్కుగతుల స్తుతిఁ జేసినది.

ఆయమ్మవారిపేరు సంయోగినిదేవి యనియు, నచ్చట దేవీ నవరాత్రములకు గొప్పయుత్సవము జరుగుననియు దానింజూచుటకై యనేకజనులు వత్తురనియు నది మిగుల రహస్యప్రదేశమనియు నాచిన్నది యొక శాసనము మూలముగాఁ దెలిసికొని మిగుల నానందించినది.

ఆపూజారి దలుపు తాళమువైచునప్పుడు లవంగి యదృష్టమున గడియ దగిలికొనినది కాదు. లేనిచో నితరదినములలో నాయాలయములోనికిఁ బోవ బ్రహ్మకైనను శక్యముగాదు. అందు విలువగల రత్నభూషణము లెన్నియేనింగలవు. మరియు నాహార పదార్థములు చాలనున్నవి. ఆచిన్నది వానినేమియుం బరిశీలింపక యాహారవస్తువులు దీసికొని తినుచు నాయావరణలోనున్న తటాక ప్రాంతమందున్న మంటపములోఁ గూర్చుండి యోగినియై నిత్యము దపము జేయుచుండెను.

రాత్రులయందు నిద్రావ్యవహారము లామంటపములోనే జేయుచుండెను. ఇట్లున్న యంత నొక్కనాఁడర్ధరాత్రంబున నద్దేవిని సేవించుటకై దేవలోకమునుండి రంభాదినిలింపకాంతలు వచ్చి యమ్మవారిసి సేవించి యరుగుచు మంటపములో నిద్రించుచున్న లవంగిం జూచి తమలో నిట్లు సంభాషించుకొనిరి.

రంభ — ఊర్వశీ! యిందొక సుందరి యోగినీవేషముతో నున్నది. చూచితివా!

ఊ — చూచితి నౌరా! దీనిరూపము చాల వింతగానున్నది.

మేనక — అక్కలారా! సంయోగినీదేవి యీయాకృతిబూని యిందు విహరించుచుండ లేదుగదా.

ఊ — యోగినీవేషముగూడ దీని కలంకారముగా నేయున్నదిసుమీ!

రంభ — ఔను. స్వభావసుందరులకు వికృతిసైతము సోయగమే యగుననుమాట వినియుండ లేదా?

మేనక—ఈచిన్నది పతినివిడిచి యొక్కరితయ యిందుండుటకుఁ గారణ మేమిరో తెలిసికొనఁగలరా!

ఊ—(దివ్యదృష్టినరసి) ఓహో! దీనియుదంతమంతయు దెలిసికొంటి జెప్పెద వినుఁడు.

మేనక—సఖీ! యెట్టిదో చెప్పుము. వినమిగులఁ గుతూహలముగా నున్నది.

ఊ—దీని పేరు లవంగి ప్రభుకీర్తియను మంత్రికూతురు. ప్రద్యుమ్నుఁడను పేరుగల దీనియన్నయు నిదియుఁ దండ్రి యాపదఁ దప్పించుటకై యూరువెడలివచ్చి మార్గంబునఁ బ్రభావతి యను చిన్నదానిని జదరంగములో నోడించి యన్నకుఁ బెండ్లి జేసి మరియుం దేశములు దిరుగుచు నన్నతోడను మగనితోడను విడిపోయి విరాగముజెంది యిందుఁదపము చేయుచున్నది.

మేనక—అక్కా! దీనితండ్రికివీరిచేదీర్పఁదగిన యాపద యేమివచ్చినది.

ఊ—సింహధ్వజుఁడను రాజు తనయొద్దకుఁ బల్లెవాండ్రు దెచ్చినచేప నంతఃపురమునకుఁ బంపుటకై యాఁడుదియా మగదియా యని యడిగెను.

మేనక—అట్లడుగుటకు నతని యభిప్రాయమేమి?

ఊ—అది మగదియైనచో నంతఃపురస్త్రీలకుఁ జూపింపఁ గూడదని.

మేనక—అంత గట్టివాఁడా? తరువాత.

ఊ—ఆభేదము చేఁపలలోఁ గనిపెట్టుట గష్టమని జెస్తలు చెప్పిరి. ఆరాజు మాటలువిని యాచేఁప పక్కున నవ్వినది.

మేనక—తరువాత.

ఊ—ఆచేఁప నవ్విన కారణము చెప్పుటకు వాని కారుమాసములు మితినిచ్చి యప్పటికిఁ జెప్పనిచో నుతిదీయింతునని యారాజు మంత్రి కాజ్ఞాపించెను.

మేనక—అన్నన్నా! రాజులెంత కఠినాత్ములోకదా? చేప నవ్విన కారణమెవ్వఁడు చెప్పఁగలఁడు. అక్కా! ఆకారణము విన నాకును వేడుకయగుచున్నది. నీకుఁ దెలిసినం జెప్పుము.

ఊ—నాకు బుద్ధిసూక్ష్మతచేఁ గ్రహింపఁ దగియుండలేదు. దివ్య దృష్టిచేఁ జూడఁదేటపడినది, చెప్పెద వినుము.

మేనక—సావధానముగా వినియెదము జెప్పుము.

ఊ—ఆసింహధ్వజుఁడు తనభార్యలను దాను గడుజాగ్రతగా నంతః పురములనుంచి కాపాడుచున్నాననియు, మగచేఁపను సైతము వారికిఁజూపింపఁగూడదని యిట్లడిగెను. అట్టియూహాగ్రహించి యాచేఁప యీభూపతి యెంతమూఢుఁడో తనయంతఃపురము లోనున్న దాదులాఁడువారో మగవారో యెరుఁగఁడు. నాప రీక్ష యీతనికిఁ గావలసివచ్చెనే యని యాచేఁప నవ్వినది.

మేనక—అతని యంతఃపురమున నట్టివారుండిరా యేమి?

ఊ—స్త్రీవేషముతో మగవారు సంచరించుచు నతని భార్యలతోఁ గ్రీడింపుచుండిరి లే.

మేనక—ఊర్వశీ! సాధు సాధు దివ్యజ్ఞాన సంపన్నవగు నీకుఁగాక యీరహస్యము వక్కాణింప నొరులకు శక్యమగునా? అయ్యో! అట్టిపనికై వచ్చి యీచిన్నది యిట్లు విరాగముతో నున్నదా? పాపము! దీనిపతియెవ్వఁడు. అతండెందున్నాఁడు?

ఊ—దీనిపతి జయసేనుఁడనువాఁడు. ఈచేడియ వటవృక్షము క్రింద నుండ దారితప్పివచ్చి గాంధర్వంబున స్వీకరించెను. ఆయిరు వురు మత్స్యదేశమునకుఁ బోవుచు దారితప్పి యక్షిణీ వనము నకుఁబోయిరి. ఆయక్షిణీవృత్తాంతము దెలియక యాదంప తులు మూఁడుదినములు దానిమేడలోఁ గ్రీడింపుచుండిరి. అంత నాల్గవదినమున నాయక్షిణివచ్చి తనశయ్యయందుఁబండుకొని

యున్న యాదంపతులంజూచి చంపక యిసుపురను చెరియొక యడవిలోనికిఁ ద్రోసివేసినది.

మే—పాపము మరల నీతరుణికిఁ బతితో సంయోగము గలుగునా?

ఊ—ఈసంయోగి నీదేవి కృపావిశేషమున నీయువతి పతితోడను.

సోదరునితోడను శీఘ్రకాలములోనే కలిసికొనఁగలదు.

మే—అట్లైన నీసంయోగినీదేవి నామము సార్థకమే కదా?

ఊ—దానికేమి సందేహము? ఈమె భక్తపరతంత్రగదా?

రం—అక్కలారా! మనమువచ్చి తడవైనది పోయివత్తమా?

(అని యందరు నిష్క్రమించుచున్నారు.)

ఆదేవకన్యకలు తన్నుఁగుఱించి సంభాషించుకొనఁ బ్రారంభించినప్పుడే యాలవంగి మేలుకువవచ్చుటచే వారిమాటలన్నియు విని యాసంవాదములోఁ దనయిడుములన్నియు నడఁగుతెరంగు స్పష్టమయ్యెనని యానంద పారావారవీచికలం దేలుచు నాలవంగి యిట్లు తలంచెను.

ఆహా! జనులెంతకష్టపడినను దైవానుకూలములేక సుఖములఁ బడయఁగలరా? సుఖదుఃఖములు దైవాయత్తములు. సుఖము దుఃఖమునకును, దుఃఖము సుఖమునకును నొక్కొక్కప్పుడు కారణ మగుచుండును. నాకింతకుఁ బూర్వముగలిగిన దుఃఖమూలముననే గదా యిట్టివిరాగముతో నీదేవాలయమునకు వచ్చితిని. ఇందు మాతండ్రి యిడుమువాయురీతి దేవకన్యకా సంభాషణశ్రవణంబునం దెల్లమైనది. ఇదియంతయు దైవముగూర్చినదేకాని వేరుకాదు. మాకు మరల మంచికాలము రానున్నది. పతితో సోదరునితో శీఘ్రకాలము లోనే గూడుకొనునని యూర్వశి చెప్పినది. ఆమెమాటలు దప్పునా యని యత్యంతసంతోషముతో నారాత్రి నిద్రపోక వేగించినది.

అంత నాకాంత నాల్గవజామున నత్తటాకములో స్నానము చేసి యామంటపములో జపమునకుఁ గూర్చుండబోవు సమయంబున

గోపురప్రాంతమం దెద్దియో మనుష్యులసద్దు వినంబడినది వెరగుపడి యాలవంగి యాగోపురపు దాపునకుఁబోయి చిన్నగుమ్మము దాపు నుండి యాయుడవిప్రక్కకుఁ దొంగిచూచెను. అందొకసుందరి మొర పెట్టుచుండఁ జెరదెచ్చినదొంగలను పారదోలుచున్న బాలయోగి నొకనింగనెను. ఆలవంగి చూచుచుండ నాబాలయోగి తన యోగ దండములో నమర్చఁబడియున్న కత్తిచే నాదొంగలనందరి నరికివైచి యాచిన్నదాని చెరవిడిపించెను. పిమ్మటనాకొమ్మతోఁగూడ నాబాల యోగి యాగుడిలోనికి వచ్చురీతి దోచినంత లవంగిమరలఁ బోయి మంటపములోఁగూర్చుండి జపముచేయుచుండెను. ఇంతలో నాయో గియు నాతరుణియు నాచిన్నద్వారమునుండి యాగుడిలోఁ బ్రవేశిం చిరి. అప్పుడు కొంచెము చీఁకటిగానేయున్నది తెల్లవారలేదు.

అంత నయ్యోగి యయ్యెలనాగతో సంయోగినీదేవి దేవాల యంబునకుఁ బ్రదక్షణముచేయుచుండ నొకదండఁ దటాకముదాపున నున్న మంటపములో రెండవచండికాదేవివలెఁ దపంబుచేయుచున్న యాలవంగి గనంబడుటచే నాశ్చర్యపడుచు నాచిన్నదానితోఁ గూడ నాచేడియకు మ్రొక్కి యందుగూర్చుండెను. లవంగియు నతనికి మరలమ్రొక్కి కన్నులందెరచి జపమాలికను దొడలపై నిడియతని నెద్దియో యడుగఁదలచునంతలో నెచ్చటనుండియోయొకపురుషుఁడు ఆకసమునుండియూడివచ్చినట్లు వచ్చి యాతటాకములోఁ బడియెను.

ఆచప్పుడువిని వారుముగ్గురు వెరఁగుపడుచు నయ్యో! పైనుండివచ్చి దీనిలో నెవ్వఁడో పడిమునింగెను ఇది మిగులవింతగా నున్నది. పాపమూరక వాఁడుమృతి నొందును. వీనిం బ్రతికించిన మిగులపుణ్యముగదా యనిపలుకుచు నాబాలయోగి యప్పుడే యత్త టాకములో నురికి మునిఁగి యతనిని వెదకిబట్టుకొని పైకి లాగికొని వచ్చి యొడ్డునం జేర్చెను. ఆహా! వానిసాహసము మిగుల కొనియాడఁ దగియున్నది.

తత్ప్రభావముచే సులభముగాఁ బాతాళలోకమునకుఁబోయితిని. అన్నన్నా! నాకిప్పుడు కొంచెమైనను మాలవంగిమాట జ్ఞాపకముండినచో నట్లుపోవుదునా? అయ్యారే! యాపాతాళలోకవైభవమేమనివర్ణింతును. స్వర్గముగూడ దానికి సాటిగాదని చెప్పఁగలను. పాతాళలోకము చీకటిగానుండునని చెప్పుకొనుమాట లబద్ధము. అందున్న రత్నరాసులకాంతి యుగ్రముగాక యనేకసూర్యులకాంతివలె వెలుంగుచుండును. దానంజేసి యందు రాత్రియుఁ బగలను భేదములేదు.

అందు నేను యథేచ్ఛంగ్రుమ్మరుచుండ నొకదండ నుద్యానవనములో వయస్యలతోడఁ గ్రీడించుచున్న యొక చేడియఁగంటి. నావాల్గంటివంటి సోయగముగల యలనాగ నాకంబుననైనను లేదని చెప్పవచ్చును. దానింజూచినంత నాకు భైరవపక్షిమాట జ్ఞాపకము వచ్చినది. నాగశిరోమణిని హస్తంబునంబూనిదానిచెంతకుఁబోయితిని.

అక్కాంతామణియు మణిహస్తుండనగునన్నుఁజూచియత్యంత సంతోషమునవచ్చి యొకపుష్పమాలిక నామెడలోవైచి యిట్టని నన్నడుగకయే గాఢాలింగనముఁ జేసికొనినది. అంతసోయగముగల కలకంఠివచ్చి మచ్చికతోఁ గౌఁగలించుకొనినప్పు డెట్టిసంతోషము గలుగునో చింతింపుము. నేనును మేనుగరుపార నపారమోదముతో సుఖపారవశ్యంబున నొకనిముసము మైమరచియుంటిని.

అంత నన్నెలంతయు నన్నాయుద్యానవనంబున డంబుమీరి యున్న క్రీడామందిరమునకుఁ దీసికొనిపోయి చేడియలచే నమరింపఁ బడిన కాంచనపీఠంబునఁ గూర్చుండబెట్టి మార్గాయాసంబువాయ వింజామరచేఁ దానే వీవఁదొడంగినది. ఆహా! అప్పటి యాయానందము దలంచుకొనినంత నిప్పుడు మేనుగరుపుజెందుచున్నది. అంత నే నాకాంతజేయు నుపచారములకు వింతపడి యప్పడఁతిని నీవృత్తాంత మేమని యడిగితిని.

నాథా! నీయుదంతము చెప్పుమని యడిగినంత నెద్దియో తలంచుకొని యూరక పరుగిడుచుంటిరేమి? ఎక్కడకుఁ బోయెదరు? మీకథ యేమని యడిగెను. అప్పు డాపడఁతికి నావృత్తాంతమంతయుం జెప్పి మాలవంగి యేమైపోయెనోయను చింతతోఁ బరుగుచుంటినని చెప్పితిని. దాని కమ్మానిని నవ్వి యూహూ! యెన్నఁడో చెట్టుక్రిందఁ దిగవిడిచివచ్చిన చిన్నదాని నిప్పుడుతలంచుకొని దాని రక్షించుటకై పోవు చుంటిరా? మేలు. మేలు. మీయనురాగము స్తుతిపాత్రమైయున్నది. రేపు పోవచ్చును రండని మరల నంతఃపురమునకుఁదీసికొనిపోయినది.

అది మొదలు అచ్చటివింతలు దానివిలాసములు నాకేమియు నుల్లాసమును గలుగఁజేసినవికావు. నేనామణినాఁడే భూలోకమునకుఁ బయనమైనంత నన్నెలంతయు నాతో దానుగూడ ప్రయాణమయ్యెను. నేను వలదని యెంతచెప్పినను వినినదికాదు. నేనారత్నాంగితోఁగూడ మునువచ్చిన మార్గంబుననే భూలోకంబునకు వచ్చితిని.

చెట్టుదిగి యందు లవంగింగానక పదచిహ్నములంజూచి యేడ్చుచు నోలవంగీ! లవంగీ! యని యయ్యడవిమూరుపలుక యూరక యరవఁజొచ్చితిని. అప్పటికి లెక్కించుకొన నెలయైనది. ఇంతదనుక నిందుండునా? యేదియో క్రూరమృగము భక్షించి యుండవచ్చునని నేను నిశ్చయించితిని. దానిబుద్ధినిగుఱించియుఁ నీతినిగుఱించియు రూపమునుగురించియుఁ దలంచుకొని దుఃఖమాగక బిట్టుశోకించుచు నెట్టకేలకు నారత్నాంగి యనునయవాక్యములచే ధైర్యముదెచ్చుకొని యయ్యడవిలో వెదకుచు నడువఁజొచ్చితిని. ఇట్లు నడుచుచుండ మార్గములో నొకచెఱువు గనంబడినది. మణియును నగలును పుట్టంబులును గట్టునఁబెట్టి మేమిరువురము మార్గాయాసమువాయ నందు స్నానము చేయుచుంటిమి. అంతలో నొకగద్దవచ్చి గట్టునబెట్టిన నాగశిరోమణిని దన్నుకొనిపోయి దూరముగానున్న యొకచెట్టుమీఁద

వ్రాలినది. అప్పుడు నేను భయపడుచు భైరవపక్షిమాట దలంచు కొని తటాలున లేచి రత్నాంగికి జెప్పక యది వ్రాలియున్న చెట్టు క్రిందికిఁ బోయితిని. ఆగద్దయు నన్నుఁజూచి బెదరి మరల నెగిరి వేరొకమ్రానుపై వ్రాలినది. నేనును దానిచెంతకుఁ బోయితిని. ఈరీతి నాపతంగ మొకచెట్టుమీఁద నైనను నిలువక రాత్రింబగళ్ళు నడుచుచు నన్నుఁ బెద్దయుం దవ్వుదీసికొనిపోయినది. నాకప్పుడు మాయాకురంగము వెంటనరిగిన శ్రీరాముఁడు జ్ఞాపకమువచ్చెను. అవి వెన్నెలరాత్రులగుట రాత్రిగూడ దానినివిడువక వెంటనంటి యరిగి తిని. అంత నది నాల్గవదినము సాయంకాలమున నయ్యడవిలో నుద్యానవనమునందున్న యొకమేడమీఁద వ్రాలినది. దానింజూచి నేను జనరహితమగు నాసౌధంబులోనికి మెల్లనబోయి యాపక్షిచెంత జేరితిని. మరల నాగద్ద తద్దయు వేగముగా నెగరబోవునంతలో దానికాలిపట్టువదలి యామణి యందుజారి పడినది.

అప్పుడు పట్టరాని యానందముతో నామాణిక్యమును గైకొని నేనారత్నాంగినిఁ దలంచుకొని యెంతదూరమువచ్చితినో తెలిసికొనఁ లేక మిగులఁ జింతించితిని. నేను మిగుల నాకలిగొనియుంటిని గాన నామేడలో నలుమూలలు వెదకితిని. అందాహారపదార్థము లనేక ములు గనంబడినవి. వానిచేఁ గొంతయాకలియడంచుకొని పైగది లోనికిఁబోయితిని అందొక హంసతూలికాతల్పంబునఁ బదియారేఁడుల ప్రాయముగల కలకంఠియొకతె నిద్రించుచున్నది. దానిఁజూచి నేను వెరగుపడి యోహో! యింతసోయగముగల యెలనాగ యీమేడలో నేకాంతముగనుండుటకుఁ గారణమేమియోగదా యని తదీయ రూప వైభవమంతయు వర్ణించుచు పెద్దతడ వక్కడనే నిలువంబడి చూచుచుంటిని.

ఇంతలో నా నెలంత మేల్కొని యెదుర నన్నుఁజూచి పండ్లు పటపటగొరుకుచు ఛీ యీమనుష్యులకు సిగ్గులేదు ఎంతచేసినను

మరల వచ్చుచుందురని పలికి నేనుఁ జూచుచుండ దనమేను పెంచి మహోయాగ్రహముతో నాకాళ్ళురెండును గైకొని గిరగిరఁద్రిప్పి విసరి వైచినది.

అప్పుడు నామేను తెలిసినదికాదు. ఆవిసరునవచ్చి యాతటాకములోఁ బడితిని. నీటిలోఁగాక మఱియొకచోటఁ బడితినేని బ్రాణము లేపోవును. ఇందైనను నీదయామూలముగాఁ బ్రతికితిని. ఇదియే నావృత్తాంతము. అట్టిసోదరిం బాసితిని రత్నాంగితో వియోగమును బొందితిని. తండ్రినిం బ్రతికించుకొనలేకపోయితిని. ఇట్లు నేను బ్రతికియు నేమిలాభమని పలుకుచుఁ గన్నీరువిడిచెను. అతని చరిత్రమంతయుఁ విని లవంగియు మేనుగరుపార దేవకన్యకల పలుకులు దలంచుకొని అన్నా! వచ్చితివేయని మనంబున సంతసించుచుఁ దన గుట్టు బయలుబెట్టక యున్నవారివృత్తాంతముగూడ దెలిసికొనఁ దలంచి యూరకుండెను.

అప్పుడు దొంగలచేఁ జెరదేఁబడి బాలయోగిచే విడిపింపబడిన చేడియ యతనికథయంతయువిని యదరిపడి హా! నాథా! వచ్చితివే యని యతనిం గాగలించుకొనియెను. దానికి బాలయోగి వెరగుపడెను. అప్పుడా ప్రద్యుమ్నుఁడు చీఁకటిబాసి వెలుఁగువచ్చినది కావున నా వెలుతురున నానవాలుపట్టి యోహో! నాప్రాణనాయికయగు రత్నాంగియే యని యవ్వనితను మరల గాఁగలించుకొని బోఁటీ! నీవిచ్చోటి కెట్లుఁవచ్చితివి? అన్నా దైవఘటనమిట్టిది కాబోలు స్వాగతమేనా? యని యడిగిన నారత్నాంగి మగని కిట్లనియె.

నాథా! వినుఁడు మీరట్లు నన్నాతటాకములోవిడిచి మాణిక్యమునకై పక్షివెంట నరిగిన వెనుక మీరాకకై కొంతసేపు నేనా సీరాకరతీరంబున వేచియుంటిని. ఎంతతడవునకు మీరు రాకపోవుటచేఁ బరితపించుచు మీరుబోయిన దారింబట్టి నడుచుచుఁ బ్రద్యుమ్నా! యని యఱచుచు మిమ్ము వెదకితిని. ఎందునను మీజాడ దెలిసినదికాదు. అంత రాత్రిపడినది కటికిచీఁకటిలో గుండె

రాయిచేసికొని బ్రతుకుమీఁది యాశవదలి యొకచెట్టుక్రిందఁ బండు
కొంటిని. ఆరాత్రి యేమియు నిద్రపట్టినదికాదు. అంతఁ దెల్లవారిన
వెనుక మరలఁ నయ్యడవిలో మిమ్ము వెదకుచు నడుచుచుంటిని. ఈరీతి
మూఁడురాత్రులు వెదకినను మీజాడ తెలిసినదికాదు.

అంత నాలుగవనాఁడురాత్రి యక్కానలో మీకై చింతించు
చున్న నారోదనవిని కొందరుదొంగలువచ్చి నన్నుఁ బట్టుకొనిరి.
అప్పుడు నాకుఁ బ్రాణములమీఁది యాశవదలినది. స్మృతితప్పి
మూర్ఛనొందితిని. పిమ్మట నాముచ్చులు నన్నేమిచేసిరో నేనెఱుం
గను. జాముక్రిందట నీపుణ్యాత్ముఁడు వారిం జంపి నన్ను విడిపించెను.
ఈతనితో నీగుడిలోనికివచ్చి యీయోగివద్దఁ గూర్చున్నవెంటనే
మీరు తటాకములోఁబడితిరి. ఇదియే నావృత్తాంతము. మిమ్మును
నన్నును నాపత్సముద్రమునుండి దరిజేర్చిన యీపుణ్యాత్మునివృత్తాంత
మెట్టిదో తెలిసికొనఁదగినదైయున్నదని పలికిన నాప్రద్యుమ్నుఁడా
బాలయోగికినమస్కరించియయ్యా! మీరు మమ్ముద్ధరింపవచ్చిన పర
మేశ్వరులని తోఁచుచున్నది. మీయభిదానవర్ణంబులంజెప్పి మదీయ
శ్రవణానందంబు గావింపుఁడని యడిగిన నవ్వుచు నాబాలసన్యాసి
యిట్లనియె.

అయ్యా! మీచరిత్రమువినిన నాకును మీతో బంధుత్వము
గలిగినట్లయున్నది. నేను మత్స్యదేశపు రాజకుమారుండను, నాపేరు
జయసేనుఁడందురు. నేనొక్కనాఁడు వేటకుఁబోయి గాలివానచే
సేనలనువిడిచి యొక్కరుండ గుఱ్ఱముతోఁ జీకటిలో దారితప్పి
యొక మఱ్ఱిచెట్టుక్రిందకుఁబోయితిని. అందొకసుందరి మెఱుపుల
వెల్తురునన్నుఁ జూచి అన్నా! ప్రద్యుమ్నా యిటురా! యని
కేకలుపెట్టెను. దానికి నేని అదరిపడి దరికరిగితిని. ఆచిన్నది నేను
ప్రద్యుమ్నుఁడనే యనుకొని తటాలునవచ్చి కౌఁగలించుకొనినది.
అప్పుడు కాంతా! నేను ప్రద్యుమ్నుఁడనుకాను నాపేరు జయసేనుఁడని

నాయుదంతమంతయుఁ జెప్పితిని. పిమ్మట నమ్మదవతియుఁ దన యుదంతమంతయుం జెప్పియన్నకై చింతింపఁదొడఁగినది.

నేనును దానినోదార్చితిని. అదియొక పురుషుని ముట్టుకొని వేరొకని మరల ముట్టుకొనదు గనుక నన్నే గాంధర్వవివాహమాడి నది. అంత మేమిరువురము ప్రద్యుమ్నుని వెదకుచు నయ్యరణ్య ములోఁ దిరుగఁజొచ్చితిమి. అటుతిరుగుచుండ నొకనాఁడు నీవిప్పుడు చెప్పిన యుద్యానవనమునందలి మేడలోనికిం బోయితిమి.

జనశూన్యమైన యామేడలో మూఁడురాత్రులు మేమిరు వురము యథేష్టకామంబులనుభవించితిమి. అంత నాల్గవదిన ముదయ మున నామేడయు నాలవంగియు నేమైపోయెనో కాని నేను దెల్లవారి లేచి చూడ నొకయడవిలోఁ జెట్టుక్రిందనుంటిని. అప్పుడు భార్యా వియోగము సైరింపలేక విరాగముతో యోగినై తిరుగుచుండ నొకనాఁడొక యోగిపుంగవుండు నాకుఁ గనంబడియెను.

అతనికిమ్రొక్కి అయ్యా! నాభార్య యెందున్నది? యెప్పటి కేని నేను దానితోఁ గలిసికొందునా! యని యడిగితిని. అయ్యతి పుంగవుండు నాయెడఁ గనికరించి సంయోగినీదేవి నారాధించినం గలిసికొందురని చెప్పి ఈయరణ్యము గురుతెరింగించెను. నేనును దిరిగితిరిగి నిన్న రాత్రికిప్రాంతముజేరితిని. ఇందీసుందరిని దొంగలు చెరదెచ్చుట జూచి జాతిధర్మంబువిడువక యోగదండములో నమర్చి యున్న కత్తిచే జంపి యీలవంగియు నేనునుఁ నీగుడిలోనికివచ్చి యీయోగినియొద్ద గూర్చుండునంతలో నీవీతటాకములోఁబడితివి. నిన్ను లేవదీసితిని. ఇదియే నావృత్తాంతము.

నీవేయాప్రద్యుమ్నుఁడవై యాలవంగియే నీచెల్లెలైనచో నీవు నాకు బావవగుదువనుటయు నాప్రద్యుమ్నుఁడతనిం గౌఁగలించు కొని బావా! నిక్కముగా నిన్నువరించినది నాయనుంగుసోదరియే.

దాని మరల నెట్లుగలిసికొందుము. అయ్యో! దానినింకువిడిచి యొక్కరుఁడ నేనింటికిఁబోఁగలనా? దైవముకొంచెము మనకనుకూలుఁ డైనట్లు తోఁచుచున్నది. లవంగికూడ మనతోఁగలిసిన చోనియతి కనేకవందనములు పెట్టెదము. ఈదేవి కనేకముగాఁ బలులివ్వింతుమని యాతురముగాఁ బలుకుచున్న యన్నమాటలును పతివచనంబులును వినియోగినిగానున్న యాలవంగి, అన్నా! ప్రద్యుమ్నా! యోహో నాథా! మీరింక నాకై చింతింపకుఁడు నేనే లవంగిని. మనయెడ దైవమునకుఁ బూర్తిగా ననుగ్రహము వచ్చినది. ఈసంయోగినీదేవి యనుగ్రహమే మరల నందరని చోటికిఁజేర్చినది. నావృత్తాంతము వినుండని తనకథయంతయు వారికెఱింగించెను. అప్పుడు ప్రద్యుమ్నుఁడు పట్టరాని సంతోషముతోఁ జెల్లెలింగౌఁగలించుకొని కన్నుల నీరుగార్చుచుఁ గొండొకసేపు మేనెఱుంగక దైవమును ధ్యానించు చుండెను.

అంతలో మరల విచారమునుదెచ్చుకొని యతండు లవంగి కిట్లనియె. అమ్మాణీ! మనయాపదలన్నియు దైవముదాటించెను. మనతండ్రిమాట మనము మరచియేపోయితిమి. ఆయన బ్రతికి యుండిన మనలఁజూచి సంతోషించునుగదా? ఆతండు లేనినాఁడు మనలనుజూచి సంతసించువారెవ్వరు? ఇందులకై నాకు విచారమగు చున్నది. యేమిచేయవలయునని పలికిన విని యక్కలికి యన్నా! అందులకై నీవుచింతింపకుము. మనతండ్రి బ్రతుకుమార్గము దేవకన్య లాడుకొనిన మాటలచేఁ దేటపడినది. చేవనవ్వీనకారణము నేను జెప్పఁగలను. కాని లెక్కించిచూడ నేఁటిసాయంకాలమే మనతండ్రిని నురిదీయుసమయము. ఈదివసముతో నారుమాసములైనది. ఇంతలో నింటికెట్లుపోఁగలము? మనగ్రామమేదిక్కుననున్నదో మనమెఱుఁగము. దీనికేదియేని యాధారమున్నఁ జెప్పుమనిన నతం డిట్లనియె. అమ్మాణీ! ఆకారణము యథార్థముగా నీకుఁ దెలిసినచో నేనీసాయంకాలము

లోపుగా మనము మనగ్రామము చేరునట్లు చేయఁగలను చూడుమని యప్పుడాత్మగతంబున బూర్వమువరమిచ్చిన భైరవపక్షులం దలంచు కొనియెను.

అంతమాత్రముననే యాపక్షులువచ్చి ముందువ్రాలినవి వానిం జూచి ప్రద్యుమ్నుఁడు సంతసించుచుఁ దనకథయంతయుం జెప్పి సాయంకాలములోపుగాఁ దమ్ముఁదమపురమునుఁ జేర్చుఁడని వేడు కొనియెను. అప్పుడా పక్షులు చెరియొకయిద్దరిని దమరెక్కలమీఁద నెక్కించుకొని గరుత్మంతునువలె నతిజవంబునఁ బొద్దు గ్రుంకక పూర్వమే మిక్కిలి దవ్వుగానున్న భర్మాపురమునకుఁ దీసికొని పోయినవి.

ఆహా! వానిగమనవేగ మెట్టిదో చూడుము. అప్పుడా గ్రామ మంతయు హల్లకల్లోలముగా నున్నది. వీధుల గుంపుగుంపులుగాజనులు గూడికొని మంత్రిమాటలు చెప్పుకొనుచుండిరి. అయ్యో! ఈమంత్రి కెట్టియాపదవచ్చినదో చూచితిరా? యుత్తికంబమునొద్దకుఁదీసికొని పోయిరి. కొడుకును గూఁతురునుఁగూడ నారుమాసములక్రిందట దేశాంతరమేగిరఁట వారుదగ్గర లేరు. పాపము భార్యయొక్కరితియ యాబండివెనుక నేడ్చుచుఁబోవుచున్నది. వారేమైపోయిరో తెలి యదు. రాజెంత దయాశూన్యుఁడో కాని యతనికొడుకును కూఁతురు నింటికివచ్చువరకైన నిలుపరాదు గాఁబోలు. పాపమా మంత్రి నీకేమికోరిక యున్నదని యడిగిన దనసంతానముఁజూడఁ గోరికొనియెనఁట. రాజుగారు దానికి సమ్మతింపలేదు. అయ్యో! తుదకు వానికపరక్రియ జేయువారుగూడ లేరుగదా యని యనేక రీతులఁ బ్రజలు జెప్పుకొనఁ దొడంగిరి. ఆమాటలన్నియు నాలిం చుచుఁ బ్రద్యుమ్నుఁడు లవంగియుఁ దిన్నగా నాయురికంబము నొద్దకే యాపక్షుల నడిపించిరి.

అప్పుడు మంత్రి నురికంబమునొద్ద నిలువఁబెట్టిరి. కొందరు పెద్దమనుష్యులు దాపుగా నిలువంబడిరి. మంత్రిభార్య యేడ్చుచు మగనియడుగుల మ్రోలఁబడియుండెను. చూచువారందరు కన్నీరు

గార్చుచుండిరి. రాజకింకరులు దండనాథునితో అయ్యా! మంత్రి నురిదీయుటకనుజ్ఞ? యని యడిగిన నతండు చేయిఁవిచి యాజ్ఞ యిచ్చెను. అందఱు హరినామ స్మరణ చేయుచుండిరి.

పిమ్మట నతనితల నురిత్రాటిలోఁ దగిలించిరి. ఇంతలో నాప క్షుల రెక్కలగాలి చప్పుడువిని యందరు నద్భుతమందుచు నాది క్కుగాఁజూచిరి. అంతనాపక్షులు రెండును వారిమ్రోల వ్రాలినవి. అప్పుడు ప్రద్యుమ్నుఁడులేచి చేయెత్తి యోహో! మంత్రినురి దీయ కుఁడు. ఉరిదీయకుఁడని కేకలుపెట్టెను. ఆధ్వనివిని యురిదీయువారలు భయపడి మంత్రిశిరస్సును ద్రాటిలోనుండి తప్పించిరి. అక్కడి యధికారి ప్రద్యుమ్నునితో నోయీ! మంత్రినురిదీయవలదని నిర్భ యముగాఁ బలుకుచుంటివి. నీవెవ్వఁడవు. నీకేమిఁయధికార మున్నది? నీవు చేఁపనవ్విన కారణము జెప్పఁగలవా యని యడిగినఁ బ్రద్యు మ్నుం డిట్లనియె.

అయ్యా! నేను మంత్రికుమారుండను నాపేరు ప్రద్యుమ్నుఁడు నేనుచేఁపనవ్విన కారణము నిశ్చయముగాఁ జెప్పఁగలను. మంత్రి నురితీయింపకుఁడు అనిచెప్పెను. ఆమాటలువిని యెల్లరు సంతోషిం చిరి. అప్పుడు దండనాథుండావార్త రాజునొద్దకుబోయి చెప్పెను. రాజు నురిదీయువారితోఁ బ్రద్యుమ్నుమాట వినువఱకు మంత్రినురి దీయవలదని యాజ్ఞాపించి వారినెల్ల రప్పించుకొని ప్రద్యుమ్నా! చేఁపనవ్విన కారణము చెప్పఁగలవా? నీతండ్రిని విడిపింతుననుటయు నతండయ్యా! యాకారణము తప్పక చెప్పెదను సభచేయింపు డను టయు సింహధ్వజుఁడప్పుడే పౌరులనెల్ల దన యాస్థానమునకు వచ్చు నట్లాజ్ఞాపించెను. సామంత నృపాల పౌర పండితయుతుండై యానృ పాలుండు పెద్దకొలువుదీర్చి కూర్చుండెను.

అచ్చటికి లవంగియు, బ్రద్యుమ్నుఁడు జయసేనుఁడు రత్నాం గియువచ్చి యుచితస్థానముల గూర్చుండిరి. మంత్రినిఁగూడ నచ్చటికి

రప్పించిరి. కొలువువారెల్ల ప్రద్యుమ్నుని యుపన్యాసమును వినగోరు చున్న సమయంబున రాజు ప్రద్యుమ్నునికిఁ జేఁపనవ్విన కారణమును జెప్పుటకు సెలవిచ్చెను. అప్పుడు ప్రద్యుమ్నుఁడావార్త జెప్పుటకుఁ దనప్రక్కనున్న లవంగిని నియోగించెను. అంత నాసెలంతయుఁ బతి యనుమతివడసి లేచి నిలువంబడి సభాసదులకు నమస్కరించి యెల్లరు విన రాజుతో నిట్లనియె. రాజా! భగవంతుఁడు పశుపక్షి మృగాదికములకేదియో యొకశక్తి పరిపూర్ణముగానిచ్చి మనుష్య కోటికి సకల విధజ్ఞానశక్తియు నొసంగెను. అట్టి మనుష్య జాతియందు జని యించియు గూడనికార్యములయందుఁ బ్రవర్తించుచు యుక్తాయుక్త వివేకశూన్యులగు మనుష్యులకంటె నితరజాతియే నీతిగలదని చెప్ప వచ్చును. పిపీలికా జ్ఞానము విహంగజ్ఞానము పశుజ్ఞానము జలచర జ్ఞానము మనుష్యజ్ఞానమును మించియొప్పును. ఆచేఁపయూరక నవ్వి నదికాదు అందులకు మంచికారణమేయున్నది. దానిం జెప్పుమని మీరుమంత్రికి నాజ్ఞాపించిరి. ఆయనకు మారుగాఁ గొమార్తెను నేను జెప్పుచుంటిని. ఆకారణము వినిన మీకుఁ గోపము రాకమానదు. అందుమూలమున నన్నపరాధినిగా నెంచితిరేని రెండవయుపద్రవము సంప్రాప్తించఁ గలదు. రాజాజ్ఞయెట్టిదైన నడ్డుచెప్పువా రుండరు. కావున నదియెట్టిదైనను క్షమింతుమని నాకభయపత్రిక నిత్తురేని వక్కాణించెద లేకున్నఁ జెప్ప నేరనని సహేతుకముగాఁబలికిన విని యానరేంద్రుఁడు తదీయగంభీరోపన్యాసమునకు సిగ్గుపడుచునిట్లనియె.

తరుణీ! చేఁపనవ్విన కారణము నిదర్శనముగాఁ జెప్పితి వేని యెంతయపరాధమైన సైరించెద నందులకు సందియమక్కర లేదు. చెప్పుము చెప్పుమని తొందరజేయుచు నట్టిపత్రిక వ్రాసియిచ్చెను. అప్పుడాచిన్నది, మహారాజా! పురుషులకంటె స్త్రీలకు సాహసము కామము మొదలగుగుణము లాఱురెట్లధికమని శాస్త్రములు జెప్పు

చున్నవి. వనితలు పరపురుష సంగమాభిలాషినులని కదా? తరుచు నంతఃపురములలోఁ బెట్టికాపాడుచుందురు.

శ్లో. నగృహాణి నవస్త్రాణి నప్రాకార స్తిరస్క్రియాః
నేదృశా రాజ సత్కారా వృత్త మాభరణం స్త్రియాః.

అంతఃపురములును వస్త్రములును ప్రాకారములును తెరలును రాజసత్కారములును స్త్రీలకాభరణములై కాపాడఁజాలవు. స్త్రీకి సద్వృత్తమే మంచియావరణము. అని వాల్మీకి చెప్పియున్నాఁడు. నీవు నీభార్యల ననేక రక్షకభట రక్షితంబులగు నంతఃపురంబులం బెట్టి పోతుటీగ నేనియుఁ జొరనీయక కాపాడుచుంటివి. వారు సచ్ఛీలలై యున్నవారని యే తలంచుచుంటివి.

అల్లనాఁడు పల్లెవాండ్రు చేఁపను దీసికొనివచ్చినప్పుడు దాని నంతఃపురమునకుఁ బంపదలంచి యదియాఁడుదియా మగదియా యని యడిగితివి. అదిమగదియేయైనచో మీభార్యలకు మానహాని వాటిల్లునని యే కదా తలంచితివి. మీప్రశ్నకారణమా మత్స్యఁ శ్రేష్ఠంబు గ్రహించి పక్కుననవ్వినది. ఇదియే చేఁపనవ్విన కారణమని పలికిన విని యారాజు తల కంపించుచునిట్లనియె.

ఇదిమాకుఁ దెలియని విషయముకాదు. నీవుచెప్పిన సమాధానము సరిపడియుండలేదు. నేనట్లడిగినంతనే కారణములేక యూరక నవ్వరు. నీవుతగిన సమాధానముచెప్పి యొప్పింపుము. లేకున్న మీతండ్రి నురితీయింపక మాననని చెప్పినవిని యక్కలికి నవ్వుఁచు నిట్లనియె.

మహారాజా! మీరెంతపనిచేయుటకైన సాహసులే! కానిండు మీభార్యల యంతఃపురమును గాచుచున్న యాఁడు వాండ్రనెల్లర నిక్కడికి రప్పింపుఁడు. వారిచే నాకారణము చెప్పింతును. మీరు స్వయముగాఁబోయి యెట్లున్నవారినట్లు తీసికొని రావలయునని కోరిన

నానృపతి యుచితపరివారముతో నప్పుడపోయి శుద్ధాంత మందున్న స్త్రీలనందరం దీసికొనివచ్చి లవంగిముందు నిలఁబెట్టించెను.

అప్పుడు లవంగియు వాండ్రఁబరీక్షించి సన్ననిబట్టలు కట్టించి స్నానముచేసిరండని యాజ్ఞాపించినది. వారప్పని కొడంబడిరి కారు. రాజశాసనము ప్రయోగించుటచే వాండ్రు దాపుననున్న తటాకములో స్నానముచేసివచ్చి సభలోనిలువంబడిరి. వారికి స్త్రీచిహ్నము లేమియునులేవు. పురుషచిహ్నములన్నియు స్పష్టముగాఁ గనంబడినవి అప్పుడాచిన్నది సభ్యులదిక్కు మొగంబై ఆర్యులారా! వీండ్రఁజూచితిరి గదా. వీరాఁడువారో మగవారో తెలిసికొంటిరా? పాపమీ రాజు వీరినందర నాఁడువారనియే తలఁచి యంతఃపురమునఁ గాపుపెట్టి భార్యలశీలముల గాపాడుచున్నాననని సంతోషించు చుండెను. తన యంతఃపురమున నున్నవాండ్రు ఆఁడువారో మగవారో తెలిసికొన లేని యీమూఢుఁడు నన్నాఁడుదియా మగదియా! యని యడుగు చున్నాఁడే? మగదానినైనను నేనేమిచేయుదును. ఇంతకన్న నవివేకి యొండైనంగలఁడా? యని దివ్యజ్ఞానసంపత్తిగల యామీనంబు నవ్వి మేనువాసినది. రాజా! యిప్పుడైన నేఁజెప్పినకారణము సరిపడి నదియా? ఇట్టి దేవరహస్యముచెప్పుమని యడిగి చెప్పనిచో నుఱి దీయింపఁబూనిన నీయొద్దఁ గొలువుచేయుట కంటె మహాపాతకము లేదనిచెప్పి యప్పడఁతి పీఠముపైఁ గూర్చుండెను.

అప్పుడు సభాసదులెల్ల కరతాళములు వాయించిరి. రాజు మొగమునఁ గళతప్పినది. సిగ్గునఁతలవంచుకొని తనకుఁదాననిందించు కొనుచు మంత్రిపాదంబులంబడి మహాత్మా! నిన్నూరక చంపఁబూనిన నాతప్పు మన్నింపుము. నీకూఁతురునాకు మంచిబుద్ధి జెప్పినది. నాకీ రాజ్యమక్కర లేదు. నీవేపాలింపుమని మిక్కిలిదీనుండై వేడుకొనుటయు

మంత్రి యతనియందుఁ బ్రసన్నుండై రాజుసంతోషించు నట్లు తిరుగా నుత్తరముజెప్పెను.

అప్పుడు సభలో లవంగిచెప్పిన యుపన్యాసమువిని సభాసదు లెల్ల విస్మయసముద్రములో మునింగిపోయిరి. లజ్జాభయక్రోధ సంభ్రమములతో నాభూపతియప్పుడ యాయంతఃపుర ద్రోహులనెల్ల నినుపచిక్కములలో నెక్కించి బిగియగట్టించి యొకతోటలో వ్రేలఁ గట్టించెను.

పిమ్మట రౌద్రావేశముతోఁ గత్తిదీసికొని యంతఃపురమున కరుగుచున్న రాజు సన్నాహముచూచి లవంగి యడ్డపడి భార్యలం జంపవలదని యెన్నియో ప్రతికూల వాక్యములు జెప్పినది. కాని యతని యహంకార మణఁగినదికాదు. భార్యలనందఱ, బరిభవించి యారాజు రాజ్యము మంత్రికిచ్చివేసి తాను తపోవనంబునఁ కఱిగెను.

మంత్రియు లవంగివలన వారుపోయిన వృత్తాంతమంతయువిని సంతసించుచుఁ గొడుకును గోడండ్రను గూఁతును నల్లుండును దన్నుభజింప మహావైభవముతోఁ బెద్దకాలము రాజ్యము గావించుచు ధరిత్రీతలంబున సకల సౌఖ్యము లనుభవించెను.

గోపా! నీవుచూచిన యినుప చిక్కములలో నున్నవారు అంతఃపురద్రోహులు వారే. తైలసిక్తములగుట వారి కళేబరములు చెడక పెద్దకాలమట్లే యున్నవనిచెప్పి మణిసిద్ధ యతీంద్రుఁడు శిష్యునితోఁగూడబోయిపోయి యొకనాఁడు సాయంకాలమునకు జగన్నాథంబు బ్రవేశించెను.

తోదకవృత్తము.

వాగ్వనితాప్రియ వారిజనాభ
ప్రాగ్వరముఖ్య సుపర్వగణేడ్యా
దిగ్వసనాంచిత ధీరజనోక్తి
స్రగ్విభవార్చిత చంద్రకపర్దా ॥

క. మంగళమగుఁ బ్రజలకు నృప
పుంగవు లేలుదురు ధర్మబుద్ధిదనర ధా
త్రిం గోవులకును విప్రుల
కుం గల్గుశుభంబు మనుజకోటి జెలంగన్.

క. కరలోచన కరితారే
శ్వర సంఖ్యా కలితశాలి శకదీపిత శా
ర్వరివత్సరమునఁ గాశీ
పురయాత్రావసధ చరిత ముంజేసితిగా.

గద్య.

ఇది శ్రీవిశ్వనాథ సదనుకంపాసంపాదిత కవితా విచిత్రా త్రేయముని సుత్రామగోత్రపవిత్రమధిరకులకలశజలనిధి రాకా కుముదమిత్ర లక్ష్మీనారాయణపౌత్ర, కొండయార్యపుత్ర,
సోమిదేవి గర్భశుక్తి ముక్తాఫల విబుధజనాభి
రక్షిత సుబ్బన దీక్షితకవి విరచితంబగు
శ్రీకాశీయాత్రావసధచరిత్రమను
మహా ప్రబంధంబునందు
ప్రథమభాగము
సంపూర్ణము.

శ్రీ విశ్వనాథార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

